శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః



# పూర్వదినచర్య - యతిరాజవింశతి ఉత్తరదినచర్య - వ్యాఖ్యానంతో

## శ్రీమాన్, డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు




శ్రీయతీశ్వరసిద్ధాంతరక్షణవ్యాపనోద్యతా ।
శ్రీరామానుజసిద్ధాంతసభా జేజీయతాం సదా ॥

శ్రీరామానుజ సిద్ధాంతసభ, సికింద్రాబాద్
2018

## పూర్వదినచర్య - యతిరాజవింశతి ఉత్తరదినచర్య - వ్యాఖ్యానంతో

**శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యులు**

**ప్రథమముద్రణము** : ఫిబ్రవరి, 2018

**ప్రతులు** : 500



**ముఖచిత్రము** : భగవద్రామానుజులు – శ్రీపెరుంబూదూర్

**ఈ గ్రంథం, పరమపదవాసులు**
**శ్రీమాన్ పెరుంబూదూర్ కందాళ పార్థసారథి గారి**
**పవిత్రస్మృతిచిహ్నికగా వారి సతీమణి శ్రీమతి సత్యవతిగారు**
**సమర్పించిన ద్రవ్యంతో ముద్రింపబడింది.**

**ప్రతులకు** : **శ్రీమాన్ స్వామిదాసు గారు**
C/o. నక్షత్రమ్యూజిక్
షాప్ నెం. జి–20, జడే ఆర్కేట్ కాంప్లెక్స్
ప్యారడైజ్ హోటల్ ఎదురుగా, ఎం.జి.రోడ్
సికింద్రాబాదు–500 003
ఫోన్ : 96185 86276

**అక్షరయోజనము :** శ్రీమతి జయలక్ష్మి, తిరుపతి
శ్రీచంద్రశేఖర్, తిరుపతి

**ముద్రణ** : సి.యన్. ప్రింటర్స్, తిరుపతి



# ముందుమాట

**న చేద్రామానుజేత్యేషా చతురా చతురక్షరీ ।**
**కామవస్థాం ప్రపద్యంతే జంతవో హంత! మాదృశః ॥**

గత ఏడు మార్చినెల చివరలో శ్రీమతి పెరుంబూదూర్ సత్యవతిగారు (అమెరికా) ఫోన్‌చేసి మాట్లాడుతూ, ఏదైనా ఒక సద్గ్రంథ ప్రచురణ కోసం తాము కొంత సొమ్మును నాకు పంపించాలని అనుకొంటున్నానని అన్నారు. నేను, కావలసి వచ్చినప్పుడు తెలుపుతాను, అపుడు పంపించండి – అని అన్నాను. కాని, వారు వెంటనే నాకు కొంత సొమ్మును వెంటనే పంపించడం జరిగింది. శ్రీమతి సత్యవతి గారు ఇదివరకే తమ భర్త **శ్రీమాన్ పెరుంబూదూర్ కందాళ పార్థసారథి గారి పవిత్ర స్మృత్యర్థం** చరమోపాయనిర్ణయమనే గ్రంథాన్ని తమ పవిత్ర ద్రవ్యంతో ముద్రించారు. శ్రీమతి సత్యవతిగారు ఈవిధంగా నాపట్ల ఉత్సాహాన్ని చూపించ డానికి కారణం హైదరాబాద్ వాస్తవ్యులు, భాగవత శ్రేష్ఠులు శ్రీమాన్ స్వామిదాస్ గారు అయినందువల్ల, వెంటనే నేను వారితో జరిగిన విషయాన్ని తెలిపి, శ్రీమతి సత్యవతి గారు పంపిన సొమ్ముతో ఏ గ్రంథాన్ని ముద్రిస్తే బాగుంటుందో తెలుపమని అడిగాను. వారు వెంటనే ఈ సంవత్సరం శ్రీరామానుజ సహస్రాబ్ది సంవత్సరం కనుక, శ్రీరామానుజుల వైభవాన్ని తెలిపే ఏదైనా ఒక గ్రంథానిన ప్రచురించాలని అంటూ, యతిరాజవింశతిని, పూర్వోత్తర దినచర్యలతో కలిపి వ్యాఖ్యాన సహితంగా ముద్రిస్తే బాగుంటుందని సూచించారు. నేను వెంటనే అంగీకరించాను.

ఆ విధంగానే పై మూడు స్తోత్రాలను వ్యాఖ్యాన సహితంగా ముద్రించాలని అనుకున్నా, వెనువెంటనే నరసాపురంలో శ్రీరామానుజ సహస్రాబ్ది కార్యాక్రమాలు జరగడం వల్ల ఈ గ్రంథముద్రణలో జాప్యం జరిగింది. ఆ తరువాత కూడా అనుకోకుండా మా పితృపాదులు శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారికి ఆకస్మికంగా అనారోగ్యం కలగడం వల్ల మరింత ఆలస్యమైనది. శ్రీరామానుజుల కృపవల్ల ఇప్పటికి అనుకున్న రీతిలో గ్రంథముద్రణ జరుగుతున్నది. ఈ గ్రంథ ముద్రణకు ఆర్థికంగా సహాయపడిన శ్రీమతి సత్యవతిగారికి నా హార్దమైన కృతజ్ఞతలను తెలుపుకుంటున్నాను.

ప్రకృతి గ్రంథంలో పూర్వదినచర్య, ఉత్తరదినచర్య స్తోత్రాల వ్యాఖ్యానం ప్రధానంగా వాధూల వీరరాఘవాచార్యస్వామివారి 'సదాచారదీపికా' అనే సంస్కృత వ్యాఖ్యానాన్ని అనుసరించి చేయబడింది. అక్కడక్కడ కాంచీ మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామి వ్యాఖ్యానంలోని, శ్రీవైష్ణవసింహ, శ్రీమాన్ టి.ఎ. కృష్ణమాచార్యస్వామి (తిరుపతి) వ్యాఖ్యానంలోని విశేషాలు ఉట్టంకింపబడ్డాయి. ఇది ఇంతకుముందే 2007 సంవత్సరంలో ముద్రింపబడింది. ఇప్పుడు మళ్ళీ ప్రచురింపబడుతున్నది. యతిరాజ వింశతికి శ్రీపిళ్లై లోకమ్ జీయర్ అనుగ్రహించిన మణిప్రవాళ వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం కూడా ఈ గ్రంథంలో ముద్రింపబడింది.

ఈ గ్రంథం శ్రీరామానుజ సిద్ధాంతసభ, సికింద్రాబాద్ వారి ద్వారా ప్రకాశింప జేయబడుతున్నది. దీనికి అంగీకరించిన శ్రీమాన్ కె.కె. పరకాలన్ స్వామివారికి, శ్రీస్వామిదాసు గారికి, సభకు చెందిన ఇతర సభ్యులకు నా కృతజ్ఞతలు. ఈ ప్రయత్నంలో నాకు ప్రోద్బలాన్ని ఇచ్చి, మంగళాశాసనం చేసిన పితృపాదులు, ఉభయవేదాంత భాస్కర, న్యాయవేదాంత విద్వాన్, ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారి సన్నిధిలో కృతజ్ఞతా పూర్వకంగా ప్రణమిల్లుతున్నాను. గ్రంథాన్ని డి.టి.పి. చేయడంలో సహకరించిన శ్రీమతి జయలక్ష్మి గారికి, శ్రీచంద్రశేఖర్ గారికి ధన్యవాదాలు. ముద్రణ భారాన్ని అందంగా నిర్వహించిన శ్రీహర్షవర్ధన్ గారికి కృతజ్ఞతలు. ప్రపన్నలోకానికి ఈ గ్రంథ ముద్రణ ఆనందం కలిగించగలదని నమ్ముతున్నాను. స్వస్తి.

**పూర్వోత్తరదినచర్యే వ్యవృణోత్ యతిరాజవింశతిం చ తథా ।**
**పూర్వాచార్యవ్యాఖ్యా రస్యా అనుసృత్య శింగరార్యోఽసౌ ॥**

**ప్రకాశయంతీ సద్గ్రంథా నీదృశాన్ సాంప్రదాయికాన్ ।**
**శ్రీరామానుజసిద్ధాంతసభా జేజీయతాం సదా ॥**

భాగవత విధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**

తిరుపతి
21-2-2018



శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# పూర్వదినచర్య - అవతారిక

ఆచార్యసార్వభౌములైన శ్రీమణవాళమహామునుల నిత్యానుష్ఠానపద్ధతిని ప్రతిదినం అనుసంధించడం శ్రీవైష్ణవులందఱికి ఉజ్జీవనోపాయాలలో ప్రధానమైనది అని పెద్దల సూక్తి. ఈవిధంగా నిత్యం అనుసంధించడానికి వీలుగా ఈ దినచర్యా ప్రబంధాన్ని మనకు అనుగ్రహించిన పరమోదారులు - ఎఱుమ్బియప్పా అనే ఆచార్యవర్యులు. వీరు అష్టదిగ్గజాలని ప్రసిద్ధి చెందిన, మణవాళమహామునులు శిష్యులు ఎనిమిదిమందిలో ఒకరు. వీరికి దేవరాజగురువనికూడా పేరు ఉన్నది.

ఈ స్తోత్రం అవతరించిన రీతిని మహావిద్వాన్ కాంచీ ప్ర.భ.అణ్ణంగరాచార్య స్వామివారు తమ వ్యాఖ్యలో ఈవిధంగా వివరించారు.

చోళసింహపురం (ఘటికాద్రి) అనేది దివ్యదేశానికి సమీపంలో ఉండే **"ఎఱుమ్బి"** అనే అగ్రహారంలో అవతరించినవారు కావడంవల్ల **"ఎఱుమ్బియప్పా"** అని పిలువబడేవారు, గొప్ప విద్వాంసులు అయిన ఈ ఆచార్యులు శ్రీరంగంలోని రంగనాథుని సేవించాలనే ఆశతో ఘటికాద్రి నారసింహుని అనుజ్ఞను తీసికొని, శ్రీరంగానికి చేరారు. అక్కడ తమకు బంధువులైన కోయిలణ్ణన్ గృహంలో విడిది చేసి, ఆ అణ్ణన్‌తోపాటు పోయి శ్రీమణవాళ మహామునుల కాలక్షేపగోష్ఠిలో అన్వయించే భాగ్యాన్ని పొందారు. అపుడు మణవాళ మహామునుల సర్వతో ముఖమైన ప్రజ్ఞా వైదుష్యాలను దర్శించి చాలా ఆనందించారు. కాని, వారి శ్రీపాదాలను ఆశ్రయించే భాగ్యపరిపాకం ఇంకా సిద్ధించక పోవడంవల్ల, మణవాళ మహామునులు తురీయాశ్రమస్వీకారం చేసినవారు కాబట్టి, సన్న్యాసులనుండి తీర్థ ప్రసాదాలను గ్రహించరాదనే సామాన్యశాస్త్ర నియమాన్ని మాత్రమే పరిగణించి, వారి సన్నిధిలో తీర్థప్రసాదపరిగ్రహాన్ని చేయకుండానే తిరిగి తమ ఊరికి చేరారు. అక్కడ ప్రాతఃకాలిక కృత్యాలను తీర్చుకొని, తీర్థమాడి, భగవదారాధనను చేయడంకోసం తమ ఆరాధన మూర్తి అయిన చక్రవర్తితిరుమకన్ (శ్రీరామచంద్రమూర్తి) సన్నిధిలో దండం సమర్పించి, **"కౌసల్యాసుప్రజా! రామ!"** అని సుప్రభాతాన్ని అనుసంధిస్తూ భగవత్సన్నిధి కవాటాలను తెఱువబోయారు. కాని, ఎంత ప్రయత్నించినా తలుపులు తెఱుచుకోలేదు. అందువల్ల చాలా

దుఃఖంతో ఆనాడు ప్రసాదాన్ని భుజించకుండానే "నావల్ల ఏమి అపచారం జరిగిందో! ఏమో!" అని తలుస్తూ ఉండిపోయారు. ఆనాటిరాత్రివారికి స్వప్నంలో వారి ఆరాధనలోని అర్చామూర్తి సాక్షాత్కరించి "మాకు ప్రాణస్థానీయులు, లోకానికి అంతటికి అద్వితీయమైన ప్రాణంలాంటివారు అయిన శ్రీవరవరమునుల శ్రీచరణాలను ఆశ్రయించకుండానే, తీర్థప్రసాదాలను స్వీకరించకుండానే మీరు ఇంటికి తిరిగివచ్చారు. అందువల్లనే మా సన్నిధితలుపులు తెఱచుకోలేదు. సాక్షాత్తు ఆదిశేషులే మణవాళ మహామునులుగా అవతరించారని గుర్తించండి. వారి సన్నిధికి పోయి, వారిని ఆశ్రయించి, పునీతులైతే తప్ప మీ తిరువారాధనను మేము స్వీకరించబోము. శీఘ్రంగా పొండి" అని నియమించాడు. ఎఱుమ్బియప్పా మేల్కొని గభాలున లేచి, చాలా ఆశ్చర్యాన్ని పొందారు, ఈ ఆశ్చర్యకరమైన వృత్తాంతాన్ని తమ స్నేహితులకు, ఆప్తులకు చెప్పి, అప్పటికప్పుడే శ్రీరంగానికి బయలుదేరారు. అనతికాలంలోనే శ్రీరంగాన్ని చేరిన అప్పా మణవాళ మహామునుల మఠానికి పోయారు. అది మణవాళమహామునులు శ్రీరంగనాథునకు మంగళాశాసనం చేయడంకోసం తమమఠం నుండి కోవెలకు బయలుదేరే సమయం. అప్పా అక్కడే ఆలయంలోనే మణవాళమహామునుల శ్రీ పాదాలను సేవించి, వారి విశేష కటాక్షానికి పాత్రులై, క్రమంగా తన ఇంటిలో జరిగిన వృత్తాంతాన్ని అంతటినీ వారికి విన్నపించి, మొదలు నఱికిన చెట్టువలె వారి శ్రీపాదాలపై పడి, అపరాధ క్షమాపణను ప్రార్థిస్తూ – "ఇక మీ శ్రీపాదాల ఛాయ తప్ప వేఱొక ఆశ్రయం దాసునకు లేదు. **"నెఱికాట్టి నీక్కి"** అన్నట్లు వేఱే మార్గాన్ని చూపి దూరం చేయకుండా, మీ అంతరంగకైంకర్యాన్ని చేసికొనే భాగ్యాన్ని ప్రసాదించాలి" అని ప్రార్థించి, మామునుల నిరవగ్రహానుగ్రహాన్ని పొంది కృతార్థులయ్యారు. తమ పరమభక్తిపరీవాహరూపంగా మణవాళ మహామునుల విషయంలో కావ్య – నాటక – చంపూ – స్తోత్రాదులను పెక్కింటిని రచించారు. వాటిలో మొట్టమొదటి కృతి ఈ దినచర్యారూపస్తుతిప్రబంధం

ఇది **"పూర్వదినచర్య"** అని, **"ఉత్తరదినచర్య"** అని రెండు భాగాలుగా ఉన్నది. పగలు అనుష్ఠింపబడే అనుష్ఠాన విశేషాలను పూర్వదినచర్యలోను, సాయంసంధ్యకు తరువాత అనుష్ఠింపబడే అనుష్ఠానక్రమాన్ని ఉత్తరదినచర్యలోను అప్పా స్తుతించారు.

పూర్వదినచర్యలో **"అంకే కవేరకన్యాయాః"** అనే శ్లోకంనుండి **"భవేయం భవదుఃఖానా మసహ్యానా మనాస్పదమ్"** అనే శ్లోకంవరకుగల 13 శ్లోకాలు ఈ స్తుతికర్త మణవాళమహామునుల సన్నిధికి మొట్టమొదటగా చేరినపుడు తాము



దర్శించిన సన్నివేశాన్ని వర్ణించేవి కావడంవల్ల అంతవరకు ఉపోద్ఘాతంగా చెప్పవచ్చు. ఆ పిమ్మట **"పరేద్యుః పశ్చిమే యామే"** అనే 14వ శ్లోకంనుండి మామునుల పూర్వదినచర్య వర్ణింపబడింది. శ్రీరంగానికి వెడలిన మఱునాటి ప్రాతఃకాలంనుండి ఎఱుమ్బియప్పా సాక్షాత్తుగా దర్శించిన అనుష్ఠాన ప్రకారాలు ఇందులో ప్రస్తుతింపబడ్డాయి. మఱునాడే తమకు మామునులు పంచ సంస్కారాలను అనుగ్రహించినట్లు 19వ శ్లోకంలో తెలియజేశారు. ఒక సంవత్సరంకాలం పాటు గురుకులవాసం చేసి పొందవలసిన ఆ ఫలాన్ని కోయిలణ్ణన్ మొదలైన ఆత్మీయులు తమ విషయంలో పురుషకారం చేసినందువల్ల ఆ ఫలం వెంటనే తమకు లభించిందనే విషయాన్ని కృతజ్ఞతాపూర్వకంగా **"తత్ప్రార్థనానుసారేణ సంస్కారాన్ సంవిధాయ మే"** అనే సూక్తి ద్వారా తెలియజేశారు.

**"శఠరిపు రేక ఏవ కమలాపతిదివ్యకవిః, మధురకవి ర్యథా చ శఠజిన్ముని ముఖ్యకవిః, యతికులపుంగవస్య భువి రంగసుధాకవిరాట్, వరవరయోగినో వరదరాజకవి శ్చ తథా"** (శ్రీమన్నారాయణుని స్తుతించిన దివ్యకవి శఠకోపులు ఒక్కరే. ఆ శఠకోపులను స్తుతించిన ముఖ్య కవి మధుర కవులే. శ్రీరామానుజులను స్తుతించిన ముఖ్య కవి శ్రీరంగామృత కవియే. శ్రీ వరవరమునులను స్తుతించిన ముఖ్యకవి దేవరాజ గురువే.) – అనే సుప్రసిద్ధ శ్లోకం దేవరాజగురువుల కవితావైభవాన్ని కీర్తిస్తున్నది. శ్రీమణవాళ మహామునుల వైభవాన్ని వర్ణించే కావ్యనాటక చంపూ గ్రంథాదులను, శతకాదిస్తోత్రాలను రచించిన తరువాతనే ఈ స్తుతిని ఎఱుమియప్పా అనుగ్రహించారని కొందఱు భావించారు. శ్రీవైష్ణవులు భగవదారాధనను ముగించి, ప్రసాదస్వీకారాన్ని చేసేటపుడు ఈ దినచర్యాస్తోత్రాన్ని అంతటా చిరకాలంగా నియమంగా అనుసంధించడం వల్ల ఇది పరమపవిత్రమైన, పంక్తిపావనప్రబంధమని తెలుస్తున్నది. ఇక, ఈ ప్రబంధంలోని ప్రధాన ప్రమేయం ఏది? అని ప్రశ్నిస్తే, మిగిలిన పూర్వాచార్య స్తోత్రాలవలెనే ఇది కూడా ద్వయ మంత్రార్థ ప్రతిపాదకమని చెప్పాలి. భగవానుని పాదస్థానీయులు శఠకోపులు, వారి పాద స్థానీయులు శ్రీరామానుజులు, వారి పాదస్థానీయులు శ్రీవరవర మునులు. ఈ వరవరమునుల వైభవాన్ని తెలిపే ఈస్తుతి పరంపరయా ద్వయార్థ ప్రతిపాదకమన్నది స్పష్టం. అట్లే, **"వశనభూషణత్తిన్ ఆழ் పొరుళ్ ఎల్లామ్ అఱివార్ ఆర్?"** (శ్రీవచన భూషణంలోని గంభీరమైన అర్థాలను తెలియగలిగిన వారు ఎవరు?) అని కీర్తింపబడ్డ శ్రీవచన భూషణదివ్యశాస్త్రగ్రంథ ప్రధాన

ప్రమేయం అయిన, అతిగంభీరమైన చరమపర్వనిష్ఠా వైభవం ఇందులో ఉగ్గడింపబడింది – అని కూడా చెప్పవలసి ఉన్నది. ఈ స్తుతిలో ప్రధాన ప్రమేయంగా కన్పించే అభిగమన, ఉపాదాన, ఇజ్య, స్వాధ్యాయ, యోగాలనే పాంచకాలిక ప్రక్రియ స్మృతివిహితం. పురాణప్రోక్తం. దాన్ని భగవద్రామానుజులు నిత్య గ్రంథంలో ప్రస్తుతించారు కూడా.

పూర్వదినచర్యాస్తోత్రంలో ఎఱుమ్బియప్పా సాయించిన శ్రీమణవాళ మహామునుల రూపవర్ణన ప్రతివాదిభయంకరం అణ్ణన్ సాయించిన **"శెయ్యతామరై త్తాళిణై వాళియే"** అనే మంగళాశాసనపాశురంలోని వర్ణనతో చాలావరకు పోలి ఉన్నది. **"శేలై వాళి"** అనే ప్రయోగం – ప్రకృతంలోని **"ఆతామ్ర విమలాంబరమ్"**. **"కాశ్మీరకేసరస్తోమ"** ఇత్యాది శ్లోకాల భావాన్ని, **"తుయ్య మార్బుమ్ పురినూలుమ్ వాళియే"** అనే ప్రయోగం – **"అమ్భోజబీజమాలాభిః", "ఆపీనవిపులోరస్కమ్"** ఇత్యాది సూక్తుల భావాన్ని, **"శున్దర త్తిరుత్తోళిణై వాళియే"** అనే ప్రయోగం – **"ఆజానుభుజభూషణమ్"** అనే సూక్తిభావాన్నిష **"తిరునాబి వాళియే"** అనే ప్రయోగం – **"నాభిబింబ"** అనే సూక్తిభావాన్ని, **"కరుణై పొజ్గియ కణ్ణిణై వాళియే"** అనే ప్రయోగం – **"దయమానదృగంచలమ్"** అనే సూక్తి భావాన్ని తలపిస్తాయి. ఈస్తోత్రప్రభావం తరువాతి కాలానికి చెందిన పలువురు పూర్వాచార్యులపై పడిందనే విషయం సుస్పష్టం. ఈ స్తోత్రంలో శ్లోకాల భావాలను శ్రీపిళ్ళైలోకార్య జీయర్ తాము రచించిన యతీంద్రప్రవణప్రభావమనే వరవరమునుల చరిత్రగ్రంథంలో అనువదించడాన్ని గమనించవచ్చు. అదేవిధంగా, ప్రస్తుతస్తోత్రాన్ని అనుకరిస్తూ వరవరమునుల పౌత్రులు అభిరామవరులు యతిపతిదినచర్యా అనే స్తుతిని రచించడంకూడా ఇచట స్మరణీయం. ఇటువంటి వక్తవ్యవిశేషాలు చాలా ఉన్నా విస్తృతిభయంచేత ప్రస్తావించడం లేదు.

ఈ స్తుతికి, ఇప్పటికి సుమారు 300 సం॥లకు పూర్వం **"తిరుమళిశై"** అనే దివ్యక్షేత్రంలో నివసించిన, పలు గ్రంథాలను రచించిన శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామి వారనే ప్రసిద్ధిచెందిన – అణ్ణావప్పజ్గార్ సంస్కృతభాషలో **"సదాచార దీపికా"** అనే పేరుతో విస్తృతమైన వ్యాఖ్యను అనుగ్రహించారు. భగవద్రామానుజుల భాగినేయులు, వారి అంతరంగ శిష్యులలో ఒకరు, వాధూల గోత్రీయులు అయిన దాశరథి (ముదలియాణ్డాన్) అనే మహనీయుల వంశానికి చెందిన ఈ వాధూల వీరరాఘవాచార్య స్వామివారు కంచికి సమీపంలో నున్న తిరుమళిశై అనే



దివ్యక్షేత్రంలో క్రీ.శ.1766వ సం. వ్యయవర్షం ఆణిమాసం కృష్ణచతుర్దశి ధనిష్ఠానక్షత్రంలో అవతరించారు. వీరు పితృపాదులు నరసింహాచార్యులవారు. వీరిది కోయిల్ కందాడైవంశం. యజుశ్శాఖ. ఆపస్తంబ సూత్రం. 15 సం॥లు నిండే సరికే సామాన్య శాస్త్రాలలో ఆరితేరారు. సంగీతంలోకూడా గొప్ప ప్రావీణ్యాన్ని సంపాదించారు. తండ్రిగారి వద్ద సంప్రదాయగ్రంథాధ్యయనాన్ని, సంస్కృత వేదాంతాన్ని వాధూలవరదాచార్యులవారి, శ్రీరంగాచార్యుల వారి సన్నిధిలో అధికరించారు. 51 సం॥లు ఈ విభూతిలో ఉన్న వీరు ముప్పయికి మించిన కృతులను వెలయించారు. వీరి శ్రీవచనభూషణ అరుబదం శ్రీవైష్ణవ సంప్రదాయవిజ్ఞాన సర్వస్వంగా చెప్పవచ్చు. వీరిచే రచింపబడిన కొన్ని కృతులు ఇంకా వెలుగు చూడవలసి ఉన్నవి. శ్రీరామానుజులవారిని స్తుతిస్తూ విరచించిన శ్రీరామానుజాతిమానుష స్తవం ఇందుకు ఒక ఉదాహరణం. ప్రస్తుతస్తుతివ్యాఖ్యలో అనేక ధర్మశాస్త్రగ్రంథాలనుండి చూపబడ్డ పలు ప్రమాణాలు వీరి అసమాన పాండిత్యానికి గీటురాళ్ళు. ఈ వ్యాఖ్య 1922వ సం॥లో చెన్నై నగరంలోని శ్రీవైష్ణవగ్రంథముద్రాపకసభవారిద్వారా ముద్రింపబడింది. ఆ ప్రతులు ఇపుడు దొరుకవు. తమిళభాషలో అనతివిస్తృతంగా కాంచీ మహావిద్వాన్ ప్ర.భ.అణ్ణాస్వామి వారు అనుగ్రహించిన వ్యాఖ్య ఉన్నది. ఈ మధ్యకాలంలో శ్రీవైష్ణవసింహ, న్యాయవేదాంతవిద్వాన్, ఉవే.శ్రీమాన్ టి.ఏ.కృష్ణమాచార్య స్వామివారు (తిరుపతి) తమిళభాషలో రచించిన వ్యాఖ్యానం సప్తగిరి (తమిళం) మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడింది. తెలుగులో శ్రీవైష్ణవ స్తోత్రమాల అనే పేరుతో పలు స్తోత్రాలకు టీకను అనుగ్రహించిన శ్రీమాన్ పరవస్తు గోవిందాచార్య స్వామివారి లఘుటీక ఉన్నది. కాని ఈ స్తుతికి తెలుగులో విస్తృతమైన వ్యాఖ్యానం ఇంతవరకు వెలువడలేదనే భావంలో ప్రస్తుత ప్రయత్నం చేయబడింది. ప్రస్తుతవ్యాఖ్య శ్రీవాధూల వీరరాఘవాచార్యస్వామి సంస్కృత వ్యాఖ్య, శ్రీప్ర.భ.అణ్ణాస్వామివారి ద్రావిడ వ్యాఖ్య, శ్రీవైష్ణవసింహ శ్రీమాన్ టి.ఎ.కృష్ణమాచార్యస్వామి వారి వ్యాఖ్యలను అనుసరించి విన్నవింపబడింది.

**శ్రీమతే రమ్యజామాతృమునీంద్రాయ మహాత్మనే ।**
**శ్రీరంగవాసినే భూయాత్ నిత్య శ్రీః నిత్యమంగళమ్ ॥**

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



**ఎఱుమ్బియప్పా అనుగ్రహించిన**

**(శ్రీ వరవరమునుల)**

# పూర్వదినచర్య

## తనియన్ శ్లోకం

**సౌమ్యజామాతృయోగీంద్రచరణాంబుజషట్పదమ్ ।**
**దేవరాజగురుం వందే దివ్యజ్ఞానప్రదం శుభమ్ ॥**

సౌమ్యజామాతృయోగీంద్ర = శ్రీమణవాళమహామునులయొక్క, చరణ + అంబుజ షట్పదమ్ = శ్రీపాదపద్మాలలో తుమ్మెదవంటివారు (తుమ్మెద పద్మాలను సర్వదా ఆశ్రయించి ఉండేటట్లు శ్రీమణవాళమహామునుల శ్రీ పాదాలను ఎల్లప్పుడు ఆశ్రయించి ఉండేవారు), దివ్యజ్ఞానప్రదం = ఆచార్యులే ఉపాయోపేయాలనే దివ్యజ్ఞానాన్ని తమ ఉపదేశానుష్ఠానాలద్వారా అనుగ్రహించేవారు, శుభమ్ = (అందువల్లనే) శుభప్రదులును అయిన, దేవరాజగురుం = దేవరాజగురువులనబడే ఎఱుమ్బియప్పా అనే ఆచార్యవర్యులను, వందే = నమస్కరిస్తున్నాను.

శ్రీవరవరమునిశతకం, వరవరముని కావ్యం, వరవరముని చంపువు, పూర్వదినచర్య, ఉత్తరదినచర్య–ఇత్యాదిగా మణవాళ మహామునుల విషయంలో పలు స్తోత్రాలను అనుగ్రహించిన ఎఱుమ్బియప్పాను స్తుతిస్తూ వారి భక్తులొకరు రచించిన శ్లోకమిది. ఈవిధంగా గ్రంథకర్తను స్తుతించే, గ్రంథంలో చేరని ప్రత్యేకాలైన ముక్తక శ్లోకాలను, పాశురాలను **"తనియన్"** అనే ద్రావిడ నామంతో వ్యవహరించడం సంప్రదాయం. **"తని"** – అంటే ప్రత్యేకమైన, ముక్తక రూపంలో–ఉన్న అని అర్థం. **"అన్"** అనేది ప్రత్యయం; గౌరవవాచకం.



ఈ శ్లోకంలో శ్రీ సౌమ్యజామాతృమునుల చరణాలకు అంబుజసామ్యం చెప్పడం చేత, చరణాల భోగ్యతాతిశయం, సదా సేవ్యత్వం, సౌకుమార్య, సౌందర్యాది గుణాలు స్ఫురిస్తున్నవి. దేవరాజగురువుల షట్పదసామ్యంద్వారా వారి ఆచార్యనిష్ఠ సూచింపబడింది. **"షట్పదోఽ_యం ద్విఖండః"** అని స్తుతింపబడే ద్వయమంత్రంలో నిష్ఠనుకల ఆచార్యులను షట్పదాలుగా నిర్దేశించడం కూడ ఇక్కడ గమనింపతగినది. **"ఎన్ పెఱుతియెన్నా......... వణ్డు తుమ్బి యెన్నుమ్"** ఇత్యాది ఆచార్య హృదయసూక్తి, దానికి శ్రీమద్వరవరమునులు అనుగ్రహించిన వ్యాఖ్య ఇక్కడ అనుసంధేయాలు.

# పూర్వదినచర్య

1. **అంకే కవేరకన్యాయా స్తుంగే భువనమంగళే ।**
**రంగేధామ్ని సుఖాసీనం వందే వరవరం మునిమ్ ॥**

తుంగే = చాలా గొప్పది, భువనమంగళే = భూలోకాదివాసులకు ఇష్టార్థసిద్ధి రూపమైన మంగళానికి సాధనం అయిన, కవేరకన్యాయాః = కావేరీనదియొక్క, అంకే = మధ్యలో (ఉండే), రంగే ధామ్ని= సర్వేశ్వరుడైన రంగనాథునకు మిక్కిలి ఇష్టమైన శ్రీరంగక్షేత్రంలో, సుఖ + ఆసీనమ్= సుఖంగా నిత్యవాసం చేసేవారు, వరవరం = రూపం, ఔదార్యం–మొదలైన గుణాలలో **"అ౧కియమణవాళన్"** అన బడే శ్రీరంగనాథునితో పోలి ఉండడం చేత ఆ అ౧కియ మణవాళన్ (వరవర) అనే నామాన్ని కల్గినవారు, మునిమ్ = తత్త్వయాథాత్మ్యజ్ఞానాన్ని ఎల్లప్పుడు మననం చేసేవారు అయిన శ్రీమణవాళమహామునులను,వన్దే=స్తుతిస్తూ, ప్రణమిల్లుతున్నాను.

ఈ శ్లోకం ఈ స్తుతికి మంగళాచరణరూపమైన శ్లోకం. ఉభయకావేరుల నడుమ మిక్కిలి గొప్పది, సకలలోకక్షేమం కరమైనది అయిన శ్రీరంగంలో సుఖంగా నిత్యవాసం చేస్తున్న మణవాళమహామునులకు నమస్కరిస్తున్నాను–అని భావం.

**(తుంగే)** – నిరతిశయమైన – అని భావం. ఇది **"భువనమంగళే"** అన్న పదానికి విశేషణం. గొప్ప లోకక్షేమానికి – అని ఈ సమస్త పదానికి భావం.

**(భువనమంగళే)** – ఇచటి భువనశబ్దంచేత లోకాలలోని జనులు లక్షింపబడతారు. మంగళ శబ్దానికి మంగళసాధనమని అర్థం. ఈ విధంగా ఇక్కడ సాధ్యసాధనాలు

ఐక్యం చెప్పబడినందువల్ల హేత్వలంకారం. **"హేతుహేతుమతో రైక్యం హేతుం కేచి త్ప్రచక్షతే"** అని ఈ అలంకారలక్షణం. (లేక) మంగళశబ్దానికి స్వయంప్రాప్యమని కూడా అర్థం. **(రంగేధామ్ని) – "యస్మా ద్రతిం గతో విష్ణుః"** (దేనివల్ల విష్ణువు ఆసక్తిని పొందాడో) అని చెప్పబడ్డ రీతిలో ఈ శ్రీరంగక్షేత్రం స్వామి స్వయంగా అభిమానించి నిలచిన స్థానవిశేషంకదా!

**(సుఖాసీనమ్)** ఈ పదప్రయోగంద్వారా మణవాళమహామునుల ఆచార్యులైన తిరువాయ్‌మొళిప్పిళ్ళైకాలంవరకు శ్రీరంగానికి పలు ఉపద్రవాలు ఏర్పడినా, మణవాళ మహామునులు ఈ క్షేత్రంలో అడుగు పెట్టినతర్వాత ఏవిధమైన ఉపద్రవం లేకుండా, విపత్తులన్నీ తీరి, క్షేమం సమకూరిన ప్రసిద్ధి వ్యక్తమౌతున్నది పెద్దల అభిప్రాయం – అని శ్రీప్ర.భ.అణ్ణాస్వామి వ్యాఖ్య.

**"కవేరకన్యాయా అంకే రంగేధామ్ని సుఖాసీనమ్"** అని అన్వయించడంవల్ల మిక్కిలి వాత్సల్యం కల్గిన మాతామహి (అమ్మమ్మ) ఒడిలో సుఖంగా ఆసీనుడైన శిశువు సామ్యం శ్రీరంగనాథునకు స్ఫురిస్తున్నదని కూడా ఆ వ్యాఖ్యలోని వివరణం ఈ స్తుతిప్రారంభం **"అంకే"** అని అకారంతో ప్రారంభమైనందున మంగళపూర్వకమైన ప్రారంభం చేయబడింది. **"అ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానమ్"** (అ అనే అక్షరం భగవానుడైన శ్రీమన్నారాయణుని మొదటి పేరు) ఇత్యాది మహాభాష్యసూక్తి స్మరణీయం. ఆ రీతిలోనే, **"వన్దే"** అనే పదప్రయోగంద్వారా కరణత్రయ మంగళాచరణం కూడా చేయబడినట్లయింది. **"తుంగే, మంగళే, రంగే"** ఇత్యాది ప్రయోగాల్లోని శ్రవణ పేయమైన అనుప్రాసాలంకారంకూడా గమనించ తగినది. ఈ ప్రారంభశ్లోకంలో కావ్యప్రారంభంలో చేయవలసిన **"ఆశీః ర్నమస్క్రియావస్తునిర్దేశో వా"** (ఆశీస్సుతో గాని, నమస్కారంతో కాని, కథానిర్దేశంతో కాని కావ్య ప్రారంభాన్ని చేయాలి.) అనే మంగళాచరణత్రయం చేయబడింది.

**2. మయి ప్రవిశతి శ్రీమన్మందిరం రంగశాయినః ।**
**పత్యుః పదాంబుజం ద్రష్టు మాయాంత మవిదూరతః ॥**

శ్రీమత్ = కైంకర్యసంపదకు నిలయం అయిన తమ, రంగశాయినః=శ్రీరంగంలో శయనించి ఉన్న శ్రీరంగనాథుని, మందిరం=కోవెలను, మయి ప్రవిశతి (సతి)=నేను ప్రవేశించినపుడు, పత్యుః = సర్వశేషి అయిన శ్రీరంగనాథున్ని, పద+అంబుజమ్= తామరల వంటి పాదాలను, ద్రష్టుం = దర్శించడానికి, అవిదూరతః = సమీపంలో, ఆయాంతం = కాకతాళీయంగా వేంచేస్తున్న వారై



ఈ శ్లోకం నుండి **"భవేయం భవదుఃఖానామ్"** 13వ శ్లోకం వరకు ఒకే అన్వయం) **"త్వామ్"** అనే కర్తతో అన్నీ అన్వయిస్తాయి. **"ఆయాంతమ్"** అనే విశేషణపదంమొదలు వరుసగా శ్లోకాలన్నిటిలో ఉండే ద్వితీయాంతవిశేషణాలు అన్నీ 12వ శ్లోకప్రారంభంలో ఉన్న **"భవంతమ్"** అనే ద్వితీయాంతకర్మపదంతో అన్వయిస్తాయి. ఒకే అన్వయాన్ని కల శ్లోకబృందానికి **"కులకం"** అని పేరు. ఈ శ్లోకంనుండి ఎఱుమ్బియప్పా తాము వరవరమునుల అనుగ్రహాన్ని పొందిన రీతిని అనుసంధిస్తున్నారు. శ్లోకంలో **"మునే! వరవరస్వామిన్!"** అనే సంబోధన ఉండడంచేత దానికి పిమ్మట ఉన్న 13వ శ్లోకం వరకు గల శ్లోకాలన్నీ శ్రీమణవాళమహామునులను సంబోధిస్తూ విన్నపించినవి. నాలుగవ శ్లోకంలోని **"భవత్ప్రియా"** అనే మధ్యమపురుషార్థకనిర్దేశంకూడా గమనార్హం.

"స్వామీ! తమను సేవించాలని దాసుడనైన నేను చాలా దూరంలోనుండి ఆర్తితో వేగంగా వస్తున్న సమయంలో తమరే నిర్హేతుకంగా దాసుణ్ణి అనుగ్రహించడం కోసం నన్ను వెదకుతూ బయలుదేరి వస్తున్నట్లున్నదే!" అనే సంతోషం స్ఫురించేటట్లు **"మయి ప్రవిశతి"** అని, **"ఆయాంతమ్ అవిదూరతః"** అని ప్రయోగింపబడింది. **"రంగశాయినః శ్రీమత్ మందిరం మయి ప్రవిశతి సతి"** (శ్రీరంగనాథుని సన్నిధిలో దాసుడనైన నేను ప్రవేశించే సమయంలో) అని కొందఱు అన్వయించి అర్థం చెప్పారు. కాని, ఈ అన్వయం సరి అయినది కాదు. అర్థమూ ఇది కాదు. **"శ్రీమన్మందిరం మయి ప్రవిశతి పత్యుః రంగశాయినః పదాంబుజం ద్రష్టుమ్ అవిదూరతః ఆయాంతమ్"** అన్నదే సరసమైన అన్వయం. **"శ్రీమన్మదిరం"** అన్నది సమస్తపదం. **"శ్రీమతః మందిరమ్ శ్రీమన్మందిరమ్"** అని షష్ఠీతత్పురుషను చెప్పాలి. **"శ్రీమతః"** అంటే – దేవరవారియొక్క – అని అర్థం. వీరు భగవన్నియ మనంతో మణవాళమహా మునులను సేవించడం కోసంవచ్చారే తప్ప, శ్రీరంగనాథుని సేవించాలనే ఉద్దేశ్యంతో కాదుకదా! అందువల్ల మొట్టమొదటగా శ్రీరంగనాథుని మందిరంలో ప్రవేశించే ప్రసక్తి లేనందువల్ల ఆ అర్థం ఇక్కడ ఉచితమైనది కాదు. శ్రీరంగానికి చేరి, అక్కడ అనుష్ఠానాదులను పూర్తిచేసికొని ఎఱుమ్బియప్పా మామునులను సేవించగోరి, వారి సన్నిధానానికి బయలుదేరి వెళ్ళారు. వీరు మామునుల నివాసాన్ని ప్రవేశించే

సమయం, మామునులు తమ ఆస్థానంనుండి సన్నిధికి మంగళాశాసనార్థం బయలు దేరి వేంచేసే సమయం ఒకటి అయినది. ఆ విషయమే ఈ శ్లోకంలో ప్రస్తావింప బడింది. **"దేవరవారి మందిరం"** అని అర్థం ఇచ్చేటట్లు **"భవన్మందిరమ్"** అనే ప్రయోగాన్ని చేయవలసి ఉండగా, **"శ్రీమన్మందిరమ్"** అని అనడం ఒక విశిష్ట సాంప్రదాయికమైన ప్రయోగం. అందువల్ల, దాసుడు తమ సన్నిధికి ఉద్దేశించి వచ్చేటపుడే, తాము శ్రీరంగనాథుని శ్రీపాదాలను సేవించడంకోసం మీ నివాసం నుండి బయలుదేరారు - అని ఈ శ్లోకంలో తెలిపినట్లయింది. ఈ వివరణమే సందర్భోచితమన్నది సుస్పష్టం. **"అవిదూరతః"** అంటే, చాలా సమీపంలో కాకుండా, చాలా దూరంలోనూ కాకుండా కొంచెం దగ్గరగా - అని భావం.

**"తద్వచశ్శ్రవణోత్సుకః విగ్రహాలోకనపరః, శ్రవణం కీర్తనం స్మృతిః"** (ఆచార్యుల సూక్తులను వినాలనే ఆసక్తిని కలవాడై, దివ్యమంగళవిగ్రహాన్ని దర్శించాలనే ఆసక్తిని కలవాడై ఆచార్యుల సూక్తుల శ్రవణాన్ని, వారి కీర్తనాన్ని, స్మరణను చేయాలి) అనే భరద్వాజసూక్తి ప్రకారం స్వాచార్యుల సూక్తుల శ్రవణం మొదలైనవి ప్రాప్యాలని, అవి సంసారదుఃఖాన్ని తొలగించేవి అని తెలుపుతూ, **"ప్రత్యక్షే గురవః స్తుత్యాః"** (సమక్షంలో గురువులు స్తుతింపదగినవారు) అనే రీతిలో ప్రత్యక్షంగా స్వాచార్యులను స్తుతిస్తూ, తాము రచింపబోయే స్తోత్రార్థాన్ని సంగ్రహంగా (**"మయి ప్రవిశతి"** ఇత్యాది ప్రకృతశ్లోకం నుండి **"అనాస్పదమ్"** అనే 12వ శ్లోకం వరకు) స్తుతికర్త ప్రస్తావిస్తున్నారు.

**(శ్రీమన్మందిరం)** ఈ ప్రయోగాన్ని **"శ్రీమన్"** అని సంబోధనాంతంగాగాని, లేక, **"శ్రీమత్"** అని విడదీసి మందిరవిశేషణంగా గాని గ్రహించవచ్చు. ఇచట **"శ్రీః"** అంటే స్వరూపానురూపమైన కైంకర్యసంపద. **"మతుప్"** - ప్రత్యయంద్వారా ఆ సంపదయొక్క అతిశయం చెప్పబడింది.

**(రంగశాయినః మందిరం మయి ప్రవిశతి సతి)** ఇంతవరకు మణవాళమహా మునులపట్ల వైముఖ్యాన్ని కల్గి ఉండడానికి కారణమైన దుష్కర్మచేత దూషితుడనైన నేను, (మణవాళమహామునుల శ్రీపాదసేవతో పోల్చినపుడు) అప్రధానం అయిన శ్రీరంగనాథుని పాదసేవను పొందాలనే ఆశతోమాత్రం కోవెలను ప్రవేశించగా-అని భావం. **(పత్యుః)** జగత్పతి అయిన శ్రీరంగనాథునియొక్క - అని అర్థం. **"పతిం విశ్వస్య"** ఇత్యాది శ్రుతులు ఇచట స్మరణీయాలు. **"మయి ప్రవిశతి ఆయాంతమ్"** అనే ప్రయోగంవల్ల తాము శ్రీరంగాలయాన్ని ప్రవేశించే సమయం, మణవాళమహామునులు శ్రీరంగనాథుణ్ణి సేవించాలని వేంచేసే సమయం రెండూ-ఒకటి కావడం, "కాకి వాలడం, పండు రాలడంవలె" (కాకతాళీయ న్యాయంవలె) యాదృచ్ఛికం అనే అర్థం స్ఫురిస్తుంది. **"అవిదూరతః"** అనే సూక్తిద్వారా **"తద్దృష్టిగోచరా స్సర్వే ముచ్యంతే సర్వకిల్బిషైః"** (ఆచార్యుని దృష్టిలో పడినవారు అందఱు అన్ని పాపాలనుండి విముక్తులవుతారు) అనే రీతిలో సదాచార్యసన్నిధి ప్రభావంవల్ల ఇంతవరకు ఉన్న వైముఖ్యం పోయిందని చెప్పబడింది. శ్రీరంగనాథుని పాదారవిందాలను సేవించాలనే ఆశతో కోవెలను ప్రవేశించిన నేను తమ అనుగ్రహాన్ని పొందడం - కట్టెలను వెదికే వానికి గొప్పనిధి దొరికినట్లుగా ఉన్నదని భావమని వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్య.



**3. సుధానిధి మివ స్వైరస్వీకృతోదగ్రవిగ్రహమ్ ।**
**ప్రసన్నార్కప్రతీకాశప్రకాశపరివేష్టితమ్ ॥**

స్వైరస్వీకృత=స్వేచ్ఛతో అపూర్వంగా పరిగ్రహింపబడ్డ, ఉదగ్రవిగ్రహమ్=చాలా అందమైన రూపాన్ని కలవారు, సుధానిధిమ్ ఇవ=సముద్రంవలె ఉన్నవారు, ప్రసన్న+అర్కప్రతీకాశ=కంటికి ఏ శ్రమ లేకుండా దర్శించడానికి వీలుగా సౌమ్యంగా, మిక్కిలి చల్లగా ఉండే సూర్యతేజస్సు అనేది ఉంటే అటువంటి కాంతిచే, పరివేష్టితమ్=నాల్గు పక్కల చుట్టబడి ఉన్నవారు-(తరువాతి శ్లోకంతో అన్వయం)

**"ఆపాదా న్మౌళిపర్యంతం గురూణా మాకృతిం స్మరేత్"** (పాదాల నుండి శిరస్సు వరకు ఆచార్యుల రూపాన్ని స్మరించాలి.) అని, **"తేశారుమ్ శిచ్చ నవన్ శీర్‌వడివై ఆశైయుడన్ నోక్కుమవన్"** (తేజస్సు నిండుగా కల్గిన శిష్యుడు ఆచార్యుని రూపాన్ని ఆసక్తితో రక్షించాలి.) అని చెప్పే రీతిలో ఎఱుమ్బియప్పా ఈ శ్లోకంనుండి క్రమంగా తాము దర్శించిన మణవాళమహామునుల దివ్యమంగళవిగ్రహాన్ని స్తుతిస్తున్నారు.

**(స్వీకృతోదగ్రవిగ్రహం సుధానిధి మివ స్థితమ్ భవంతమ్)** అమృతసముద్రం ఈ రీతిలో ఉన్న ఒక దివ్యమంగళవిగ్రహాన్ని. స్వీకరించాలని స్వయంగా ఆశపడి మామునులుగా మూర్తీభవించినదా! అన్నట్లున్నది - పరమసత్త్వనిధి అయిన

మామునుల దివ్యమంగళరూపం. సన్నివేశాన్నిబట్టి **"మణ్ణాయ్ నీరెరికాల్ మఞ్జులావు మాకాశముమ్ పుణ్ణారాక్కై"** (భూమి, నీరు, నిప్పు, గాలి, మేఘాలు సంచరించే ఆకాశం అనే వీటితో ఏర్పడిన, పుండ్లతో నిండిన శరీరం) అని, **"మఞ్జుశేర్ వానెరి నీర్ నిలజ్కాలివై మయజ్గి నిన్ఱ అఞ్జుశేరాక్కై"** (మేఘాలు సంచరించే ఆకాశం, నిప్పు నీరు, భూమి, గాలి అనే ఈ ఐదింటితో ఏర్పడే శరీరం) అని చెప్పబడే పాంచభౌతికంగా ఉండే ప్రసక్తి లేనందువల్ల **"ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః"** (తన సంకల్పంతో గ్రహించినవి, తనకు ఇష్టమైనది అయిన దేహం) అని కీర్తింపబడే భగవానుని దివ్యరూపంవలెనే మణవాళమహామునుల తిరుమేనికూడా అప్రాకృతమని స్తుతికర్త తమలో నిశ్చయించుకొన్నారు. స్వేచ్ఛతో స్వీకరింపబడ్డ, అతిరమణీయమైన దేహాన్నికల అమృత సముద్రంవలె ప్రకాశించే దేవరవారిని–అని ఇచటి తాత్పర్యం. **"స్వైరస్వీకృత"** అని అన్నందువల్ల చాలా అభిమతమైనదని వ్యక్తం అవుతున్నది. కర్మానుగుణంగా వచ్చే శరీరానికి అభిమతంగా ఉంటుందనే నియతి లేదుకదా! **"ఉదగ్ర"** అనే విశేషణం సుధానిధికంటె ఎక్కువ రామణీయకాన్ని కల్గి ఉండడం తెలుపుతున్నది. దీనివల్ల యథాతథంగా ఉన్న సుధాసముద్రానికి మామునుల రూపంతో సాటి అయే యోగ్యత లేదు కాబట్టి, ఈ విశేషణాన్ని ప్రయోగించడంద్వారా ఉపమానాన్ని శిక్షిస్తున్నారు–అంటే – విశేషిస్తున్నారు. ఈ విధంగా ఉపమానాన్ని విశేషించి పల్కడం దివ్యసూరి సూక్తుల్లో ప్రస్ఫుటంగా, ప్రచురంగా కన్పిస్తుంది. భగవానుని తిరుమేనివర్ణాన్ని కీర్తించే నమ్మాళ్వార్లు **"శుట్టురైత్త నన్పొన్ ఉన్ తిరుమేని ఒళి ఒవ్వాదు"** (కాచి వడబోసిన మేలిమి బంగారం వన్నె కూడా నీ దేహవర్ణంతో సాటిరాదు.) అనే సూక్తిలో **"నన్పొన్"** అంటూ ఉపమానాన్ని శిక్షించడాన్ని గమనించ వచ్చు.

**(ప్రసన్నార్కప్రతీకాశప్రకాశపరివేష్టితమ్)** కన్నులకు ఏ శ్రమ లేకుండా చూడతగిన సూర్యుడు ఒకడు ఉంటే, అతని కాంతివంటి కాంతిని కలవారని భావం. ఇక్కడ **"ప్రసన్న"** పదంచేత సౌమ్య, శీతలత్వాది గుణాల సమవాయం తెలుపబడింది. దీనివల్ల సూర్యుడు విశేషింపబడ్డాడు. యథావత్తుగా ఉండే సూర్యుడు ఉష్ణత్వాదులను కల్గి ఉండడంచేత ఉపమానం కావడానికి అర్హుడుకాడు కదా! పూర్వవిశేషణంచేత, ఈ విశేషణం చేత అభూతోపమ స్ఫురిస్తున్నది. చంద్రుని శైత్యాన్ని గ్రహించి, సూర్యునివలె దర్శనాన్ని అనుగ్రహించేవారని అనికదా తాత్పర్యం. ఈ సందర్భంలో



**"తత్ర గోవింద మాసీనం ప్రసన్నాదిత్యవర్చసమ్"** (అక్కడ వేంచేసియున్నవాడు, ప్రసన్నుడైన సూర్యుని కాంతిని కలవాడు.) అనే ప్రమాణం స్మరణీయం. **"ప్రతీకాశ"** శబ్దం ఉపమావాచకం. **"హృది వసతి యస్య సౌమ్యరూపః"** అన్నట్లు ప్రసన్నాదిత్య వర్చస్సును కల భగవానుని ఎల్లప్పుడు హృదయంలో పదిలంగా కల్గిన మామునుల రూపంకూడా ఆ రీతిలోనే ప్రకాశించడం తగినదేకదా! ఉపనిషద్వాక్యాల్లో పలుచోట్ల జ్ఞానులను **"సౌమ్య"** అనే పదంతో సంబోధించడాన్ని గమనించవచ్చు. **"సుధానిధి"** అనే పూర్వవిశేషణంద్వారా మాధుర్యం, గాంభీర్యం, పావనత్వం–మొదలైనవి, ఈ విశేషణంవల్ల తమ కాంతితో లోకాన్ని అంతటిని సంతోషింపజేసే స్వభావం తెలుపబడ్డాయి. **"సుధానిధి"** – దృష్టాంతంద్వారా శ్రీమణవాళమహామునులు ఆదిశేషావతారభూతులనే వారి అవతారరహస్యం సూచింపబడింది. వరవరముని శతకంలోకూడా ఈ అంశాన్ని ఎఱుమ్బియప్పా– **"నిత్యం పత్యుః పరిచరణతో వర్ణతో నిర్మలత్వాత్"** (నిత్యం భగవంతుని సేవించడం వల్ల, స్వచ్ఛమైన తెల్లని వర్ణాన్ని కలిగిఉన్నందువల్ల శ్రీవరవరమునులు ఆదిశేష స్వరూపులని వ్యక్తం అవుతున్నది) అని తెలియజేశారు.

**4. పార్శ్వతః పాణిపద్మాభ్యాం పరిగృహ్య భవత్ప్రియౌ ।**
**విన్యస్యంతం శనై రంఘ్రీ మృదులౌ మేదినీతలే ॥**

పార్శ్వతః = రెండువైపుల, భవత్ప్రియౌ = అన్ని విషయాల్లో విరక్తులైన దేవరవారి ప్రేమకు స్థానమైన కోయిలణ్ణన్‌ను, వారి తమ్ములను, పాణిపద్మాభ్యాం= భోగ్యతాదిగుణాలలో తామరపూవుతో పోలిన రెండు చేతులలో, పరిగృహ్య= పట్టుకొని, మృదులౌ=మిక్కిలి సుకుమారంగా ఉన్న, అంఘ్రీ=శ్రీపాదాలను, మేది నీతలే = భూతలంపై, శనైః=మెల్లగా, విన్యస్యంతమ్=మోపుతున్నవారై (తరువాతి శ్లోకంతో అన్వయం)

**"ఆయాంత మవిదూరతః"** అంటూ రెండవ శ్లోకంలో మణవాళ మహామునులు తమ మఠంనుండి వేంచేసే సన్నివేశం ప్రస్తావింపబడిందికదా! ఆ విధంగా వేంచేసే సన్నివేశాన్ని తాము ఏ రీతిలో దర్శించారో,ఆ రీతిలోనే ఇందులో అప్పా ప్రస్తుతిస్తున్నారు.

ఎఱ్ఱతామరపూవులవంటి తమ రెండు శ్రీహస్తాలతో శ్రీమణవాళ మహామునులు తమ అంతరంగప్రీతిపాత్రభూతులైన ఇద్దఱు శిష్యులను రెండు

వైపుల పరిగ్రహించి, చాలా సుకుమారాలైన పాదాలతో మెల్లిగా నడుస్తూ వేంచేస్తున్నారని ఇచటి భావం. ఇచట శ్రీవరవరమునులకు రెండు వైపుల ఉండే అంతేవాసుల నామాలు స్పష్టంగా నిర్దేశింపబడనందువల్ల, వారిద్దరు కోయిలణ్ణన్, వారి తమ్ములు – అని కొందఱు, కోయిలణ్ణన్, వానమామలైజీయర్–అని మఱికొందఱు భావిస్తున్నారు.

**(భవత్ప్రియౌ)**–విషయవిరక్తులైన మీకు జ్ఞానం చేత, అధ్యవసాయం చేత, భక్తి, ప్రీతిసంభావణ ఇత్యాదుల చేత మీ నిరతిశయప్రేమకు పాత్రమైనవారని భావం. యతీశ్వరులైన భగవద్రామానుజులు సైతం దాశరథిని, కూరేశులను అత్యంతం ప్రేమించడం ప్రసిద్ధంకదా! శ్రీమామునులకు వార్ధక్యం కారణంగా శరీరంలో కల్గిన అలసటవల్ల వేఱొకరి హస్తావలంబాన్ని అపేక్షించి, వేంచేసే విషయం ఇక్కడ తెలుపబడిందని శ్రీ ప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్య. వీరిరువురు కోయిలణ్ణన్ అనబడే వాధూల వరదనారాయణులు, వారి అనుజులు వాధూల శ్రీనివాసగురువర్యులును. ఈ విషయాన్ని ఎఱుమ్బియప్పా వరవరమునిశతకంలో **"ప్రేమస్థానం వరవరమునే సంతు సంత శ్శతం తే తుల్యః కో వా వరదగురుణా తేషు నారాయణేన"** (శ్రీవరవరమునుల అభిమానాన్ని పొందినవారు ఎంతోమంది ఉండవచ్చు. కాని వారిలో వరదనారాయణ గురువులతో సాటి వచ్చేవారు ఎవరు?) అని, వేఱొక ముక్తకశ్లోకంలో **"వరవరమునివర్యఘనకృపాపాత్రమ్"** (శ్రీవరవరమునుల గొప్పకు పాత్రమైన వారు) అని సూచించారు–అని వాధూల వీరరాఘవాచార్యవ్యాఖ్య.

**(పాణిపద్మాభ్యామ్)** తామరపూలతో పోలికను చెప్పడంవల్ల శ్రీహస్తాల పావనత్వం, భోగ్యత్వం మొదలైనవి చెప్పబడ్డాయి. **(పరిగృహ్య) – "బహి రంత శ్శైకరూప్యేణ గృహీత్వా"** అని వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్య. అంటే, లోపల బయటకూడ ఒకే రీతిలో మనస్సులో ఏ విధమైన భేదం లేకుండా–అని అర్థం. లేక, ఇచట అప్పా తమ అభిప్రాయానుగుణంగా పరిగ్రహశబ్దప్రయోగాన్ని చేశారని కూడా చెప్పవచ్చు. పరిగ్రహమంటే గొప్పవారు తమకంటె తక్కువవారిని స్వీకరించడమే కదా! – అని కూడా ఆ వ్యాఖ్యలోని వివరణం. ఇక్కడ **"పరిగృహ్య"** అని ప్రయోగించడంవల్ల **"భవత్ప్రియౌ"** అని నిర్దేశింపబడ్డ ఇద్దఱు శిష్యులకు శ్రీమణవాళమహామునులు హస్తదానాన్ని చేసిన విషయం వ్యక్తమవుతున్నది.



ఇక్కడ **"పాణిపద్మాభ్యామ్ పరిగృహ్య"** అని రెండు చేతులతో ఇద్దఱు శిష్యులను పట్టుకొన్నట్లు చెప్పబడడంవల్ల వరవరమునులు త్రిదండాన్ని ధరించలేదని స్ఫురిస్తున్నదికదా! యతులు త్రిదండాన్ని ఎల్లప్పుడూ ధరించి ఉండాలనే నియమం ఉన్నందున ఇది తగదుకదా పాంచరాత్రాగమానికి చెందిన తత్త్వసాగరమనే సంహితలో – **"విష్ణురూపం త్రిదండాఖ్యం సర్వదా ధారయే ద్యతిః"** (విష్ణురూపమైన త్రిదండాన్ని యతి ఎల్లప్పుడూ ధరించాలి) అని, **"ఉపవీతం త్రిదండం చ పాత్రం జలపవిత్రకమ్, కౌపీనం కటిసూత్రం చ న త్యాజ్యం యావదాయుషమ్"** (యజ్ఞోప వీతాన్ని, త్రిదండాన్ని, పాత్రను, జలపవిత్రాన్ని, కౌపీనాన్ని, కటిసూత్రాన్ని–అంటే మొలనూలును జీవించినంతకాలం యతి విడువరాదు) అని చెప్పబడింది. యతుల త్రిదండాన్ని ఇతరులు పట్టుకోవడంకూడా నిషిద్ధమే. **"బ్రహ్మసూత్రం త్రిదండం చ శిఖావత్ బిభృయాత్ స్వయమ్, వాహయే దితరేణాథ ప్రాయశ్చిత్తీ భవే ద్యతిః"** (బ్రహ్మసూత్రాన్ని, త్రిదండాన్ని యతి స్వయంగా ధరించాలి. ఒకవేళ వానిని ఇతరులచేత మోయిస్తే ప్రాయశ్చిత్తం చేసికోవలసివస్తుంది) అని శౌనకవచనం కదా–అనే సందేహాన్ని ప్రకృతశ్లోకంలో లేవనెత్తి శ్రీవాధుల వీరరాఘవాచార్య స్వామివారు దాన్ని ఈ క్రిందిరీతిలో సమాధానించారు. త్రిదండాన్ని యతి తప్పక ధరించాలనే నియమం ఉన్నా, విశిష్టజ్ఞానులైనవారు ఏదైన ఒక విశిష్టకారణంచేత కొంతకాలం త్రిదండాన్ని ధరించకపోయినా దోషం లేదు. ఈవిషయం **"శీలం వృత్తం శ్రుతం జ్ఞానం వైరాగ్యం ధర్మలక్షణమ్, ఐశ్వర్యం విద్యతే యస్య మాత్రాభిః తస్య కిం ఫలమ్"** (శీలం, మంచి ప్రవర్తన, విద్య, జ్ఞానం, వైరాగ్యం, ఐశ్వర్యం కలిగినవారికి యతిచిహ్నాలతో పనిలేదు.) అనే ప్రమాణంవల్ల వ్యక్తం అవుతున్నది. త్రిదండం మాత్రాంతర్భూతం కదా! భగవన్మందిరానికి వెళ్ళడం అక్కడ భగవానునకు ప్రణామం చేయడం కోసం కాబట్టి, భగవత్ప్రణామంతో పాటు త్రిదండధారణాన్ని చేయడం సాధ్యం కాదు కాబట్టి ఇక్కడ త్రిదండం లేకుండాన్నే శ్రీమణవాళమామునులు వేంచేశారని భావించడంలో తప్పులేదు. ప్రణామం చేసే సమయంలో త్రిదండాన్ని ధరించే అవకాశం లేదని అనడానికి **"నిధాయ దండవ ద్దేహం ప్రసార్య చరణౌ కరౌ, బద్ధ్వా ముకుళవ త్పాణీ ప్రణామో దండసంజ్ఞితః"** (కట్టెవలె దేహాన్ని నిలువుగా చేసికొని సాగిలపడి, పాదాలను చేతులను చాచి, చేతులను రెండింటినీ మొగ్గరూపంలో ముడుచుకొని చేసేదే ప్రణామం) అని, **"పాదౌ శిర స్తథా హస్తౌ నికుంచ్య ముకుళా**

**కృతీ, మనోబుద్ధ్యభిమానేన ప్రణామో౽ష్టాంగసంజ్ఞితః"** (రెండు పాదాలను, శిరస్సును, చేతులను మొగ్గరూపంలో జోడించి, మనస్సు, బుద్ధి, అభిమానాలతో చేసేది ప్రణామమనబడుతుంది) ఇత్యాది ప్రమాణాలవల్ల తెలుస్తున్నది. త్రిదండాన్ని ధరించి ఉన్నపుడు ఈ విధంగా రెండు చేతులను ముకుళించే అవకాశం లేదు కదా! లేకపోతే, ఒక చేతితో త్రిదండాన్ని ధరించి, వేరొక చేతితో ప్రణామాన్ని చేయవచ్చునని చెప్పే వీలులేదు. ఏకహస్తంతో చేసే ప్రణామం నిషేధింపబడింది. **"ఏకేన పాణినా యో వై ప్రణమే ద్దేవ మచ్యుతమ్, తస్య దణ్డః కరచ్ఛేదః ఇతి ధర్మవిదో విదుః"** (ఒక చేతితో భగవానుడైన అచ్యుతునకు ప్రణామం చేసేవానికి తగిన శిక్ష అతని చేతులను ఛేదించడమేనని ధర్మాన్ని తెలిసినవారు చెప్పారు) అనికదా ప్రమాణం. అందువల్ల ప్రకృతశ్లోకంలో శ్రీమామునులు తమ రెండు చేతులతో తమ శిష్యులను ఇద్దఱిని పట్టుకొని వేంచేశారు అని అనడంలో విప్రత్తిలేదు. ఇక, త్రిదండాన్ని విడువకూడదనే నిషేధం ప్రణామవిశేషాదులకు సంబంధించిన కాలానికి చెందినదని భావించాలి.

కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారు తమ వ్యాఖ్యలో ప్రస్తుతవిషయాన్నిగూర్చి విచారిస్తూ ఈ విధంగా వివరించారు. "రెండు చేతులతో ఇద్దఱు శిష్యులను పట్టుకొని ఉంటే త్రిదండధారణాన్ని చేయడం ఏవిధంగా వీలవుతుంది? అని శంకిస్తూ కొందఱు చెప్పే సమాధానాలు ఏవీ శాస్త్రాలకు ఏ మాత్రం పొసగేవి కావు. వాస్తవానికి ఈ శంకకు ప్రస్తుతంలో కొంచెంకూడా అవకాశం లేదని నిశితంగా పరిశీలించినవారికి తెలుస్తుంది. ఇంతకుముందు రెండవశ్లోకంలో **"మయి ప్రవిశతి శ్రీమన్మందిరమ్"** అనే సూక్తిని వివరించినరీతిలో శ్రీమామునులు తమ మఠంలోనుండి బయలుదేరి వేంచేసిన క్రమాన్ని తెలిపే ఈ ప్రకరణంతో త్రిదండం శ్రీహస్తంలో ఉన్నదా? లేదా? అనే విచారమే అవసరం లేదు. అది ఉంటే ఉండనీ, లేకపోతే లేకపోనీ. రెండు చేతులతో ఇద్దఱు అంతేవాసులను పట్టుకొని వేంచేసినట్లు ఇచట చెప్పిన విషయాన్ని నిశితంగా పరిశీలిస్తే, స్వామి వారి చేతులను పట్టుకొన్నట్లు చెప్పవలసిన అవసరమే లేదు. వారు స్వామికి సహాయం చేయడం కోసం తమ హస్తాలంబాన్ని ఇచ్చారన్నదే ఇచట వివక్షితం. ఇది యుక్తమైన అనుష్ఠానమే. మూలశ్లోకంలోని వచనవిన్యాసం ఆవిధంగా కన్పించడం లేదే! అనే ఆక్షేపాన్ని ప్రాజ్ఞులైనవారు చేయదగినది కాదు **"పరిగృహ్య"** అంటే స్వీకరించి–అని అర్థం. తమ శ్రీహస్తాలను వారు పట్టుకొంటే, దానికి అంగీకరించినపుడుకూడా ఈ విధంగా శ్లోకాన్ని



అనుగ్రహించడంలో అడ్డులేదు కదా! అంతేకాక, చేతులను పట్టుకొని ఉండడమే కాకుండా, రెండువైపులా ఇద్దరు భక్తులు సహాయంగా వస్తున్నారు–అనే అర్థాన్ని దృష్టిలో ఉంచుకొని ఈవిధంగా శ్లోకాన్ని రచించారని అనడంలో లోటులేదు. ఈ నిర్వాహం అంగీకరించదగినదే అనడానికి ఒక ఉదాహరణను చూపిస్తాను. **"లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్"** (ఓ లక్ష్మీనరసింహా! నాకు చేయూతను ఇయ్యి.) అనే శ్లోకం లోకప్రసిద్ధం. "లక్ష్మీనృసింహస్వామీ! నాకు కరావలంబాన్ని అనుగ్రహించు" అని దీని అర్థం. అంటే, "నీ అనుగ్రహం నాపై పడాలి" అనే తాత్పర్యాన్ని ఇచ్చేదేకదా ఈ **"కరావలంబం మమ దేహి"** అనే ప్రార్థన. అంతేకాక, యతిరాజసప్తతిలో **"పరబ్రహ్మణః కరగ్రహవిచక్షణో జయతి లక్ష్మణో౽యం మునిః"** (పరమాత్మ చేతిని పట్టుకోవడంలో సమర్థులైన ఈ లక్ష్మణ ముని గొప్పగా ప్రకాశిస్తున్నారు.) అని ఉన్నదికదా! భగవద్రామానుజులు భగవానునకు కరావలంబాన్ని ఇచ్చేటట్లు సుస్పష్టంగా ఈ సూక్తిలో చెప్పబడింది. అయితే, వాస్తవానికి శ్రీరామానుజులు భగవానునకు చేతిని అందించినవారు కారుకదా! ఇది అంతా ఔపచారికప్రయోగం అనే విషయం. **"పఱవై యేఱు పరమ్ పురుడా! నీ యెన్నై క్కైక్కొణ్డపిన్"** (గరుడుని అధిరోహించే ఓ పరమ పురుషా! నీవు నా చేతిని స్వీకరించిన తర్వాత) అనే పెరియాళ్వార్ల శ్రీసూక్తి వల్ల చక్కగా తెలియవచ్చు. ప్రకృతంలో, మామునులే రెండు వైపులా ఇద్దఱు భక్తుల చేతులను పట్టుకొని వేంచేస్తున్నారని అర్థం గ్రహించినా గాని, దానివల్ల ఏ శాస్త్రార్థానికి లోటు రాదు. ఇది, మఠంనుండి వేంచేసే క్రమాన్ని తెలిపే సందర్భం కాబట్టి, మణవాళమహామునులు శ్రీరంగనాథునకు మంగళాశాసనం చేయడంకోసం బయటకు వచ్చే రీతిని **"తత స్సార్ధం వినిర్గత్య భృత్యైః నిత్యానపాయిభిః, శ్రీరంగమంగళం ద్రష్టుం పురుషం భుజగేశయమ్"** (తన వెంట ఎల్లప్పుడు వుండే శిష్యులతో కలసి బయలుదేరి, శ్రీరంగానికి మంగళకరుడు, ఆదిశేషునిపై శయనించి ఉన్నవాడు, పరమపురుషుడైన శ్రీరంగనాథుని సేవించడం కోసం) అనే ఇరవై రెండవ శ్లోకంలోనే ప్రస్తావించనున్నారనే సంగతిని గమనించిన వారికి ఇంతకంటే వివరంగా చెప్పవలసిన అవసరంలేదని ఇంతటితో విరమిస్తున్నాను.

**"విన్యస్యంతం శనై రంఘ్రీ"** అనే సూక్తికి అనుగుణంగా **"దృష్టిపూతపదన్యాసీ"**, **"దృష్టిపూతం న్యసేత్ పాదమ్"** ఇత్యాది ప్రమాణాల అర్థాలు అనుసంధేయాలు. మధుకైటభుల మేదస్సుతో నిండిన ఈ భూమికి ఇటువంటి మహానుభావుల

దివ్యచరణాల సంబంధం కలగడం మహాభాగ్యపరిణామం – అనే విశేషార్థం. **"మేదినీ"** శబ్దం ద్వారా వ్యక్తం అవుతున్నది. **"ఞిమిదా–స్నేహనే"** అనే ధాతువునుండి నిష్పన్నమైన మేదినీశబ్దంద్వారా భూమి స్నేహపూర్వకంగా (భక్తిపూర్వకంగా) మామునుల దివ్యచరణయుగళాన్ని అనుభవిస్తున్నదని స్ఫురిస్తున్నదని వాధూల వీరరాఘవాచార్యస్వామివారి వ్యాఖ్య.

**5. ఆమ్లానకోమలాకార మాతామ్రవిమలాంబరమ్ ।**
**ఆపీనవిపులోరస్క మాజానుభుజభూషణమ్ ॥**

ఆమ్లానకోమల + ఆకారమ్ **=** కొంచెం అలసిన మృదువైన తిరుమేనిని కలవారు, ఆత్రామవిమల + అంబరమ్ **=** మిక్కిలి ఎఱ్ఱగా ఉన్న, పరిశుద్ధమైన వస్త్రాన్ని ధరించినవారు, ఆజానుభూజభూషణమ్ **=** మోకాళ్ళవరకు ఉన్న, చాలా పొడుగైన, గొప్ప అందమైన భుజాలను కలవారు – (పై శ్లోకంతో అన్వయం)

స్తనంధయ (తల్లి దగ్గఱ పాలు తాగే) శిశువు ముందుగా తన జీవనాధారం అయిన తల్లి స్తన్యాన్ని నోటిలో పెట్టుకొన్న రీతిలో స్తుతికర్తకూడా మొట్టమొదటగా మణవాళమహామునుల శ్రీపాదాల్లో తమకు దృష్టిని కల్గిన విషయాన్ని గడచిన శ్లోకంలో **"అంఘ్రీ మృదులౌ మేదినీతలే"** (సుకుమారాలైన శ్రీపాదాలను భూమిపై మోపి) అని వ్యక్తం చేసి, ఇపుడు మిగిలిన దివ్యావయవాల్లో, పీతాంబరంలో దృష్టిని సారించి పల్కుతున్నారు. కొంచెం అలసట పొందిన, పరమసుందరమైన దివ్యమంగళరూపాన్ని కలవారై, కటిప్రదేశంలో ఎఱ్ఱని, ధగధగలాడే కాషాయవస్త్రాన్ని ధరించినవారై, ఉత్తుంగమైన, విశాలమైన వక్షఃస్థలాన్ని కలవారై, మోకాళ్ళవరకు ఉన్న, పొడుగైన చేతులనే దివ్యభూషణాలను కలవారై వెల్గుతున్న మణవాళ మహామునులను – అని శ్లోక తాత్పర్యం.

**(ఆమ్లానకోమలాకారమ్)** – వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్యలో **"అమ్లానకోమలా కారమ్"** అనే పాఠం స్వీకరింపబడి, **"ఆమ్లాన"** శబ్దానికి పెద్దగోరింటపూవు అనే అర్థం ఉన్నందున ఆ పూవువలె సుకుమారమైన రూపాన్ని కలవారనే అర్థం చెప్పబడింది. దీనివల్ల కేవలం శ్రీపాదాలే కాకుండా, సర్వావయవాల మార్దవంకూడా చెప్పబడింది. శ్లోకంలోని మిగిలిన మూడు పాదాలు దీర్ఘమైన అకారంతో ప్రారంభమైనందువల్ల, తదనుగుణంగానే మొదటి పాదంలో కూడా **"ఆమ్లానకోమలాకారమ్"** అనే పాఠాన్ని



కొందఱు గ్రహించి, దేహం అంతటా గోరింటపూవు సౌకుమార్యంవంటి సౌకుమార్యాన్ని కలవారని వివరించారు. మఱికొందఱు **"అమ్లాన"** శబ్దం శిరీష పుష్పాన్ని – అంటే దిరిసెన పూవును – తెలుపుతుందని అన్నారు.

శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారు ఈ వివరణాలను వేనినీ ఆదరించలేదు. "మొదటి పాదంలో **"అమ్లాన"** అని కొందఱు పాఠాన్ని గ్రహించి, **"వాడా క్కుఱిఞ్జి"** వలె అందమైన రూపాన్ని కలవారని అర్థం చెప్పారు. కాని, అది సహృదయహృదయంగమం కాదు. **"మ్లాన"** శబ్దం పైన **"ఆఙ్"** అనే ఉపసర్గ చేరిందని భావించి అర్థం చెప్పబడమే సరసం. వయః పరిణామంచే కల్గిన మ్లానికూడ **"కి మివ హి మధురాణాం మండనం నాకృతీనామ్"** (అందమైన ఆకారం ఉన్నవారికి ఏది అలంకారం కాదు?) అన్న రీతిలో శోభాతిశయావహమే అవుతుంది. ఈ అర్థవిశేషస్ఫురణానుగుణంగానే వెంటనే **"కోమల"** శబ్దప్రయోగం చేయబడింది" – అని వారు వ్యాఖ్యానించారు.

**(ఆతామ్రవిమలాంబరమ్)** అంతట ఎఱ్ఱని, ధగధగ మెఱిసే వస్త్రాన్ని ధరించినవారని– అర్థం. యతులు ధరించే వస్త్రం **"శెమ్మల్ పొడిక్కూరై"** అన్న రీతిలో ఎఱ్ఱని గైరిక ధాతువుల చూర్ణంవల్ల (జేగురు రాళ్ల పొడివల్ల) కాషాయవర్ణాన్ని కల్గి ఉండడాన్ని **"ఆతామ్ర"** అనే విశేషణం, **"సుధానిధి మివ"** అంటూ పూర్వం వర్ణింపబడ్డ శుద్ధధౌతవర్ణానికి, కాషాయవర్ణంతో గల కలయికవల్ల ఏర్పడిన పరభాగశోభను **"విమల"** అనే విశేషణం తెలియజేస్తున్నవి. ఇందువల్ల అమృతసముద్రంలో పగడాల సమూహం శోభిల్లేటట్లున్నదని వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్య. **"మోక్షాశ్రమే స్మృతం వస్త్రం రక్తగైరికధాతునా, ధార్యం యజ్ఞోపవీతం తు సితం నవగుణాన్వితమ్"** (సన్న్యాసాశ్రమంలో గైరికధాతువు చేత ఎఱ్ఱని రంగు కల వస్త్రాన్ని, తెల్లని, తొమ్మిది దారాలున్న యజ్ఞోపవీతాన్ని ధరించాలి) అనే దత్తాత్రేయవచనాన్ని ఇచట స్మరించాలి.

**(ఆజానుభుజభూషణమ్)**–జానుపర్యంతం వ్యాప్తాలైన భుజాలను భూషణంగా కలవారిని – అని అర్థం. దీనివల్ల శ్రీమణవాళమహామునుల మహాపురుషలక్షణం సూచింపబడింది. ఇంతకుముందు శ్లోకంలో **"పార్శ్వతః పాణిపద్మాభ్యామ్"** అని అంటూ రెండు చేతులతో రెండు వైపుల ఇద్దఱు అంతేవాసులను పట్టుకొని వస్తున్నట్లు చెప్పబడగా, ఇపుడు రెండు భుజాలు మోకాళ్ళవరకు సాగి ఉన్న సన్నివేశం వర్ణింపబడడం పూర్వోత్తరవిరుద్ధం కదా! అనే శంకకు తావు లేదు. వార్ధక్యంవల్ల కల్గిన శ్రమచేత కొంచెంసేపు భుజాలను కిందకు వ్రేలాడేటట్లు ఉంచిన రీతిని

దర్శించి స్తుతికర్త ఈ విశేషణాన్ని ప్రయోగించారని చెప్పవచ్చు. ప్రకృత ప్రయోగానికి భుజాలలో భూషణాలను కలవారనే అర్థాన్ని చెప్పే వీలున్నా, అది సరసం కాదు.

**6. మృణాలతంతుసంతానసంస్థానధవళత్విషా ।**
**శోభితం యజ్ఞసూత్రేణ నాభిబింబసనాభినా ॥**

మృణాల తంతు సంతాన = తామరతూడులనుండి తీసిన దారాల పరంపరవలె తెల్లని కాంతిని కల, నాభిబింబసనాభినా = గుండ్రని నాభివరకు వేలాడే, యజ్ఞ సూత్రేణ = యజ్ఞోపవీతంతో, శోభితమ్ = ప్రకాశించేవారిని. (పై శ్లోకంతో అన్వయం.)

ప్రకృతం శ్రీమణవాళమహామునుల వక్షస్సులో ప్రకాశించే యజ్ఞోపవీతవర్ణన చేయబడుతున్నది. తెల్లని తామరతూడుల దారాల సమూహంవలె తెల్లని కాంతిని కల్గిన, నాభివరకు వేలాడే యజ్ఞోపవీతంతో ప్రకాశించేవారు శ్రీమణవాళ మహామునులని తాత్పర్యం.

**(మృణాలతంతుసంతానసంస్థానధవళత్విషా)** తామరతూడుల దారాల సమూహం వలె తెల్లని కాంతితో – అని గాని, తామరతూడుల దారాల సమూహంవంటి తెల్లని కాంతితో అని కాని ఈ ప్రయోగానికి అర్థం చెప్పవచ్చు. మొదటి అర్థం బహువ్రీహివల్ల, రెండవ అర్థం కర్మధారయంవల్ల స్ఫురిస్తుంది. సంస్థానం అంటే – ఆకారం. **"సంస్థాన మాకృతౌ మృత్యౌ"** అని రత్నమాల.

**(నాభిబింబసనాభినా)** లోతుగా, గుండ్రంగా ఉన్న నాభితో సదేశమైనది– అనగా – అంతవరకు వేలాడుతూ ఉన్నది. **"సపిండా స్తు సనాభయః సమానోదర్య సోదర్యసగర్భసహజా స్సమాః"** అనే అమరకోశవచనాసారం సనాభిశబ్దం తోడబుట్టినవానిని నిర్దేశిస్తుంది.

**"ధవళత్విషా"** అనే యజ్ఞోపవీతవిశేషణానికి అనుగుణంగా, **"ధార్యం యజ్ఞోపవీతం స్యాత్ సితం నవగుణాన్వితమ్"** (తెల్లని, తొమ్మిది దారాలను కల యజ్ఞోపవీతాన్ని ధరించాలి) అనే దత్తాత్రేయవచనాన్ని, **"యతీనాం త్రీణి శుక్లాని భవంత్యేతాని నిత్యశః, యజ్ఞోపవీతం దంతా శ్చ"** అనే మేధాతిథివచనాన్ని స్మరించవలసి ఉన్నది. **"యజ్ఞసూత్రమ్"** అంటే – యజ్ఞోపవీతం. **"తన్మహా మునిభి ర్వేద బ్రహ్మసూత్ర మితి స్మృతమ్, ఉపవీతం బ్రహ్మసూత్రం సూత్రం యజ్ఞోపవీతకమ్,**



**యజ్ఞసూత్రం దేవలక్ష్మ ఇత్యాఖ్యా షట్క్రమేణ తు"** అనే వచనాన్నిబట్టి ఉపవీత, బ్రహ్మసూత్ర, సూత్ర, యజ్ఞోపవీత, యజ్ఞసూత్ర, దేవలక్ష్మాలనే పదాలు యజ్ఞోపవీత వాచకాలు **"యజ్ఞసూత్రేణ"** అనే ఏకవచనప్రయోగం యతులు ఒకే యజ్ఞోపవీతాన్ని ధరించాలని తెలుపుతున్నది. **"ఏక మేవ యతే స్సూత్రం సాజినం బ్రహ్మచారిణః, సోత్తరీయాణి గృహిణః తథైవ వనవాసినః"** (యతికి ఒకటే సూత్రం. బ్రహ్మచారి కృష్ణాజినంతో కూడిన ఒకేసూత్రాన్ని ధరించాలి. గృహస్థుడు, వానప్రస్థుడు ఉత్తరీయంతో కలిపి రెండు సూత్రాలను ధరించాలి.) అని, **"ఉపవీతం వటో రేకం ద్వే తథా వనవాసినః"** అని, **"ఉపవీతం వటో రేకం ద్వే తథేతరయోః స్మృతేః, ఏక మేవ యతీనాం స్యా దితి శాస్త్రస్య నిశ్చయః"** (బ్రహ్మచారికి ఒకటే సూత్రం. మిగిలినవారికి రెండు. యతులకు ఒకటే సూత్రం – అని శాస్త్ర నిశ్చయం.) అని ఇత్యాది ప్రమాణాలు ఈ విషయాన్ని ఋజువుచేస్తున్నవి. **"సనాభి"** శబ్దంచేత సదేశత్వం – అంటే ఒకే చోట ఉండే స్థితి చెప్పబడుతున్నది. నాభిపర్యంతం యజ్ఞోప వీతం ఉండాలనే విషయం దీనివల్ల తెలుస్తున్నది. ఈ విషయాన్ని **"నాభే రూర్ధ్వ మనాయుష్య మధస్తా త్తు తపఃక్షయః, తస్మా న్నాభిసమం కుర్యా దుపవీతం విజా నతః"** (యజ్ఞోపవీతం నాభికి పైన ఉంటే ఆయుక్షీణం, క్రిందకు ఉంటే తపఃక్షయం కలుగుతుంది. అందువల్ల సరిగా నాభిపర్యంతం ఉండాలి) అనే ప్రమాణంవల్ల కూడా తెలియవచ్చు.

**7. అంభోజబీజమాలాభి రభిజాతభుజాంతరమ్ ।**
**ఊర్ధ్వపుండ్రై రుపశ్లిష్ట ముచితస్థానలక్షణైః ॥**

అంభోజబీజమాలాభిః=తామరపూసలతో చేయబడిన మాలలతో, అభిజాత భుజాంతరమ్ =అలంకరింపబడ్డ అందమైన బాహువులను, వాని మధ్యభాగం అయిన వక్షఃస్థలాన్ని కలవారు, ఉచితస్థానలక్షణైః=శాస్త్రాలలో చెప్పబడ్డ లలాటం మొదలైన స్థానాల సౌష్ఠవాన్ని, లక్షణసౌష్ఠవాన్ని కల, ఊర్ధ్వపుండ్రైః= ద్వాదశోర్ధ్వపుండ్రాలతో, ఉపశ్లిష్టమ్=(పుష్పాలు పూచినట్లు) పొందికగా ఉన్నవారిని (పై శ్లోకంతో అన్వయం)

శ్రీవరవరమునుల భుజాలలో, వక్షఃస్థలంలో ప్రకాశించే తామరపూసల మాలను, ఊర్ధ్వపుండ్రాలను స్తుతిస్తున్నారు. తామరపూసల మాలలచే అలంకరింపబడ్డ

అందమైన భుజాలతో, ఆ భుజాల మధ్యభాగం అయిన వక్షఃస్థలంతో శోభిల్లేవారు, లలాటం మొదలైన ఆయా నిర్దిష్టస్థలాలలో లక్షణసౌష్ఠవాన్ని కల్గిన ఊర్ధ్వ పుండ్రాలను తిరుమేనిలో అవి సహజంగానే ఉన్నాయా! అనేటట్లు కల్గి ఉన్నవారు శ్రీమణవాళ మహామునులు అని భావం.

ఈవిధంగా వరవరమునులు తులసీపూసల మాలలు, తామరపూసల మాలలు మొదలైనవి అలంకరించుకొన్నందువల్ల వారికి ఏర్పడిన అందాన్ని, పన్నెండు ఊర్ధ్వపుండ్రాలతో ధగధగమని వారు వెలిగే సౌందర్యాన్ని కవి ఇందులో స్తుతించారు.

విశిష్టమైన అధికారాన్ని కలవారు తామరపూసల మాలను, తులసిపూసల మాలను ధరించడం శాస్త్రవిహితమే. భారద్వాజస్మృతిలో **"పవిత్రాణ్యబ్జబీజాని శంఖచక్రాంకభూషణమ్, ధారయే ద్వైష్ణవం నామ"** (పవిత్రాలైన తామరపూసలను, శంఖచక్రాల అంకనమనే భూషణాన్ని, వైష్ణవనామాన్ని–అంటే తాను భగవంతునకు చెందినవాడననే నామాన్ని ధరించాలి) అని, పరాశరస్మృతిలో **"ఉపవీతం శిఖాబంధ మూర్ధ్వపుండ్రం తథైవ చ, పద్మాక్షమాలాం కౌశేయం సతతం ధారయే ద్విజః"** (బ్రాహ్మణుడు ఉపవీతాన్ని–అంటే యజ్ఞోపవీతాన్ని శిఖను, ఊర్ధ్వపుండ్రాలను, తామరపూసలమాలను, పట్టువస్త్రాన్ని ఎల్లప్పుడూ ధరించాలి) అని చెప్పబడింది.

శ్లోకంలో **"మాలాభిః"** అనే బహువచనంవల్ల తులసీమాలలను, పవిత్రాలను కూడా ధరించవచ్చునని తెలుస్తున్నది **"యే కంఠలగ్నతులసీనళినాక్షమాలా..... భువన మాశు పవిత్రయంతి"** (ఎవరు, తమ మెడలో తులసి పూసల మాలలను, తామర పూసల మాలలను ధరిస్తారో.... వారు ఈ లోకాన్ని పవిత్రం చేస్తున్నారు.) అని శ్రీవైష్ణవచిహ్నాలు వర్ణింపబడ్డాయి కదా! బ్రాహ్మపురాణంలో కూడా **"శ్రీకృష్ణతులసీకాష్ఠమణిమాలాం తథైవ చ, శ్రీమత్పవిత్రం దేవేన ధారితం వై గళం తథా, సహ పద్మాక్షమాలాం చ"** (కృష్ణతులసి పూసల మాలను, భగవానుడు ధరించి విడచిన పవిత్రాలను తామరపూసలమాలతో పాటు ధరించాలి) అని చెప్పబడింది.

ఊర్ధ్వపుండ్రధారణ విషయాన్నిగూర్చి వృద్ధమనుస్మృతిలో **"ఊర్ధ్వపుండ్రం మృదా ధార్యం యతీనాం తు విశేషతః, భస్మచందనగంధాదీన్ వర్జయే ద్యావదాయుషమ్"** (జీవించినంతకాలం ఊర్ధ్వపుండ్రాన్ని తప్పకుండా యతులు



మృత్తిక (సుద్దతో) ధరించాలి. భస్మంతో కాని, చందనంతోకాని ఊర్ధ్వపుండ్రాన్ని ధరించకూడదు) అని తెలుపబడింది. పరాశరస్మృతి **"ఆదాయ వైష్ణవక్షేత్రా న్మృత్తికాం విమలాం సితామ్, మూలమంత్రేణాభిమంత్ర్య ఊర్ధ్వపుండ్రాని ధారయేత్"** (వైష్ణవక్షేత్రంనుండి పరిశుద్ధమైన, తెల్లని మృత్తికను సంపాదించి, దానితో మూలమంత్రాన్ని అభిమంత్రిస్తూ ఊర్ధ్వపుండ్రధారణను చేయాలి) అని ఊర్ధ్వపుండ్రధారణను విధిస్తూ, దాని వివరాన్ని **"లలాటాదిషు చాంగేషు కేశవాదీన్యథాక్రమమ్, త్ర్యంగుళం ద్వ్యంగుళం వాపి సాంతరాళం ప్రకల్పయేత్, పార్శ్వ మంగుళిమాత్రం తు ఊర్ధ్వపుండ్రస్య లక్షణమ్, హరేః పాదాకృతిం రమ్యం సుపార్శ్వం సుమనోరమమ్, నాసికామూల మారభ్య లలాటాంతం సువిన్యసేత్, ఊర్ధ్వపుండ్ర ప్రమాణాని స్థానాని ద్విజసత్తమాః!, వ్యూహభేదాని నామాని వక్ష్యామి చ పృథక్ పృథక్, చతు స్త్రిః ద్వ్యంగుళ వాపి విస్తారం ప్రకల్పయేత్, లలాటే కేశవాయేతి చతురంగుళ మాయతమ్, చతుశ్చక్రధరం దేవం శుద్ధజాంబూనదప్రభమ్....కుక్షౌ నారాయణాయేతి ధారయే త్తు దశాంగుళమ్"** (నుదురు మొదలైన స్థానాల్లో కేశవనామాన్ని ప్రారంభించి యథాక్రమంగా ఊర్ధ్వపుండ్రాన్ని మధ్యలో రెండు కాని, మూడు కాని అంగుళాల అంతరం ఉండేటట్లు, పార్శ్వంలో అంగుళం ప్రమాణం ఉండేటట్లు ధరించడం ఊర్ధ్వపుండ్రలక్షణం. భగవత్పాదాకారంలో, అందంగా, రెండు వైపుల చక్కగా ఉండేటట్లు, మనస్సును ఆనందింపజేసేటట్లు నాసికామూలం నుండి లలాటం చివర వరకు ధరించాలి. ద్విజశ్రేష్ఠులారా! ఊర్ధ్వపుండ్రాల ప్రమాణాలను, వాని స్థానాలను, వ్యూహభేదనామాల ఉచ్చారణతో వానిని ధరించే రీతిని ప్రత్యేక ప్రత్యేకంగా తెలియజేస్తాను. లలాటంలో **"కేశవాయ"** అని ఉచ్చరిస్తూ నాల్గు అంగుళాల వెడల్పుతో నాల్గు చక్రాలను ధరించినవాడు, పరిశుద్ధమైన బంగారురంగువంటి రంగును కలవాడు అయిన స్వామిని స్మరిస్తూ ధరించాలి.... ఉదరంలో పది అంగుళాల ప్రమాణంలో **"నారాయణాయ"** అని స్మరిస్తూ ధరించాలి) అని ఈ విధంగా తెలియజేసింది.

పాంచరాత్రాగమానికి చెందిన పరాశరసంహితలో పరాశరమహర్షి ఊర్ధ్వపుండ్రధారణనుగూర్చి తెలుపుతూ **"నాసాదౌ ద్వ్యంగుళం పాదం మధ్యం సార్ధాంగుళం భవేత్, పార్శ్వ మఙ్గుళిమాత్రం తు సుస్పష్టం ధారయే ద్విజః"** (నాసికాప్రారంభంలో రెండు అంగుళాల పాదం, మధ్యలో అర అంగుళం, పార్శ్వంలో

అంగుళపరిమాణంలో స్పష్టంగా ఊర్ధ్వపుండ్రాన్ని (బ్రాహ్మణుడు ధరించాలి) అని తెలిపాడు. పాద్మపురాణంలోకూడా **"ఆరభ్య నాసికామూలం లలాటాంతం సువిన్యసేత్, సమారభ్య భ్రువో ర్మధ్య మంతరాళం ప్రకల్పయేత్"** (నాసికా మూలంనుండి ఆరంభించి, లలాటం చివరవరకు చక్కగా ఊర్ధ్వపుండ్రాన్ని ధరించాలి) అని, **"అంతరాళం ద్వ్యంగుళం స్యాత్ పార్శ్వా వంగుళమాత్రకౌ"** (ఊర్ధ్వపుండ్రం మధ్యభాగం రెండు అంగుళాలు, పార్శ్వాలు ఒక అంగుళం ఉండాలి) అని చెప్పబడింది. **"హ్రస్వం దీర్ఘం తతం తను, వక్రం వక్రరూపం బద్ధాగ్రం ఛిన్నమూలం పదచ్యుతమ్, అశుభ్రమ్"** (పొట్టిగా, ఎక్కువ పొడుగుగా, బాగా విశాలంగా, బాగా సన్నంగా, వంకరగా, విరూపంగా, అగ్రాల్లో ముడిపడేటట్లుగా, మూలంతో కలవకుండేటట్లు, పాదం లేకుండేటట్లు ఊర్ధ్వపుండ్రాన్ని ధరించరాదు) అని ఊర్ధ్వపుండ్రదోషాలుకూడా ఆ గ్రంథంలో చెప్పబడ్డాయి. భరద్వాజసంహితలోకూడ **"ఉదరే హృది కంఠే చ దశాష్టచతురంగుళాన్"** (ఉదరంలో, వక్షఃస్థలంలో, కఠంలో వరుసగా పది, ఎనిమిది, నాల్గు అంగుళాల్లో ఊర్ధ్వపుండ్రాలని ధరించాలి) అని చెప్పబడింది. **"ద్వాదశోర్ధ్వ పుండ్రైః"** అని సంఖ్యావిశేషనియమం తెలిసేటట్లు చెప్పకుండా, కేవలం **"ఊర్ధ్వ పుండ్రైః"** అని పల్కడం... **"త్రయోదశ ద్వాదశ వాప్యూర్ధ్వపుండ్రాణి ధారయేత్"** అనే వచనాన్నిబట్టి (పదమూడు సంఖ్యలో కాని, పండ్రెండుగా గాని ఊర్ధ్వపుండ్రాలను ధరించాలి) అని కాని, లేక, ఊర్ధ్వపుండ్రసంఖ్య పండ్రెండు అన్నది సుప్రసిద్ధం కాబట్టి కాని – ఆవిధంగా ప్రయోగింపబడింది – అని వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్య. మృత్తికతో ధరించిన ఊర్ధ్వ పుండ్రంమధ్యలో శ్రీచూర్ణం ధరించాలి. ఈ విషయాన్ని **"ఊర్ధ్వపుండ్రస్యాంతరాళే హరిద్రాం ధారయే చ్ఛ్రియే"** (ఊర్ధ్వపుండ్రం మధ్యలో మంగళకరమైన హరిద్రను – అంటే – పసుపుతో చేయబడిన శ్రీచూర్ణాన్ని ధరించాలి) అనే పరాశరసూక్తి స్పష్టం చేస్తున్నది.

**8. కాశ్మీరకేసరస్తోమకడారస్నిగ్ధరోచిషా ।**
**కౌశేయేన సమిన్ధానం స్కంధమూలావలంబినా ॥**

కాశ్మీరకేసరస్తోమ = కుంకుమపూల సముదాయంవలె, కడారస్నిగ్ధరోచిషా = ఎఱ్ఱని, చిక్కని ధగధగ మెఱిసే కాంతిని కల్గిన, స్కంధమూల + అవలంబినా = బాహువుల్లో ధరింపబడి ఉన్న, కౌశేయేన = పట్టువస్త్రంతో, సమిన్ధానం = (తిరుమేనికి ఏర్పడిన పరభాగశోభలో) ప్రకాశించేవారు.



ముందుశ్లోకంలో ఊర్ధ్వపుండ్రవర్ణన చేయబడినందువల్ల, ఆ ఊర్ధ్వపుండ్రాల సంబంధాన్ని కల స్కంధమూలాన్ని, అక్కడ ధరించిఉన్న ఉత్తరీయాన్ని ఎఱుమ్బియప్పా కీర్తిస్తున్నారు.

కుంకుమపూల సమూహంవలె ఎఱ్ఱగా, ధగధగా మెఱిసే కాంతిని కల్గినది, బాహుస్కంధమూలాల్లో వేలాడుతూ ఉన్నది, కాషాయరంగులో ఉన్నది అయిన ఉత్తరీయంవల్ల ఏర్పడిన పరభాగ శోభతో శ్రీమణవాళమహామునులు ప్రకాశిస్తున్నారు.

ఉత్తమాశ్రమికి ఉత్తరీయధారణం తగదనే నిషేధం దివ్యదేశప్రావణ్యం లేకుండ, వర్ణధర్మైకనిష్ణాతులైన యతులను ఉద్దేశించి–అని తెలియాలి–అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామివారివ్యాఖ్య.

**"స్కంధమూలావలంబినా"** అనే ప్రయోగంవల్ల ఉత్తరీయరూపంగా వస్త్రాన్ని ధరించిన విషయం స్పష్టం అవుతున్నది. పారాశరస్మృతి నాల్గు వర్ణాలకు చెందినవారి వస్త్రధారణను గూర్చి తెలుపుతూ **"ఉపవీతం శిఖాబంధ మూర్ధ్వపుండ్రం తథైవ చ, పద్మాక్షమాలాం కౌశేయం సతతం ధారయే ద్విజః"** (యజ్ఞోపవీతాన్ని, శిఖను, ఊర్ధ్వపుండ్రాన్ని, తామరపూసల మాలను, పట్టుబట్టను విప్రుడు నిత్యం ధరించాలి) అని అన్నది. యతి ఉత్తరీయాన్ని ధరించరాదనే నియమం అవైష్ణవయతులకు చెందినది. కోవెలకు వేంచేసే సమయంలో భుజాలపై వేలాడే ఉత్తరీయంతో ఉండడంలో ప్రతిపత్తిపత్తి ఏమీ లేదు. ఎందువలన అంటే, ప్రణామకాలంలోనే ఆ విధంగా ఉత్తరీయాన్ని భుజాలపై ధరించరాదు – అని నిషేధం. **"ప్రదక్షిణే ప్రణామే చ పూజాయాం హవనే తథా, న కంఠగతవస్త్ర స్స్యాత్ దర్శనే గురుదేవయోః"** (ప్రదక్షిణాన్ని, ప్రణామాన్ని, పూజను, హోమాన్ని చేసేటపుడు, దైవాన్ని, గురువును దర్శించేటపుడు ఉత్తరీయాన్ని కంఠప్రదేశంలో ధరించరాదు) అని శాణ్డిల్యస్మృతి సూక్తి. యతుల కౌశేయం కాషాయవర్ణంలో ఉండాలనే నియమాన్ని **"కాషాయ మేవ కార్పాసం వాసః కంథాం చ ధారయేత్, వల్కలం వాఽజినం వాపి కౌశం శాణమయం తు వా"** అనే ప్రమాణం తెలుపుతున్నది.

**9. మంత్రరత్నానుసంధానసంతతస్ఫురితాధరమ్ ।**
**తదర్థతత్త్వనిధ్యానసన్నద్ధపులకోద్గమమ్ ॥**

మంత్రరత్న+అనుసంధాన=మంత్రరత్నం అనబడే ద్వయమంత్రాన్ని (సదా) అను సంధానం చేయడంవల్ల, సంతత=ఎల్లప్పుడూ, స్ఫురిత=కొంచెం కదిలే, అధరమ్= అధరాన్ని కలవారు, తదర్థతత్త్వ నిద్యాన = ఆ ద్వయమంత్రార్థతత్త్వాన్ని సదా మననం చేయడంవల్ల, సన్నద్ధపులకోద్గమమ్ = వ్యక్తం అయిన రోమాంచోదయాన్ని కలవారు (పై శ్లోకంతో అన్వయం)

మంత్రరత్నం అనే పేరుతో కీర్తింపబడే ద్వయమంత్రాన్ని నిరంతరం అను సంధానం చేయడంవల్ల శ్రీమణవాళమహామునుల అధరం కొద్దిగా కదలుతున్నది. ఆ ద్వయమంత్రం యొక్క తత్త్వార్థాన్ని మనస్సులో సదా భావన చేయడంవల్ల వారి తిరుమేనిలో కల్గిన రోమాంచం ప్రస్ఫుటంగా గోచరిస్తున్నది.

పూర్వశ్లోకంలో శ్రీవరవరమునుల స్కంధమూలసౌభాగ్యం వర్ణింపబడడంవల్ల, ఆ స్కంధమూలానికి సమీపంలో ఉన్న వారి అధరసౌందర్యం ఇందులో స్తుతింప బడుతున్నది.

**"శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయ నమః"** అనే రెండు ఖండాలను కల్గిన, న్యాస, శరణాగతి, ప్రపత్త్యాదిశబ్దాలచే వ్యవహరింపబడే, ఉత్తమోపాయాన్ని తెలిపే మంత్రానికి ద్వయమని పేరు. దీనికి మంత్రరత్నమనే ప్రసిద్ధమైన వేఱొక పేరుకూడా ఉన్నది. **"ఓమ్ నమో నారాయణాయ"** అనే అష్టాక్షరీమంత్రానికి మంత్రరాజమని పేరు. దానికంటే గొప్పది అయినందువల్ల ద్వయానికి మంత్రరత్నమనే పేరు సార్థకం అయినది. మంత్రరత్నం అంటే – మంత్రాలు అన్నిటిలోను శ్రేష్ఠమైనదని అర్థం. ఇక్కడ రత్నశబ్దం శ్రేష్ఠవాచకం. ఈ నామం దీనికి యోగరూఢమని వాధూలవీరరాఘవాచార్యవ్యాఖ్య. **"సర్వేషా మేవ మంత్రాణాం మంత్రరత్నం ద్వయాహ్వయమ్, మంత్రరత్నం ద్వయం న్యాసః ప్రపత్తి శరణాగతిః, నామాని మంత్రరత్నస్య పర్యాయేణ నిబోధ మే"** (మంత్రాలన్నిటిలో ద్వయమంత్రం మంత్రరత్న మని వ్యవహరింపబడుతున్నది. దీనికే మంత్రరత్నం, ద్వయం, న్యాసం, ప్రపత్తి, శరణాగతి –అనే వేఱే పేర్లు కూడా ఉన్నాయి) అనే సూక్తి ద్వయమంత్రానికి మంత్రరత్నమనే పేరు ఉన్నట్లు తెలుపుతున్నది. ఈ ద్వయమంత్రం సర్వమంత్రశ్రేష్ఠం అనే విషయాన్ని నారదమహర్షి పరాశరునకు" **మంత్రాణాం పరమో మంత్రో గుహ్యానాం గుహ్య ముత్తమమ్, రహస్యానాం రహస్యం చ సద్య స్సంసారతారణమ్, సర్వసంశయచ్ఛేత్తా చ సర్వకల్మషనాశనః, శరణాగతిమంత్రోఽ యం సర్వసంపచ్ఛుభా వహః"** (మంత్రాలు అన్నిటిలోను గొప్పదైన మంత్రం ఇది. రహస్యాల్లోను గొప్ప రహస్యం ఇది. చాలా వేగంగా సంసారసముద్రాన్ని దాటించేది. ఇది తిరుమంత్ర మనబడే అష్టాక్షరీమంత్రంలో కలిగే సంశయాలను అన్నిటినీ తీర్చేది. అన్ని పాపాలను తీర్చగల్గేది, ఇది. ఈ శరణాగతిమంత్రం అన్ని సంపదలను, అన్ని విధాలైన శుభాలను కల్గజేసేది) అంటూ తెలియజేశాడు. (అనుసంధానం అంటే – మెల్లగా ఉచ్చరించడం) పరాశరమహర్షి కూడా **"న్యాసాఖ్యం పరమం మంత్రం సంసారచ్ఛేదనం శుభమ్, సర్వదం సర్వపాపఘ్నం మహత్ప్రియతరం విభోః"** (న్యాసమనే పేరుగల గొప్ప మంత్రం–అంటే ద్వయమంత్రం సంసారాన్ని పోగొట్టేది, పవిత్రమైనది, అన్ని ఫలాలను అనుగ్రహించేది, అని పాపాలను పోగొట్టేది అంటే యోగక్షేమాలను కల్గించేది. భగవానునకు చాలా ఇష్టం అయినది) అని అంటూ దీని గొప్పతనాన్ని తెలియజేశాడు. లక్ష్మీదేవి సైతం **"వేదామృతమహాంభోధేః హరిణా ద్వయ ముద్ధృతమ్, తద్ద్వయం శృణు వక్ష్యామి సద్యోముక్తిప్రదం శుభమ్"** (హరి అనబడే భగవానుడు వేదమనబడే అమృతసాగరంనుండి ద్వయాన్ని వెలికితీశాడు. శీఘ్రంగా ముక్తిని ఇచ్చే, శుభమైన ఆ ద్వయాన్ని తెలుపుతాను విను) అని వచించింది. ఇటువంటి గొప్పతనాన్ని దృష్టిలో ఉంచుకొని స్తోత్రకర్త మంత్రరత్నమనే పదాన్ని ప్రయోగించారు. (మన సంప్రదాయంలో మంత్రరత్న మని, పురాణరత్నమని, స్తోత్రరత్నమని మూడు రత్నాలున్నాయి. మంత్రరత్నం అంటే – ద్వయం, పురాణరత్నం అంటే – విష్ణుపురాణం. **"నిరమమీత పురాణరత్నం తస్మై నమో మునివరాయ పరాశరాయ"** అని యామునులు విష్ణుపురాణాన్ని పురాణరత్నమని కీర్తించారుకదా. ఇక స్తోత్రరత్నం అంటే – శ్రీయామునులు అనుగ్రహించిన (ఆళవన్దార్) స్తోత్రం)

**"సంతతస్ఫురితాధరమ్"** అనే ప్రయోగంవల్ల ద్వయమంత్రానుసంధానం **"అప్పోదైక్కప్పోతు ఎన్నారావముదమ్"** (ఎప్పటికప్పుడు అపర్యాప్త అమృతమై భాసించేవాడు) అని, **"క్షణే క్షణే యన్నవతా ముపైతి"** (ప్రతిక్షణం కొత్తగా తోచేది.) అని కీర్తింపబడిన రీతిలో సదాతనత్వాన్ని కల్గినదనే విషయం స్ఫురిస్తున్నది. **"అనేన మంత్రరత్నేణ మత్ప్రియేణ భజే త్సదా"** (నాకు ఇష్టమైన ఈ మంత్రరత్నంతో నన్ను ఎల్లప్పుడూ భజించాలి) మొదలైన ప్రమాణాలవల్ల, పరాశరమహర్షి పల్కిన **"యావచ్ఛరీరపాతం తు ద్వయ మావర్తయే న్మనుమ్"** (బ్రతికి ఉన్నంతకాలం

ద్వయమంత్రాన్ని అనుసంధించాలి) అనే సూక్తివల్ల ద్వయానుసంధానాన్ని ఎల్లప్పుడూ చేయాలని తెలుస్తున్నది. **"స్ఫురిత"** అనే పదప్రయోగంవల్ల ఆ అనుసంధానం (గట్టిగా కాకుండా) చాలా మెల్లగా చేయాలని కూడా ఏర్పడుతున్నది. దీని ద్వారా **"మన్త్రం యత్నేన గోపయేత్"** (మంత్రాన్ని ప్రయత్నపూర్వకంగా రహస్యంగా ఉంచాలి) అనే శాస్త్రార్థాన్ని శ్రీమణవాళమహామునులు తమ అనుష్ఠానంద్వారా ఆదరించి చూపించారనికూడా ధ్వనిస్తున్నది.

ఈ ద్వయాన్ని అర్థానుసంధానపూర్వకంగా ఉచ్చరించడం ఉన్నతాధికారులకు కర్తవ్యం కాబట్టి, ఆ శాస్త్రార్థాన్ని శ్రీమణవాళమహామునులు ఆచరించి, మనకుపదేశిస్తున్నారనే విషయాన్ని ఇకపై తెలియజేస్తున్నారు. అష్టశ్లోకిలో కూడా శ్రీపరాశరభట్టర్ **"దశైతాన్ మంతారం త్రాయతే అయమ్"** అని వచించడం గమనించదగినది. **"మంతారమ్"** అని అన్నందువల్ల అధికారినియమం లేదనే విషయం స్పష్టమవుతున్నది. దీనివల్ల దీనికి దేశకాలాదినియమాలు లేవన్నదికూడ అర్థసిద్ధం. ఎందువల్లనంటే, **"అత్ర ఇదానీమ్ మంతారం త్రాయతే"** అని చెప్పబడలేదుకదా. ఈ విధంగా అధికారినియమం లేదన్న విషయాన్ని శాస్త్రం తెలిపింది **"దుర్వృత్తో వా సువృత్తో వా మూర్ఖః పండిత ఏవ వా, లక్ష్మీం చ మాం సురేశేశం ద్వయేన శరణం గతః, మల్లోక మచిరా ల్లబ్ధ్వా మత్సాయుజ్యం స గచ్ఛతి, అతిపాపప్రసక్తోఽపి శ్రీవైకుంఠం పురాతనమ్, ద్వయానుష్ఠానమాత్రేణ నరః శీఘ్రం స గచ్ఛతి, మూర్ఖో వా ధర్మశీలో వా నిందితో వాఽప్యనిందితః, ద్వయోచ్చారణమాత్రేణ నరః పూజ్యో న సంశయః, నానుకూల్యం న నక్షత్రం న తీర్థాదినిషేణమ్, న పురశ్చరణం నిత్యం జపం వాఽపేక్షతే హ్యయమ్, ద్వయేన మంత్రరత్నేన మత్ప్రియేణ భజే త్సదా, స్త్రీశుద్రా వినతా శ్చైవ మంత్రం ప్రణవవర్జితమ్, నమోఽతం మంత్రరత్నం చ జపేయు ర్వైష్ణవా స్సదా, ఋష్యాదీం శ్చ కరన్యాస మంగన్యాసం చ వర్జయేత్, నారీ వా వృషలో వాపి గురువందనపూర్వకమ్, స్త్రీణాం చ సర్వవర్ణానాం పురుషాణాం తథా విదుః"** (చెడ్డవర్తనం కలవాడైనా, మంచివర్తనం కలవాడైనా, మూర్ఖుడైనా, పండితుడైనా, ద్వయమంత్రంతో లక్ష్మిని, సురులకు ప్రభువైన నన్ను శరణు పొందితే, శీఘ్రంగా నా లోకాన్ని చేరుకొని, నా సాయుజ్యాన్ని అతడు పొందుతాడు. చాలా పాపాలను చేసివాడైనా ద్వయాన్ని అనుష్ఠించినంతమాత్రంచేతనే అతడు శీఘ్రంగా పురాతనం అయిన వైకుంఠాన్ని పొందుతాడు. మూర్ఖుడైనా, ధర్మాన్ని ఆచరించేవాడైనా,



నిందితుడైనా, అనిందితుడైనా, అతడు ద్వయాన్ని ఉచ్చరించిన మాత్రంచేత నిస్సందేహంగా పూజ్యుడు కాగలడు. అనుకూలమైన సమయంకాని, నక్షత్రం అనుకూలంగా ఉండాలనికాని, కాని, తీర్థాల్లో స్నానాదులు చేయాలి అని కాని, నిత్యం జపించవలసిన అవసరం కాని ఈ ద్వయానికి అవశ్యకాలు కావు. నాకు ఇష్టం అయిన మంత్రరత్నం అనబడే ద్వయమంత్రంతో సదా నన్ను భజించాలి. స్త్రీలు, శూద్రులు, అంతకంటే జన్మతః తక్కువారు అయినా ప్రారంభంలో ప్రణవం లేనిది, నమశ్శబ్దాన్ని చివరకల్గినది అయిన మంత్రరత్నాన్ని వైష్ణవులు అందఱు జపించవచ్చు. ఋషుల నామోచ్చారణం, అంగన్యాస–కరన్యాసాదులు కూడా అవసరం లేదు. గురువందనపూర్వకంగా ద్వయాన్ని స్త్రీలు, శూద్రులు అనుసంధించాలి) ఇత్యాదివచనాలు అనుసంధేయాలు.

ఇక, ఈ మంత్రాన్ని అర్థపురస్సరంగా అనుసంధించాలని అనడం **"జ్ఞానా న్మోక్షః"** అనే నియమం స్ఫురించడంకోసం. **"యథార్థం తు ద్వయం చైవం సర్వజ్ఞో మంత్రవిత్తమః – ఎన్ఱు అర్థజ్ఞానత్తైయుమ్ శొల్లిరిఱే. ఉదాహృతవచనఙ్గళిలుమ్ అర్థద్వారా మంత్రజ్ఞానమ్ ఎన్గిఱతు కణ్డుకొళ్వతు"** అనే అప్పన్ శ్రీనివాసాచార్యకృత అష్టశ్లోకీవ్యాఖ్యానసూక్తి స్మరణీయం. ద్వయార్థం ఏమి? అంటే, పిరాట్టితోకూడిన భగవానుని శరణంగా ఆశ్రయించడం. దీని తత్త్వం ఏది? అని అంటే, లక్ష్మీ పురుషకారభావం, ఆమెవల్ల ఉద్బుద్ధాలైన వాత్సల్యాదిగుణాలు, ఆ గుణాలతోకూడిన సిద్ధోపాయమైన నారాయణుడు, ఆ స్వామి తిరుమేని, దానిని సూచించే శ్రీపాదాలును. ధ్యానమంటే నితరాం ధ్యానం. అంటే, భావనాప్రకర్ష, నిరంతరం భావన చేయడం – అని దీని భావం. **"షట్పదోఽయం ద్విఖండః"** అనే అష్టశ్లోకీసూక్తిని వ్యాఖ్యానిస్తూ "ఈ విధంగా పూర్వవాక్యం మూడు పదాలుగా ఉన్నది. **స భ్రాతు శ్చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః** – అనే ఉపాయవరణాన్ని, దానికి ప్రతిసంబంధి అయిన శ్రీపాదాలను, ఆశ్రయణసౌకర్యాపాదకాలైన, తదేకాంతాలైన గుణవిశేషాలను, వాటిని ఉద్బుద్ధాలుగా చేసే లక్ష్మీపురుషకారాన్ని అవి తెలుపుతున్నాయి. ఉత్తరవాక్యం మూడు పదాలను కల్గినదై, **"భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి"** అని చెప్పబడ్డ పురుషకారం (లక్ష్మి), ఉపాయం (భగవానుడు) అయిన ఇద్దఱి కలయికలో సహజమైన, సార్వకాలికకైంకర్యరూపమైన ఉపేయాన్ని విరోధి నివృత్తిపూర్వకంగా అపేక్షించడాన్ని తెలుపుతున్నది" అని అప్పన్ శ్రీనివాసాచార్యులవారు

పల్కిన వివరణం స్మరణీయం. పైన చెప్పబడ్డ ద్వయంలోని అర్థతత్త్వాలను ఎడతెగక భావిస్తే భగవద్భక్తులకు ఆశ్చర్యంవల్ల, సంతోషంవల్ల రోమాంచం కల్గడం సహజం. ఆ దశావిశేషం మహాజ్ఞానులైన శ్రీమణవాళ మహామునులకు కల్గిందనే అర్థవిశేషం **"సన్నద్ధపులకోద్గమమ్"** అనే సూక్తివల్ల స్పష్టం. ఈ విశేషం **"నిధ్యాన"** అనే పదంలోని **"ని"** అనే ఉపసర్గవల్ల ధ్వనిస్తుంది. అందువల్లనే ద్వయాన్ని, దాని అర్థాన్ని మననం చేయడమే ప్రపత్తి కాబట్టి, ఆ ప్రపత్తిని **"కర్తవ్యం సకృదేవ"** అన్నట్లు ఒక పర్యాయంమాత్రం అనుష్ఠించవలసి ఉన్నందున, ఈ విధంగా నిరంతరం అనుష్ఠించాలని చెప్పడం పొసగదు కదా! అనే సందేహం కలుగవలసిన అవసరం లేదు. మోక్షార్థం ప్రపత్తిని చేయడం ఒకేసారి అయినా, సత్కాలక్షేపార్థం, భోగార్థం నిరంతరం ఆ అర్థతత్త్వాన్ని అనుసంధించడం తగినదే అని చెప్పాలి.

శ్లోకంలోని ఉత్తరార్ధానికి వేఱే రీతిలోకూడా అర్థాన్ని చెప్పవచ్చు. **"విష్ణుః శేషీ తదీయ శ్శుభగుణనిలయో విగ్రహః శ్రీశఠారిః, శ్రీమాన్ రామానుజార్యః పదకమలయుగం భాతి రమ్యం తదీయమ్, తస్మిన్ రామానుజార్యే గురు రితి చ పదం భాతి నాన్యత్ర తస్మాత్, శిష్టం శ్రీమద్గురూణాం కుల మిద మఖిలం తస్య నాథస్య శేషః"** (విష్ణువు శేషి. మనం చేసే కైంకర్యాలను స్వీకరించి ఆనందించే స్వామి. శుభగుణాలకు ఆకరమైన ఆ భగవానుని తిరుమేని శ్రీశఠారి అనబడే నమ్మాళ్వార్లు. వారి శ్రీపాదపద్మద్వయిగా శ్రీమద్రామానుజాచార్యులని పిలువబడే ఎమ్బెరుమానార్ ప్రకాశిస్తున్నారు **"గురుః"** అనే పదం ఈ భగవద్రామానుజా చార్యులయందే ప్రకాశిస్తున్నది. వేఱొకరిలో ప్రకాశించడంలేదు. అందువల్ల ఆ రామానుజులకు ముందు, తరువాత ఉన్న ఆచార్యసమూహం అంతా ఆ మునివరులకు శేషం) అని పెరియవాచ్చాన్ పిళ్ళై సాయించిన రీతిలో **"శ్రీమన్నారాయణచరణౌ"** అనే ద్వయమంత్రంలోని చరణశబ్దార్థం భగవద్రామానుజులే. అదియే శ్రీమన్నారాయణుని శ్రీపాదాలు **"శ్రీమన్నారాయణచరణౌ"** అన్నపుడు చరణశబ్దార్థం భగవద్రామానుజులే. అదియే తదర్థతత్త్వం. అంటే, మనం చూచే శ్రీమన్నారాయణుని చరణాలు కావు. భగవద్రామానుజులే శ్రీమన్నారాయణుని శ్రీపాదాలు అన్నది ద్వయమంత్రార్థం యొక్క యథార్థస్థితి – అని భావం. యతీంద్రప్రవణులైన (భగవద్రామానుజభక్తులైన) మణవాళమహామునులకు శ్రీరామానుజులనబడే శ్రీమన్నారాయణుల చరణాలను నిరంతరం ధ్యానించడమే ముఖ్యం కాబట్టి, పూర్వం



తెల్పిన ద్వయార్థతత్త్వంకంటె ఈ ద్వయార్థతత్త్వమే ఇచట ఎఱుమ్బియప్పావల్ల అనుగ్రహింపబడింది అనడం యుక్తమే. **"సన్నద్ధపులకోద్గమమ్ భవంతం పశ్యన్" (12)** అని అనడంవల్ల **"ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృత గాత్రవాన్, సదా పరగుణావిష్టః ద్రష్టవ్య స్సర్వదేహిభిః"** (భగవానుని గుణాలచేత ఆవేశింపబడి, ఆ భగవానుని గుణాలనే ధ్యానించి, అందువల్ల ఆనందబాష్పాలతో రోమాంచాన్ని పొందిన తిరుమేనితో వెలిగే భక్తుడు ఈ శరీరాన్ని పరిగ్రహించిన అందఱిచే ఎప్పుడూ దర్శింపబడాలి") అని అంటూ విష్ణుతత్త్వగ్రంథంలో చెప్పిన రీతిలో పలువురు ఆ స్థితిలో ఉన్న మణవాళమహామునులను కన్నులార చూడాలని ఎఱుమ్బియప్పా ఆశపడినట్లయింది. **"గాత్రైః సరోమోద్గమైః"** (రోమాంచంతో కూడుకొన్న శరీరంతో), **"మెయ్‌కళ్ శిలిర్‌ప్ప"** (రోమాంచం కలుగగా) ఇత్యాది పలు సూక్తుల భావాలు ఇచట అనుసంధేయాలు. **"సన్నద్ధ"** అనే ప్రయోగస్వారస్యాన్నిబట్టి ద్వయానుసంధానం వల్ల, తదర్థానుసంధానంవల్ల కలిగే రోమాంచం శరీరానికి పెట్టని నగవంటిదని స్ఫురిస్తుంది. ఈ ప్రయోగం, వివరణం – రెండూ భగవద్రామానుజులు ద్వయోచ్చార ణను గూర్చి రహస్యాలు మూడింటిలో తిరుమంత్రంలో కాని, చరమశ్లోకంలో కాని లక్ష్మీసంబంధం స్ఫుటంగా ప్రకాశించడం లేదు. ద్వయంలో మాత్రమే స్పష్టంగా ప్రకాశిస్తున్నది. అందువల్ల ఈ మంత్రానికి మంత్రరత్నమని పేరు వచ్చిందని పెద్దలంటారు. ఉపాయోపేయాలు రెండు వరుసగా పూర్వోత్తరఖండాలలో ప్రతి పాదింపబడడంవల్ల ద్వయమనే పేరు వచ్చిందనే విషయం **"ఇప్పడి సకల ప్రమాణప్రతిపాద్యఙ్గళాయ్, మంత్రసిద్ధమాన నిరతిశయసుఖరూపమాన ఆత్మస్వరూపత్తుక్కు అనురూపమాయ్, అభిమతముమాయిరున్దుళ్ళ ఉపాయోపేయఙ్గళై ఇరణ్డు వాక్యత్తాలుమ్ విశదమాక ప్రతిపాదిక్కైయాలే ద్వయమెన్ఱు తిరునామమాయ్"** (ఈ విధంగా సకలప్రమాణాలచేత ప్రతిపాదింపబడ దగినవి, అభిమతమైనవి అయిన ఉపాయోపేయాలను రెండింటిని రెండు వాక్యాలతో విశదంగా ప్రతిపాదించడంవల్ల ద్వయమనే పేరును కల్గినదై) అని అష్టశ్లోకీవ్యాఖ్యానంలో అప్పన్ శ్రీనివాసాచార్యుల వారు తెలియజేశారు. ప్రతివాది భయంకరం అణ్ణన్‌స్వామివారు తమ అష్టశ్లోకి 5వ శ్లోకవ్యాఖ్యానంలో **"మంత్రరత్నస్య వాక్యద్వయాత్మకత్వేన ద్వయత్వం సూచితమ్"** (మంత్రరత్నంలో రెండు వాక్యాలు ఉన్నందున దాని ద్వయత్వం సూచింపబడింది.) అని అన్నందువల్ల ఈ మంత్రంలో

రెండు వాక్యాలున్నందున ద్వయమనే పేరు వచ్చిందనికూడా తెలుస్తున్నది. ఆ రీతిలోనే, పూర్వం తెల్పినట్లు లక్ష్మీనారాయణుల ఇద్దఱి ప్రాధాన్యం (పురుషకార ఉపాయరూపాలలో) చెప్పబడినందువల్లకూడా ద్వయమనబడుతున్నదని పెద్దలు చెప్పారు.

**"సంసారవిషదష్టనుక్కు ద్వయమ్ రసాయనసేవైయాయిరుక్కుమెన్ఱు మణక్కాల్ నమ్బి యరుళిచ్చెయ్‌వర్"** (సంసారమనే విషసర్పంచేత కఱువబడ్డవానికి ద్వయం రసాయన సేవగా ఉంటుందని మణక్కాల్‌నమ్బి వచించేవారు), **"అధననుక్కు మహానిధిపోలే - యెన్ఱు పెరియముదలియార్ అరుళిచ్చెయ్‌వర్"** (దరిద్రునకు మహానిధివంటిది అని ఆళవన్దార్ అనుగ్రహించేవారు), **"క్షుధార్తనుక్కు అమృతపానమ్‌పోలే యెన్ఱు అరుళిచ్చెయ్‌వర్ తిరుమాలై యాణ్డాన్"** (ఆకలితో అలమటించేవానికి అమృతపానంవంటిది – అని తిరుమాలైయాణ్డాన్ అనేవారు), **"స్తనంధయప్రజైక్కు స్తన్యమ్బోలేయిరుక్కుమెన్ఱరుళిచ్చెయ్‌వర్ తిరుక్కోట్టియూర్ నమ్బి"** (పాలుతాగే శిశువుకు స్తన్యపానంవలె ఉంటుందని తిరుక్కోట్టియార్‌నమ్బి అనుగ్రహించేవారు), **"రాజకుమారనుక్కు ముడియుమ్, మాలైయుమ్ పోలే ప్రపన్నకులత్తుక్కు ద్వయోచ్చారణమ్ ఎన్ఱరుళిచ్చెయ్‌వర్ భాష్యకారరర్"** (రాజకుమారునకు కిరీటం, మాలవలె ప్రపన్నకులానికి ద్వయోచ్చారణం – అని భాష్యకారులు అనేవారు) **"పెరుమిడియన్ కైయిల్ చిన్తామణి కైప్పుకున్దాప్పోలే యెన్ఱు పిళ్ళైయుఱఙ్గావిల్లిదాసర్"** (కటికదరిద్రుని చేతితో చింతామణి దొరికినట్లు – అని పిళ్ళైయుఱఙ్గావిల్లిదాసర్ అనేవారు) **"వాచ్యఙ్గళిల్ ఎమ్బెరుమానుక్కవ్వరుకిల్లాదాప్పోలే వాచకఙ్గళిల్ ప్రపత్తియిఱ్కాట్టిల్ అవ్వరుకిల్లై యెన్ఱరుళిచ్చెయ్‌వర్ నఞ్జీయర్"** (వాచ్యార్థాలలో శ్రియః పతికి మించినది లేనట్లే, వాచకాలలో ద్వయానికి మించినది లేదని నంజీయర్ చెప్పేవారు), **"రాజకుమారనుక్కు కర్పూరనికరమ్బోలే ఇవనుక్కు విడిల్ నాక్కు నఱ్ఱుమెన్ఱు నమ్బిళ్ళై అరుళిచ్చెయ్‌వర్"** (రాజకుమారునకు కర్పూరంవలె జీవునకు ద్వయోచ్చారణలేకపోతే నాలుక తడి ఆరిపోతుంది – అని నమ్బిళ్ళై అనుగ్రహించేవారు) **"ఆழ்వాన్ తిరునాట్టుక్కెழுన్దరుళ పుఱప్పడు విట్టిరుక్కిఱదశైయిలే ఆழ்వానుక్కు కర్పూరనికరత్తై వాయిలిట్టాప్పోలే కాణుఙ్గోళ్ ఎన్ఱు అవరుక్కు ద్వయత్తై అరుళిచ్చెయ్‌దార్"** (కూరేశులు పరమపదయాత్రకై బయలుదేరిన సమయంలో కూరేశులకు నోరు తడి ఆరిపోకుండా కర్పూరనికరాన్ని నోటిలో పెట్టినట్లు సుమా! అని వారికి ద్వయాన్ని అనుగ్రహించారు) **"అనన్దాழ்వాన్ జీయరై ప్పార్త్తు తిరుమంత్రత్తిలే పిఱన్దు, ద్వయత్తిలే వళర్న్దు, ద్వయైకనిష్ఠరావీర్ ఎన్ఱు వాழ்த్తినార్"** (అనందాழ்వాన్ నంజీయర్‌ను చూచి తిరుమంత్రంలో పుట్టి, ద్వయంలో పెరిగి, ఆ ద్వయంలో నిష్ఠను కలవారుగా ఉండండి – అని మంగళాశాసనం చేశారు) అనే పలు పూర్వాచార్యసూక్తులను ద్వయార్థానుసంధానానికి అనుగుణంగా స్మరించవచ్చును. **"మంత్రరత్నాను సంధానాసక్తచేతసమ్"** అనే యతిపతిదినచర్యా స్తోత్రప్రయోగం ఇక్కడ భావ్యం.



**10. స్మయమానముఖాంభోజం దయమానదృగంచలమ్ ।**
**మయి ప్రసాదప్రవణం మధురోదారభాషణమ్ ॥**

స్మయమానముఖాంభోజమ్=ఎల్లప్పుడూ మందహాసంతో కూడిన తిరుముఖ మండలాన్ని కలవారు, దయామానదృగంచలమ్=దయకు సూచకం అయిన కటాక్షవీక్షణాన్ని కలవారు, మయి=ఇంతకాలంగా తమను ఆశ్రయించడంలో విముఖతను కల్గి ఉన్న నాపట్ల, ప్రసాదప్రవణం =విశేషమైన అనుగ్రహాన్ని చూపేవారు, మధుర+ఉదారభాషణమ్=ఆ అనుగ్రహకార్యంగా సంభవించేవి, వినడానికి మధురంగా ఉండేవి, అర్థగాంభీర్యాన్ని కల్గినవి అయిన సూక్తులను మాట్లాడేవారు అయిన మణవాళమహామునులను (పై శ్లోకంతో అన్వయం)

ముందుశ్లోకంలో **"సంతతస్ఫురితాధరమ్"** అని అధరవర్ణన చేయబడింది. ఈ శ్లోకంలో ఆ అధరంపైన కదలాడే మందహాసాన్ని, దాని కాంతితో శోభిల్లే కటాక్షాన్ని, ఆ రెండింటితో సమానమైన వచనామృతాన్ని, వీనివల్ల స్ఫురించే తమ విషయంలోని అనుగ్రహాన్ని స్తుతికర్త ప్రస్తావిస్తున్నారు.

**(స్మయమానముఖాంభోజమ్) – "స్మయమాన"** అనే వర్తమానకాలికప్రయోగంవల్ల వరవరమునుల ముఖం ఎప్పుడూ మందహాసాన్ని కల్గి ఉన్నదని ధ్వనిస్తున్నది. మందహాసరూపక్రియాన్వయసార్థక్యంకోసం **"ముఖాంభోజమ్"** అన్నపుడు అంభోజంవంటి ముఖం – అని చెప్పాలి. ముఖంగా పరిణామాన్ని చెందుతున్నందున పరిణామాలంకారం ఉందని చెప్పాలి.

శ్రీమణవాళమహామునుల తిరుముఖమండలం మందహాసం కల్గి ఉండడానికి రెండు కారణాలను వ్యాఖ్యాతలు వివరించారు. పూర్వశ్లోకంలో చెప్పబడినరీతిలో, ద్వయార్థతత్త్వ భావనాప్రకర్షంవల్ల ప్రాప్యరూపభగవత్కైంకర్యం లభించిందికదా!–

అనే అభిప్రాయం ఏర్పడినందున, తత్కారణంగా కల్గిన కృతార్థతానుసంధానంవల్ల సంతోషం జనించి, దానివల్ల ఎల్లప్పుడూ మందహాసాన్ని తమ ముఖంలో కల్గి ఉన్నారన్నది ఒక హేతువు. **"స్మితపూర్వభాషీ చ పూర్వభాషీ చ రాఘవః",** (చిరునవ్వుతో మాటలాడేవాడు, ముందుగా మాటలాడేవాడు, శ్రీరాముడు), **"మధురాభాషీ"** అన్న రీతిలో తాము పలుకబోయే మధురవచనాలకు ముందు మందహాసం చేస్తున్నారన్నది ఇంకొక హేతువు. మందహాసపూర్వకంగాకదా మహాత్ముల మధురభాషణం ఉంటుంది.

**(దయమానదృగంచలమ్)** – తాము పొందే భగవత్కైంకర్యరూపమైన ప్రాప్యాన్ని పొందదగిన అర్హతను అందఱు కల్గి ఉన్నా పొందలేక పోతున్నారే! అయ్యో!–అనే బాధవల్ల సదా కరుణను కురిసే కటాక్షవీక్షాన్ని కల్గి ఉన్నారనే విశేషం **"దయామాన"** ఇత్యాది వర్తమానకాలిక ప్రయోగంవల్ల వ్యక్తమవుతున్నది. దీనివల్ల వరవరమునుల పరదుఃఖదుఃఖిత్వరూపమైన దయ అనే మహాగుణం ప్రస్ఫుటమవుతున్నది. లేకపోతే, ముందు ప్రస్తావింపబడబోయే **"మధురోదారభాషణా"** నికి మూలమైన దయ దీనివల్ల సూచింపబడిందనికూడా చెప్పవచ్చును.

ఈ శ్లోకంలో అవశ్యం కల్గి ఉండవలసిన సంతోషం, దయ – అనే రెండు గుణాలు తెలుపబడ్డాయి. **"క్షమా తీర్థం తప స్తీర్థం తీర్థ మింద్రియనిగ్రహః, సర్వభూతదయా తీర్థం ధ్యానం తీర్థ మనుత్తమమ్, ఏతాని పంచతీర్థాని సత్యం షష్ఠం తు సర్వదా"** (క్షమ ఒక తీర్థం, తపస్సు తీర్థం, ఇంద్రియనిగ్రహం ఒక తీర్థం, సర్వభూతదయ అన్నది ఒక తీర్థం, ధ్యానం గొప్ప తీర్థం. ఇవి అయిదు తీర్థాలు. సత్య మన్నది ఆఱవ తీర్థం) అనే బృహస్పతి వచనం, **"సత్యశౌచదయాధైర్యక్షమా సంతోషయుక్తతా"** (సత్యాన్ని, పవిత్రతను, దయను, ధైర్యాన్ని, సహనాన్ని, సంతోషాన్ని కల్గిఉండడం) అని భరద్వాజపరిశిష్ట గ్రంథ సూక్తి, **"సాధారణం తు సర్వేషాం శంఖచక్రాదిధారణమ్, అహింసా సత్య మక్రౌర్యం శౌచ మింద్రియనిగ్రహః, దానం దమః క్షమా విద్యా సర్వేషాం మునిభిః స్మృతమ్"** (శంఖచక్రాదిధారణం అన్నది అందఱికి సాధారణం. దానం, అంతర్నిగ్రహం, క్షమ, విద్య–అనే వీటిని కల్గి ఉండాలని అందఱు మునులు అంగీకరించారు) అనే పరాశరవచనం ఈ విషయంలో ప్రమాణాలు.

**(మయి ప్రసాదప్రవణమ్)** ఇచటి అస్మచ్ఛబ్దంవల్ల ఇంతవరకు వైముఖ్యాన్ని కల్గి ఉన్న నా విషయంలో – అనే అర్థం తోస్తుంది. ప్రసాదశబ్దం అనుగ్రహాన్ని,



కాలుష్యనివృత్తిని కూడా తెలుపుతుంది. **"మయి ప్రసాదప్రవణమ్"** అనే సూక్తిద్వారా నా విషయంలో అనుగ్రహించడంలో ఆసక్తి కలవారనే అర్థమేకాక, గతంలో నా వైముఖ్యాన్ని చూచి పొందిన బాధ తీరి, మనస్సులో స్వచ్ఛతను పొందినవారనే అర్థంకూడా తెలుపబడింది. ఈ ప్రసాదంవల్ల జరిగే కార్యం ఇకపై ప్రస్తావింపబడుతున్నది.

**(మధురోదారభాషణమ్) "సంశ్రవే మధురమ్"** అన్నట్లు పలికే మాట తీయగా ఉండాలి. **"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్"** (సత్యాన్ని పలకాలి, ప్రియాన్ని పలకాలి) అని కదా సూక్తి. ఈ అర్థం ప్రకృతంలో **"మధుర"** శబ్దంచేత సూచితం. **"మధురా మధురాలాపా"** అన్నట్లు ఆలకించే దశలోకూడా మధురంగా ఉండడమే కాకుండా, ఆ సూక్తుల అనువాదం కూడా మధురమని చెప్పవచ్చు. ఈ మధుర సూక్తులలోని అర్థగాంభీర్యాన్ని **"ఉదార"** మనే విశేషం తెలుపుతున్నది. ఈ అర్థగాంభీర్యం పూర్వం వివరింపబడిన రీతిలో ద్వయమంత్రార్థాన్ని ప్రతిపాదించడంవల్ల, అంటే–ఏ మాట పల్కినా అది ద్వయమంత్రార్థాన్ని వివరించేది కాబట్టి అర్థగాంభీర్యాన్ని కల్గి ఉంటుందని తాత్పర్యం. మధురంగా మాట్లాడాలి అన్నది అవశ్యం కల్గి ఉండదగిన గుణం. **"సూనృతా మీరయే ద్వాచమ్"** (సత్య వచనాన్ని పలకాలి) అని మేధాతిథి వచనం. శాండిల్యస్మృతిలో కూడా **"అర్థయుక్తం చ సత్యం చ శ్రావ్యం ప్రియకరం మధు, శుద్ధం మితం చ యుక్తం చ కాలయోగ్యం వదే ద్వచః"** (అర్థంతో కూడినది, సత్యమైనది, శ్రావ్యమైనది, మధురమైనది, ప్రియమైనది, పవిత్రమైనది, మితమైనది, తగినది, కాలానుగుణమైనది అయిన మాటను పలకాలి) అని చెప్పబడింది. **"ఆగచ్ఛ గచ్ఛ తిష్ఠేతి స్వాగతం సుహృదం ప్రతి, సమ్మాన మపి న బ్రూయాత్ న్ముని మోక్షపరాయణః"** (మోక్షార్థి అయినవాడు స్నేహితుణ్ణి గూర్చి కూడ రా, పో కూర్చో, అని స్వాగతాన్ని, సమ్మానాన్ని పలుకరాదు) అనే నిషేధవచనాలు విష్ణుభక్తులు కానివారి విషయంలో వర్తిస్తాయని శ్రీవాధూలవీరరాఘవాచార్య వ్యాఖ్య.

మందహాసం పూచి, వెలిగే ముఖారవిందాన్ని కలవారు, మనస్సులో ఉన్న కృపా తిశయాన్ని వ్యక్తంచేసే కటాక్షవీక్షణాన్ని కలవారు, ఇంతవరకు ఆశ్రయించకుండా ఇపుడే తమను ఆశ్రయించాలని వచ్చిన దాసుడనైన నాపట్ల ఆదరాన్ని చూపించేవారు, అనుగ్రహమే మూర్తీభవించినట్లుగా ఉండేవారు, శబ్దపుష్టిని, అర్థపుష్టిని కల మధుర భాషణాలను పలికేవారు, శ్రీమణవాళమహామునులు–అని ఈ శ్లోకసారం.

**11. ఆత్మలాభా త్పరం కించి దన్య న్నాస్తీతి నిశ్చయాత్ ।**
**అంగీకర్తు మివ ప్రాప్త మకించన మిమం జనమ్ ॥**

ఆత్మలాభాత్=భగవానునకు కౌస్తుభస్థానీయం అయిన ఆత్మయొక్క లాభంకంటె, అన్యత్ =వేఱయిన, కించిత్ =ఏ వస్తువును, పరం నాస్తి =ఉత్కృష్టమైన పురుషార్థం కాదు, ఇతి = అనే, నిశ్చయాత్ = నిర్ణయంవల్ల, అకించనం= అంగీకరించడానికి హేతువైన ఆత్మగుణలేశం కూడలేనివాడనై, ఇమమ్ =పరిత్యజించడానికి తగిన దోషాలు పూర్ణంగా ఉన్న నన్ను, అంగీకర్తుం = స్వీకరించడానికి, ప్రాప్తమ్ ఇవ=అభిముఖంగా వేంచేస్తున్నట్లున్నవారిని (అనంతరశ్లోకంతో అన్వయం)

పూర్వశ్లోకంలో చెప్పబడ్డ మందహాసం, కరుణ పొంగిన నేత్రద్వయం, మధుర భాషణం మొదలైనవానినిబట్టి – దాసుని విషయంలో అనుగ్రహాన్ని చూపడం కోసమే శ్రీవరవరమునులు నేను వచ్చే సమయంకోసం కాచుకొని ఉండి, నేను కోవెలకు వెళ్ళే సమయంలో వేంచేశారని భావిస్తున్నాను వారితో దాసునకు కల్గిన సమాగమం తానుగా ఏర్పడినది కాదు–అనే విషయాన్ని ఇందులో స్పష్టం చేస్తున్నారు.

**"కురుమామణిప్పూణ్ కులావి త్తికఁు న్తిరుమార్బన్"** (గొప్పదైన కౌస్తుభమణి అనే ఆభరణం అటు ఇటు ఊగిసలాడగా ప్రకాశించే వక్షస్సును కలవాడు.) అని కీర్తింబడే భగవానుని వక్షఃస్థలంలో ఉల్లాసంగా ఊగులాడుతూ ప్రకాశించే, గొప్పరత్నం అయిన కౌస్తుభమణితో సమానం అయినట్టి ఒక ఆత్మను సంస్కరించడంకంటె వేఱొక పురుషార్థం ఏది లేదు – అనే నిశ్చయంతో, ఆకించన్యం మూర్తీభవించినట్లున్న నన్ను అనుగ్రహించడంకోసం ఆభిముఖ్యం ప్రకటిస్తూ శ్రీమణవాళమహామునులు నా దగ్గఱకు వారే స్వయంగా వేంచేశారు.

**(ఆత్మలాభాత్)** జీవాత్మ భగవానునకు కౌస్తుభస్థానీయం అనే విషయాన్ని శ్రీవిష్ణుపురాణంలోని అస్త్రభూషణాధ్యాయంలో గల **"ఆత్మాన మస్య జగతో నిర్లేప మగుణాలయమ్, బిభర్తి కౌస్తుభమణిస్వరూపం భగవాన్ హరిః"** (1–22–68) (భగవంతుడైన హరి తన వక్షస్సులో ఆత్మసముదాయాన్ని కౌస్తుభమణి రూపంలో ధరిస్తున్నాడు) అనే ప్రమాణం వల్ల గమనించవచ్చు. **(అకించనమ్) "అంగీకార హేతులవ విరహిణమ్"** (అంగీకరించడానికి తగిన కొద్దిపాటి కారణం కూడా లేనివాడను) అని వాధూల వీరరరాఘవాచార్య వ్యాఖ్య.



**(ఇమమ్)** కాకుస్వరాన్నిబట్టి ఇచటి సర్వనామశబ్దంలోని విశేషాన్ని **"పరిత్యాగహేతు దోషభూయిష్ఠజనం మా మిత్యర్థః. ఉక్తాకించన్యవిశేషద్రఢీకరణాయ జన మితి సామాన్యవ్యపదేశః"** (విడచిపెట్టడానికి తగిన పలు కారణాలను కల్గిన నన్ను అనే అర్థం. తాము పల్కిన ఆకించన్యాన్ని బలపరచడం కోసం **"జనమ్"** అని సామాన్యంగా తమను కవి నిర్దేశించుకొన్నారు.) అని వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్య వివరించింది. లోకంలో భూమికి భారంగాను, తిండికి దండగగాను పుట్టడమే కాక, జన్మసాఫల్యం కలిగేటట్లు దోషాలను పోగొట్టుకోవడం కాని, గుణాలను పొందడంకాని ఏమీ లేకుండా చెడిపోయినవాడను నేను – అని అంటూ ఈ పదం ద్వారా ఎఱుమియప్పా తమను తక్కువచేసి పలుకుతున్నారు. ఇటువంటి నన్నుకూడా విడువకుండా అనుగ్రహించాలని వచ్చిన మామునుల మహాకృప ఎంత గొప్పది! అంటూ ఈ ప్రయోగంద్వారా అప్పా ఆశ్చర్యపడుతున్నారు కాడా. **"పాప్త మివ"** అనే ప్రయోగంలోని **"ఇవ"** శబ్దం ఉత్ప్రేక్షాసూచకం. ఉపమావాచకం కాదు. **"ప్రణష్టస్య యథా లాభః"** అని అన్నట్లు పోయిన వస్తువు తిరిగి లభించిన రీతిలో తమ లాభం స్వామికి అభిమతం కాబట్టి ఈ విధంగా సొత్తు అయిన నేను శేషి అయిన భగవానుని వద్దకు చేరడంలో సహాయం చేయడంకూడా భగవానునకు ముఖోల్లాసాన్ని కల్గిస్తుంది కాబట్టి ఆత్మలాభం ప్రకృష్టమైన పురుషార్థం అయింది. వరవరమునిశతకంలో కూడా **"ఆత్మనః శోధయిత్వా, పద్మా భర్తుః ప్రతి దిన మిహ ప్రేషయన్ ప్రాభృతాని"** (జీవాత్మలను శోధించి, లక్ష్మీపతికి కానుకగా ప్రతిదినం పంపేవారై) అని ఈ స్తుతికర్త వచించారు.

**12. భవంత మేవ నీరంధ్రం పశ్య న్వశ్యేన చేతసా ।**
**మునే వరవరస్వామిన్! ముహుః త్వా మేవ కీర్తయన్ ॥**

**13. త్వదన్యవిషయస్పర్శవిముఖై రఖిలేంద్రియైః ।**
**భవేయం భవదుఃఖానా మసహ్యానా మనాస్పదమ్ ॥**

స్వామిన్=తన వస్తువును తానే అభిమానించే స్వామిత్వసంబంధాన్ని కల మహానుభావా!, వరవరమునే =నన్ను అనుగ్రహించడంకోసం తగిన ఉపాయచింతను చేసే మణవాళమహామునీ!, భవంతమ్ ఏవ =సౌందర్య, సౌలభ్యాది సమస్తగుణ పూర్ణులు అయిన మిమ్ములనే, నీరంధ్రమ్ = అడ్డులేకుండా, పశ్యన్=దర్శిస్తూ,

వశ్యేన = తమ కటాక్షవిశేషంతో నాకు స్వాధీనం అయిన, చేతసా= మనస్సుతో, త్వా మేవ = కీర్తించతగిన మిమ్ములనే, ముహుః =మాటిమాటికి, కీర్తయన్ =కీర్తిస్తూ, త్వదన్యవిషయస్పర్శవిముఖైః = దేవరవారిని తప్ప మిగిలిన విషయాలలో సంబంధం పట్ల వైముఖ్యాన్ని కల్గిన, అఖిల+ఇంద్రియైః =వాక్కు మొదలైన కర్మేంద్రియాలచే, చక్షుస్సు మొదలైన జ్ఞానేంద్రియాలచే (నేను), అసహ్యానామ్ =దుస్సహాలైన (భరింప సాధ్యం కాని), భవదుఃఖానాం = శరీర సంబంధంవల్ల కలిగే దుఃఖాలకు అన్నిటికి, అనాస్పదమ్ =ఆశ్రయం కానివాడనుగా, భవేయమ్ = కాగలను (అయేటట్లు కృపజేయాలి).

ఆచార్యులనే ఎల్లప్పుడు కన్నులతో దర్శిస్తూ, నోటితో కీర్తిస్తూ, మిగిలిన ఇంద్రియాలతో కూడా ఆ ఆచార్యులనే విషయంగా చేసికొనడంవల్ల తాము మోక్షానికే యోగ్యతను పొందినవారై, ఇంతవరకు ఇంద్రియాలు అన్నీ లోకంలోని శబ్దాదినీచ విషయాలనే లక్ష్యాలుగా చేసికొని ఉండడంవల్ల తమకు కల్గిన సంసారదుఃఖం ఇకపై కలుగకుండా ఉండాలని శ్రీమణవాళ మహామునులను ఈ రెండు శ్లోకాలద్వారా ఎఱుమ్బియప్పా ప్రార్థిస్తున్నారు. పూర్వశ్లోకాలలోని ద్వితీయాంతవిశేషణపదాలకు అన్నిటికీ పన్నెండవశ్లోకంలోని **"భవేయమ్"** అనే పదంతో అన్వయం.

శ్రీమణవాళమహామునీ! పూర్వం తెల్పిన అతిశయాలను అన్నిటినీ కల్గిన తమనే ఎడతెగకుండా కన్నులతో దర్శిస్తూన్నవాడనై, తమ కటాక్షవిశేషంవల్ల నాకు స్వాధీనం. అయిన మనస్సుతో (అంటే, **"యాను మెన్నెఞ్జు మిశైన్దొழిన్దోమ్"** - నేను, నా మనస్సు అంగీకరించాము - అనే రీతిలోనే కాకుండా **"మున్దుత్త నెఞ్జే!"** - ముందడుగు వేసిన మనసా! - అన్న రీతిలో నా కంటే ఒక అడుగు ముందుకు వేసే రీతిలో ఉన్న నా మనస్సుతో) మాటిమాటికీ తమనే కీర్తిస్తున్నవాడనై, తమనుతప్ప మిగిలిన విషయాలను కొంచెం కూడా ఆశ్రయించకుండా కన్ను, చెవి, ముక్కు, త్వక్కు, జిహ్వ-మొదలైన సకలేంద్రియాలతో అసహ్యాలైన సాంసారికతాపాలకు ఆశ్రయం కాకుండా, బ్రహ్మానందాన్ని అనుభవించేవానిగా నేను తమ దివ్యాను గ్రహంవల్ల కావాలి-అని భావం.

**(స్వామిన్)**-తమ సొత్తు అయిన ఈ ఆత్మవస్తువును స్వీయమని అభిమానించే వరవరముని! - అని అర్థం. **"స్వామ్యం స్వీయాభిమానితా"** - సామ్యమంటే తనది అనే అభిమానం - అని సామ్యశబ్ద నిర్వచనం. ఇందువల్ల తామే స్వయంగా తమకు నాతో ఉన్న సంబంధాన్ని స్మరించి, విముఖుడనై ఉన్న నన్ను అనుగ్రహించారు. ఎంత ఆశ్చర్యం! ఏమి కృప! అనే ఆర్ద్రభావం వ్యక్తమవుతున్నది. **(మునే!)** - **"మననశీలో మునిః"** అనే మునిశబ్దనిర్వచనం ప్రకృతంలో నన్ను అనుగ్రహించే విషయంలో మననం చేసేవారనే అర్థంలో పర్యవసిస్తుంది. సాభిప్రాయప్రయోగం ఇది.



**(భవంతమ్)** - ఈ సర్వనామపదం ద్వారా గడచిన శ్లోకాల్లో ప్రస్తావింపబడ్డ. శ్రీవరవరమునుల సౌందర్యసౌలభ్యాదిగుణపూర్ణత చెప్పబడుతున్నది. **"భవన్త మేవ"** అన్నప్పుడు ఏవకారం ద్వారా వేఱొక వస్తువును చూడనవసరంలేదనే అర్థం స్థిరీకరింపబడింది. **(వశ్యేన)** నీ కటాక్షవిశేషవశంచేత నాకు అధీనం అయిన-అని అర్థం.

**(త్వా మేవ)** - కీర్తింపదగినవారైన మిమ్ములనే, -

**(పశ్యన్, కీర్తయన్)** ఈ రెండు పదాలను **"అహమ్"** అని అధ్యాహరింపబడ్డ కర్తతో కలిపి, తరువాతి శ్లోకంలో అన్వయించాలి. ఈ రెండు పదాలలోని శతృప్రత్యయం కారణార్థకం కాబట్టి దర్శించడంవల్ల, స్తుతించడంవల్ల-అనే అర్థాన్ని ఇస్తుంది. వీనికి అనంతరశ్లోకంలోని **"భవదుఃఖానామ్ అసహ్యానా మనాస్పదమ్ భవేయమ్"** అనే ప్రయోగంతో అన్వయం.

**(భవేయమ్)** - ఈప్రయోగంలోని **"లోట్"** ప్రత్యయం ప్రార్థనార్థకం కాబట్టి, తమనే దర్శిస్తూ ఉండడంవల్ల, స్తోత్రంచేస్తూ ఉండడంవల్ల, శబ్దాదివిషయాలను విడచి తమనే లక్ష్యంగా కల్గిన అన్ని ఇంద్రియాలను కల్గినవాడను అయినందువల్ల మోక్షాన్ని పొందడానికే యోగ్యుడనై, సంసారదుఃఖాలకు ఏనాడు లక్ష్యభూతుడను కాకుండా ఉండేటట్లు దేవరవారు కృపజేయాలి -అని ప్రార్థించారని ఈ లకారంవల్ల స్ఫురిస్తుంది. ఆచార్యుని ఎల్లప్పుడూ దర్శించడంవల్ల, కీర్తించడంవల్ల భగవానునకు మనస్సులో ప్రీతికల్గి, దానివల్ల శిష్యుడు మోక్షాన్ని పొందుతాడు కాబట్టి, శిష్యుడు సంసారదుః ఖానికి లక్ష్యం కాకుండే ఉండేందుకు ఆచార్యదర్శనం, ఆచార్య కీర్తనం పరంపరయా కారణాలు అని గ్రహించాలి లేక, ఇంద్రియాలన్నీ ప్రాప్తవిషయం అయిన ఆచార్య దర్శనకీర్తనాదిరూపమైన సుఖంలో ఆసక్తాలు అయినందువల్ల భవదుఃఖాలకు

అవకాశం లేకుండా పోతుందనికూడా చెప్పవచ్చు. ఇంతవరకు చేయబడిన వివరణం పన్నెండవ శ్లోకానికి సంబంధించినది. ఇకపై పదమూడవ శ్లోకవివరణం చేయబడుతున్నది.

తమ అన్ని ఇంద్రియాలకు, శబ్దాదివిషయాలలో పరాఙ్ముఖత్వం చెప్పబడినందువల్ల, వానికి శ్రీమణవాళమహామునులనే లక్ష్యంగా కల్గి ఉండడాన్ని స్తుతికర్త ప్రార్థించినట్లు ఊహించుకోవాలి. ఇంద్రియాలు కుర్వద్రూపాలు కాబట్టి! (అంటే, తమకు తగిన ఏదో ఒక పనిని చేస్తూ ఉండే స్వభావాన్ని కల్గినవి కాబట్టి), శబ్దాదివిషయాలలో వైముఖ్యాన్ని కల్గిన ఇంద్రియాలకు మణవాళమహామునులనే విషయంగా (లక్ష్యంగా) కల్గి ఉండడం ఆవశ్యకం కాబట్టి, ఇంద్రియాలు ఏదో ఒక విషయాన్ని ఆశ్రయించకుండా ఊరికే ఉండవుకదా! అందుచేత ఈ రెండింటివల్ల, ఓ వరమునీ! మీ దయవల్ల దాసుని అన్ని ఇంద్రియాలు తమనే లక్ష్యంగా కల్గి ఉండి, దాసుడు మోక్షాన్ని పొందే యోగ్యతను కలవాడు కావాలి. హేయాలైన శబ్దాదులను విషయాలుగా గ్రహించనివాడనై జన్మదుఃఖానికి ఆస్పదం కాకుండా ఉండాలి. ఈ విధంగా ఉండేటట్లు దేవరవారు నన్ను అనుగ్రహించాలి–అని తాత్పర్యం.

**(త్వదన్యవిషయస్పర్శవిముఖైః)**– నాకు, దేవరవారుతప్ప మిగిలిన లౌకికవిషయాల స్పర్శకూడా దుస్సహమే కావాలి. ఆ విధమైన దుస్సహత్వానికి వాటి అల్పత్వ–అస్థిరత్వాదులు కారణం కాదు, తమకంటే అవి వేఱు కావడమే కారణం–అని భావం.

**(అసహ్యానామ్)** – **"సర్వం సహే"** – అన్నిటినీ సహిస్తాను – అని ప్రతిజ్ఞ చేసిన దేవర వారి సహనశీలతనుకూడా మించి, వారికి అసహ్యాలుగా తోచే దుఃఖాలకు–అని భావం.

**"పశ్యన్"** అని అనడంద్వారా చక్షుస్సుయొక్క, **"పశ్యేన చేతసా"** అని అనడం ద్వారా మనస్సు యొక్క, **"కీర్తయన్"** అని శోత్రేంద్రియం యొక్క, **"స్వచరణాంభోజ స్పర్శసంపన్న సౌరభైః తీర్థైః"** అని చెప్పబోయే సూక్తిద్వారా ఘ్రాణ, రసనేంద్రియాల యొక్క, **"దీర్ఘం ప్రణమతః"** అని అనడం ద్వారా చేతులయొక్క, పాదాలయొక్క, **"పదంద్వయం దత్వా"** అని అనడంద్వారా త్వగింద్రియంయొక్క వినియోగవిశేషాన్ని **(కైంకర్యవిశేషాన్ని)** అనుసంధించినట్లయింది. అంతేకాక, **"త్వదన్యవిషయస్పర్శ విముఖైః"** అని అనడంద్వారా విషయాంతరాలపట్లగల వైముఖ్యం చెప్పబడినందువల్ల కుర్వద్రూపాలైన అన్ని ఇంద్రియాలు ప్రాప్తవిషయం అయిన భగవద్భాగవతాచార్యసేవలో ఆసక్తాలు అయినవి అన్నది అర్థాత్ సిద్ధిస్తుంది.



శాండిల్యస్మృతిలో – **"ప్రతిషిద్ధేష్వసక్తం యత్ సక్తం శబ్దేషు సాధుషు, భగవద్విషయేష్వేవ శుద్ధం తచ్ఛ్రోత్ర ముచ్యతే, అస్పర్శ్య మస్పృశంతీ యా స్పృశంతీ స్పర్శ్య మేవ చ, తత్రాప్యలోలుపా సా తు త్వక్ శుద్ధేతి నిగద్యతే, పాషండపతితాద్యేషు న పతంతీ కదాచన, ఆరూక్షా సంపతంతీ దృక్ఛుద్ధా భాగవతాదిషు, భోజ్యానేవ రసాన్రస్యే న్నాత్యంతచపలా రసే, కాలే మితం చ సా జిహ్వా పరిశుద్ధేతి కీర్త్యతే..... మేధ్యగంధేషు యోజితా, యుక్తేష్వలోలుపా సా నాసా శుద్ధేతి కీర్త్యతే, పుణ్యస్తవాదిపఠనే నిరతా ప్రియవాదినీ, సత్యైః పరహితైః సార్థైః హితై ర్లక్షణసంయుతైః, యుక్తాక్షరై స్సుపూతా వాక్....అభ్యంజనాదివ్యాపారే వృత్తః పిత్రో ర్గురో స్తథా"** (నిషేధింపబడ్డ విషయాల్లో ఆసక్తిని పొందనిది, భగవద్విషయాలైన మంచి శబ్దాదులలో ఆసక్తిని కల్గినది అయిన శ్రోత్రం శుద్ధమని చెప్పబడుతున్నది. స్పృశింపకూడనిదానిని స్పృశింపనిది, స్పృశింపతగినదానిని స్పృశించేది, స్పృశించే విషయాల విషయంలో కూడా సంగాన్ని లేనిది అయిన త్వక్కు శుద్ధమని చెప్పబడుతున్నది. పాషండులు, పతితులు మొదలైనవారి విషయంలో ప్రసరించనిది, తీవ్రంగా లేనిది, భాగవతుల పట్ల చక్కగా ప్రసరించేది అయిన దృక్ శుద్ధమని చెప్పబడుతున్నది. భుజింపతగిన రసాలను ఆస్వాదించేది, ఎక్కువ చాపల్యాన్ని లేనిది, సకాలంలో మితంగా ఆస్వాదించేది అయిన జిహ్వా పరిశుద్ధమనబడుతున్నది, తగిన సుగంధాలపట్ల ఆసక్తిని కల్గినది అయిన నాసిక శుద్ధమని కీర్తింపబడుతున్నది. మహనీయుల స్తుతులను పఠించడంలో ఆసక్తిని కల్గినది, ప్రియంగా ఉన్నది, మంచి లక్షణాలను కల్గినది అయిన వాక్కు పవిత్రమైన వాక్కుగా చెప్పబడుతున్నది. తల్లిదండ్రులకు, గురువులకు అభ్యంగనాదిసేవలను చేయడంలో ఆసక్తిని కల్గినది.......అయిన హస్తం పరిశుద్ధంగా చెప్పబడుతున్నది) అంటూ ఈ విధంగా కన్ను, ముక్కు, వాక్కు, త్వక్కు, చెవి మొదలైన కర్మేంద్రియాలు, మనస్సు అనే అంతరింద్రియం –అన్నీ భగవద్భాగవతసేవకే ఉపయోగపడాలని చెప్పబడింది.

ఇంతవరకుగల భాగం ఈ వరవరమునిదినచర్య అనే ప్రకృత స్తోత్రానికి ఉపోద్ఘాతంవంటిది. ఈ స్తోత్రంలో ఇకపై ప్రస్తావింపబడే, అయిదు కాలాలలో

అనుష్ఠింపబడవలసిన అభిగమనం, ఉపాదానం, ఇజ్య, స్వాధ్యాయం, యోగం–అనే అయిదు అంగాలలో ఇజ్యతప్ప మిగిలిన నాల్గు సంగ్రహంగా ఇంతవరకు ప్రస్తావింపబడినవి. అభిమనగమంటే – భగవానుని సేవించడంకోసం బయలుదేరి పోవడం. ఇది **"పత్యుః పదాంబుజం ద్రష్టు మాయాంతమ్"** (స్వామి పాదపద్మాలను సేవించడం కోసం వచ్చేవారు) అంటూ జగత్పతి అయిన శ్రీరంగనాథుని సేవించడం కోసం శ్రీరంగాలయానికి వరవరమునులు వేంచేయడంద్వారా తెలుపబడింది. ఉపాదానం అంటే – భగవానునకు సమర్పింప వలసిన ద్రవ్యాలను సేకరించు కోవడం. ఇది **"ఆత్మలాభాత్ పరం కించి దన్య న్నాస్తీతి నిశ్చయాత్, అంగీకర్తు మివ ప్రాప్త మకించన మిమం జనమ్"** (11) అంటూ పరమాత్మకు జీవాత్మను దాసునిగా చేసి, అతనిని సమర్పించడమే ప్రయోజనం అని నిశ్చయించుకొని, అందుకోసం మామునులు తమను స్వీకరించడానికై వేంచేయడం చెప్పబడినందువల్ల, వరవరమునులు తాము భగవానునకు దాసునిగా సమర్పించవలసిన ఎఱుమ్బియప్పాను స్వీకరించడం అనే ఉపాదానం ప్రస్తావింపబడింది. స్వాధ్యాయం అంటే – తమ శాఖకు చెందిన వేదమంత్రాధ్యయనం. **"మంత్రరత్నానుసంధానసంతత స్ఫురితాధరమ్"** (9) అంటూ వేదమంత్రాలలో గొప్పది అయిన ద్వయాన్ని మెల్లగా ఉచ్చరించడంవల్ల ఎల్లప్పుడూ కొంచెం స్పందించే అధరాన్ని కల్గి ఉండడం తెలుపబడడంద్వారా ఈ స్వాధ్యాయం తెలుపబడింది. యాగం అంటే – భగవద్విషయాన్ని ధ్యానించడం. ఇది **"తదర్థతత్వనిధ్యాన సన్నద్ధపులకోద్గమమ్"** (9) అంటూ ఆ ద్వయమంత్రంయొక్క వాస్తవార్థం అయిన లక్ష్మి, నారాయణులను కాని, భగవద్రామానుజులను కాని ధ్యానించడం తెలుపబడ్డంవల్ల సూచింపబడింది. ఈ విధంగా అయిదు అంగాలలో నాల్గు అంగాలు సూచింపబడింది. అందువల్ల ఈ ఉపోద్ఘాతం ఇకపై వివరంగా తెలుపబడే అంశాలకు సంగ్రహరూపం. భగవానుని దర్శించడం, భగవదారాధనకు అవసరమైన ద్రవ్యాలను సేకరించుకోవడం, ఆరాధించడం, వేదమంత్రాధ్యయనం చేయడం, వేదమంత్రార్థాని ధ్యానించడం–అనే ఈ అయిదు అంశాలతో కాలాన్ని సరిగా గడపాలి – అని అర్థం ఇచ్చే **"కృత్వాభిగమనం పూర్వం ముపాదాయ చ సంపదః, ఇష్ట్వాధీత్య చ యుంజానో భోగైః కాలం నయేత్", బ్రహ్మచారీ గృహస్థ శ్చ వానప్రస్థోఽథ భిక్షుకః, ఏకాంతినః స్వధర్మస్థా స్సర్వే యాంతి పరాం గతిమ్"** (బ్రహ్మచారి గాని, గృహస్థుడుగాని, వానప్రస్థుడు గాని ఎవరైనా తమ ధర్మాలను ఆచరించే వారంతా ఉత్తమ గతిని పొందుతారు) అనే భారద్వాజసూక్తి స్మరణీయం.



**14. పరేద్యుః పశ్చిమే యామే యామిన్యాః సముపస్థితే ।**
**ప్రబుధ్య శరణం గత్వా పరాం గురుపరంపరామ్ ॥**

పరేద్యుః = తమకు వరవరమునులతో యాదృచ్ఛికసమాగమం ఏర్పడిన మరునాడు, యామిన్యాః = రాత్రియొక్క, పశ్చిమే = చివరిది అయిన, యామే = నాల్గవ జాము, సముపస్థితే (సతి) సమీపించినది కాగా, ప్రబుధ్య=నిద్ర లేచి, పరాం= గొప్పది అయిన, గురుపరంపరామ్ =శ్రియఃపతి మొదలు స్వాచార్యపర్యంతంకల ఆచార్యపరంపరను, శరణం గత్వా =ఉపాయంగా నమ్మి (గురుపరంపరానుసంధానం చేసి–అని భావం)

పూర్వం సంగ్రహంగా పల్కిన అంశాలను ఎఱుమ్బియప్పా ఇకపై వివరంగా అనుగ్రహిస్తున్నారు. అంటే, ఎఱుమ్బియప్పా, మామునుల అనుష్ఠానవైలక్షణ్య క్రమాన్ని వివరిస్తున్నారు. భగవానుడనే సిద్ధోపాయాన్ని మోక్షోపాయంగా ఆశ్రయించే అధికారికి సర్వధర్మాలను విడచి వేయడాన్ని అంగంగా శ్రీకృష్ణభగవానుడు గీతలో **"సర్వధర్మాన్ పరిత్యజ్య"** (అన్ని ధర్మాలను విడచిపెట్టి) అని అంటూ విధించినా, నిత్యకర్మానుష్ఠానాన్ని భగవత్కైంకర్యరూపంగానో, లోకసంగ్రహదృష్టిలోనో పెద్దలు చేసి తీరాలనే సిద్ధాంతాన్ని, **"లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి"** – (లోక రక్షణకోసం అయినా కర్మాచరణను చేయాలి) – అనే గీతా సూక్తిని అనుసరించి పరమకారుణికులైన, భగవత్కైంకర్యనిష్ఠాగరిష్ఠులైన మణవాళమహామునులు పూర్వం ప్రస్తావింపబడ్డ అభిగమనం, ఇజ్య మొదలైన అయిదుకాలాలలో చేయవలసిన అయిదు కర్మలను భగవత్కైంకర్యాదిరూపంగా ప్రతిదినం అనుష్ఠించడంవల్ల **"గురోర్వార్తా శ్చ కథయేత్"** (ఆచార్యుని అనుష్ఠానవృత్తాంతాలను అనుసంధించాలి)అనే శాస్త్రక్రమాన్ని అనుసరించి, ఆచార్యభక్తిని పురస్కరించుకొని ఈ ఎఱుమ్బియప్పా ఈ వరవరమునుల దినచర్యను అనుగ్రహించడం ఆవశ్యకం. అంతేకాక, తరువాతివారికిది ఉద్బోధకంగా ఉంటుంది కాబట్టికూడా ఈ స్తుతి ప్రబంధరచన ఆవశ్యకం. తదీయారాధనసమయంలో శ్రీవైష్ణవపంక్తిని పంక్తిపావనులైన ఈ వరవరమునుల దినచర్యాప్రబంధం పావనం చేస్తుంది అనే సాంప్రదాయికరహస్యం

ఇంతకుముందే ప్రారంభంలోనే **"ఇయం హి దినచర్యా పంక్తిపావనం భగవతం వరవరముని మధికృత్య ప్రవృత్తా స్వయ మపి పంక్తిపావనీ సకలై రపి నిష్కృష్టసత్త్వ నిష్ఠై ర్వైదికవరిష్ఠైః పంక్తిశోఽనుయాగానుష్ఠానారంభేష్వనుసంధీయత ఇతి సంప్రదాయః"** (ఈ దినచర్య స్తోత్రం పంక్తిని పావనం చేసే శ్రీవరవరమునులను గూర్చి రచింపబడింది. స్వయంగా తాను కూడా పంక్తిని పావనం చేసేది. సాత్త్వికులైన వేదవేత్తలచే ప్రతిదినం అనుయాగ (భోజన) సమయంలో అనుసంధింపబడుతున్నది – అనేది సత్‌సంప్రదాయం) అని తెలుపబడింది.

**(పరాం గురుపరంపరాం శరణం గత్వా)** ఉపాయంగా గురుపరంపరను ఆశ్రయించి, అనుసంధించి–అని అర్థం. ఇది కాయిక, వాచిక, మానసికరూపం అయిన ఆశ్రయణాన్ని తెలుపుతుంది. **"పరేద్యుః"** అనేపదం ఎఱుమ్బియప్పా వరవరమునులను యాదృచ్ఛికంగా దర్శించిననాటికి మఱునాడు అనే అర్థాన్ని ఇస్తుంది. ఈ స్తుతికర్త వరవరముని కావ్యంలో **"నిత్యం నిశావసానేషు సోఽయం విశుద్ధచేతసా, ప్రబుధ్య సుచిరం దధ్యౌ పరాం గురుపరంపరామ్"** (ఈ మణవాళమహామునులు ప్రతిదినం ప్రాతఃకాలసమయాల్లో నిద్రలేచి, విశుద్ధమైన మనస్సుతో విశిష్టమైన గురుపరంపరను చిరకాలం మనస్సులో ధ్యానించారు) అని పలికారుకదా! వ్యాకరణశాస్త్రానుసారం **"పరేద్యవి"** అనే రూపమే సాధువు అయినా, ఇక్కడ **"పరేద్యుః"** అనే ప్రయోగం పలు స్మృతి గ్రంథాల్లో ప్రచురంగా కన్పించడంవల్ల **"ఆర్షప్రయోగత్వాత్ సాధుః"** అనే సూక్తినిబట్టి ఈ రూపంకూడా సాధువనే గ్రహించాలి. ఈ ప్రయోగాన్ని చేయడంద్వారా ఎఱుమ్బియప్పా తమ స్తుతి స్మృతిగ్రంథాలను అనుసరించి రచింపబడిందనే విషయాన్నే కాకుండా, వరవరమునుల అనుష్ఠానం స్మృతి ప్రమాణమూలకం అని, అందువల్ల పరమప్రామాణికమనికూడా సూచించారు. **"పరేద్యుః"** అనే ఈ రూపాన్ని చాంద్రవ్యాకరణానుసారంగా కొంతమంది వైయాకరణులు సమర్థించారు.

కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారు తమ వ్యాఖ్యలో **"అపరేద్యుః"** అన్నట్లు ''వ రే ద్యుః'' అనే రూపం సిద్ధించదు – అనే భావంతో కొందఱు. **"పరేద్యవ్యంతిమే యామే"** అనే పాఠాంతరాన్నికూడా కల్పించారు. కాని, ఆ విధమైన వేఱొక శిష్టపారం ఉన్నట్లు ఎక్కడా కన్పడలేదు..... **"ఉత్థాయ పశ్చిమే యామే చాచమ్య ప్రయతాత్మవాన్, ఉపవిశ్య శుచౌ దేశే సమాసీన స్సుఖాసనే"** (చివరి జాములో నిద్ర లేచి ఆచమనం



చేసి, పవిత్రమైన చోటులో సుఖాసనంలో కూర్చొండి) – అనే పరాశరవచనాన్ని, **"ఉత్థాయ పశ్చిమే శాంతమానసః"** (చివరి జాములో నిద్రలేచి, ప్రశాంతమైన మనస్సును కలవాడై) అనే గౌతమధర్మశాస్త్రసూక్తిని అనుసరిస్తూ **"పశ్చిమే యామే"** అని ప్రయోగింపబడింది. అందువల్ల **"అంతిమే యామే"** అనే పాఠకల్పనం విరసం– అని వివరించడాన్నికూడా గమించాలి. దీనివల్ల చివరి జామున లేచి, గురుపరంపరానుసంధానం చేయడం కర్తవ్యమన్నది పరాశరాదిధర్మశాస్త్రానుసారం అని తెలుస్తున్నది. శాండిల్యస్మృతిలోకూడా **"ఆద్యంతవర్జం నిద్రాయా యోగ్యం యామద్వయం నిశి, చతుర్థే యామ ఉత్థాయ యోగీ యోగం సమాచరేత్"** అని రాత్రికాలంలో మొదటి జాము, చివరి జాము కాకుండా మధ్యలో ఉన్న రెండు జాములకాలం నిద్రకు తగిన కాలం అని, చివరి జాములో లేచి గురుపరంపరానుసంధానం చేయాలని విధింపబడింది.

రాబోయే శ్లోకంలో (15వ శ్లో) రహస్యత్రయానుసంధానాన్ని స్తుతికర్త చెప్పబోతున్నారు కాబట్టి ఈ గురుపరంపరానుసంధానం దానికి అంగంగా భావించాలి. పరాశరస్మృతిలో **"స్వాచార్యం హృదయే ధ్యాత్వా జప్త్వా గురు పరంపరామ్"** (తమ ఆచార్యుని మనసులో ధ్యానించి, గురుపరంపరను జపించి) అని ప్రారంభించి, **"మన్త్ర మధ్యాపయే ద్గురుః, న్యాసాఖ్యం పరమం మంత్రమ్"** (అష్టాక్షరిని, న్యాసమనే గొప్పదైన ద్వయమంత్రాన్ని అధ్యాపనం చేయాలి) అని, భరద్వాజపరిశిష్టమనే గ్రంథంలో, **"ఆదౌ గురూణాం విజ్ఞాన మథ మంత్రార్థచింతనమ్, తత ఏవాత్మనో జ్ఞానం తద్ధర్మాణాం చ సర్వశః"** (మొదట గురుపరంపరను తెలియాలి, తరువాత మంత్రార్థాన్ని గురించి చింతించాలి. తరువాత ఆత్మను గురించిన జ్ఞానాన్ని తమ, ధర్మాలను అన్నిటిని తెలియాలి) అని చెప్పబడినందువల్ల గురుపరంపరానుసంధాన పూర్వకంగానే తత్త్వత్రయధ్యానం కర్తవ్యమనే విధి ఇక్కడ **"శరణం గత్వా"** అని ఈ శ్లోకంలో ప్రారంభించి, **"ప్రణిధాయ"** అనే అనంతరశ్లోకంలోని సూక్తితో సూచింపబడింది. ఇక్కడ గురుపరంపర అంటే – పరమపదంలో ఆచార్యప్రీత్యర్థం చేసే భగవదనుభవం అనబడే మోక్షం ఒక్కటే పురుషార్థంగాను, ఆచార్యపర్యంతంగా శ్రియఃపతినిమాత్రమే దానికి ఉపాయంగాను ఉపదేశించే స్వాచార్యుల పరంపర. వరవరమునికావ్యంలోకూడా **"ప్రబుధ్య సుచిరం దధ్యౌ పరాం గురుపరంపరామ్"** (నిద్ర లేచి గొప్పదైన గురుపరంపరను గూర్చి చిరకాలం ధ్యానించి) అని వర్ణింప

బడింది. **"పరామ్"** అనే విశేషణంవల్ల **"పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్"** (పుత్రులను బంధువులను, స్నేహితులను, గురువులను ) అని చెప్పబడ్డ లౌకికగురుశబ్దవాచ్యులైన వారు ఈ గురుపరంపరలోనికి చేరరు–అని సూచింపబడింది కూడా. **"బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ ధ్యాత్వా గురుంపరంపరామ్"** (బ్రాహ్మ ముహూర్తంలో నిద్ర లేచి, గురుపరంపరను ధ్యానించి) అనే యతిపతి దినచర్యా సూక్తి ఈ శ్లోకార్థానికి అనుగుణంగా స్మరణీయం.

**15. ధ్యాత్వా రహస్యత్రితయం తత్త్వయాథాత్మ్యదర్పణమ్ ।**
**పరవ్యూహాదికాన్ పత్యుః ప్రకారాన్ ప్రణిధాయ చ ॥**

తత్త్వయాథాత్మ్యదర్పణమ్=ఆత్మస్వరూపానికి చెందిన, యథార్థమైన అనన్యార్హ శేషత్వ, అనన్యశరణత్వ, అనన్యభోగ్యత్వాలనే ఆకారత్రయానికి అద్దంవలె ప్రకాశకమైన, రహస్యత్రితయమ్ = అష్టాక్షరి, ద్వయం, చరమశ్లోకం–అనబడే మూడు రహస్యాలను, ధ్యాత్వా =అర్థానుసంధానపూర్వకంగా ధ్యానించి, పరవ్యూహాది కాన్–పరత్వ, వ్యూహత్వ, విభవత్వ, అంతర్యామిత్వ, అర్చారూపత్వాదులైన, పత్యుః ప్రకారాన్ =సర్వశేషి అయిన శ్రియఃపతియొక్క ప్రకారాన్=అయిదు రూపాలను, ప్రణిధాయ చ=ధ్యానించి, (తరువాతి శ్లోకంతో అన్వయం)

జీవాత్మస్వరూపంయొక్క యథార్థమైన రూపాలు మూడు. అవి 1)శ్రీమన్నారాయణునకే శేషభూతుడుగా ఉండడం, 2) ఆ భగవానుని మాత్రమే మోక్షోపాయంగా కల్గి ఉండడం, 3) ఆ స్వామికైంకర్యమే ఫలంగా కల్గిఉండడం అనేవి. తిరుమంత్రంలో ఉన్న **"ఓమ్, నమః, నారాయణాయ"** అనే మూడు పదాలు క్రమంగా పైన పేర్కొన్న మూడిటిని స్పష్టంగా నిరూపిస్తున్నందున, ఈ మంత్రంలోని మధ్యమపదం అయిన నమశ్శబ్దంచేత చెప్పబడే సిద్ధోపాయం–అంటే, భగవానుని మోక్షోపాయంగా నమ్మడం అనే అర్థాన్ని ద్వయమంత్రంలోని పూర్వఖండం **"శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే"** అనే మూడు పదాలు స్పష్టంగా తెలుపుతున్నందున, శ్రీకృష్ణుడు అర్జునునకు అనుగ్రహించిన గీతాచరమ శ్లోకంలోని పూర్వార్థం అయినట్టి **"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకంశరణం వ్రజ"** (అన్ని ధర్మాలను విడచిపెట్టి నన్ను ఒక్కని మాత్రమే శరణువేడు) అనే సూక్తి శ్రీకృష్ణుడు శ్రీమన్నారాయణరూపుడైన తననే మోక్షోపాయంగా నిశ్చయించి, విధించడం స్పష్టం



తెలుపుతున్నందున – ఈ మూడు రహస్యాలు ఆత్మస్వరూపాన్ని దర్శింపజేసే అద్దంవంటివి – అని చెప్పబడ్డాయి. ఈ విషయంలో ఇంకా వివరణాన్ని రహస్య గ్రంథవ్యాఖ్యానాల్లో గమనించవచ్చు.

రహస్యత్రయం ఆత్మస్వరూపాన్ని స్పష్టంగా దర్శింపజేస్తున్నదనే విషయాన్ని పరాశరమహర్షి విస్తరంగా తెలియజేశారు. **"సంబంధ మపి విజ్ఞేయం నిరుపాధిత్వ మీశితుః, అకారవాచ్యస్య విభోః హరే శ్శేష మహం సదా, మమాపి చ న కర్తాస్మి పరవానవ్యయ స్స వై, నిత్యం నారాయణాయైవ కైంకర్యం కరవాణ్యహమ్, మంత్రార్థం చింతయే దేవం ప్రాత రుత్థాయ సర్వదా, ఇత్థ మాత్మస్వరూపం తు జ్ఞాత్వా మంత్రేణ మంత్రవిత్, స్వరూప మాత్మనో జ్ఞానం తద్వృత్తిం చ ద్వయేన వై, అఖిలస్యేశ్వరా నిత్యా సర్వదా జగదాశ్రయా, నిత్యానపాయినీ విష్ణో ర్జగతా ముపకారిణీ, సమాసీనః శ్రియా సార్ధం గుణవాన్ పరమేశ్వరః, శరణం తస్య చరణౌ వ్రజామ్యకించన స్సదా, ఆసీనాయ శ్రియా సార్ధం హరయే పరమాత్మనే, తస్య చిత్తానురూపేణ శేషవృత్తిం కరోమి వై, ఇత్థం ద్వయార్థం సంచిత్య స్వకర్మాదిచతుష్టయమ్, ఉపాయభావాత్ సంత్యజ్య త మేవ శరణం వ్రజన్, కర్మ కుర్యా దసక్త స్సన్ సంతుష్ట్యై పరమాత్మనః"** (అందటిని శాసించే భగవానునితో మనకున్న స్వాభావికమైన సంబంధాన్నికూడా తెలిసికోవాలి. అకారవాచ్యుడైన, అంతటా వ్యాపించి ఉన్న, హరి అయిన స్వామికి నేను ఎల్లప్పుడూ శేషభూతుడను; నేను నన్ను రక్షించుకొనే కార్యానికి కర్తను కాను. అవ్యయుడు – అనగా ఏ విధమైన మార్పు లేనివాడైన – భగవానునకు నేను పరతంత్రుడను. నిత్యం ఆ శ్రీమన్నారాయణుని కోసమే కైంకర్యం చేస్తాను–అని ఈ విధంగా ఉదయమే నిద్రలేచిన తర్వాత అష్టాక్షరీమంత్రార్థాన్ని భావించాలి. అష్టాక్షరీమంత్రంద్వారా ఈ రీతిలో ఆత్మ స్వరూపాన్ని తెలిసికొని, తద్ద్వారా మంత్రార్థాన్ని గ్రహించినవాడై, ఆత్మస్వరూపాన్ని, ఆ ఆత్మకర్తవ్యాన్ని ద్వయమంత్రంవల్ల తెలిసికోవాలి. అన్నిటిని శాసించేది, నిత్యమైనది, జగత్తును ఆశ్రయంగా, లేక, జగత్తుకు ఆశ్రయంగా ఉన్నది, స్వామిని ఏనాడు విడచి ఉండనిది, జగత్తుకు పురుషకారం చేయడంద్వారా ఉపకారం చేసేది అయిన ఆ లక్ష్మీదేవితో కలసి వేంచేసి ఉన్నవాడు, సమస్త కల్యాణ గుణాలను కలవాడు, పరమేశ్వరుడు పాదాలను రెండింటిని వేరే ఏ గతి లేనివాడనై నేను పాదాలను ఉపాయంగా నమ్మి సదా ఆశ్రయిస్తున్నాను. లక్ష్మీదేవితో కలిసి వేంచేసి ఉన్నవాడు, హరి, పరమాత్మ అయిన ఆ స్వామిమనస్సుకు అనుగుణంగా

శేషవృత్తిని చేస్తాను – అని. ఈ విధంగా ద్వయార్థాన్ని అనుసంధించి, కర్మాది చతుష్టయాన్ని (కర్మయోగ–జ్ఞానయోగ–భక్తియోగ– ప్రపత్తియోగాలను) ఉపాయంగా భావించకుండా ఆ స్వామినే శరణు పొందుతున్నాను. ఆ పరమాత్మ సంతోషం కోసమే నేను అన్ని కార్యాలను చేయడంలో ఆసక్తిని కల్గి ఉంటాను" – అని అంటూ ఈ రీతిలో పల్కిన పరాశరమహర్షి వచనాలు స్మరణీయాలు.

**(పరవ్యూహాదికాన్ పత్యుః ప్రకారాన్)** ఇక్కడ **"పర, వ్యూహ"** శబ్దాలు రెండు **"ప్రకారాన్"** అనే భావవాచకానుగుణంగా భావప్రధాన నిర్దేశాలు. **"పరత్వం, వ్యూహత్వం"** అని భావం. ఆదిపదం ద్వారా రామకృష్ణాది అవతారాలు, జీవుని హృదయపుండరీకంలో విగ్రహవిశిష్టుడై వేంచేసియుండే భగవానుని స్థితి, ఆత్మస్వరూపంలో ఆ విగ్రహావస్థాన రూపమైన అంతర్యామిత్వం, దివ్య–ఆర్ష–సైద్ధ–మానుషరూపాలతో పలు విధాలైన ఆవేశావతారరూపాలు, అర్చారూపత్వం, వీటితో పాటు ఆచార్యత్వంకూడా గ్రాహ్యాలు. **"పరవ్యూహాదికాన్...ప్రకారాన్"** అనే సూక్తిలో భగవద్రూపాలను అయిదు అని కాని, ఆఱు అని కాని సంఖ్యావిశేషం నిర్దేశింపబడనందున రెండు విధాలైన పక్షాలు గ్రాహ్యాలే. పూర్వం తెలిపిన పరత్వాది పంచప్రకారాలతో పాటు ఆఱవది అయిన ఆచార్యత్వాన్ని కూడా గ్రహిస్తే ఆఱు ప్రకారాలు అన్నది వేఱొక గణన. ఈ ప్రకారషట్కం **"మమ స్వరూపం సర్వస్మా త్పరస్య జగదీశితుః, షడ్విధం పరిపూర్ణం తత్ సేనేశ! పరిపఠ్యతే, పరత్వం వ్యూహవిభవ మంతర్యామిత్వ మేవ చ, అర్చాచార్యావతారౌ ద్వౌ షాడ్విధ్యం మే ప్రకీర్తితమ్"** (ఓ సేనేశా! అందఱికంటె గొప్పవాడను, లోకాలన్నిటినీ శాసించేవాడను అయిన నా స్వరూపం ఆఱు విధాలుగా, పరిపూర్ణంగా చెప్పబడుతున్నవి. పరత్వం, వ్యూహత్వం, ఆ విభవత్వం, అంతర్యామిత్వం, అర్చారూపత్వం, ఆచార్యత్వం – అనే రీతిలో నా రూపాలు ఆఱు రకాలు) ఇత్యాది ప్రమాణసిద్ధం.

పరమపదంలో నిత్యులు, ముక్తులు దర్శించే రూపం – పరరూపం. బ్రహ్మాదులు చేసే మొఱను ఆలకించి, వారి అభీష్టాన్ని నెఱవేర్చడంకోసం క్షీరాబ్ధిలో పరుండి ఉండే సన్నివేశం – వ్యూహం. అసురరాక్షసాది దుష్టులను సంహరించి, సాధు పరిత్రాణం చేయడం కోసం ఈ లోకంలో రామకృష్ణాదిరూపాలతో అవతరించిన రూపాలు – విభవం. చిదచిత్తులు అన్నిటిలోపల, బయట స్వరూపంతో వ్యాపించి ఉండే రూపం – జ్ఞానుల హృదయపుండరీకంలో వారి ధ్యానానికి లక్ష్యభూతుడు



కావడం కోసం దివ్యమంగళవిగ్రహవిశిష్టుడై వేంచేసి ఉండే రూపం – అంతర్యామి. ఈ నాల్గు రూపాలవలె దుర్లభంగా ఉండకుండా, అజ్ఞానం, అశక్తి ఉన్న మనవంటివారు సైతం ఆశ్రయించేటట్లు ఈ లోకంలో మనం ఉండేచోట, అన్ని సమయాల్లో మన మాంసచక్షువులకుసైతం గోచరుడై, ఆలయాల్లో, గృహాల్లో మనం ఆదరించిన శిలాలోహకాష్ఠచిత్రపటాదులతో నిర్మింపబడ్డ రూపాలనే తానుకూడా ఆదరంలో స్వీకరించి, నిలచి ఉండే రూపం – అర్చారూపం. ఈ అయిదు మాత్రమే కాకుండా, ఆచార్యరూపం అనే ఆఱవప్రకారంకూడా ఉన్నది. **"పీతకవాడై పిరానార్ పిరమకురువాకి వన్దు"** (పెరియాళ్వార్–5–2–8) (పీతాంబరధారి అయిన స్వామి పరమాచార్యుడై అవతరించి) అనే రీతిలో పీతాంబరధారి అయిన భగవానుడే బ్రహ్మోపదేశం చేసే ఆచార్యునిగా అవతరించాడని ఆళ్వార్లు అనుగ్రహించారుకదా! అందువల్లనే గురుపరంపరాపూర్వకంగా భగవానుని ఈ ఆఱు ప్రకారాలను వరవరమునులు పూర్వసంధ్యాకాలంలో అనుసంధించారని ఈ శ్లోకంవల్ల స్పష్టపడుతున్నది – అంటూ ఆశ్రీవైష్ణవ సింహ, ఉ.వే.శ్రీమాన్ టి.పి. కృష్ణమాచార్య స్వామిపాదుల వివరణం స్మరణీయం. **పత్యుః** – సర్వశేషి అయిన భగవానుని యొక్క – అని భావం. దీనివల్ల **"హరౌ స్వామీతి బుద్ధిమాన్"** (హరిశబ్దవాచ్యుడైన శ్రియఃపతియందు స్వామిత్వబుద్ధిని కలవాడై) అని చెప్పబడ్డ పారమైకాత్మ్యం ధ్వనిస్తుంది. ప్రపన్నుడు భావించవలసిన. భగవానుని అయిదు రూపాల వివరాలను పరాశరమహర్షి వివరిస్తూ **"ఏవం వైకుంఠనాథోఽ సౌ రాజతే పరమే పదే, సేవ్యమాన స్సదా నిత్యముక్తై ర్భోగపరాయణైః, ఏవం సంచితయే న్నిత్యం పరే వ్యోమ్ని మహేశ్వరమ్, తస్యైవ వ్యూహభేదా శ్చ విభవార్చాదిమూర్తయః"** (ఈవిధంగా వైకుంఠ నాథుడు పరమాత్మ అనుభవంలో పరాయణులైన నిత్యముక్తులతో సేవింపబడేవాడై వేంచేసి యుంటాడు – అని పరమపదంలో పరమేశ్వరుని ధ్యానించాలి. ఆవిధంగానే ఆ స్వామి యొక్క వ్యూహ రూపాలను, విభవరూపాలను, అర్చామూర్తులను ధ్యానించాలి) అని ప్రారంభించి, **"దర్శనార్థం దివౌకసామ్, లోకసంరక్షణార్థాయ వైభవాయ సమాగతాన్, నృసింహరామకృష్ణాది విగ్రహా నపి చింతయేత్, దేవతిర్యఙ్మనుష్యాది చేతనేష్వపి సంస్థితిః, తదంతర్యామ్యవస్థా హి విష్ణో స్సర్వగత స్స వై, స ఏవ యోగి హృదయపంకజే తు సవిగ్రహః, సౌలభ్యాయ సర్వేషా మర్చాయాం నిత్యసన్నిధిః"** (దేవతల దర్శనంకోసం, లోకాన్ని రక్షించడం కోసం అవతరించిన నృసింహ

రామకృష్ణాది రూపాలను కూడా ధ్యానించాలి. దేవతలలో, పక్షులు, జంతువులు మొదలైన తిర్యక్కులలో, మానవులలో ఉండే స్థితి అంతర్యామి రూపం. ఇది సర్వగతమైనది. ఆ విష్ణువే యోగిహృదయ కమలాలలో తన దివ్యమంగళ రూపంతో వేంచేసి ఉంటాడు. అందరూ సులభంగా అర్చించడం కోసం అర్చారూపంలో దేవాలయాదులలో నిత్య సాన్నిధ్యాన్ని కలిగి ఉంటాడు.) ఇత్యాదిగా పల్కిన సూక్తులు అనుసంధేయాలు. **"ప్రణిధాయ చ"** అని సముచ్చాయకం అయిన చకారాన్ని ప్రయోగించడంవల్ల స్వశరీరచింతనకూడ చెప్పబడింది. పరాశరమహర్షి కూడా ఈవిషయాన్ని **"ఆత్మానం స్వశరీరం చ పరేశ మను చింతయన్, శుక్లశోణితసంభూతం శరీరం పాంచభౌతికమ్"** (శుక్లశోణిత సంయోగంవల్ల ఏర్పడిన, పంచభూతాత్మకమైన శరీరాన్ని, తన ఆత్మను, పరమాత్మనుగూర్చి భావించాలి) ఇత్యాదిగా ప్రస్తావించారు ఈ సందర్భంలో అర్చిరాదిగతిస్మరణాన్నిగూర్చి ప్రస్తావించకపోవడానికి అనుగుణంగా **"తం తు మద్భోగయోగ్యం తు కృపారూపప్రకాశనాత్, నయామి పరమం స్థాన మర్చిరాదిగతిం వినా, గరుడస్కంధ మారోప్య యథేష్ట మనివారితః"** (నా భోగానికి యోగ్యుడైన ఆ పరమైకాంతిని నా నిర్హేతుకకృపావైశిష్ట్యంతో అర్చిరాదిగతి అవసరం లేకుండానే, యథేష్టంగా గరుడుని వీపుపై కూర్చుండబెట్టుకొని, పరమపదానికి చేరుస్తాను) ఇత్యాది ప్రమాణవచనాలు స్మరణీయాలు. లేక, ఇక్కడి చకారంచేత అర్చిరాదిగతికూడా చెప్పబడింది – అని కూడా భావించవచ్చు. **"పంచప్రకారాం శ్చ హరే రర్చిరాదిగతేః క్రమమ్, ధ్యాయంతమ్"** (భగవానుని పరత్వం మొదలైన ఐదు రూపాలను, అర్చిరాదిగతిని ధ్యానించేవారు) అని యతిపతిదినచర్యా సూక్తి ఇక్కడ భావ్యం.

**16. తతః ప్రత్యుషసి స్నాత్వా కృత్వా పౌర్వాహ్ణికీః క్రియాః ।**
**యతీంద్రచరణద్వంద్వప్రవణేనైవ చేతసా ॥**

తతః = పూర్వం తెలిపిన రీతిలో ధ్యానం చేసిన తరువాత నిర్వహించే దంతధావనాది కార్యాలు పూర్తి అయిన పిమ్మట, ప్రత్యుషసి=అరుణోదయ కాలంలో, స్నాత్వా=స్నానం చేసి, పౌర్వాహ్ణికీః క్రియాః=పూర్వాహ్ణంలో–అంటే ప్రాతఃకాలంలో చేయవలసిన శుద్ధవస్త్రధారణ, పుండ్రధారణ, సంధ్యానందనాదిక్రియలను, యతీంద్రచరణ ద్వంద్వ= యతిసార్వభౌములైన భగవద్రామానుజుల శ్రీపాదద్వయిలో, ప్రవణేన చేతసా ఏవ =పరమభక్తిని కల్గిన మనస్సుతోనే, కృత్వా=చేసి.



భగవానునియొక్క పరత్వాది రూపాలనుగూర్చి మనస్సులో భావించిన తర్వాత దంతధావనాదికార్యాలను ముగించుకొని, అరుణోదయకాలంలో స్నానం చేసి, భగవద్రామానుజుల శ్రీపాదాలలో పరమభక్తిని కల్గిన మనస్సుతో ప్రాతఃకాలంలో చేయవలసిన ఆహ్నిక క్రియలను వరవరమునులు నిర్వహించారు.

**(తతః)** – పూర్వశ్లోకంలో **"ప్రణిధాయ"** (ధ్యానించి) అనే ల్యబంత అసమాపకక్రియవల్ల తరువాత అనే అర్థం స్ఫురించినా, మళ్ళీ **"తతః"** అని అనడం బుద్ధిస్థమైన దంత ధావనం, దానికి ముందు చేయవలసిన శౌచాదులు చేసిన తర్వాత–అనే అర్థాన్ని తెలుపుతుంది. పరాశరాదిమహర్షుల సూక్తులీ ప్రాక్తనకార్యాలనుగూర్చి తెలుపుతున్నాయి. పరాశరమహర్షి **"ప్రాత రుత్థాయ సతతం శౌచం కృత్వా యథావిధి, ప్రక్షాళ్య పాదౌ హస్తౌ చ పశ్చా దాచమనం చరేత్, తతః స్నానం ప్రకుర్వీత దంతధావనపూర్వకమ్"** (నిత్యం ఉదయమే లేచి, కాలకృత్యాలను యథావిధి తీర్చుకొని, చేతులను కాళ్ళను కడుగుకొని, తరువాత ఆచమనాన్ని చేయాలి. ఆ తరువాత దంతధావనాన్ని చేసి, స్నానాన్ని చేయాలి) అని వచించారు. వేటే గ్రంథంలో కూడా, **"బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ వసురణ్యో విభూ రితి, అనేన పరమాత్మానం ధ్యాయే దహరహర్హృది, తత ఆవశ్యకం కృత్వా పూర్వ మాదాయ మృత్తికామ్, శౌచం చతుర్గుణం కుర్యా ద్విహితా ద్గృహమేధినః"** (బ్రాహ్మ ముహూర్తంలో నిద్రలేచి, **'వసురణ్యో విభూః'** అనే వేదసూక్తితో హృదయంలో పరమాత్మను ధ్యానించాలి. తరువాత కాలకృత్యాలను తీర్చుకొని, మట్టితో నాలుమార్లు చేతులను కడిగికొని తరువాత విధింపబడిన కృత్యాలను గృహస్థులు చేయాలి.) అని చెప్పబడింది. విశ్వామిత్రుడు కూడా **"ఉషఃకాలే సముత్థాయ శౌచం కృత్వా విధానతః, దంతకాష్ఠ మథాచమ్య పర్వవర్జ మతంద్రితః, కృతస్నానో జపేత్తావ ద్యావదాదిత్యదర్శనమ్"** (ఉషస్సులో నిద్రలేచి, శౌచాదులకు దంతధావనాదులను చేసి, స్నానమాడి సూర్యోదయం అయేవరకు జపం చేయాలి) అని విధించాడు.

**(ప్రత్యుషసి)** అరుణోదయ కాలంలో – అని అర్థం. ఇది సూర్యోదయకాలానికి ముందు నాల్గు గడియల కాలం. రాత్రిసమయంలోని నాల్గవ జాములోని ఏడున్నర గడియల కాలంలో మొదటి మూడున్నర గడియలకాలం గడచిన తర్వాత మిగిలి ఉన్న నాల్గు గడియల కాలమే ఇది. (ఒక గంటకు రెండున్నర ($2^{1/2}$) గడియల

కాలం) ఈ శ్లోకంలో చెప్పబడిన స్నానానికి, ముందు శ్లోకంలో విధింపబడ్డ గురుపరంపరాను సంధానం, భగవానుని ఆఱు విధాలైన రూపాల భావన అనే వీనికి మధ్యలో చేయవలసిన దేహశుద్ధి, దంతధావనాదులను కూడా ఇక్కడ గ్రహించాలి. **"ప్రత్యుషసమ్"** అనే రూపం సాధుపాఠమై ఉండవచ్చునవి శ్రీమాన్ రఘునాథాచార్య స్వామివారి సూక్తి. విభక్త్యర్థే అవ్యయీభావం అయినా ఈ రూపమే సాధువు. **"ప్రత్యుషసి"** అనే రూపం ప్రామాదికం కావచ్చు.

అరుణోదయకాలం యతులకు స్నానానికి తగిన సమయం అనే అంశం పలు ప్రమాణాలద్వారా నిరూపింపబడింది. భవిష్యత్పురాణంలో **"చతస్రో నాడికా ప్రాత రరుణోదయ ఉచ్యతే, యతీనాం స్నానకాల స్తు గంగాంబుసదృశః స్మృతః"** (ఉదయానికిముందు నాల్గు గడియల కాలం అరుణోదయకాలం. ఇది యతులకు స్నానకాలం, గంగాజలంవలె పవిత్రమైనది) అని చెప్పబడింది. స్కాందగారుడ పురాణాల్లోని **"ఉదయాత్ప్రాక్ చతస్ర స్తు నాడికా అరుణోదయః, తత్ర స్నానం ప్రశస్తం స్యాత్ స హి పుణ్యతమః స్మృతః"** (ఉదయానికి ముందు నాలుగు ఘడియల కాలం అరుణోదయ కాలం. ఇది స్నానానికి మిక్కిలి ప్రశస్తమైన కాలంగా చెప్పబడింది.) అనే ప్రమాణం కూడా ఈ అర్థాన్నే తెలుపుతున్నది. స్నానవిధి శాండిల్యస్మృతిలో **"ధ్యాయన్ దేవం పరం బ్రహ్మ యథాశక్తి నిమజ్య చ, చతుర్నిమజ్య విధివత్"** (పరబ్రహ్మను ధ్యానిస్తూ యథాశక్తి నాల్గుమార్లు విధిప్రకారం నీటిలో మునగాలి) ఇత్యాదిగా తెలుపబడింది. శ్లోకంలో పూర్వాహ్ణశబ్దం ప్రకరణస్వారస్యాన్నిబట్టి, మిగిలిన పూర్వాహ్ణసమయాల్లో చేయవలసిన కృత్యాలు తెలియజేసినందున, ప్రాతఃకాలాన్ని తెలుపుతుంది. యతుల వస్త్రధారణనుగూర్చి మేథాతిథి – **"ఊర్ధ్వం జాన్వో రధోనాభేః పరిధాయైకమంబరమ్, ద్వితీయ మంతర్వాసశ్చ పరిధాయ"** (మోకాళ్ళకు పైన, నాభికి క్రిందగా ఉండేటట్లు ఒక వస్త్రాన్ని ధరించి, వేఱొక వస్త్రాని ఆ వస్త్రంలోపల నడుముకు చుట్టుకొని) అని తెలియజేశాడు. యతులు ఆచమనాన్ని జలపవిత్ర సహితంగా చేయాలి. **"ఆచమనాదిషు పంచసు జలపవిత్రస్య సంబంధః"** (ఆచమనం మొదలైన ఐదు కర్మలలో జలపవిత్ర సంబంధం ఉన్నది) అనే ప్రమాణం, **"సదా జలపవిత్రేణ మార్జనాచమతర్పణమ్"** (ఎల్లప్పుడు జలపవిత్రంతో మార్జన, ఆచమన తర్పణాలను చేయాలి.) అనే గాలవవచనం దీన్ని తెలుపుతున్నవి. ఊర్ధ్వపుండ్రధారణను గూర్చి, కాషాయవస్త్ర ధారణను గూర్చి



పవిత్ర–పద్మాక్ష–తులసీమాలను ధారణనుగూర్చి, యజ్ఞోపవీతాది ధారణనుగూర్చి ఉపోద్ఘాత ప్రకరణంలో వివరంగా ప్రస్తావింపబడింది.

**(యతీంద్ర....చేతసా)** యతీంద్రచరణద్వంద్వప్రవణత్వమంటే భగవద్రామానుజుల పాదద్వంద్వ విషయంలో పరమభక్తిని పూర్ణంగా కల్గి ఉండడం. **"వన–సంభక్తౌ"** అనే ధాతువునుండి పుట్టిన **'ప్ర'** అనే ఉపసర్గతో కూడిన రూపం ప్రవణం. సంభక్తి అంటే – ప్రీతి. అది పరమభక్తి. లేక, **"ప్రాచీనప్రవణే వైశ్వదేవేన యజేత్"** అనే ప్రయోగాల్లోవలె ఇక్కడ కూడా ప్రవణశబ్దానికి అవనతస్థలమనే అర్థం చెప్పవచ్చు. అపుడు **"యతీంద్రచరణద్వంద్వం ప్రవణం యస్య తత్"** అనే బహువ్రీహి సమాసానుగుణవిగ్రహాన్నిబట్టి పల్లపు ప్రదేశంలో నీరు మొదలైనవి త్వరగా చేరడమే కాకుండా, ఆ చోటునుండి వేఱొక చోటుకు పోనట్లే, వరవరమునుల మనస్సుకూడా భగవద్రామానుజుల పాదద్వంద్వమనే అవనతస్థలంలో వేగంగా చేరి, అక్కడనుండి కదలకుండా నిలచి ఉన్నదనే భావం స్ఫురిస్తుంది. లేకపోతే, **"చరణద్వంద్వస్య ప్రవణేన నిమ్నస్థలేన"** అనే తత్పురుషసమాసానుగుణవిగ్రహాన్ని చెప్పి, యతీంద్రచరణ ద్వంద్వం, నిర్హేతుకంగానే (సహజంగానే), నీరు పల్లపుదేశంలోకి చేరేటట్లు, అవనతస్థలం అయిన తమ మనస్సులోనికి వచ్చి చేరడమే కాకుండా, అక్కడ నుండి కదలకుండా స్థిరంగా నిలచి ఉన్నదనే భావం ధ్వనిస్తుంది. ఈ రెండు వివరణలు స్వగత–పరగత స్వీకారాలను తెలుపుతున్నవని చెప్పే వీలున్నందున, సంప్రదాయార్థ స్వారస్యాన్నిబట్టి, రెండవ అర్థమే మిక్కిలి సరసం. లేక, శ్రీరామానుజచరణద్వంద్వంలో అవనతమైన మనస్సుతో–అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. **"ప్రవణః క్రమనిమ్నోర్వ్యాం ప్రవాహే"** అని అమరం. క్రియాసామాన్యాన్ని తెలిపే వనధాతువు నుండిపుట్టిన, ప్రపూర్వకం అయిన ప్రవణశబ్దం క్రియాసామాన్యాన్ని చేసే కర్తను తెలుపుతుంది. అందువల్ల ఈ శబ్దం ప్రకృతంలో యతీంద్రుల చరణాలను ఉద్దేశించి చేసే కైంకర్య రూపక్రియలో ఆసక్తిని కలవారనే భావాన్ని ఇస్తుంది. **"ప్రవణేనైవ"** అనే ఏవకారంచేత కర్త అయిన వరవరమునులు యతీంద్రప్రవణులు అనే నామాన్ని కల్గినవారు కావడంవల్ల, ఆ నామంయొక్క అర్థస్వారస్యానుగుణంగా, భగవద్రామానుజుల శ్రీపాదాల్లో వారు కల్గి ఉన్న అతిశయితప్రావణ్యాన్ని తెలుపుతుంది.

**(చేతసా)** కరణరూపమైన మనస్సుతో–అని అర్థం. ఈ పదాన్ని మధ్యమణిన్యాయంలో రాబోయే శ్లోకాలు అన్నిటిలో అర్థానుగుణంగా అన్వయించాలి. ఆచార్యాధీనమైన

మనస్సుతో ప్రవర్తించాలనే నియమం **"తదధీన శ్చ వర్తేత సాక్షా న్నారాయణో హి సః"** (ఆ ఆచార్యునకు అధీనుడై వర్తించాలి. అతడు సాక్షాత్తు నారాయణుడే కదా) **"య చ్చ కర్మ తదర్థం తద్విష్ణో రారాధనా త్పరమ్, అపదిశ్య పితౄన్ దేవాన్ గురౌ యత్ప్రతిపాద్యతే, దేశకాల క్రియామంత్రనిరపేక్షం తదక్షయమ్"** (ఆచార్యుని ఉద్దేశించిచేసే ఆరాధన విష్ణువును ఆరాధించడం కంటె గొప్పది. తల్లిదండ్రులను, దేవతలను, ఉద్దేశించి చేసే ఆరాధనకంటె, ఆచార్యుని ఉద్దేశించి దేశకాల క్రియామంత్ర నిరపేక్షంగా చేసే ఆరాధన గొప్పది) అని భరద్వాజసూక్తి. అందువల్ల ఆచార్యనిష్ఠను కలవారికి ఆచార్యరూపి అయిన భగవానుని ముఖోల్లాసం కోసమే నిత్యనైమిత్తికాది కైంకర్యాలను చేయడం వారి యోగ్యతకు తగినదని తెలుస్తున్నది. అందువల్లనే భగవద్రామానుజుల ఆజ్ఞానుసారం కూరేశులు ఆంధ్రపూర్ణులనబడే వడుగనంబిపేర ఆచార్యనిష్ఠను కల అధికారులు చేయవలసిన నిత్యనైమిత్తికాదికర్మల అనుష్ఠాన ప్రకారాన్ని తెలియజేసే ఆహ్నికగ్రంథాన్ని రచించారట. ఈ విషయం పాంచరాత్రరక్షలో చెప్పబడింది. లేకపోతే, **"యతీంద్రచరణద్వంద్వ"** ఇత్యాది ప్రయోగానికి భగవద్రామానుజుల దివ్యాజ్ఞచేతనే నిత్యనైమిత్తికాదికైంకర్యాల అనుష్ఠానాన్ని వరవరమునులు చేస్తున్నారని కూడా అర్థం చెప్పవచ్చు. ఈ అర్థాన్ని ఎఱుమ్బియప్పా వరవరమునికావ్యమనే గ్రంథంలో **"ఆత్మస్వరూపయాథాత్మ్య మాచార్యాధీనతైవ యత్, అమ్నాయానాం రహస్యం తదఖిలేభ్యః ప్రకాశయన్, సర్వం యతిపతే రేవ కుర్వ న్నాదేశపూర్వకమ్, కృత్యాకృత్యేషు కర్తృత్వం కృతీ కి మపి నాస్పృశేత్"** (ఆత్మస్వరూపంయొక్క యథార్థస్థితి ఆచార్యాధీనుడుగా ఉండడమే. ఇదే వేదార్థ రహస్యం. దీన్ని వరవరమునుల అందఱికీ ప్రకాశింపజేస్తూ, అంతా భగవద్రామా నుజుల ఆదేశానుసారంగా ఆచరిస్తూ, విధి – నిషేధరూపక్రియల్లో కృతార్థులై, కర్మల విషయంలో ఎటువంటి కర్తృత్వరూప సంబంధాన్ని లేనివారై ఉన్నారు) అని తెలియజేశారు. **"తతః ప్రత్యూషసమయే భక్తైః శిష్యైః యతీశ్వరైః,.... శ్రీపతే రాజ్ఞయా సిద్ధాః కృత్వా పౌర్వాహ్ణికీః క్రియాః"** అనే యతిపతిదినచర్యా సూక్తి భావనీయం.

**17. అథ రంగనిధిం సమ్య గభిగమ్య నిజం ప్రభుమ్ ।**
**శ్రీనిధానం శనై స్తస్య శోధయిత్వా పదద్వయమ్ ॥**

అథ=స్నానం చేసి, ప్రాతఃకాలకృత్యాలను పూర్తి చేసికొని, మఠానికి వేంచేసిన తరువాత, నిజం=అర్చారూపంలో తమకు సన్నిహితంగా ఉన్నవాడు, ప్రభుం= అందఱిని నియమించేవాడు, రంగనిధిం=శ్రీరంగానికి నిధివలె సర్వైశ్వర్యానికి కారణమైనవాడు అయిన శ్రీరంగనాథుని, సమ్యక్ అభిగమ్య=శాస్త్రానుసారం భక్తితో సమీపించి, దండం సమర్పించి, శ్రీనిధానమ్= కైంకర్యలక్ష్మికి స్థానం అయిన, తస్య=ఆ శ్రీరంగనాథునియొక్క, పదద్వయమ్ శ్రీపాదాలను, శనైః=అత్యంత భక్తిపారవశ్యంతో తొందర లేకుండా మెల్లగా, శోధయిత్వా=సుగంధజలంతో తిరుమంజనం చేసి, (ఇచట చెప్పబడ్డ అభిషేకం తిరువారాధనను అంతటిని లక్షిస్తుంది)

స్నానం చేసి, ప్రాతఃకాలకృత్యాలను సమాప్తి చేసికొని, మఠానికి వేంచేసిన తరువాత వరవరమునులు తమ ఆరాధనలోని అర్చామూర్తి అయిన శ్రీరంగనాథునకు అర్ఘ్యపాద్యాచమనీయాదిరూపం అయిన తిరువారాధనను సమర్పించారు.

**(అథ)** కావేరీనదిలో గాని – చంద్రపుష్కరిణిలో కాని, వేఱేచోట గాని స్నానం చేసి మఠానికి వచ్చిన తర్వాత.

**(రంగనిధిమ్)** శ్రీరంగానికి నిధి. నిధివలె అనవధికమైన ఐశ్వర్యానికి నిదానభూతుడని అర్థం. **"నిధి రవ్యయః"** (తరగని నిధి) అని **"నిదియినై"** అనికదా స్వామి కీర్తింప బడుతున్నాడు.

**(శ్రీనిధానమ్) "శ్రీమంతౌ హరిచరణౌ సమాశ్రితోఽ హమ్"** (లక్ష్మికి నివాసమైన హరిచరణాలను రెండింటిని నేను ఆశ్రయించాను.) అనే రీతిలో లక్ష్మీనివాస భూతమైన – అని భావం.

**(శనైః)** మెల్లగా – అని అర్థం. ఈ పదంవల్ల **"అత్వర స్సుమనాః క్రోధం కామం హిత్వా యజేత చ"** (తొందరలేకుండా పరిశుద్ధ చిత్తంతో, కామక్రోధాలను విడచి ఆరాధించాలి) అనే శాండిల్యసూక్తి స్మరింపబడింది.

ప్రాతఃకాలంలో స్నానానంతరం అభిగమనం (భగవదారాధన) స్మృతి విహితం. శాండిల్యస్మృతి స్నాన విధులను వివరంగా తెలిపిన తర్వాత, **"అభిగచ్ఛేచ్చ దేవేశం సుస్నాతః సోర్ధ్వపుండ్రకః, సుప్రక్షాళితపాద శ్చ స్వాచాంత స్సంయతేంద్రియః, సంధ్యయో రుభయో ర్నిత్యం యావదర్కర్క్ష దర్శనమ్, ధ్యాయన్ బ్రహ్మ జపే న్మౌనీ తతోఽ భిగమనక్రియా"** (చక్కగా స్నానం చేసి, ఊర్ధ్వపుండ్రాలను ధరించి, పాదాలను కడుగుకొని, చక్కగా ఆచమించి, ఇంద్రియనిగ్రహం కల్గి, దేవతలకు అధిపతి

అయిన పరమాత్మను ఆరాధించాలి. ప్రాతస్సంధ్య, సాయంసంధ్యలలో ప్రతిదినం సూర్యోదయవేళ, సూర్యాస్తమయవేళ సంధ్యావందనాన్ని ముగించుకొని, మౌనంగా అభిగమనాన్ని–అంటే భగవదారాధనను చేయాలి) అని చెప్పింది. శ్లోకంలోని **"ప్రభుమ్"** అనే పదప్రయోగానికి అనుగుణంగా శాండిల్యస్మృతిలోని **"స్వామిత్వేన సుహృత్వేన గురుత్వేన చ సర్వదా, పితృత్వేన తథా భావ్యో మాతృత్వేన చ మాధవః"** (మాధవుడైన శ్రియఃపతిని ఎల్లప్పుడూ స్వామిగా, స్నేహితునిగా, గురువుగా, తండ్రిగా భావించాలి) అనే వచనం స్మరించతగినది. శ్రీవరవరమునులు తమ అర్చామూర్తి అయిన శ్రీరంగనాథుని ఆరాధించే వృత్తాంతం వరవరముని కావ్యంలో **"అభిగమ్య క్రమా త్స్వీయ మర్చయామాస మాధవమ్, తత్సంశ్లేషాభిలాషేణ రంగధామా పరః పుమాన్, తద్గృహార్చాత్మనా తత్ర సన్నిధిం విదధే సదా"** (వరవరమునులు క్రమంగా తమ అర్చామూర్తి అయిన మాధవుణ్ణి ఆరాధించారు. ఆ వరవరమునులను సంశ్లేషించాలనే ఆశతో పరమాత్మ అయిన శ్రీరంగనాథుడు గృహార్చామూర్తి రూపంలో అక్కడ వరవరమునుల ఇంటిలో సాన్నిధ్యాన్ని కల్గి ఉన్నాడు) అని ప్రస్తావింపబడింది. **(పదద్వయం శోధయిత్వా)** ఇచట తెలుపబడిన పాద్యప్రదానం ఆరాధనను లక్షిస్తుంది. ఈ సందర్భాన్ని స్తుతించే వరవరముని కావ్యంలో **"అర్చయామాస"** అనే ప్రయోగం చేయబడింది కదా! **"జప్త్వాఽభిగమనం మంత్ర మర్చయిత్వా యథావిధి, ఆసనార్ఘ్యాదిభిః భోగైః భక్త్యా పరమపావనైః, అభిగమ్య జగన్నాథం ధ్యాయ న్నేవ సనాతనమ్"** (ఆసనం, అర్ఘ్యం, పాద్యం మొదలైనవానిని సమర్పించి, స్వామిని ఆరాధించి) అని శాండిల్యస్మృతిలో ఆసన అర్ఘ్యపాద్యాదులను సమర్పించి, స్వామిని యథావిధిగా ఆరాధించాలని తెలుపబడింది. వరవరమునులు యతీంద్రచరణ ద్వంద్వంలో అత్యంతప్రావణ్యం కల్గి ఉన్నవారైనపుడు, వారు శ్రీరంగనాథుని మూర్తిని ఆరాధించడం ఎందుకు? అంటే, ఆ శ్రీరంగనాథుని అర్చామూర్తి భగవద్రామానుజులకు ఉద్దేశ్యం కాబట్టి, ఆచార్యముఖోల్లాసహేతువైన శ్రీరంగనాథుని ఆరాధన వరవరమునులకు ప్రాప్తమే అవుతుంది. అందువల్ల స్వాధికారవిరోధం లేదు. భరతుని విషయంలో అత్యంతప్రావణ్యం కల్గిన, భాగవత పారతంత్ర్యానికి ఉత్తమోదాహరణం అయిన శత్రుఘ్నుడు, ఆ భరతునకు మిక్కిలి ఆరాధ్యుడైన శ్రీరామచంద్రుణ్ణి తన మనస్సులో నిత్యం భావించినట్లు అతడు స్వయంగా పల్కిన **"నాహం స్వపిమి జాగర్మి త మేవార్యం విచింతయన్, ఇత్యేవ మవద ద్భ్రాతా శత్రుఘ్నో భరత ప్రియః"** (నేను నిద్రపోవడం లేదు. ఆ శ్రీరామునే స్మరిస్తూ మేల్కొని ఉన్నాను – అని భరతునకు ఇష్టుడైన శత్రుఘ్నుడు పలికాడు.) అనే సూక్తి ద్వారా వాల్మీకి శ్రీరామాయణంలో తెలియజేశాడు కదా!



**18. తత స్తత్సన్నిధిస్తంభమూలభూతలభూషణమ్ ।**
**ప్రాఙ్ముఖం సుఖ మాసీనం ప్రసాదమధురస్మితమ్ ॥**

తతః = తిరువారాధనం మొదలైనవి ముగిసిన తరువాత, తత్సన్నిధిస్తంభమూల భూతల భూషణమ్ = ఆ శ్రీరంగనాథుని సన్నిధిలో ఉండే స్తంభం మూలప్రదేశానికి అలంకారం వంటివారు, ప్రాఙ్ముఖం=తూర్పుదిక్కుగా, సుఖం=ఏకాగ్రతతో అనుకూలంగా, ఆసీనం=వేంచేసి ఉన్నవారు, ప్రసాదమధురస్మితమ్=సంతోషం మొదలైనవానివల్ల కల్గిన మనోనైర్మల్యంచేత ప్రియమైన మందహాసాన్ని కలవారు – (తరువాతి శ్లోకంతో అన్వయం)

ఆరాధనాదులు పూర్తి అయిన తరువాత ఆ శ్రీరంగనాథుని సన్నిధిలో ఒక స్తంభం మూలదేశంలో దానికి అలంకారంగా, తూర్పుముఖంగా, సుఖంగా తమ మనస్సులోని ప్రశాంతత వ్యక్తం అయేటట్లు మందహాసాన్ని చిందిస్తూ వరవరమునులు వేంచేసి ఉన్నారు.

ఈ శ్లోకంలోని ద్వితీయాంతపదాలన్నీ 21వ శ్లోకంలోని **"వందే వరవరం మునిమ్"** అనే ప్రయోగంతో అన్వయించాలి. **(తతః)** ద్వయమంత్రాదులను జపించిన తరువాత. **(ప్రాఙ్ముఖం)** దీన్ని క్రియావిశేషణంగాకాని, కర్తృవిశేషణం (వరవర మునులకు విశేషణం)గా కాని చెప్పవచ్చు. ఆరాధనానంతరం మంత్రరత్నజపం చేయడాన్నిగూర్చి పరాశరస్మృతిలో – **"కాలత్రయార్చనాంతే తు జపే దష్టసహస్రకమ్, అష్టోత్తరశతం వాపి, అష్టావింశతి మేవ వా, యథాశక్తి జపే న్నిత్యం మంత్రరత్న మతంద్రితః, తదర్థం చింతయే న్నిత్యం యావద్దేహనిపాతనమ్"** (మూడు కాలాల్లో చేసే అర్చన తరువాత ఎనిమిదివేలసార్లు గాని, నూటెనిమిదిసార్లు గాని, ఇరవై ఎనిమిదిసార్లుగాని ద్వయాన్ని సోమరితనం లేకుండా యథాశక్తి జపించాలి. ఆ మంత్రార్థాన్ని జీవించి ఉన్నంతకాలం స్మరించాలి) అని చెప్పబడింది.

ఇచటకూడా **"యతీంద్రచరణద్వంద్వప్రవణేనైవ చేతసా"** అనే ప్రయోగాన్ని అన్వయించుకోవాలి. దీనివల్ల జపాసనాదులైన అన్ని సన్నివేశాల్లో తమ చరమ

పర్వనిష్ఠకు అనుగుణంగా స్వాచార్యస్మృతిని వరవరమునులు కల్గి ఉండడం తెలుపబడుతున్నది. తూర్పు ముఖంగా కూర్చోవడాన్నిగూర్చి శాండిల్యస్మృతి **"ఆచార్య మేకభక్తం చ భగవన్మందిరం జలమ్, అగ్ని మర్కం చ సోమం చ పృష్ఠీకృత్య జపే న్న చ"** (ఆచార్యునకు, పరమైకాంతికి, భగవానుని మందిరానికి, జలానికి, అగ్నినికి, సూర్యునకు, చంద్రునకు వెనుకకు తిరిగి జపించరాదు) అని ప్రారంభించి, **"ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖో వా కుర్యా ద్భగవతః క్రియాః"** (ఉత్తరముఖంగా కాని, తూర్పుముఖంగా కాని ఉండి భగవత్కైంకర్యాన్ని చేయాలి) అని విధించింది. మణవాళ మహామునుల మనస్సులో ఏ విధమైన మనఃకాలుష్యం లేనందువల్ల వారి ముఖంలో అందమైన మందహాసం భాసిస్తున్నది. **"అకత్తిన్ అఢ్కు ముకత్తిలే తెరియుమ్"** (మనస్సులోని అందం ముఖంలో వ్యక్తమవుతుంది) అనే ద్రావిడసామెత, **"రూప మేవాస్య ఏత న్మహిమానం వ్యాచష్టే"** (రూపమే ఇతని గొప్పదనాన్ని వివరిస్తున్నది) అనే వైదికసూక్తి స్మరణీయాలు. దీనికి పిమ్మటగల శ్లోకంలో తమకు వరవరమునులు పంచసంస్కార ప్రదానాన్ని చేయడం తెలుపబడం చేత, అందుకోసం వరవరమునులు వేంచేసియున్న సన్నివేశాన్ని స్తుతికర్త ఈ శ్లోకంలో ప్రస్తుతించారని కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య.

**19. భృత్త్యైః ప్రియహితైకాగ్రైః ప్రేమపూర్వ ముపాసితమ్ ।**
**తత్ప్రార్థనానుసారేణ సంస్కారాన్ సంవిధాయ మే ॥**

ప్రియహితైకాగ్రైః=ఇష్టంగాను, పథ్యంగాను ఉన్న, భగవదారాధనకు ఆవశ్యకాలైన వస్తువులను సంపాదించడంలో ఏకాగ్రతను కల్గినవారైన, భృత్త్యైః=కందాడై అణ్ణన్ మొదలైన శిష్యుల చేత, ప్రేమపూర్వకమ్=స్నేహపూర్వకంగా, ఉపాసితం=సేవింపబడినవారై, తత్ప్రార్థనా+ అనుసారేణ=ఆ అంతరంగశిష్యులు చేసిన, కాదనడానికి వీలుకాని ప్రార్థనవల్ల, మే=ముందు దినంలో ఆశ్రయించిన నాకు, సంస్కారాన్=తాపాది సంస్కారాలను, సంవిధాయ=యథావిధిగా అనుగ్రహించి –

స్వరూపానురూపవృత్తిలో ఆసక్తులై ఉండే వానమామలైస్వామి, కన్దాడై అణ్ణన్, కోయిలణ్ణన్ మొదలైన తమ శిష్యులు భక్తితో సేవిస్తూండగా, వారు చేసిన ప్రార్థనను కాదనలేక అంగీకరించి వరవరమునులు నాకు తాపాదిసంస్కారాలను అనుగ్రహించారు.



**(ప్రియహితైకాగ్రైః) – "ఏకాగ్ర"** శబ్దప్రయోగంవల్ల భగవదారాధనకు పనికి వచ్చేవి, వర్ణధర్మాలకు, ఆశ్రమధర్మాలకు విరుద్ధంకాని వస్తువులను ఉపాదానంగా సమర్పించడం చేత శిష్యులయొక్క ప్రియపరత్వం, హితపరత్వం సూచింపబడింది.

పూర్వశ్లోకంలో వర్ణింపబడిన రీతిలో శ్రీరంగనాథుని సన్నిధిలోని స్తంభం మూలప్రదేశంలో వరవరమునులు కూర్చుని ఉండే సమయంలో వారి అంతరంగశిష్యులు భగవదారాధనకు అవసరమైన, శాస్త్రాలకు విరుద్ధం కాని బియ్యం, పప్పు,పండ్లు, పాలు,పెరుగు, శాకములు మొదలైన ద్రవ్యాలను భక్తితో తీసికొనివచ్చి, వారి సన్నిధిలో సమర్పించగా, వానిని వరవరమునులు స్వీకరించారు. **"సిద్ధ మన్నం భక్తజనై రానీతం య న్మఠం ప్రతి, ఉపపన్నం తదిత్యాహు ర్మునయో మోక్షకాంక్షిణః"** (భక్తులచే సిద్ధంచేయబడి సమర్పింపబడిన భోజన ద్రవ్యాలు స్వీకరించదగినవి అని మోక్షాన్ని కోరే మునులు పలుకుతారు) అనే సూక్తినిబట్టి భగవదారాధన కోసం భక్తులు సమర్పించిన తణ్డుల, శాకాదులు నిషిద్ధాలు కావు; స్వీకరణీయాలే. పరాశరసంహితలోకూడ **"మఠాపత్యం యతిః కుర్యాత్ విష్ణుధర్మాభివృద్ధయే"** (యతి, శ్రీవైష్ణవధర్మాలు అయిన పంచసంస్కారాలు, ఉభయవేదాంతరహస్యగ్రంథప్రవచనం, ఆ గ్రంథాల్లో చెప్పబడ్డ రీతిలో శిష్యులు నడుచుకొనేటట్లు చేయడం మొదలైన వానిని అభివృద్ధి చేయడంకోసం మఠాధిపత్యాన్ని నిర్వహించాలి) అని చెప్పబడినందువల్ల కన్దాడై అణ్ణన్ మొదలైన పలువురు మహనీయులు శ్రీవైష్ణవతదీయారాధన జరిగే వరవరమునుల మఠంలో భగవదారాధన భాగవతారాధన కోసం ఉపయోగించేటట్లు ద్రవ్యాలను భక్తితో సమర్పించడం, వరవరమునులు వాటిని అంగీకరించడం తగినదే. **"ధనధాన్యాది సంగ్రహమ్"** అనే పరాశరవచనంకూడా దీన్ని తెలియజేస్తున్నది. **"యద్వా, స్వాయత్తాచార్యప్రియతదాయత్తస్వహిత తదుభయపరైః భృత్త్యైః వాధూల వరదనారాయణగురుప్రభృతిభిః"** అని ప్రకారాంతరంగా వాధూల వీరరాఘవాచార్య స్వామి వ్యాఖ్యలో వివరింపబడింది. అంటే, తమ ఆచార్యులైన వరవరమునులకు ఇష్టమైన కైంకర్యాన్ని చేసిన వారికి ప్రియాన్ని కల్గించేవారు, ఆ వరవరమునులవల్ల తమ హితాన్ని పొందేవారు అయిన వాధూల వరదనారాయణ (కోయిలణ్ణన్) గురువులవంటివారిచే–అని తాత్పర్యం. **(ఉపాసితమ్)** పరిచర్య చేయబడినవారిని–అని భావం. ఇచట పరిచర్య అంటే, పూర్వోక్తపద్ధతిలో భగవదారాధనకు మంత్రపరిభవం, దేవతాపరిభవం చేయకుండా,

భక్త్యుత్కర్షను వ్యక్తం చేసే ప్రేమసమాచారాలను పల్కడంద్వారా, ఆచార్యులకు ప్రీతిని పెంపొందించడం. ఇటువంటి ప్రియహిత పరులైన శిష్యుల ప్రార్థన ఆచార్యునకు అనతిక్రమణీయం కదా! అందువల్లనే **"తత్ప్రార్థనానుసారేణ"** అని ప్రయోగింప బడింది.

**(సంవిధాయ)** యథాశాస్త్రం చేసి-అని అర్థం. ఈ అసమాపకక్రియారూపం ముందున్న శ్లోకంలోని **"అనుకంపా....పూర్వకమ్"** అనే ప్రయోగంతో అన్వయిస్తుంది.

**"సంవత్సర ముపాసీత త మేవ సుసమాహితః"** (ఒక సంవత్సరకాలం గురువును ఉపాసించాలి, అటువంటి శిష్యునకే గురువు పంచస్కారాలను అనుగ్రహించాలి) **"ఉపాసీత గురో ర్వర్షమ్"** (ఆచార్యుని సంవత్సరకాలం ఉపాసించాలి) అను మొదలైన ప్రమాణాలవల్ల ఒక సంవత్సరకాలంపాటు శిష్యుణ్ణి పరీక్షించి, ఆ తరువాతనే పంచసంస్కారాలను చేయాలని శాస్త్రం విధించినా, ఒక సంవత్సరకాలం కంటే ఎక్కువ కాలం పాటు తాము పరీక్షించినవారు, పరహితపరులైనవారు అయిన కోయిలణ్ణన్వంటి అంతరంగశిష్యులు తమను తప్పక అనుగ్రహింవచలసినదిగా వరవరమునులను ప్రార్థించినందువల్ల, శాస్త్రవిధికంటె అంతరంగశిష్యుల ప్రార్థన ఎక్కువ ప్రియం, హితం కాబట్టి వారిమాటను కాదలేక ముందు దినమే వచ్చిన తమకు వరవరమునులు పంచసంస్కారాలను ప్రసాదించడంలో ఏ అనుపపతి లేదు అనే భావం. **"తత్ప్రార్థనానుసారేణ"** అనే ప్రయోగంద్వారా ధ్వనిస్తుంది. అందువల్ల **"ప్రియహితైకాగ్రైః"** అనే ప్రయోగంవల్ల వరవరమునులకు ప్రియులు, ఎందుకంటే, పరహితంలో ఏకాగ్రతను కల్గినవారు-అనే అర్థవిశేషంకూడా ధ్వనిస్తున్నదనడంలో అడ్డు లేదు.

పూర్వశ్లోకంలోని **"శోధయిత్వా పదద్వయమ్"** అనే సూక్తిద్వారా సూచింపబడ్డ భగవదారాధన ఇక్కడ ప్రస్తావింపబడ్డ పంచసంస్కారప్రదానానికి ప్రసంగవశాత్తు ఉపకరించింది. పంచసంస్కారవిధిప్రక్రియలో భగవదారాధనకూడా అంగమే కదా! అందువల్ల పరాశరస్మృతిలోని **"స్నాత్వా శుభేఽహ్ని పూర్వాహ్నే సమ్యగభ్యర్చ్య కేశవమ్, స్నాతం శిష్యం సమాహూయ కృతకౌతుకబంధనమ్, ఆచార్యో విధివత్ కుర్యాత్ చక్రపుండ్రాదిసత్క్రియామ్"** (శుభదినంలో పూర్వాహ్ణసమయంలో స్నానం చేసి, యథావిధిగా భగవదారాధనను చేసి, స్నానం చేసిన, కంకణధారణను చేసిన



శిష్యునకు ఆచార్యుడు శాస్త్రవిధిలో పంచసంస్కారాలను ప్రసాదించాలి) అనే విధానం పూర్ణంగా అన్వయించినట్లయింది. **"న కాలస్య పరీక్షాస్తి"** (కాలపరీక్ష అవసరం లేదు), **"స ఏష దేశః కాల శ్చ"** (ప్రార్థించిన దేశమే, కాలమే పంచసంస్కారానికి తగినవి) అనే సూక్తులుకూడా ప్రార్థించిన సమయంలోనే (విశిష్టాధికారికి) పంచసంస్కార ప్రదానం చేయడంలో ప్రత్యవాయం (అడ్డు) లేదని సూచిస్తున్నవి. **"సంస్కారాన్"** అనే ప్రయోగంలోని బహువచనంద్వారా **"తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగ శ్చ పంచమః"** (తాపము, పుండ్రము, నామం, మంత్రం, యాగం అనే ఐదు సంస్కారాలు) అని నిర్దేశింపబడ్డ పంచసంస్కారాలను-అని సామాన్యంగా అర్థం స్ఫురించినా, కపింజలాధికరణన్యాయంద్వారా, కేవలం మొదటి మూడు సంస్కారాలే అంటే తాప-పుండ్రధారణ-నామధారణాలు అనే మూడే చేయబడ్డాయని చెప్పాలి. ఎందుకంటే, మిగిలిన రెండు సంస్కారాలలో మన్త్రమనే సంస్కారం తరువాతి శ్లోకంలోని (21) **"మంత్రరత్నం ప్రయచ్ఛంతమ్"** అనే సూక్తి చెప్పబడినందువల్ల, యాగమనే సంస్కారం అధికారానుగుణంగా తమ పాదుకలను అనుగ్రహించడంద్వారా కాలాంతరంలో అనుగ్రహిస్తారని భావించవలసి ఉన్నది.-అని వీరరాఘవాచార్య వ్యాఖ్య. అందువల్ల బాహుద్వయంలో తప్తశంఖచక్రాల లాంఛనాలను ధరించడమనే తాపసంస్కారం, పన్నెండు పుండ్రాలను దేహంలో ఆయాచోట్ల ధరింపచేయడమనే పుండ్రసంస్కారం, **"అడియేన్ రామానుజదాసన్"** అనే నామాన్ని ధరించడం అనే నామ సంస్కారం-ఈ మూడే ఇచట గ్రాహ్యాలు. ఇక్కడ సంస్కారమంటే - ఒకడు శ్రీవైష్ణవుడు కావడానికి ఆవశ్యకమైన యోగ్యతను పొందడంకోసం ఆచార్యుడు చేసే సత్కారం. **"సంస్కారాన్"** అనే పదంలోని **"సమ్"** అనే ఉపసర్గకు ఏకీకరణం అర్థం కాబట్టి, ఈ మూడు సంస్కారాలు ఒకే సమయంలో చేసినట్లు అర్థం స్ఫురిస్తుంది. భారద్వాజపరిశిష్టమనే గ్రంథంలోని **"సదైకదివసే వా ద్వే త్రీణి చత్వారి పంచ చ"** అనే ప్రమాణం ఒకే దినంలో వీనిని చేయవచ్చునని తెలుపుతున్నది. యతులకు అగ్నికార్యంలో (హోమాదులు చేయడంలో) అన్వయం కూడదని నిషేధింపబడి నందున, యతులు పంచసంస్కారాలను అనుగ్రహించే సమయంలో హోమాదులను ఇతరులద్వారా నిర్వహింపజేయాలి. **"ఆచార్య స్స్వయ మాదాయ నియుక్తో వాఽథ మంత్రలిత్, ప్రాఙ్ముఖ స్సోపవిష్టస్య న్యసే ద్బాహౌ తు దక్షిణే"** (మంత్రజ్ఞుడైన ఆచార్యుడు స్వయంగా గాని, ఇతరునిచే నియోగింపబడి కాని తూర్పుదెసగా కూర్చుని

ఉన్న శిష్యుని దక్షిణబాహువులో సుదర్శనలాంఛనాన్ని ముద్రించాలి) అని ఆ భరద్వాజపరిశిష్టంలోనే చెప్పబడింది. ఈ ప్రమాణంలో ఆచార్యునిచేత ఆదేశింపబడ్డ వేఱొకడు ప్రధానం అయిన చక్రాంకనాన్నికూడా చేసే అవకాశం ఉన్నదని చెప్పబడినందువల్ల, అప్రధానం అయిన అగ్నికార్యాన్ని వేఱొకడు చేయడంలో ఏమి అడ్డు ఉన్నది? అది కింపునర్న్యాయసిద్ధం కదా! **"న శిష్యాననుబధ్నీత"** (పంచ సంస్కారప్రదానంలో శిష్యులను ఉపయోగించరాదు) అనే నిషేధం విశిష్టప్రార్థనా విరహవిషయంలో–అంటే ఆర్తితో ప్రార్థించనివారి విషయంలో అన్వయిస్తుంది – అని భావించాలి.

**20. అనుకంపాపరీవాహై రభిషేచనపూర్వకమ్ ।**
**దివ్యం పదద్వయం దత్వా దీర్ఘం ప్రణమతో మమ ॥**

అనుకంపాపరీవాహైః=ఇతరుల అనర్థాన్ని చూచి సహించలేకపోవడమనే కృపయొక్క ప్రవాహంతో, అభిషేచనపూర్వకమ్=(నన్ను) అభిషేకించడంతో పాటు, దీర్ఘం = చిరకాలం, ప్రణమతః = భక్త్యతిశయంతో సాగిలపడి ఉన్న, మమ=దాసుడనైన నాకు, దివ్యం= సర్వోత్కృష్టమైన, పదద్వయం=శ్రీపాదద్వంద్వాన్ని, దత్వా=దాసుని శిరస్సుపై ఉంచడంద్వారా అనుగ్రహించి. (పై శ్లోకంతో అన్వయం)

కృపాప్రవాహపరీవాహరూపాలైన తమ కటాక్షవిశేషాలను వరవరమునులు నాపై ప్రసరింపజేసి, సాష్టాంగ దండప్రణామాన్ని చిరకాలం ఆచరించే నాకు తమ దివ్యపాదారవింద యుగళాన్ని **"ఉన్ పాద పఙ్కయమే తలైక్కణియాయ్"** (నీపాద పద్మాన్ని నా శిరస్సుకు ఆభరణంగా అలంకరించు) అని ప్రార్థించిన రీతిలో నా శిరస్సుకు ఆభరణంగా అనుగ్రహించారు.

**(అనుకంపాపరీవాహైః)** శరణాగతరక్షణకు ఉపయోగించే ఆశ్రయణ సౌకర్యాపాదకగుణాల్లో కృప ప్రధానమైనది. ఆ గుణమే ఇక్కడ ప్రస్తుతింపబడినది. **"పరీవాహైః"** అనే ప్రయోగంవల్ల ఈ గుణం మామునులకు ఉత్కటంగా ఉన్నదని తెలుస్తున్నది. శ్లోకంలోని **"అనుకంపా....పూర్వకమ్"** అనే ప్రయోగం **"దత్వా"** అనే అసమాపకక్రియారూపానికి విశేషణం.

**(దీర్ఘం ప్రణమతో మమ)** – **"అభిమానపఙ్గమాయ్.......వన్దు తలైప్పెయ్దోమ్"** (అభిమానమంతా పోయి.... నీదరికి చేరగలిగాము) అన్నట్లు భగ్నాభిమానత్వంచేత,



భక్త్యతిశయంచేత చిరకాలం సాష్టాంగప్రణామాన్ని చేసే నాకు – అని ఇచటి భావం.

**(దివ్యమ్)** – **"దివు–దీప్తౌ"** అనే ధాత్వర్థస్వారస్యాన్నిబట్టి భగవచ్చరణారవిందాలకంటె గొప్పగా ప్రకాశించేవి – అనే అర్థం కూడా చెప్పవచ్చు. **"పొన్ అడియామ్ శెఙ్గమల ప్పోదుకళై"** (బంగారు వలె ఆశపడదగిన పాదపద్మాలను) అని చెప్పబడిన రీతిలో మామునుల పాదాలు అత్యంతం స్పృహణీయాలుకదా! అంతేకాక, సంసార బంధానికి, మోక్షానికి రెండింటికి కారణం అయిన భగవత్సంబంధం కంటె, మోక్షానికి మాత్రమే కారణం అయిన ఆచార్యసంబంధం గొప్పది–అనే అర్థం ఇచ్చే **"ఈశ్వర సంబంధమ్ బంధమోక్షఙ్గళిరణ్డుక్కుమ్ పొతువాయిరుక్కుమ్, ఆచార్య సంబంధమ్ మోక్షత్తుక్కే హేతువాయిరుక్కుమ్"** (ఈశ్వరునితో సంబంధం బంధానికి, మోక్షానికి–రెండిటికి కారణమౌతుంది. కాని ఆచార్య సంబంధం మోక్షానికి మాత్రమే కారణమౌతుంది) అనే శ్రీవచనభూషణ చూర్ణిక (433) ఈ సందర్భంలో అను సంధేయం.

**21. సాక్షాత్ఫలైకలక్ష్యత్వప్రతిపత్తిపవిత్రితమ్ ।**
**మంత్రరత్నం ప్రయచ్ఛంతం వందే వరవరం మునిమ్ ॥**

సాక్షాత్ఫలైకలక్ష్యత్వప్రతిపత్తిపవిత్రితమ్=ద్వయమంత్రోపదేశం చేయడంలో ముఖ్యోద్దేశ్యం అయిన భగవన్మంగళాశాసనరూప ఫలం ఒక్కటే ముఖ్య లక్ష్యంగా కల్గిన అభిప్రాయంవల్ల పావనం అయేటట్లు, మంత్రరత్నం=ద్వయమనబడే మంత్రరత్నాన్ని, ప్రయచ్ఛంతం=ఉపదేశిస్తున్న, వరవరమునిం=మణవాళమహా మునులను, వందే = నమస్కరిస్తున్నాను.

భగవన్మంగళాశాసనపరునిగా నన్ను సంస్కరించడం ఒక్కటే ప్రధానోద్దేశ్యంగా కల్గి, నాకు ద్వయమంత్రాన్ని ఉపదేశించే వరవరమునులకు నమస్కరిస్తున్నాను.

శ్రీవచనభూషణగ్రంథంలో సదాచార్యలక్షణప్రకరణంలోని **"సాక్షాత్ఫల ముమ్, సదాచార్యఫలముమ్ సిద్ధిక్కుమ్పడి యెన్? ఎన్నిల్, తన్నినైవాలుమ్, ఈశ్వరన్ నినైవాలుమ్ సిద్ధిక్కుమ్"** (సాక్షాత్ఫలం, సదాచార్యఫలం సిద్ధించే తీరు ఏది? అని అంటే, తన అభిప్రాయంతో, భగవానుని అభిప్రాయంతో సిద్ధిస్తుంది) అనే సందర్భంలో **"సాక్షాత్ఫలమావతు–ఉపదేశపాత్రమాన ఇవన్ తిరున్ది మఙ్గళాశాసనత్తుక్కు ఆళాకై.**

**ఇదు తన్నినైవాలే సిద్ధిక్కైయావతు-ఉపదేష్టావాన తాన్ విప్రతిపత్తికళొన్ఱు మిన్ఱి ఇతువే ఫలమాక నినైత్తు ఉపదేశిక్కవే అవనప్పడి తిరుస్ది మజ్గళాశాసన అధికారియాకై"** (సాక్షాత్ఫలం అంటే, ఉపదేశానికి పాత్రుడైన ప్రపన్నుడు సంస్కరింపబడి భగవానునకు మంగళాశాసనం చేసేవాడుగా మారడమే. ఇది ఆచార్యుని అభిప్రాయంతో సిద్ధించడమంటే, ఉపదేష్ట అయిన తాను ఈ విప్రతిపత్తులు ఏమీ లేకుండా, ఇదే ఫలంగా భావించి ఉపదేశించగానే, అతడు – అంటే శిష్యుడు ఆ రీతిలో మంగళా శాసనపరుడు కావడం) అనే వ్యాఖ్యాన శ్రీసూక్తులు ఇచట అనుసంధేయాలు-అని శ్రీ.ప్ర.భ. అణ్ణాస్వామి వారివ్యాఖ్య.

మణవాళమహామునులు తాము తమ శిష్యులకు చేసే ద్వయమంత్రోపదేశానికి ముఖ్యఫలంగా తలచింది – తమ ఉపదేశాన్ని పొందిన శిష్యులు సంస్కరింపబడి, భగవన్మంగళాశాసనపరులు కావడం అనేది ఒక్కటే. ఆ విధంగా వారు తలచినందువల్లనే వారు చేసే ఉపదేశం పవిత్రతను కల్గినది అయింది. అందువల్ల ఆవిధంగానే వారు భావించి తమకు ద్వయాన్ని శుద్ధోపదేశం అయేటట్లు ఉపదేశించారు-అని ఎఱుమ్బియప్పా ఈ శ్లోకంలో తెలిపారు. **"సాక్షాత్ఫలైక...."** ఇత్యాది ప్రథమార్ధం పూర్తిగా క్రియావిశేషణం. మంత్రరత్నమనే పదానికి విశేషణంగా చేసి కొందఱు అన్వయించారు.

ఈ విధంగా భావించకుండా, ధనం, సేవ-మొదలైన లౌకిక లాభాలను ఆశించి గాని, శిష్యుల మోక్షాన్ని ఉద్దేశించి గాని, తాను ఒక శిష్యుని సంస్కరించి, అందువల్ల భగవానునకు చేసే కైంకర్యాన్ని ఆశించిగాని, తన ఏకాంతం తీరేటట్లు తనతో శిష్యుడు కలసి ఉంచాడనే సహవాసాన్నిగాని ఆశించిగాని ఉపదేశించినట్లయితే ఆ ఉపదేశానికి పవిత్రత సిద్ధించదు-అని దీనివల్ల సూచింపబడింది. (ఈ ఉద్దేశ్యాలతో ఉపదేశాన్ని చేసి, శిష్యునిగా గ్రహించడానికి శిష్యసంగ్రహం అని పేరు) ఇది యతికి బంధకారణం. కృపతో శిష్యునకు ఉపదేశం చేయడం మాత్రం యతులకు విరుద్ధం కాదు. ఇక శిష్యసంగ్రహం అంటే ఏమి? అనే విషయాన్ని **"శుశ్రూషాలాభ పూజార్థం యశోర్థం వా పరిగ్రహః, శిష్యాణాం న తు కారుణ్యా త్స జ్ఞేయ శ్శిష్యసంగ్రహః"** (దయతో కాకుండా శుశ్రూషను ఆశించి, లాభాన్ని ఆశించి, పూజను ఆశించి, ఖ్యాతి ఆశించి తప్ప, శిష్యుణ్ణి పరిగ్రహించడం శిష్యసంగ్రహ మనబడుతుంది) అనే ప్రమాణం వివరిస్తున్నది. ఈ లోకంలో వేంచేసి ఉండే



కాలంలో ఆచార్యునకు దేహయాత్రకోసం ధనంగాని, శుశ్రూషగాని అవసరం కాదా! శిష్యుడు మోక్షం పొందవద్దా? ఇచట ఉన్న కాలంలో ఆచార్యుడు భగవత్సేవను చేయవద్దా?సచ్ఛిష్యులతో సహవాసం ఆచార్యునకు సిద్ధించవద్దా! ఇవి అన్నీ మంచి ఆశలే కదా! చెడ్డవి కాదు కదా! వీటిని ఆశించి ఆచార్యుడు ద్వయోపదేశం చేయడం తగదని పల్కడం ఏ రీతిలో తగినది? అనే సందేహం కలుగవచ్చు. ఆచార్యుని విషయంలో శిష్యునకున్న శేషత్వం వీలయినంతలో ధనాన్ని సమర్పించి శుశ్రూషచేస్తే తప్ప నిలువదు అని తలచే శిష్యుని తలపువల్ల మొదటి ఫలం సిద్ధిస్తుంది. ఎవడైనా ఒకడు మోక్షాన్ని పొంది, నా దగ్గరకు వస్తాడా! అని తలచి, దానికి తగినట్లు ఒక శిష్యుని ఒక ఆచార్యునితో చేర్చి, ద్వయోపదేశాన్ని పొందేటట్లు చేసే భగవానుని తలపువల్ల శిష్యునకు మోక్షం-అంటే రెండవ ఫలం సిద్ధింస్తుంది. ఇతనికి (నా శిష్యునకు) సదుపదేశాలను చేసి, ఇతడు భగవన్మంగళాశాసనాన్ని చేసేటట్లు ఒక శిష్యుని గురువు సంస్కరించడం భగవానుని చిత్తానికి చాలా సంతోషం కలిగించే విషయం కాబట్టి, ఇది భగవత్కైంకర్యంకదా!" అని భావించే తన ఆచార్యుని తలపువల్ల ఆచార్యునకు భగవత్కైంకర్యం సిద్ధిస్తుంది. చాలా కాలంగా నేను – నాది అనే అహంకార మమకారాలతో సత్తను పోగొట్టుకొని ఉన్న మనకు హితోపదేశం చేసి, భగవన్మంగళాశాసనానికి తగినవానినిగా చేసిన మహోపకారకుని మనం ఏనాడు నా విడచి ఉండకూడదనే తలచి ఉండే శిష్యుని కృతజ్ఞతాభావంవల్ల శిష్యునితో ఆచార్యునకు సహవాసం సిద్ధిస్తుంది. అందువల్ల ఆచార్యుడు తాను శిష్యునకు చేసే ద్వయమంత్రోపదేశాన్ని తమకు తామే సిద్ధించే ఈ నాల్గింటిని ఫలంగా తలచకుండా భగవన్మంగళాశాసనం ఒక్కటే ఫలంగా తలచి పవిత్రంగా ద్వయమంత్రోపదేశం చేయాలి – అనే విషయాన్ని దృష్టిలో పెట్టుకొని మామునులు తమకు ద్వయోపదేశాన్ని చేశారని దీనివల్ల స్తుతికర్త తెలిపారు.

ఈ మంత్రోపదేశాన్నికూడా వరవరమునులు భగవద్రామానుజుల శ్రీపాదాలనే ధ్యానిస్తూ చేశారని గ్రహించాలి. గురుపరంపరను అనుసంధానం చేసి, ద్వయాన్ని అనుసంధించాలి – అనే నిర్బంధం ఉన్నందున **"యతీంద్రచరణద్వంద్వ ప్రవణేనైవ చేతసా"** అంటూ చెప్పబడ్డ భగవద్రామానుజులను గూర్చిన అనుసంధానం అనువర్తిస్తున్నందున అది శ్రీరామానుజులకు ముందు, తరువాత ఉన్న సకలాచార్య పరంపరను ఉపలక్షిస్తున్నది. భగవద్రామానుజులు గురుపరంపరమధ్యలో ఉన్నా,

**"యతిరాజేన నిబద్ధనాయకశ్రీః మహతీ గురుపంక్తిహారయష్టిః"** (యతి రాజులను నాయక రత్నంగా కలిగిన గురుపరంపర అనే గొప్పదైన హారం ప్రకాశిస్తున్నది.) అన్నట్లు నాయకమణిగా భాసిస్తున్నారు కాబట్టి, ప్రధానులైన వీరి విషయంలో చేసిన అనుసంధానం అందటి విషయంలో చేసినట్లే అవుతుంది.

ఆచార్యుడు శిష్యునకు కృపతో ఉపదేశించాలని శాండిల్యస్మృతి **"సంవత్సరం తదర్థం వా మాసత్రయ మథాపి వా, పరీక్ష్య వివిధోపాయైః, కృపయా నిఃస్పృహో వదేత్"** (సంవత్సరం కాలం పాటుకాని, అర్ధసంవత్సరం కాని, మూడునెలలుకాని, పలు ఉపాయాలద్వారా పరీక్షించి, కృపతో ఎటువంటి ఆశలేకుండా గురువు ఉపదేశించాలి) అని అన్నది. ఈ సూక్తిలో **"వివిధోపాయైః"** అని చెప్పబడ్డ ఉపాయాల్లోకి ఇంతకు ముందు ప్రార్థింపబడ్డ వారు చేసే ప్రార్థనకూడా చేరుతుందని వీరరాఘవాచార్య వ్యాఖ్య. పరాశరమహర్షికూడా **"కృపయా వీక్షయే ద్గురుః, స్వాచార్యం హృదయే ధ్యాత్వా జప్త్వా గురుపరంపరామ్"** (గురుపరంపరను జపించి, తన ఆచార్యుని మనస్సులో స్మరించి గురువు శిష్యుణ్ణి కటాక్షించాలి) **"ఆచార్యః కృపయా స్వయమ్, స్వాచార్యం హృదయే ధ్యాత్వా మంత్ర మధ్యాపయే ద్గురుః, న్యాసాఖ్యం పరమం మంత్రం సంసారచ్ఛేదనం శుభమ్"** (ఆచార్యుడు, తన ఆచార్యుని హృదయంలో ధ్యానించి, మంత్రోపదేశాన్ని స్వయంగా దయతో చేయాలి. న్యాస మనబడే గొప్ప ద్వయమంత్రం మంగళకరమైనది, సంసారబంధాన్ని తొలగించేది) అని వచించారు. ద్వయానుసంధానం గురుపరంపరానుసంధానపూర్వకంగా చేయాలన్న విషయం ఉదాహృతసూక్తిలోని **"జప్త్వా గురుపరంపరామ్"** అనే ప్రయోగంవల్ల ఏర్పడుతున్నది.

యతులు వైష్ణవులకు మంత్రం ఉపదేశించడం విశేషశాస్త్రసిద్ధం. దీనికి శాండిల్యస్మృతిలోని **"బ్రహ్మచారీ గృహస్థ శ్చ వానప్రస్థో యతి స్తథా, కృపయా శ్రమిణ స్సర్వే ధర్మం బ్రూయు స్త్వలింగినే, గృహస్థో వా పి సర్వేభ్యో ధర్మం బ్రూయా న్మహామతిః"** బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సన్న్యాసి అనే అన్ని ఆశ్రమాలకు చెందినవారందఱు ధర్మాని బోధించవచ్చు. గృహస్థుడు, సన్న్యాసి మాత్రం ఎవరికైనా బోధించవచ్చు) అనే వచనం ఒక ప్రమాణం. ఈ విషయం **"అనుకంపాపరీవాహైః"** అనే ప్రయోగంవల్ల ధ్వనిస్తున్నది. **"అభిషేచనపూర్వకం దివ్యం పదద్వయం దత్వా మంత్రరత్నం ప్రయచ్ఛంతమ్"** అనే ప్రయోగస్వారస్యంవల్ల సమాసోక్తిప్రక్రియలో స్నానమాల్య ఆభరణ ప్రదానశైలి ధ్వనిస్తున్నది.



**"దీర్ఘం ప్రణమతః"** అనే సూక్తికి అనుగుణంగా **"నమస్కృత్య గురుం దీర్ఘం ప్రణామై స్త్రిభి రాదృతః, తత్పాదౌ గృహ్య మూర్ధ్ని స్వే నిధాయ వినయాన్వితః, గృహ్ణీయా న్మంత్రరాజానం మాం గచ్ఛే చ్ఛరణం నరః"** (గురువుకు చిరకాలం మూడు మార్లు నమస్కరించి, ఆ ఆచార్యుని పాదాలను వినయంతో గ్రహించి తన శిరస్సుపై పెట్టుకొని మంత్రరాజ మనబడే అష్టాక్షరిని గ్రహించి, నన్ను శరణు పొందాలి) అని అంటూ మంత్రాంతరమైన అష్టాక్షరివిషయంలో చెప్పబడ్డ దీర్ఘప్రణామ నియమం ఇక్కడ అతిదేశంద్వారా అన్వయించుకోవాలి. **"దీర్ఘం ప్రణమతః"** అనే సూక్తిలోని ఏకవచనప్రయోగంవల్ల ఒకేసారి నమస్కరిస్తే చాలుననే స్వారస్యం స్ఫురిస్తున్నది. దీనికిమూలంగా విష్ణుధర్మంలోని **"ఏకోఽపి కృష్ణస్య సకృత్ప్రణామః"** (కృష్ణునకు చేసిన ప్రణామం ఒక్కసారి అయినా అది మోక్షానికి కారణమౌతుంది) అనే సూక్తిని అన్వయపరంగా, **"యే ప్రణామాం స్తు సుబహూన్ కారయంత్య విచక్షణాః"** (విచక్షణా జ్ఞానం లేకుండా పలు నమస్కారాలను చేసేవారు) అనే సూక్తిని వ్యతిరేకంగాను అన్వయించుకోవచ్చు.

ద్వయోచ్చారణలో ఋషి, దేవతాదులనుగూర్చి అనుసంధించవలసిన అవసరం లేదు. **"వినాపి న్యాసముద్రార్థతత్వర్షిచ్ఛందదైవతమ్, ఉచ్చారణే మనో రస్య సర్వసిద్ధిఫలం భవేత్"** (న్యాసముద్రాదులకోసం చేసే ఋషి, ఛందస్సు, దేవతల ఉచ్చారణ ద్వయమంత్రాను సంధానంలో అవసరం లేదు. ఆ రీతిలో ఉచ్చరించే ఈ మంత్రంవల్ల సకలసిద్ధులు కలుగుతాయి) అని పరాశరస్మృతి తెలుపుతున్నది. **"నమోఽంతం మంత్రరత్నం చ జపేయు ర్వైష్ణవా స్సదా, ఋష్యాదీం శ్చ కరన్యాస మంగన్యాసం చ వర్జయేత్, నారీ వా వృషలో వా పి గురువందన పూర్వకమ్, స్త్రీణాం చ సర్వవర్ణానాం పురుషాణాం తథా విదుః, ఏవం ధ్యాత్వా ద్విజశ్రేష్ఠో ద్వయం నిత్య మతంద్రితః, శ్రీమన్నారాయణం ధ్యాత్వా జపే త్తం పురుషోత్తమమ్"** (వైష్ణవులు నమశ్శబ్దంతో పూర్తి అయే ద్వయమంత్రాన్ని సదా జపించాలి. ఆ జపంలో ఋషి,అంగన్యాస, కరన్యాసాల ఉచ్చారణ అవసరం లేదు. స్త్రీలు కాని, శూద్రులు కాని గురుపరంపరానుసంధానపూర్వకంగా ద్వయాన్ని జపించాలి. అన్ని వర్ణాలకు చెందిన స్త్రీలకు, పురుషులకు కూడా ఇదే క్రమం. ఈ విధంగా ద్విజశ్రేష్ఠుడు

ద్వయాన్ని శ్రద్ధగా ధ్యానించి ఆ పురుషోత్తముని జపించాలి) అనే ప్రమాణాంతరం కూడా స్మరణీయం.

శ్రీవైష్ణవులు అనుష్ఠింపవలసిన అభిగమన, ఉపాదాన, ఇజ్య– స్వాధ్యాయ– యోగాలు అనే అయిదు అంగాలలో భగవానునకు సమర్పించవలసిన ద్రవ్యాలను సేకరించడం అనే ఉపాదానాన్ని, ఈ శ్లోకంలో వరవరమునులు ద్వయోపదేశం చేయడంద్వారా ఈ స్తుతికర్త అయిన ఎఱుమ్బియప్పాను శిష్యులుగా పరిగ్రహించి, వారిని భగవానునకు దాసులుగా సమర్పింపవలసిన చేతనద్రవ్యంగా సేకరించడం స్పష్టంగా తెలుపబడినందువల్ల, అనుష్ఠింపబడినట్లయింది. భరద్వాజపరిశిష్టమనే గ్రంథంలోకూడా **"అన్యేషాం చైవ భోగానాం చేతనాచేతనాత్మనామ్, నిష్పాదనం రక్షణం చ సంస్క్రియోపనయాది చ, భక్త్యా చ నియతా సాంగా స్వయ మారాధన క్రియా, ఇత్యేతత్ సకలం కాండస్కంధశాఖాదళాంకురమ్"** (చేతనాచేతనరూపాలైన భగవద్భోగ్య వస్తువులను సంపాదించడం, వాటిని రక్షించడం, సంస్కరించడం, భగవానుని సమీపానికి తీసికొని రావడం, భక్తితో, విధిప్రకారంగా, సాంగంగా స్వయంగా ఆరాధించడం – ఇవన్నీ మొదలు, పెద్దకొమ్మ, రెమ్మ,దళం, అంకురం (చిగురు) వంటివి) అని చెప్పబడింది.

**22. తత స్సార్ధం వినిర్గత్య భృత్యై ర్నిత్యానపాయిభిః ।**
**శ్రీరంగమంగళం ద్రష్టుం పురుషం భుజగేశయమ్ ॥**

తతః=ద్వయోపదేశాన్ని చేసిన తరువాత, శ్రీరంగమంగళమ్=శ్రీరంగదివ్యక్షేత్రానికి అలంకారభూతుడై, భుజగేశయం=ఆదిశేషునిపై పవళించి ఉన్న, పురుషం=అన్ని మనోరథాలను తీర్చే శ్రీరంగనాథుణ్ణి, ద్రష్టుం=దర్శించడం కోసం, నిత్యానపాయిభిః =క్షణకాలం కూడా విశ్లేషాన్ని సహించకుండా ఎల్లప్పుడూ వెంట ఉండే, భృత్యైః సార్ధం=కోయిలణ్ణన్ మొదలైన అంతరంగశిష్యులతో, వినిర్గత్య= మఠంనుండి బయలుదేరి (తరువాతి శ్లోకంలో అన్వయం)

ద్వయోపదేశానంతరం ఆదిశేషునిపై పరుండి ఉన్నవాడు, శ్రీరంగక్షేత్రానికి ఆభరణం వంటివాడు అయిన శ్రీరంగనాథుణ్ణి సేవించడం కోసం తమ అంతరంగ శిష్యులైన కోయిలణ్ణన్ మొదలైనవారితో కలిసి వరవరమునులు శ్రీరంగాలయానికి వేంచేశారు.



**(తతః)** – ద్వయోపదేశం చేసిన తరువాత – అని భావం.

**(శ్రీరంగమంగళమ్)** – **"శ్రీ రిత్యభేదేన వా"** అనే రీతిలో సహజంగానే గొప్పతనాన్ని కల్గిన వస్తువును శ్రీశబ్దపూర్వకంగా నిర్దేశించడం లోకంలో అలవాటు. శ్రీశబ్దం ఇక్కడ శ్రీరంగనగరానికి విశేషణం. శ్రీ అయిన రంగం – అని అర్థం. శ్రీరంగనాథుడు శయనించి ఉన్నందున శ్రీరంగానికి వైశిష్ట్యం కలుగలేదు. మఱి దేనివల్ల కలిగింది? అని అంటే, శ్రీరంగనాథుడు తనకు అపూర్వమైన గొప్పతనం కలగాలని తలచి, దానికి తగినచోటు కోసం తనకు వెదుకుతూ వచ్చి చేరిన చోటు, అనువైన, సహజమైన గొప్పతనాన్ని కల్గిన చోటు ఈ శ్రీరంగం అయినందువల్ల కల్గింది. **"క్షీరాబ్ధే ర్మండలా ద్భానోః యోగినాం హృదయా దపి, రతిం గతో హరి స్తస్మా ద్రంగ మిత్యభిధీయతే"** (భగవానుడు క్షీరాబ్ధికంటె, సూర్యమండలంలో కంటె, యోగుల హృదయపుండరీ కాలలో కంటె అధికమైన ఆదరాన్ని పొందిన క్షేత్రం కాబట్టి రంగమని పిలువబడు తున్నది) ఇత్యాదిగా చెప్పబడే రంగశబ్దవ్యుత్పత్తి ఈ సందర్భంలో యథావకాశం స్మరణీయం. ఈ అర్థం భగవానుని అభిప్రాయానుసారం చెప్పబడింది. శ్రీరంగనగరం యొక్క అతిశయం వేఱొకరిపై ఆధారపడినది కానట్లే, ఆ నగరంయొక్క సంపద కూడా వేఱొకరిపై ఆధారపడి లేదు. అందువల్ల **"శ్రీరంగమ్"** అని అంటూ నిర్దేశింపబడిందని వీరరాఘవాచార్య వ్యాఖ్య. ఇక, కవి అభిప్రాయానుసారంగా ప్రయోగింపబడ్డ **"శ్రీరంగమంగళమ్"** అనే విశేషణం శ్రీరంగనగరానికికూడా అలంకారం వంటివాడు, శోభను కల్గించేవాడు స్వామి అనే అర్థాన్ని ఇస్తుంది. ఈ రెండు అర్థాలవల్ల **"మణినా వలయం వలయేన మణిః"** (కంకణం మణివల్ల, మణి కంకణంవల్ల ప్రకాశిస్తున్నాయి) అన్నరీతిలో శ్రీరంగానికి స్వామివల్ల, స్వామికి శ్రీరంగం వల్ల అతిశయం ఏర్పడిందనే అర్థవిశేషం ద్యోతితమవుతుంది. అందువల్ల **"అన్యోన్యం నామ యత్రస్యా దుపకారః పరస్పరమ్"** అని నిర్వచింపబడ్డ అన్యోన్యాలంకారం వ్యంగ్యం.

**(పురుషమ్)** – **"సర్వకారణభూతం, సర్వాంతర్యామిణం, సర్వాపేక్షితప్రదం భగవంతమ్"** (సర్వకారణమైనవాడు, అపేక్షితాలను అన్నిటిని ఇచ్చేవాడు. అయినా భగవంతున్ని) అని వాధూలవీరరాఘవాచార్య వ్యాఖ్య. **"పురతి ఇతి పురుషః"** అనే పురుషశబ్ద వ్యుత్పత్తి **"పుర–అగ్రగమనే"** అనే ధాతువునుబట్టి చేయబడింది. దీనివల్ల లోకసృష్టికిముందే స్వామి ఉన్నాడనే అర్థం ఏర్పడడంవల్ల ఈ పదం భగవానుని

సర్వకారణత్వాన్ని తెలుపుతున్నది. **"పురి శేతే ఇతి పురుషః"** అనే ఇంకొక వ్యుత్పత్తి భగవానుడు జీవాత్మల శరీరాల్లో సహజంగానే ఆశ్రయించి ఉంటాడని తెలుప బడడంచేత, సర్వాంతర్యామిత్వం వ్యక్తమవుతున్నది. **"పురు అధికం సనోతి దదాతి ఇతి పురుషః"** అనే మఱి ఒక వ్యుత్పత్తివల్ల భక్తుల కోరిన దానికంటె అధికంగా మనోరథాలను అనుగ్రహించేవాడనే అర్థం ఏర్పడుతున్నది. కాబట్టి భగవానుని సర్వాపేక్షితప్రదత్వం సూచితమైనది. ప్రార్థించిన ఫలాలను అనుగ్రహించడమే కాక, **"ఎనక్కే తన్నై త్తన్ద కల్పకమ్"** (నాకు తనను దానం చేసికొన్న గొప్ప కల్పవృక్షం) అని కీర్తించే రీతిలో తనను సైతం ఒక ఫలంగా అనుగ్రహించే మహోదారుడనే పరమార్థం ఈ సందర్భంలో ధ్వనిస్తుంది. ఈ మూడు వ్యుత్పత్తులేకాక, **"పూరయతి ఇతి పురుషః, పురీ–ఆప్యాయనే"** అనే ఇంకొక. వ్యుత్పత్తి కూడా పై అర్థాన్నే బలపఱుస్తున్నది. ఈ మూడు అర్థాలు శ్రీరంగనాథుని విషయంలో అర్థవంతాలు. ఆదిశేషునిపైన పరుండి ఉండడాన్ని–అంటే –శేషశాయిత్వాన్ని పరమాత్మ అసాధారణలక్షణంగా పెద్దలు వచించారు. అందువల్ల **"భుజగేశయమ్, అత ఏవ పురుషమ్"** అని అన్వయించి అనంతశాయిత్వం పైన వివరించిన పురుషత్వానికి కారణమనికూడా చమత్కరించవచ్చు.

**(నిత్యానపాయిభిః)** – ఇచట **'ఇని'** ప్రత్యయంవల్ల వరవరమునులను క్షణంకూడా విడచి ఉండలేని కోయిలణ్ణన్‌వంటి అంతరంగశిష్యుల అతిశయితభక్తి సూచింప బడింది. వీరి అంతరంగవృత్తిలోని అతిశయం ఏమంటే – **"ఛాయా వా సత్త్వ మనుగచ్ఛేత్"** (జీవుడు పరమాత్మను, నీడ దానికి మూలమైన వస్తువునువలె, అనుసరించాలి) అని చెప్పబడిన రీతిలో లోకంలోని ఛాయకంటే ఎక్కువ గొప్పతనాన్ని కల్గి ఉండడమే. ఆ ఛాయ రాత్రివేళలో కన్పించదు. కాని, వీరు అపుడుకూడా అనుసరిస్తారు అన్నదే వీరి అతిశయం. దీనివల్ల వీరి అత్యంతభక్తి చెప్పబడింది. **"ద్రష్టుమ్"** అనే క్రియ **"వినిర్గత్య"** అనే ల్యబంతక్రియతో అన్వయిస్తుంది.

**(భృత్యైః సార్ధమ్)**– **"ఎమ్మై విక్కవుమ్ పెఱువార్‌కళే"** (భాగవతులు మమ్ములను అమ్మడానికి కూడా సమర్థులే) అని, **"క్రయవిక్రయార్హా...సమింధతే"** అన్నరీతిలో క్రయ, విక్రయాలకు తగిన అత్యంతపారతంత్ర్యాన్ని కల్గిన వరదనారాయణగురువు మొదలైనవారితో – అని అర్థం. ఈ సందర్భంలో కూడా **"యతీంద్రచరణద్వంద్వ ప్రవణేనైవ చేతసా"** (శ్రీరామానుజుల రెండు పాదాల పట్ల గొప్ప భక్తిని కలిగిన



మనస్సుతో) అనే ప్రయోగాన్ని అన్వయించుకోవాలి. దీనివల్ల శ్రీరంగమంగళ రూపుడై, పురుషశబ్దవాచ్యుడై, భుజగశయనుడై ఉన్న శ్రీరంగనాథుని మణవాళమహాముని సేవించడం భగవద్రామానుజుల మనస్తృప్తి కోసమే తప్ప, వేఱే ఏ ఫలాన్ని ఆశించి కాదు – అని వ్యక్తమవుతుంది. ఈ విషయాన్ని ప్రస్తుతస్తుతికర్త వరవరముని కావ్యంలో **"సర్వం యతిపతే రేవ కుర్వ న్నాదేశపూర్వకమ్"** (సమస్తం యతిపతి ఆజ్ఞతో నిర్వహిస్తూ...) అని ప్రారంభించి, **"తత స్తస్య ముఖోల్లాసం చికీర్షన్నేవ కేవలమ్, నిర్జగామ జగద్ధామ నిద్రాణం ద్రష్టు మచ్యుతమ్"** (తరువాత ఆ రామానుజులకు ముఖోల్లసాన్ని కలిగించగోరినవారై, ఆదిశేషునిపై సేవించే రంగనాథుని సేవించడం కోసం బయలుదేరి వెళ్ళారు) అని ప్రస్తావించారు. **"నిత్యానపాయిభిః"** అని అంటూ ఇచట ప్రస్తావించిన విషయాన్నికూడా ఆ కావ్యంలో **"గచ్ఛంత మన్వగచ్ఛం స్తం గరీయాంసం గుణై శ్శుభైః, తదీయా స్తత్పదద్వంద్వచ్ఛాయా దాయాదవృత్తయః"** (కల్యాణగుణాలతో కూడినవారు కావడం చేత గొప్పవారైన వరవరమునులను వారి శిష్యులు వారి పదద్వంద్వాల ఛాయతో దాయాద వృత్తిని కల్గినవారై – అంటే – వారి పదాలను ఆ పాదాల నీడ ఎల్లప్పుడూ అనుసరించినట్లే, తాము అనుసరిస్తూ – వెంబడించారు) అని కొనియాడారు. భృత్యుల ఛాయాసామ్యం వల్ల, వస్తువు నీడను విడచి ఉండడానికి వీలులేనట్లే, ఆ నీడవంటివారైన శిష్యుల సహవాసం, సహగమనం వరవరమునులకు దోషం కాదని ధ్వనిస్తుంది.

**"ఏకో భిక్షుః యథోక్త స్తు తా వేవ మిథునం స్మృతమ్, త్రయో గ్రామా స్సమాఖ్యాతా ఊర్ధ్వం తు నగరం యతేః, నగరం తు న కర్తవ్యం, గ్రామో వా మిథునం తు వా, ఏతత్త్రయం ప్రకుర్వాణః స్వధర్మా చ్చ్యవతే యతిః"** (యతి ఒంటరిగానే ఉండాలి. ఇద్దరు కలిస్తే మిథునం అని, ముగ్గురు కూడితే గ్రామమని, అంతకంటే ఎక్కువ అయితే నగరమని పేరు. నగరాన్ని గాని, గ్రామాన్ని గాని, మిథునాన్ని గాని యతి తన దగ్గరకు చేర్చకూడదు. ఈ మూడింటిని చేర్చే యతి తన ధర్మంనుండి భ్రష్టుడవుతాడు) అని చెప్పబడ్డ నిషేధం **"స్నేహపైశున్యమాత్సర్యం సన్నికర్షా ద్భవిష్యతి"** (ప్రేమకు, మోసం, అసూయ–అనేవి దగ్గఱగా ఉండడంవల్ల ఏర్పడతాయి) అనే వాక్యశేషాన్నిబట్టి, అటువంటి దోషాలకు కారణం అయేవారితో కలసి ఉండకూడనే భావాన్ని తెలిపేది తప్ప, **"బోధయంతః పరస్పరమ్"** (పరస్పరం తెలుపుకుంటూ) అని అన్నట్లు భగవద్గుణానుభవంలో కాలం గడిపే మహనీయుల సహవాస,

సహగమనాలను నిషేధించేది కాదని తెలియాలి. **"ప్రభుం భక్తపరాధీనం నిత్య మాలోకయే ద్ధరిమ్, విమాన మథ వా తస్య దూరా ద్గోపుర మేవ వా"** (సర్వనియంత, భక్తపరాధీనుడు అయిన హరిని నిత్యం దర్శించాలి. లేకపోతే కనీసం దూరంనుండి అయినా ఆలయ విమానాన్నిగాని, గోపురాన్నిగాని దర్శించాలి) అనే భరద్వాజసంహితలోని సూక్తి, అవకాశం ఉన్నపుడు అంతా భగవదాలయగమనం, తాను ఇంట్లోను ఆరాధించే భగవానుని అభిగమనంకంటే వేఱుగా చేయాలి–అని తెలుపుతున్నది. ఈ అర్థం ప్రకృతంలో **"తతః సార్ధం వినిర్గత్య"** అనే ప్రయోగంద్వారా తెలుపబడింది. భగవదాలయానికి సమీపంలో తీర్థం ఉన్నట్లయితే, తీర్థంలో స్నానమాడి, తన ఇంటిలోని అర్చామూర్తికి ఆరాధన చేయడానికి ముందుగానే, ఆలయానికి వెళ్ళాలి – అనే విధి కూడా ఉన్నది.

**23. మహతి శ్రీమతి ద్వారే గోపురం చతురాననమ్ ।**
**ప్రణిపత్య శనై రంతః ప్రవిశంతం భజామి తమ్ ॥**

శ్రీమతి**=** సకలైశ్వర్యాలతో నిండినదై, మహతి**=**విశాలమైన చోటును కల్గినదై, ద్వారే **= "నామ్మకన్ కోట్టై వాశల్"** అనే పేరును కల్గిన సన్నిధి ద్వారంలో, చతురా ననమ్ **=** చతుర్ముఖమనే పేరు కల, గోపురమ్**=**గోపురానికి, ప్రణిపత్య **=** మనోవాక్కాయాలతో దండం సమర్పించి, శనైః**=** మెల్లగా (ఆ గోపురం అందాన్ని దర్శించే కన్నులను దానినుండి అతికష్టం మీద నివర్తింపజేసి), అంతః **=**సన్నిధి లోపలకు, ప్రవిశంతమ్ **=** ప్రవేశిస్తున్న, తమ్ **=**ఆ వరవరమునులను, భజామి **=**సేవిస్తున్నాను.

సకలైశ్వర్యాలతో నిండినది, చాలా వైశాల్యాన్ని కల్గినది, **"నామ్మకన్ కోట్టైవాశల్"** అనే పేరును కల్గినది అయిన శ్రీరంగాలయద్వారంలో, చతుర్ముఖసంజ్ఞకమైన గోపురాన్ని త్రికరణాలతో నమస్కరించి, మెల్లగా ఆ గోపురసౌందర్యంనుండి తమ దృష్టిని మరలించి, సన్నిధిలోపలకు ప్రవేశించే వరవరమునులను సేవిస్తున్నాను.

**(మహతి శ్రీమతి)** – ఈ రెండు **"నామ్మకన్ కోట్టైవాశల్"** అనే పేరుతో ప్రసిద్ధమైన ఆలయ ద్వారానికి విశేషణపదాలు. బ్రహ్మాదులుసైతం ఈ వాకిటిలో ప్రవేశించి నంతమాత్రాన సకలైశ్వర్యాలను పొందడానికి తగిన ఐశ్వర్యంతో నిండినది అనే



అర్థం రెండవ విశేషణంవల్ల, శ్రీరంగనాథుడు తన దాసవర్గం అంతటితో ప్రవేశించినా నిండనంతటి గొప్పవైశాల్యాన్ని కల్గి ఉన్నదనే అర్థం మొదటి విశేషణంవల్ల స్ఫురిస్తాయి. మొదటి విశేషణానికి అనుగుణంగా భట్టర్ రచించిన శ్రీరంగరాజస్తవం పూర్వశతకంలోని **"సర్వాత్మసాధారణనాథగోష్ఠీపూరేఽ పి దుష్పూరమహావకాశమ్"** (అందరికీ నాథుడైన శ్రీరంగనాథుని భక్తులందరూ చేరినా, ఇంకా నిండని గొప్ప చోటును కలిగినది) అనే సూక్తి స్మరణీయం.

**(చతురాననమ్ గోపురమ్)** – ఈ గోపురం **"నామ్మకన్ కోపురమ్"** అనే పేరుతో పిలువబడుతున్నది. ఇచటి గోపురశబ్దం ఆ గోపురం పైన ఉన్న విమానాన్ని లక్షిస్తుంది.

**(ప్రణిపత్య)** – వరవరమునికావ్యంలోకూడా ఎఱుమ్బియప్పా ఈ విషయాన్ని **"శ్రీమద్ద్వారం మహ త్ప్రాప్య నామ ధ్యాయ న్నమస్యయా"** అని ప్రస్తావించారు.

**(శనైః ప్రవిశంతమ్) "పొన్నియలు మాడ క్కవాడమ్ కడన్దు పుక్కు"** (బంగారం వలె మెరిసే కవాటంలోని అందంనుండి అతి కష్టంపై చూపులను తిప్పుకొని దాటి వచ్చి) అన్న రీతిలో ఆ గోపుర కనకవాటాల అందంచేత కబళింపబడ్డ నేత్రాలను ఏదోవిధంగా దాని నుండి మరల్చి అని భావం.

**(తమ్ భజామి)** ఆవిధమైన పారవశ్యంతో గోపురాన్ని సేవించే వరవరమునులను నేను అత్యంత పారవశ్యంతో సేవిస్తున్నాను–అని భావం. భగవదాలయ గోపుర సౌందర్యాతిశయం గొప్పదే కావచ్చు. కాని, కవి మనస్సును ఆకర్షించినది ఆ అందం కాదు. అత్యంతాదరంతో సేవించే వరవరమునుల ఆనందమే వీరి మనస్సును వశీకరించుకొన్నదని ఇచటి తాత్పర్యం. భరద్వాజసంహితలోకూడా **"ఉపేత్యాయతనం విష్ణోః ప్రణిపత్య తత స్తతః, పరీత్య దేవదేవేశం ప్రణమ్యాత్మాన మర్పయేత్"** (విష్ణువు ఆలయాన్ని చేరి అక్కడ ఉన్న ఆయా గోపురమండపాదులకు నమస్కరించి, దేవదేవుణ్ణి ప్రదక్షిణం చేసి శరణాగతిని చేయాలి) అని ఉన్నది. ఈ సూక్తిలోని **"తత స్తతః ప్రణిపత్య"** అనే ప్రయోగం విమానమండపాదులను ఆర్తితో దర్శిస్తూ పోవాలనే విషయం తెలియజేస్తున్నది. భట్టర్ ఐతిహ్యం ప్రకృత శ్లోకంలోని **"ప్రణిపత్య"** అనే ప్రయోగం ఉదాహరింపబడ్డ భరద్వాజసంహితాప్రమాణాన్ని స్మరింపజేయడంకోసం చేయబడింది. **"చతురాననామానం సమేత్యానమ్య గోపురమ్"** అనే యతిపతిదిన చర్యాసూక్తి ప్రకృతంలో స్మరణీయం.

**24. దేవీ గోదా యతిపతిశఠద్వేషిణౌ రంగశృంగమ్**
**సేనానాథో విహగవృషభ శ్శ్రీనిధి స్సింధుకన్యా ।**
**భూమానీళాగురుజనవృతః పూరుష శ్చేత్యమీషా**
**మగ్రే నిత్యం వరవరమునే రంఘ్రియుగ్మం ప్రపద్యే ॥**

దేవీ =అయోనిజగా అవతరించినందువల్ల ఏర్పడిన అప్రాకృతమైన శోభను కల్గిన, గోదా =గోదాదేవి, యతిపతిశఠద్వేషిణౌ =భగవద్రామానుజులు, నమ్మాళ్వార్లు, రంగశృంగం =శ్రీరంగవిమానం, సేనానాథః =విష్వక్సేనులు, విహగవృషభః =గరుత్మంతుడు, (పెరియ తిరువడి), శ్రీనిధిః =మహాలక్ష్మికి నిధివంటి శ్రీరంగనాథుడు, సింధుకన్యా= లక్ష్మీదేవి, భూమానీళాగురుజనవృతః= భూదేవి, నీళాదేవి, నమ్మాళ్వార్లు–మొదలైన ఆచార్యవర్గంతో పరివేష్ఠితమైన, పూరుషః= పరమపదనాథుడు, ఇతి అమీషామ్ అగ్రే= అనే వీరి సమక్షంలో, వరవరమునేః = స్వాచార్యులైన శ్రీవరవరమునుల, అంఘ్రియుగ్మం =శ్రీపాదద్వయికి, నిత్యం =ప్రతిదినం, ప్రపద్యే =దండం సమర్పిస్తున్నాను. (ఈ శ్లోకంలో శ్రీరంగలయంలో మణవాళ మహామునులు మంగళాశాసనంచేసిన క్రమం తెలుపబడింది)

ఈ శ్లోకం ఎఱుమ్బియప్పా ప్రణీతమైన వరవరముని శతకంలోనిది సందర్భానుసారంగా ఈ స్తుతిలో కూర్చబడింది.

**(దేవీ)** గోదాదేవి తులసీవనంలో అవతరించినందువల్ల అంతర్హితం కాని, దివ్యమైన తేజస్సును కల్గినది – అని అర్థం.

**(రంగశృంగమ్)** పర్వతాగ్రాన్ని చెప్పే ఈ శృంగశబ్దంచేత పర్వతశిఖరంవలె ఉన్నతంగా, స్థిరంగా, విశాలంగా ఉన్న శ్రీరంగవిమానం తెలుపబడుతున్నది.

**(గురుజనవృతః) – "పరాంకుశాద్యాః ప్రథమే పుమాంసః"** (నమ్మాళ్వార్లు మొదలైన మహనీయులైన పురుషులు) అని స్తుతింపబడే నమ్మాళ్వార్లు మొదలైన దివ్యసూరులు అని అర్థం.

శ్రీమణవాళమహామునులు **"నాన్ముకన్ కోట్టైవాశల్"** అని పిలువబడే గోపురద్వారం ద్వారా శ్రీరంగాలయంలోపల ప్రదక్షిణంగా వేంచేసేటపుడు క్రమంగా గోదాదేవి, భగవద్రామానుజులు, నమ్మాళ్వార్లు, శ్రీరంగవిమానం, విష్వక్సేనులు,



గరుడాళ్వార్లు, శ్రీరంగనాథుడు, శ్రీరంగనాయకీదేవి – అనే వీరిని, తరువాత పరమపద నాథుని సన్నిధిలో వేంచేసి ఉండే, శ్రీభూనీళాదేవి సహితుడైన పరమపదనాథుని సేవించి వచ్చేటపుడు, ఒక్కొక్క సన్నిధివాకిలిలోను తాము వారిని సేవించడం కాక, వరవరమునులనే సేవిస్తున్నట్లు ఎఱుమ్బియప్పా ఈ శ్లోకంలో తెలియజేశారు. ఎందువల్ల ఎఱుమ్బియప్పా గోదాదేవ్యాదులను సేవించినట్లు చెప్పకుండా, తమ ఆచార్యులైన వరవరమునులకు ఇష్టమైనవారనే అభిప్రాయంతోనే సేవించారు కాబట్టి, ఆవిధంగా ఎఱుమ్బియప్పా తాము గోదాదేవి మొదలైన వారిని సేవించడాన్నిగూర్చి ఇచట ప్రస్తావించలేదు. ఎఱుమ్బియప్పా తమకు రుచించినవారని సేవించేది తమ ఆచార్యులైన ఒక్క వరవరమునులను మాత్రమే. తాము ఆచార్య పరతంత్రులమనే విషయం దీనిద్వారా కవి వ్యక్తం చేశారు.

ఈ శ్లోకంలో చెప్పిన రీతిలో వరవరమునులు సేవిస్తూ వేంచేసినపుడు ప్రదక్షిణం చేసినట్లుగా సిద్ధించడం చేత **"పరీత్య దేవదేవేశమ్"** అంటూ గతశ్లోకవ్యాఖ్యలో ఉట్టంకింపబడ్డ భరద్వాజసంహితావచనక్రమం అనుష్ఠించి నట్లయింది. **"దేవీ గోదా.....విహగవృషభః"** అని, **"గురుజనవృతః"** అని శ్లోకంలో చెప్పబడిన క్రమం **"పరీవారాం శ్చ సేవేత భక్త్యా పరమయా హరేః, తత్తదర్చాగతాన్ భక్తాన్ గుర్వాదీం శ్చ విశేషతః"** (భగవానునియొక్క పరివారాన్ని మిక్కిలి భక్తితో సేవించాలి. ఆయా అర్చామూర్తుల రూపంలో ఉన్న భక్తులను, ఆచార్యులను విశేషమైన భక్తితో సేవించాలి) అనే భారద్వాజసంహితావచనాన్నిబట్టి అనుగ్రహింప బడింది. భూదేవీ అవతారం అయిన గోదాదేవి భక్తవర్గంలోను, దివ్యసూరులలోను కూడా అంతర్భవించడం విశేషం. భూదేవి స్వయంగా భగవానునితో **"అహం శిష్యా చ దాసీ చ భక్తా చ పురుషోత్తమ"** (పురుషోత్తమా! నేను శిష్యురాలను, దాసిని, భక్తురాలను కూడా) అని అన్నది కదా!

కోవెలలో భగవానుని తప్ప వేరెవ్వరికి నమస్కరించకూడదనే నియమానికి విరుద్ధంగా స్తుతికర్త తాను గోదాదేవ్యాది అర్చామూర్తుల ఆలయాల్లో వరవరమును లను సేవించినట్లు చెప్పడం ఏవిధంగా తగినది? అనే ప్రశ్నను **"అగ్రే"** అనే పదానికి సమక్షంలో – అని కాక, ఆలయానికి వెళ్ళడానికి పూర్వమే అనే అర్థాన్ని చెప్పి సమాధానించవచ్చునని శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారి సమన్వయం.

**25. మంగళాశాసనం కృత్వా తత్ర తత్ర యథోచితమ్ ।**
**ధామ్న స్తస్మా ద్వినిష్క్రమ్య ప్రవిశ్య స్వం నికేతనమ్ ॥**

తత్ర తత్ర= గోదాదేవి మొదలుగా పరమపదనాథుని వరకుగల ఆయా అర్చామూర్తులకు, మంగళాశాసనమ్ = ఉన్న కొఱతలు తీరి, మఱింతగా, నిరవధికంగా మంగళం కలగాలని ప్రేమాంధ్యంచేత చేసే ప్రార్థనను, యథోచితమ్ = ఆయా మూర్తులపట్ల తమకున్న ప్రేమకు తగినట్లుగా, (లేక, ఆయా మూర్తులకు తగినట్లుగా) కృత్వా = చేసి, తస్మాత్ ధామ్నః= ఆ సన్నిధి నుండి, వినిష్క్రమ్య= బయలుదేరి, స్వం నికేతనమ్= (శ్రీరంగనాథుని ఆజ్ఞవల్ల లభించినందున లోకంలో తనదిగా చెప్పబడే తమ మఠానికి, ప్రవిశ్య = వేంచేసి (తర్వాతి శ్లోకంతో అన్వయం).

గత శ్లోకంలో **"దేవీ గోదా"** అంటూ తెలిపిన క్రమంలో ఆయా సన్నిధులలో తమ ప్రేమకు తగిన రీతిలో మంగళాశాసనాన్ని చేసి, సన్నిధినుండి బయలుదేరి, తిరిగి తమ మఠానికి వరవరమునులు చేరారు.

మణవాళమహాములు ఆణ్డాళ్ మొదలైన అర్చామూర్తుల సన్నిధులకు వేంచేయడం వారిని సేవించి, తాము ఏదో ఒక ఫలాన్ని పొందాలనే ఉద్దేశ్యంతో కాకుండా, వారికి మంగళాశాసనం చేయడం కోసమే కాబట్టి వారిని సేవించి–అని అనకుండా, వారికి మంగళాశాసనం చేసి–అని స్తుతికర్త అన్నారు. మంగళాశాసనం చేయడం ముఖ్యంగా భగవద్రామానుజులకే కాబట్టి, వారి సంతోషం కోసమే మిగిలినవారికి మంగళాశాసనం చేయడంవల్ల, మంగళాశాసనం చేయడంలోని తారతమ్యాలను దృష్టిలో పెట్టుకొని **"యథోచితమ్"** అని అన్నారు.

భగవానుడు సమస్తకల్యాణగుణాకరుడు, అవాప్తసమస్తకాముడు, జ్ఞానానందమయుడు అయినా, ఆ స్వామికి మంగళాశాసనం చేయడం ప్రపన్ననకు కర్తవ్యం, స్వరూపానురూపం అనే విషయాన్ని గూర్చిన సాంప్రదాయికమైన వివరణాలు, ప్రమాణాలు పూర్వాచార్యసూక్తులలో, శ్రీవచనభూషణాది రహస్యగ్రంథాలలో, వాటి వ్యాఖ్యలలో అనుసంధేయాలు. **"జితమ్"** అనే పదం మంగళాశాసనార్థంలో పర్యవసిస్తుందన్న అంశాన్ని పూర్వాచార్యసూక్తులద్వారా (జితంతేస్తోత్రవ్యాఖ్య) తెలియాలి.



యతులకు సొంత నివాసం అనేది ఉండకూడదని శాస్త్రనియమం కదా! **"స్వం నికేతనమ్"** అనే ప్రయోగం ఏవిధంగా అర్థవంతం? అనే ప్రశ్న – భగవన్నిదేశం వల్ల స్వీయనివాసాన్ని కల్గి ఉండడం దోషం కాదు. **"అనగ్ని రనికేత స్స్యాత్"** (యతి స్వీయాగ్నిని, స్వీయగృహాన్ని కల్గి ఉండరాదు) అనే నియమం భగవానుని ఆదేశంవంటి విశేషకారణం లేనివారి విషయంలోనే ఈ నిషేధం వర్తిస్తుంది – అని వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్యలో సమాధానింపబడింది. **"ధామ్న స్తస్మా ద్వినిష్క్రమ్య"** అనే ప్రయోగం వరవరమునులు భగవానుని విశ్లేషాన్ని సహించలేక, అతికష్టంపైన ఆలయాన్ని వీడి వచ్చారు అనే అర్థాన్ని ధ్వనింపజేస్తుంది. **"ప్రీతిసంహృష్టసర్వాంగః స్తుత్వా చాభివిలోకయన్"** (ఆనందంతో పరవశించిన అన్ని అంగాలను కలవాడై స్తుతించి, అంతటా దర్శించేవాడై) అనే భరద్వాజసూక్తి స్మరణీయం. ఈ శ్లోకంలోని పూర్వార్ధాన్ని పోలిన **"మంగళాశాసనం కృత్వా తత్ర తత్ర యథోచితమ్"** అనే ప్రయోగం యతిపతిదినచర్యలో చోటుచేసికోవడం విశేషం.

**26. అథ శ్రీశైలనాథార్యనామ్ని శ్రీమతి మండపే ।**
**తదంఘ్రిపంకజద్వంద్వచ్ఛాయామధ్యనివాసినమ్ ॥**

అథ=మఠానికి తిరిగివేంచేసిన తరువాత, శ్రీశైలనాథార్యనామ్ని=తమ ఆచార్యుల తిరునామంతో అంకితమైనది, శ్రీమతి=ఆచార్యుల తిరుమాళిగల మన్నుతో పూయబడినందున అంతులేని శోభను కల్గినది అయిన, మండపే=మండపంలో (చిత్రరూపంలో వేంచేసి ఉన్న), తదంఘ్రిపంకజద్వంద్వచ్ఛాయా మధ్య నివాసినమ్= స్వాచార్యులైన ఆ తిరువాయ్మొళిప్పిళ్ళై శ్రీపాదపద్మాల నీడలో నిత్యవాసం చేసేవారై (తరువాతి శ్లోకంతో అన్వయం)

శ్రీవరవరమునులు, శ్రీరంగనాథుని సన్నిధిలో మంగళాశాసనం చేసి, తమ ఆస్థానానికి వేంచేసిన తర్వాత, తమ ఆచార్యుల తిరునామంతో కాలక్షేపకూటంగా నిర్మింపబడ్డ. తిరుమలైయాళ్వార్ తిరుమణ్డపమ్‌లో చిత్రరూపంలో వేంచేసి ఉన్న స్వాచార్యులైన ఆ తిరువాయ్మొళిప్పిళ్ళై శ్రీపాదపద్మయుగ చ్ఛాయలో వేంచేసి ఉన్నారు.

**(అథ)** – పూర్వశ్లోకంలో ప్రయోగింపబడ్డ **"ప్రవిశ్య"** అనే అసమాపకక్రియారూపంవల్ల అనంతరం అనే అర్థం చెప్పబడినా, తిరిగి ఈ శ్లోకంలో ఆనంతర్యార్థకం అయిన

**"అథ"** అనే పదాన్ని ప్రయోగించడం – జరిగిన విషయాన్ని యతీంద్రులకు నివేదించి – అనే అర్థాన్ని ఇస్తుంది. ఈ విషయం వరవరమునికావ్యంలోకూడా **"ఉపేత్య పున రప్యేష నిజ మేవ నివేశనమ్, నివేద్య నిఖిలం తత్ర యతీంద్రాయ నమస్యయా"** (తిరిగి తమ మఠానికి చేరి, జరిగిన దానిని అంతటిని రామానుజులకు నమస్కారపూర్వకంగా నివేదించి) అని ప్రస్తావింపబడింది.

**(శ్రీమతి)** – పిళ్ళైలోకాచార్యులవారు మొదలైన పూర్వాచార్యుల దివ్యాలయాలు నిర్మింపబడ్డ క్షేత్రాలలోని మన్నును లేపనం చేయడంవల్ల గొప్ప సౌభాగ్యాన్ని పొందిన–అని భావం. ఈ శ్లోకతాత్పర్యానికి అనుగుణంగా యతీంద్రప్రవణ ప్రభావం లోని **"తిరుమలైయాழ్వార్ ఎన్ను తిరువాయ్‌మొழిప్పిళ్ళై తిరునామత్తాలే వ్యాఖ్యానమణ్డపత్తై యుణ్డాక్కి, పిళ్ళైలోకాచార్యర్ తిరుమాళిగైయిల్ రహస్యమ్ విళైన్ద మణ్ణాలే అన్ద వ్యాఖ్యానమణ్డపస్థలత్తుక్కు మణ్‌కాప్పు శాత్తువిత్తు, అవ్విడత్తై గురుకులవాసమాకవే ఎణ్ణి, స్వాచార్యాంఘ్రిపంకజద్వంద్వచ్ఛాయామధ్యే సుఖాసీనరాయ్ వ్యాఖ్యానిత్తుక్కొణ్డు ఎழున్దరుళి యిరున్దు"** (తిరుమలైయాழ్వార్ అనే పేరును గల తిరువాయ్‌మొழి పిళ్ళై పేరుతో ఒక వ్యాఖ్యాన మంటపాన్ని నిర్మించి, శ్రీపిళ్ళైలోకాచార్యులవారి గృహంలోని రహస్యగ్రంథాలు అవతరించిన చోటులోని మన్నుతో ఆ వ్యాఖ్యాన మండపాన్ని పూయించి, ఆ చోటును గురుకుల వాసంగా భావించి, తమ ఆచార్యుల చరణపద్మాల ఛాయలో సుఖంగా ఆసీనులై, వ్యాఖ్యానాన్ని అనుగ్రహిస్తూ వేంచేసి ఉండి) అనే సూక్తులు స్మరించతగినవి.

**(అంఘ్రి పంకజద్వంద్వ)** పంకజద్వంద్వశబ్దప్రయోగం ద్వారా రెండు శ్రీపాదాల పొందిక, అందం ఛాయావైపుల్యం సూచింపబడ్డాయి.

ఈ శ్లోకంలో వరవరమునుల ఆచార్యపారతంత్ర్యపరాకాష్ఠ ప్రకాశింప జేయ బడింది. ఈ విధంగా ఆచార్యవశ్యతను కల్గిఉండాలనే ప్రపన్నధర్మం భరద్వాజ పరిశిష్ట హృదయమనే గ్రంథంలో తెలుపబడింది. వరవరమునులు కాలక్షేపమండ పానికి తమ ఆచార్యుల తిరునామాన్ని పెట్టడం శాస్త్రీయమనే అంశం **"కుర్యా దచేతనానాం చ వైష్ణవం నామ లక్ష్మ చ, కరిష్యన్ వైష్ణవం నామ వైష్ణవాశ్రయమేవ వా"** (అచేతనమైన వస్తువులకుకూడా విష్ణుభక్తుల పేరును, గుర్తును, నివాసాలకు కూడా విష్ణుభక్తుల పేరును పెట్టి, వైష్ణవులకు ఆశ్రయంగా చేసి) మొదలైన



ప్రమాణంవల్ల సిద్ధం. **"శ్రీమతి"** అనే విశేషణానికి అనుగుణంగా – **"వైష్ణవస్యాంక శయ్యాయాం వైష్ణవస్య గృహే పి వా దేశే వా, తద్విచరితే సంస్థితా యాంతి మద్గతిమ్"** (విష్ణుభక్తుని శయ్యాసంబంధం కలవాడు, విష్ణుభక్తుని గృహంలో ఉన్నవాడు, విష్ణుభక్తుని సంచరించిన దేశంలో ఉన్నవాడు, నివసించేవాడు గతిని పొందుతాడు) ఇత్యాది ప్రమాణాలు అనుసంధేయాలు. ఈ ప్రమాణ శ్లోకంలో **"సంస్థితా"** అనే పదంచేత నివాసం వివక్షితమని వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్య. సాక్షాత్తుగా విష్ణుభక్తుల గృహంలో వారు సంచరించిన ప్రదేశంలో నివసించే అవకాశం లేనందువల్ల, ఆ ప్రదేశంలోని మన్నును మండపానికి అలదడంద్వారా దాని ప్రతినిధి నిర్మింపబడింది.

**"తదంఘ్రిపంకజచ్ఛాయామధ్యనివాసినామ్"**– అనే షష్ఠీబహువచనాంతమైన పాఠాంతరానికి **"అస్య వ్యాచక్షాణమ్"** అనే అనంతరశ్లోకంలోని ప్రయోగంతో అన్వయం. **"వ్యాచక్షాణమ్"** అనే పదం శ్రీవరవరముని పరమైనది. కాని షష్ఠ్యంత పాఠంలోని తత్పదం చేత వరవరముని పరామర్శింపబడుతున్నారని భావిస్తే, **"నిజం ప్రభుమ్"**, **"స్వం నికేతనమ్"**, **"స్వచరణాంభోజ....భావయంతమ్"** ఇత్యాదిగా కన్పించే పూర్వోత్తరశైలికి భంగం కల్గుతుంది. అందువల్ల **"నివాసినమ్"** అనే పాఠమే యుక్తమైనది. షష్ఠీవిభక్త్యంతపాఠంలో **"శిష్యాణామ్"** అనే విశేష్యపదాన్ని అధ్యాహారంచేసి కోవాలి. కాలక్షేపార్థం వరవరమునుల రాకను ఎదురు చూస్తూ, అక్కడ శ్రోతలు చేరి ఉన్నారని దీనిచే చెప్పబడిందని భావించాలి. అటువంటి అంతేవాసులకు **"దివ్యప్రబంధానామ్ తత్త్వం వ్యాచక్షాణమ్"** అని పై శ్లోకంతో అన్వయించాలి – అని శ్రీ ప్ర.భ. అణ్ణాస్వామి వ్యాఖ్య. లేకపోతే, ద్వితీయాంతపాఠంలో వలెనే, షష్ఠ్యంతపాఠంలో కూడా తత్పదాన్ని శ్రీశైలనాథార్యపరంగా అన్వయించవచ్చు. **"శిష్యాణాం స్వాచార్యశిష్యత్వభావనాభిప్రాయేణత్విద ముక్త మిత్రి దష్టవ్యమ్"** – వరవరముని శిష్యులు, తమ ఆచార్యులు వారి ఆచార్యులకు శిష్యులై ఉన్నారనే అభిప్రాయంతో ఈ విధంగా ప్రయోగింపబడిందని భావించాలి – అని వీరరాఘవా చార్య వ్యాఖ్య.

**27. తత్త్వం దివ్యప్రబంధానాం సారం సంసారవైరిణామ్ ।**
**సరసం సరహస్యానాం వ్యాచక్షాణం నమామి తమ్ ॥**

సంసారవైరిణామ్ = ప్రకృతిసంబంధాన్ని తొలగించేవి, సరహస్యానామ్ =అష్టాక్షరి, ద్వయం, చరమశ్లోకమనబడే మూడు రహస్యాల అర్థాలను ప్రతిపాదించేవి అయిన, దివ్యప్రబంధానాం =భగవానుని నిర్హేతుకకృపవల్ల కల్గిన, నిర్దుష్టమైన పరమభక్తి రూపాన్ని పొందిన జ్ఞానాన్ని కల ఆళ్వార్లు అనుగ్రహించిన దివ్యప్రబంధాల, సారమ్ = సంసారాన్ని జయించడంలో బలవత్తరమైన, తత్త్వమ్ =పరస్వరూప, జీవనస్వరూపాల యథార్థాన్ని, సరసం =మధురంగా, వ్యాచక్షాణం=సంశయం, విపరీతజ్ఞానం మొదలైన దోషాలు ఏవీ లేనట్లు అనుగ్రహించే, తమ్=ఆ మణవాళ మహామునులను, నమామి=నమస్కరిస్తున్నాను.

**"వానిన్ మీదేఱ్ఱి యరుళ్ శెయ్దు ముడిక్కుమ్ పిఱవిమామాయ క్కూత్తినైయే"** (పరమపదానికి చేర్చి, జన్మ అనే మహామాయ విన్యాసాలను లేకుండ చేస్తుంది), అని, **"మీట్చియిన్ఱి వైకున్దమానకర్ మఱ్ఱతు కైయతువే"** (పునరావృత్తి లేని వైకుంఠ మహానగరం, మిగిలిన ఫలాలు అన్నీ హస్తగతాలే) అని పల్కే రీతిలో ప్రకృతి సంబంధాన్ని తీర్చి, పరమపదాన్ని పొందించ గల్గిన దివ్యసూరుల దివ్య ప్రబంధాల సారమైన తత్త్వార్థాలను రహస్యార్థాలతో కలిపి చేర్చి, **"క్షీరం శర్కరయా"** (చక్కెర కలిపిన పాలు) అన్నట్లు అత్యంతమధురంగా వ్యాఖ్యానించే ఆ మణవాళమహా మునులను నమస్కరిస్తున్నాను.

**(సంసారవైరిణామ్)** చేతనునకు సంబంధించిన, ద్వేషాన్ని నిర్దేశించే వైరిపదాన్ని అచేతనమైన సంసారంవిషయంలో ప్రయోగించడం చేతనసమాధితో అని చెప్పాలి. ఈ సంసారంకూడా ఒక విరోధియేనా దివ్యప్రబంధాలముందు! అనే పరిహాసం ఈ చేతనసమాధివల్ల ధ్వనిస్తుంది – అని దీని భావం. దివ్యప్రబంధాలు శరీర సంబంధ రూపమైన సంసారాన్ని పోగొట్టగలవనే విషయం **"మాఱన్ విణ్ణప్పమ్ శెయ్త శొల్లార్ తొడైయిలిన్నూఱుమ్ వల్లార్ అழுన్దార్ పిఱప్పామ్ పొల్లా వరువినై మాయవన్ శేఱ్ఱళ్ళల్ పొయ్న్నిలత్తే"** (తిరువిరు–100) (నమ్మాళ్వార్లు పల్కిన ఈ నూరు పాశురాలను అనుసంధించ గల్గినవారు అనే ఈ సంసారంలో తిరిగి జన్మించరు) **"శెయరిల్ శొల్లిశైమాలై ఆయిరత్తుళిప్పత్తాల్ వయిరమ్ శేర్ పిఱప్పఱుత్తు వైకున్దమ్ నణ్ణువరే"** (తిరువాయ్–4–8–11) (వేయి పాశురాలలోని ఈ పది పాశురాలను పలుకగలిగినవారు జన్మను పోగొట్టుకొని, వైకుంఠాన్ని చేరగలరు) మొదలైన పలు ఫలశ్రుతి పాశురాలలో గమనించవచ్చు.



**(సారమ్)** ప్రయోజనమని, బలమని ఇచటి సారశబ్దానికి అర్థం. ముముక్షువులకు ఉపాదేయరూపమైన ప్రయోజనంగా, తమకు విరోధిగా ఉన్న సంసారాన్ని తొలగించుకోవడంలో ఉపయోగించే బలంగా ఉన్నది–అని భావం. **"సారో బలే స్థిరాంశేఒర్థే పుమా న్యాయ్యే వరే త్రిషు"** అనే నానార్థరత్నమాలా ప్రమాణాన్నిబట్టి సారశబ్దం ప్రయోజనం, బలం అనే అర్థాలను ఇస్తుంది.

**(సరహస్యానామ్)** – **"ముముక్షువుక్కు అఱియవేణ్డుమ్ రహస్యఙ్గళ్ మూన్ఱు"** (ముముక్షువు తెలియదగిన రహస్యాలు మూడు) అని ముముక్షుప్పడి రహస్య గ్రంథంలో నిర్దేశింపబడ్డ అష్టాక్షరి, ద్వయ, చరమ శ్లోకరూపంగా ఉన్న రహస్య త్రయంయొక్క – అని అర్థం. పై ముముక్షుప్పడి సూక్తిని వ్యాఖ్యానిస్తూ **"ఇవనుక్కు అవశ్యమ్ జ్ఞాతవ్య మాయుళ్ళతు స్వరూపోపాయపురుషార్థఙ్గళాకైయాలుమ్, అవఱ్ఱై ఇన్ద రహస్యత్రయమ్ ఉళ్ళపడి ప్రతిపాదిక్కైయాలుమ్, రహస్యత్రయమే అఱియవేణ్డువతెన్నై. స్వజ్ఞానం ప్రాపకజ్ఞానం ప్రాప్య జ్ఞానం ముముక్షుభిః, జ్ఞానత్రయ ముపాదేయ మేతదన్య న్న కించన–ఎన్నక్కడవదిఱే."** (జీవుడు తప్పకుండా తెలిసికోవలసినవి స్వరూప – ఉపాయ – పురుషార్థాలు కావడంచేత, వానిని ఈ మూడు రహస్యాలు యథాతథంగా ప్రతిపాదించడంచేత, రహస్యత్రయమే జ్ఞాతవ్యమని అర్థం. స్వరూపజ్ఞానం, ఉపాయజ్ఞానం, ప్రాప్యమనబడే పురుషార్థజ్ఞానం – అనే ఈ మూడే ముముక్షువులకు తెలియవలసినవి. వీనికంటే వేఱయినది ఏ కొంచెం అవసరం లేదు – అని చెప్పబడుతున్నది కదా!) అని, **"ఇవఱ్ఱై రహస్యఙ్గళెన్గిఱతు–సకలవేదాన్తసారార్థప్రతిపాదకతయా పరమగుహ్యఙ్గళాకైయాలే"** (వీనిని రహస్యాలు అన్నది ఇవి సకలవేదాంతాలసారార్థాన్ని ప్రతిపాదించడంవల్ల, మిక్కిలి గోపనీయాలు కాబట్టి) అనే సూక్తులిచట స్మరణీయాలు.

**(సరసమ్)** పూర్వోక్త రహస్యత్రయాలకు శ్రియఃపతియే శేషి, ఉపాయం, ప్రాప్యం–అన్నది ప్రథమతః తోచే అర్థం. ఇంకొంచెం లోతుగా పరిశీలిస్తే భగవద్భక్తులే శేషి, ఉపాయం, ప్రాప్యం అనే భావం కల్గుతుంది. ఇంకా మఱికొంచెం నిశితంగా పరిశీలించి చూస్తే ఆచార్యుడే శేషి, ఉపాయం, ప్రాప్యం అనే నిశ్చయం కలుగుతుంది. అందువల్ల రహస్యత్రయాల ముఖ్యలక్ష్యం మూడవ (చరమ) పర్వమైన ఆచార్యుని విషయంలోనే అన్నది ఆచార్యనిష్ఠాగరిష్ఠులైన మధురకవులు మొదలైన మహానుభావుల స్థిరనిశ్చయం. ఇచట మణవాళమహాములు యతీంద్రప్రవణులు కాబట్టి, వారు

భగవద్రామానుజులపట్ల అత్యంతప్రావణ్యం కల్గినవారు. వారినే శేషిగా, ఉపాయంగా, ప్రాప్యంగా దివ్యప్రబంధాల సారార్థంగా శిష్యులకు, ఉపదేశించారని ప్రకృతార్థం. **"తస్మిన్ రామానుజార్యే గురు రితి చ పదం భాతి"** (ఆ రామానుజార్యుల వారిలోనే గురువనే పదం ప్రకాశిస్తున్నది) ఇత్యాదిప్రమాణాలవల్ల ఆచార్యత్వం భగవద్రామానుజులయందే పూర్ణంగా అర్థవంతం అనే విషయం ఇంతకుముందే వివరింపబడింది. శేషి అంటే – స్వామి, ప్రాప్యుడంటే పొందదగినవాడు, ఉపాయమంటే ప్రాప్యుడైన స్వామిని పొందడానికి తగిన సాధనం. మనం సేవించతగిన స్వామి ఆచార్యుడే కాబట్టి, దానికి పొందదగిన (ప్రాప్యుడైన) ఆచార్యుని పొందడానికి వేఱొక ఉపాయాన్ని అన్వేషింపకుండా, ఆ ఆచార్యునే ఉపాయంగా ఆశ్రయించాలి అన్నది రహస్యత్రయాల సారార్థం. దీన్నే మామునులు శిష్యులకు మధురంగా ఉపదేశించారు. (**"సరసమ్"** అనే పదాన్ని ఈ విధంగా క్రియావిశేషణంగా కాకుండా తత్త్వానికి విశేషణంగా చేసి కూడా అర్థం చెప్పవచ్చు). ఈ అర్థవిశేషం అందఱికీ సమ్మతంగా తోచుకున్నా, చరమపర్వనిష్ఠను కలవారికి మాత్రం ఈ అర్థతత్త్వం విశేషించి భోగ్యంగా తోస్తుంది.

**(దివ్యప్రబంధానామ్)** దివ్యశబ్దం ప్రబంధవిశేషణం. భగవానుని నిర్హేతుకజాయమాన కటాక్షంవల్ల లభించిన దివ్యజ్ఞానం కారణంగా ఉద్భవించినవి కాబట్టి ఇవి దివ్యాలు – అని భావం. ఈ ప్రబంధాలు ద్రవిడోపనిషత్తులుగా ప్రసిద్ధి చెందినవి. **"ద్రావిడ వేదసాగరమ్"** అని, **"ద్రావిడీం బ్రహ్మసంహితామ్"** అని కదా వీటి ప్రసిద్ధి.

**(తత్త్వమ్)** ఆ ప్రబంధాలచేత ప్రతిపాదితమైన జీవ–పర–ఉపాయ–ఫల–విరోధి స్వరూపాల యథార్థస్వరూపం–అని అర్థం. **"తత్త్వం విలంబమానే స్యా త్స్వరూపే పరమాత్మని"** అని రత్నమాలాసూక్తి. ఈ పదం **"వ్యాచక్షాణమ్"** అనే వ్యాఖ్యానక్రియతో అన్వయిస్తుంది.

వాధూలవీరరాఘవాచార్య వ్యాఖ్యలో **"యద్వా, తత్త్వం దివ్యప్రబంధానాం సారం కర్మ, సంసారవైరిణామ్ సరహస్యానాం సరసం యథా భవతి తథా వ్యాచక్షాణ మిత్య న్వయః"** అని అన్వయాంతరం చూపబడింది. దీనివల్ల ద్రవిడోపనిషత్తులుగా చెప్పబడే దివ్యప్రబంధాల పరమప్రయోజనమైన చరమపర్వనిష్ఠ, ప్రకృతి సంబంధాన్ని తొలగించుగొనగోరే (ముముక్షువులైన) వారు, రహస్యత్రయంలో అంచచలమైన



నిష్ఠను కల అధికారులు అయిన వరదనారాయణగురువులు మొదలైన అంతరంగ శిష్యులకు మధురంగా, సుఖంగా అవగతం అయేటట్లు, వారికి ఆనందం కలిగేటట్లు వ్యాఖ్యానించేవారు – అనే భావం స్ఫురిస్తుంది. **"వ్యాచక్షాణమ్"** అన్నపుడు **"పరిచ్ఛేదః పదార్థోక్తిః విగ్రహో వాక్యయోజనా"** ఇత్యాదిగా నిర్వచింపబడిన వ్యాఖ్యాన రీతిలో వ్యాఖ్యానించేవారు – అని భావం. **"మధుర"** మనే క్రియావిశేషణం వరవరమునుల వ్యాఖ్యానచాతురిని తెలుపుతున్నది. **(నమామి) – "నమ–ప్రహ్వీభావే"** అనే ధాతుస్వారస్యాన్ని బట్టి వరవరమునుల వ్యాఖ్యానవైదగ్ధ్యానికి త్రికరణాలతో నమస్కరిస్తున్నాను – అనే భావం ద్యోతితమవుతుంది. కాంచీ ప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్యలో **"సరహస్యానాం దివ్యప్రబంధానాం సారం సరసం తత్త్వం సంసారవైరిణామ్ సరసం వ్యాచక్షాణమ్"** (రహస్యాలతో కూడిన దివ్యప్రబంధాలలోని సారాన్ని సరసంగా, సంసారాన్ని విడచిపెట్టాలని కోరేవారికి సరసంగా వివరించేవారు) అంటూ వేఱొక విధమైన అన్వయం చూపబడింది. ఈ అన్వయంలో **"సరసమ్"** అనే పదం మధ్యమణి న్యాయంలో మొదట తత్త్వానికి విశేషణంగాను, తరువాత వ్యాఖ్యాన క్రియా విశేషణంగాను చూపబడింది. **"సంసారవైరిణామ్"** అనే పదం పుర్వశ్లోకంలోని **"ఛాయామధ్యనివాసినామ్"** అనే షష్ఠ్యంతపాఠాంతరంలో అన్వయిస్తుంది. **"తదంఘ్రిపంకజచ్ఛాయామధ్యనివాసినామ్ సంసారవైరిణామ్"** అని అన్వయక్రమం. **"ఇదు కణ్డు కన్దాడైయణ్ణన్ ముదలానోర్ ఇవర్ తిరువడికళిల్ ఆశ్రయణోన్ముఖరాయిరుక్క, అవ్వేళవిలే పెరుమాళుమ్ అవర్కళ్స్వప్నత్తిలే – అసంకుచిత మాచఖ్యే భుజంగశయనః పుమాన్–ఎన్గిఱపడియే విశదమాక జీయర్ తిరువడికళిలే ఆశ్రయిక్కుమ్బడి నియమిత్తరుళ, అవర్ తిరుముకప్పడియే – రామానుజపదాంభోజ సౌగంధ్యనిధయోఽపి యే–ఎన్ఱు తొడఙ్గి, శ్రుత్వైవ వైభవం తస్య తత్వేన శరణం యయుః"–ఎన్గిఱపడియే రామానుజపరిగృహీతరాయ్, అభిజనవిద్యావృత్తఙ్గళాలుమ్ ఉయర్న్దిరుక్కుమవర్కళాన కన్దాడైయణ్ణన్ ముదలాన ఆచార్యపురుషర్కళాయుళ్ళ అనైవరుమ్, తన్దామ్ ఉయర్త్తిక్కళై ప్పారామల్ ఇవర్తిరువడికళిల్ సంబంధమ్ తఙ్గళుక్కు ధారకమెన్ఱు అఱుతియిట్టు వన్దు జీయర్ తిరువడికళైయే శరణమాకప్పఱ్ఱి ఉజ్జీవిత్తార్కళ్"** (దీనిని దర్శించి, కన్దాడై అణ్ణన్ మొదలైనవారు వీరి శ్రీపాదాలను ఆశ్రయించడంలో ఆనుకూల్యం కల్గినవారుకాగా, అపుడు శ్రీరంగనాథుడు వారికి స్వప్నంలో సాక్షాత్కరించి "ఆదిశేషునిపై పరుండి ఉన్న పరమపురుషుడు సుస్పష్టంగా

వివరించాడు" అన్నట్లు విశదంగా జీయర్ శ్రీపాదాలలో ఆశ్రయించేటట్లు వారిని ఆజ్ఞాపించగా, వారుకూడా అదేరీతిలో రామానుజుల పదాంభోజాల సౌగంధ్యాన్ని నిధిగా కలవారైనా – అని ప్రారంభించి, వారి వైభవాన్ని యథాతథంగా విని, శరణుపొందారు –అని ఎఱుమ్బియప్పా వర్ణించిన రీతిలో, రామానుజులచేత అనుగ్రహింపబడ్డవారై, సద్వంశంలో, విద్యలో, వృత్తంలో ఉన్నతులైన కన్దాడై అణ్ణన్ మొదలైనవారు అందఱు తమ తమ ఔన్నత్యాన్ని లెక్కించకుండా, వీరి శ్రీపాదాల సంబంధమే తమకు రక్షకంగా తలచి నిశ్చయించుకొని వచ్చి, జీయర్ శ్రీపాదాలనే శరణంగా ఆశ్రయించి, తరించారు) అనే యతీంద్రప్రవణప్రభావంలోని సూక్తులు భావ్యాలు. ఈ వృత్తాంతాన్ని స్తుతికర్త వరవరముని కావ్యంలో **"పున స్స్వాప్నోపదేశేన దేశే దేశే నిరంకుశః, అయ మర్చావతారత్వసమాధి మవధీరయన్, అత్యమర్త్యతయా తస్య తత్త్వ మాత్యంతికం హితమ్, అసంకుచిత మాచఖ్యౌ భుజంగశయనః పుమాన్, దేశే దేశే విశేషజ్ఞై రజ్ఞై రప్యవిశేషతః, ఆశ్రిత్య తత్పదద్వంద్వ మశ్రూయత పరం హితమ్, రామానుజపదద్వంద్వసౌగంధ్యనిధయోఽ పి యే, అసాధారణ మౌన్నత్య మవధూయ నిజం ధియా, ఉత్తేజయంత స్స్వాత్మానం తత్తేజస్సంపదా తదా, శ్రుత్వైవ వైభవం తస్య తత్త్వేన శరణం గతాః, సింధుః సద్గుణరత్నానాం సీమా శేషత్వసంపదామ్, వాధూలవరదాచార్యో మౌళిరత్నం మనీషిణామ్, అభూ దనుపమ స్తస్య విభూషణ మనుత్తమమ్, రామానుజమునీంద్రస్య శ్రీమాన్ దాశరథి ర్యథా"** (మఱల, స్వప్నం నెపంతో ఆదిశేషునిపై వపళించి ఉన్న నిరంకుశుడైన శ్రీరంగనాథుడు దేశదేశాల్లో ఉన్న తన అర్చారూపసమాధిని దాటి, వరవరమునుల అతిమానుషమైన, అత్యంతం హితమైన తత్త్వాన్ని సుస్పష్టంగా వ్యక్తం చేశాడు. దేశదేశాల్లో ఉండే విద్వాంసులు, అజ్ఞులు అందఱు వరవరమునుల పాదద్వంద్వాన్ని ఆశ్రయించి గొప్ప హితాన్ని ఆలకించారు. రామానుజద్వంద్వసౌగంధ్యాన్ని కల్గినవారైనా, తమ అసాధారణమైన ఔన్నత్యాన్ని తమ మనస్సులో విడచివేసి, తమ ఆత్మను వారి తేజస్సుతో మెఱుగు పెట్టుకొన్నారు. వారి వైభవాన్ని యథాతథంగా విని శరణు పొందారు. సద్గుణ రత్నాలకు సముద్రులు, శేషత్వసంపదకు పర్యంతసీమ, విద్వాంసులకు శిరోరత్నం అయిన వాధూలవరదాచార్యులవారు ఆ వరవరమునులకు, దాశరథి భగవద్రామానుజులకువలె, సాటిలేని విభూషణంగా అయ్యారు) అని వర్ణింపబడింది.

పై వర్ణనలోని **"ఉత్తేజయంత స్స్వాత్మానమ్"** అనే ప్రయోగంలోని స్వారస్యం సహృదయైకవేద్యం. ఇచటి ఉత్తేజన (పదును పెట్టడం) అనే శబ్దప్రయోగం **"శరవ**



**త్తన్మయో భవేత్"** అనే సూక్తిలో జీవాత్మ శరంతో పోల్చిన స్వారస్యానికి అనుగుణం. ఉత్తేజన మంటే సానపెట్టడం అనే అర్థం కూడా ఉన్నది. కాబట్టి ఈ పదప్రయోగం శ్రీవిష్ణుపురాణం అస్త్రభూషణాధ్యాయంలో చెప్పబడే ఆత్మయొక్క కౌస్తుభమణిసామ్యానికి అనుగుణం. ఇందువల్ల పూర్వం పొందలేని అతిశయాన్ని పొందడం కోసం, భగవంతునిచే సాక్షాత్తు నిరూపింపబడిన వైభవాన్ని కల్గిన విశేషవ్యక్తులను (ఆచార్యశ్రేష్ఠులను) ఆశ్రయించడం ప్రపన్నునకు యుక్తమేనని తెలుపబడింది. ఇంతకు ముందే పొందినదాన్ని మఱల పొందాలని ఎవరూ కోరరుకదా! **"యదర్థం తు కృతం పూర్వం తదర్థం న పునఃక్రియా"** (ఎందుకోసం ఇంతకు ముందు ప్రయత్నం చేయబడిందో, మళ్ళీ దానికోసం ప్రయత్నం చేయబడదు కదా) అనికదా లోకన్యాయం. పైరీతిలో విశిష్టవ్యక్తిసమాశ్రయణం కర్తవ్యమంటూ శాండిల్యస్మృతి **"ఆచార్యచిత్తాను గుణం సిద్ధాంతానుగుణంత్వపి, అన్యత్ర శ్రుణుయాత్ జ్ఞేయ మనుజ్ఞాప్యైవ జీవతి, యస్మిన్ పరమవిద్యాయాం న సంసిద్ధి రబోధతః, గురో ర్వాప్యన్యతో గ్రాహ్యా పరా విద్యా గుణాన్వితాత్"** (ఆచార్యుని చిత్తానికి అనుగుణంగా, సిద్ధాంతానికి అనుకూలంగా తెలియదగిన విషయాన్ని ఆ ఆచార్యుల అనుమతితో వేఱొకరివద్ద తెలుసుకోవాలి. ఎవనికి పరవిద్యలో స్పష్టమైన జ్ఞానం కలుగలేదో అతడు గురువుల వద్దగాని, గుణవంతుడైన వేఱొకరివద్దగాని ఆవిద్యను నేర్చుకోవాలి) అని తెలిపింది.

**"వ్యాచక్షాణమ్"** అనే పదంలోని శానచ్ ప్రత్యయం తాచ్ఛీల్యార్థకం. వరవరమునుల వ్యాఖ్యానవైదగ్ధ్యాన్ని సూచిస్తున్నది. వరవరమునుల ఈ సామర్థ్యం వరవరముని కావ్యంలో విశదంగా ఈ క్రింది విధంగా వర్ణింపబడింది. **"ఆశంకా మవిధేయానాం వాక్యానా మవతారణే, అవిస్తరేణ నిర్ణీత మర్థానాం ప్రతిపాదనే, పూర్వోత్తరానుసంధాన మభిప్రాయప్రకాశనే, అసందిగ్ధం సమాధాన మాక్షేపేషు నిరుత్తరమ్, వీక్షమాణా శ్చిరం తత్ర వ్యస్మయంత విచక్షణాః, స ఏవ భగవానేవం సహస్రవదన స్స్వయమ్, అవాతర దితి వ్యక్త మిత్యవోచన్ పరస్పరమ్, శ్రుత్యంత సూత్రసూక్ష్మార్థప్రకాశనపరైః పురా, పరమై ర్యోగిభిః దృష్టాన్ ప్రబంధా నభ్యధా త్పరమ్, ప్రస్తుతా నన్వభూ త్తత్ర భగవద్గుణవిగ్రహాన్, ప్రపేదే పరమం హర్షం ప్రత్యక్షానుభవా దపి, శబ్దశక్తి రియం నిత్యా శృణ్వతాం గృహ్ణతా మపి, సర్వాత్మనా హృది స్వార్థాన్ సన్నిధాపయతీతి యత్, అత శ్శాస్త్రేష్వభిష్వంగం కుర్వన్ సర్వోపకారకః, సత్వశుద్ధికరం ధ్యేయసన్నికర్షేణ చేతసః, గుణానుభవనం పత్యుః భృత్యకృత్య మపి**

**ప్రియమ్, వాచికం వాచికేనైవ సర్వదా విదధే సుధీః, తత్తత్ప్రబంధకారాణాం గురూణాం తత్ర సన్నిధిమ్, తానేవ త్తత్తదర్థానాం వ్యాఖ్యాతౄ నప్యమన్యత, శ్రోతృషు ప్రథమత్వం తు చింతయ న్నాత్మన స్స్వయమ్, అనువక్తృత్వ మాస్థాయ పరేభ్యః ప్రత్యపాదయత్, అజ్ఞానా మగ్రగణ్యం మా మధిష్ఠాయ యతీశ్వరః, అజ్ఞాతజ్ఞాపనే ప్రాజ్ఞ మకార్షీ దిత్యబుధ్యత, ప్రత్యక్షలక్షితస్వాత్మతత్వయాథాత్మ్యసంపదామ్, ఆచార్యాధీనవృత్తీనాం ప్రాచా మేవ ప్రచేతసామ్, చరిత్రాణి పవిత్రాణి చిత్రాణి వచనాని చ, మధ్యే మధ్యే మునిః ధ్యాత్వా భృత్యానాం ప్రతిపాదయన్, స్వైరాలాపై స్సుమధురై స్స స్వరూపవినిశ్చయమ్, శోతౄణా మతి మారోప్య సువ్యక్తం ప్రత్యబోధయత్"** (సందేహం లేవనెత్తడానికి వీలు లేని వాక్యాలకు అవతారికను అనుగ్రహించడంలో, సంగ్రహంగా నిర్ణయింపబడ్డ అర్థాలను విశదీకరించడంలో, పూర్వోత్తర సందర్భాలను కలుపుకుంటూ విషయాలను వ్యక్తం చేయడంలో, ఆక్షేపాల్లో మళ్ళీ ఆశంకను చేయడానికి వీలులేనట్లు సుస్పష్టమైన సమాధానాన్ని అనుగ్రహించడంలోని వరవరమునుల సామర్థ్యాన్ని చూచి సమర్థులైనవారుకూడా చిరకాలం ఆశర్చపడినవారై, వేయినోళ్ళనుకల ఆ ఆదిశేషుడే ఈ విధంగా స్వయంగా అవతరించాడని పరస్పరం చెప్పుకొన్నారు. వేదాంతసూత్రాల సూక్ష్మార్థాన్ని ప్రకాశింపజేయడంలో ఉద్దేశ్యం కల దివ్యసూరులు దర్శించిన ప్రబంధాలను మనస్సులో ధరించి, భగవద్గుణ విగ్రహాలను వర్ణించే ఆ సూక్తులు ప్రస్తుతాలైనపుడు వాటిని అనుభవించారు. ఆ ప్రత్యక్షానుభవంవల్లకూడా గొప్ప హర్షాన్ని పొందారు. నిత్యమైన ఈ వరవరమునుల శబ్దశక్తి దానిని వినేవారికి, గ్రహించేవారికికూడా పూర్తిగా వరవరమునుల మనస్సులో ఉన్న అర్థాలను వ్యక్తం చేసేటట్లున్నది.)

భగవానుని ఆలయంనుండి ఇంటికి చేరిన తర్వాత జ్ఞాతవ్యార్థాల వ్యాఖ్యానం కర్తవ్యమని భారద్వాజసంహితలో – **"ప్రభుం భక్తపరాధీనం నిత్య మాలోకయే ద్ధరిమ్, విమాన మథవా తస్య దూరా ద్గోపుర మేవ వా, స్వరూపరూపవిభవగుణ కర్మాది శార్ఙ్గిణః, వ్యాచక్షీత నిబధ్నీయాత్ శ్రుణయా ద్విలిఖే త్పఠేత్, చతుర్భుజ ముదారాంగం శ్యామం పద్మనిభేక్షణమ్, శ్రీభూమినీళాసహితం చింతయే చ్చ సదా హృది"** (ప్రభువు, భక్తపరాధీనుడు అయిన హరిని నిత్యం దర్శించాలి. లేకపోతే ఆ స్వామి ఆలయవిమానాన్ని గాని, గోపురాన్ని గాని దర్శించాలి. ఆశ్రియఃపతియొక్క స్వరూప–రూప–విభవ–గుణ–లీలాదులను వ్యాఖ్యానించాలి, కవనం చేయాలి,



వినాలి, రాయాలి, పఠించాలి. చతుర్భుజుడు, గొప్ప రూపాన్ని కలవాడు, శ్యామాంగుడు, పద్మనేత్రుడు, శ్రీదేవి భూదేవినీళాదేవులతో కూడి ఉన్నవాడైన స్వామిని ఎల్లప్పుడూ హృదయంలో చింతించాలి) అని, **"సద్భిః ప్రణిహితాం శ్చాన్యాన్ ప్రబంధాన్ పరిశీలయేత్"** (మహానుభావులచే రచింపబడ్డ మిగిలిన ప్రబంధాలను పరిశీలించాలి) అని చెప్పబడింది. ఈ ప్రమాణంలోని **"వ్యాచక్షీత నిబధ్నీయాత్"** అనే ప్రయోగాన్ని స్మరింపజేయడంకోసమే ప్రసుతం శ్లోకంలో **"వ్యాచక్షాణమ్"** అని ప్రయోగింపబడింది. **"కృపయా శ్రమిణ స్సర్వే ధర్మం బ్రూయు స్త్వలింగినే, పరివ్రాడపి బ్రూయాత్"** (కృపతో అన్ని ఆశ్రమాలకు చెందినవారు బ్రహ్మచారి కానివానికి ధర్మాన్ని బోధించవచ్చు, యతికూడా బోధించవచ్చు) అనే విశేషశాస్త్ర విధిని బట్టి, **"న వ్యాఖ్యానపరో భవేత్"** (సన్న్యాసి వ్యాఖ్యానం చేయకూడదు), **"న వ్యాఖ్యాన ముపయుంజీత"** మొదలైన సామాన్యనిషేధవచనాలు త్రివర్గానికి (బ్రాహ్మణ–క్షత్రియ–వైశ్యకులానికి) చెందిన శిష్యులకు కీర్తి మొదలైన లౌకిక ప్రయోజనాలను ఆశించి మోక్షానికి ఉపయోగించని గ్రంథాలను వ్యాఖ్యానించ కూడదనే నిషేధాన్ని దృష్టిలో కల్గినవని ధ్వనిస్తున్నదని వాధూల వీరరాఘవాచార్యస్వామి వ్యాఖ్య. **"వేదాంతవిద్యాం విమలాం వ్యాకుర్వంతం మృదూక్తిభిః, శిష్యేభ్యో హితకామేభ్యః"** (విమలమైన వేదాంతవిద్యను మృదువైన సూక్తులతో హితాన్ని కోరే శిష్యులకు వ్యాఖ్యానించేవారు) అనే యతిపతి దినచర్యాసూక్తి ఇక్కడ భావనీయం.

**28. తత స్స్వచరణాంభోజస్పర్శసంపన్నసౌరభైః ।**
**పావనై రర్థిన స్తీర్థై ర్భావయంతం భజామి తమ్ ॥**

తతః=దివ్యప్రబంధార్థాలను ఆ విధంగా అనుగ్రహించిన తరువాత, స్వచరణ+అంభోజస్పర్శ సంపన్నసౌరభైః=స్వాచార్యులకు సాధనభూతులైన తమయొక్క పద్మాలవంటి శ్రీపాదాల సంబంధంచేత మిక్కిలి పరిమళాన్ని కల్గిన, పావనైః=పరమపవిత్రమైన, తీర్థైః=శ్రీపాదతీర్థ ప్రదానంచేత, అర్థినః=ఆ శ్రీపాదతీర్థాన్ని ప్రార్థించి, ఎదురు చూచే శిష్యులను, భావయంతం తరింపజేసే, తం=ఆ వరవర మునులను, భజామి=భజిస్తున్నాను.

అధ్యాత్మశాస్త్రప్రవచనాన్ని అనుగ్రహించిన పిమ్మట శిష్యులకు శ్రీపాదతీర్థాన్ని ప్రసాదించే వరవరమునులను సేవిస్తున్నాను. దివ్యప్రబంధసారార్థాలను ఉపదేశించిన

తరువాత ఉపదేశాన్ని పొందిన శిష్యులు ప్రార్థించడంచేత తమ శ్రీపాదతీర్థాన్ని వారికి ఇచ్చి, స్వీకరించేటట్లు చేసి, వారికి సత్తను కల్గించారని తాత్పర్యం.

**(స్వచరణ) –** భగవద్రామానుజులు ఇపుడు వేంచేసియుండనందున వారికి సాధనంగా, అంటే ప్రతినిధిగా తమను భావిస్తూ తమ శ్రీపాదతీర్థాన్ని శిష్యులకు అనుగ్రహించడంవల్ల వరవరమునులకు ఏ దోషం అంటదు. శిష్యులు చేసిన అనుల్లంఘ్యమైన ప్రార్థనే దీనికి కారణం. శిష్యులు తన వద్ద శ్రీపాదతీర్థాన్ని సేకరించే టపుడు, వారు తమ ఆచార్యుల శ్రీపాదతీర్థాన్ని చేరుస్తున్నారని భావించాలే తప్ప, తనవద్దనే చేరుస్తున్నారనే అహంకారాన్ని ఆచార్యుడు కలిగి ఉండరాదనే రహస్యం దీనివల్ల వ్యక్తం అయినది.

**(చరణాంభోజ)** శ్రీపాదాల పద్మసామ్యం పావనత్వ సౌరభ్యాలనుబట్టి చెప్పబడింది.

**(సంపన్న సౌరభైః)** – మిక్కిలి అధికమైన సౌరభ్యాన్ని కల్గినవి.

**(తీర్థైః)** – ఇచటి బహువచనం సాభిప్రాయకం. పూజాయాం బహువచనమని శ్రీ.ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్య. సంస్కృతంలోని బహువచనస్వారస్యాన్నిబట్టి శ్రీపాదతీర్థాన్ని మూడుసార్లు వరవరమునులు అనుగ్రహించారని తోస్తున్నదని శ్రీమాన్ టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారి వివరణం. **"తీర్థై రితి బహుత్వం ప్రదానార్థపదానో పాధికం సత్ కపింజలాధికరణన్యాయత్ త్రిత్వే పర్యవస్యతి"** అని వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్య. **"త్రిః పిబేత్"** అనే స్మృతివచనం మూడుమార్లు శ్రీపాదతీర్థాన్ని స్వీకరించడంలో ప్రమాణం. కొందఱు రెండుమార్లు మాత్రమే శ్రీపాద తీర్థాన్ని స్వీకరిస్తారు. ఆ సంప్రదాయంకూడా శాస్త్రీయమే. ఉశనస్మృతిలో **"యత్ర భాగవతానాం తు పాదోదకనిషేవణమ్, పావనం సర్వభూతానాం సోమపానసమం స్మృతమ్"** (భాగవత శ్రీపాదతీర్థాన్ని సేవించడం జీవులందఱికి సోమపానంతో సమానమని చెప్పబడింది) అంటూ భాగవతపాదోదక సేవనం సోమపానంతో సాటి అనబడింది. సోమపానం కొన్ని సమయాల్లో రెండుమార్లు చేయబడుతుంది. సోమయాగప్రయోగం మాధ్యందినసవనంగూర్చి తెలిపేటపుడు **"హోతృకా స్వం స్వం చమసం ద్వి ర్భక్షయంతి"** అనేది ప్రమాణం. సోమపాన సామ్యాన్నిబట్టి మధ్యాహ్నిక సమయంలో చేసే శ్రీపాదతీర్థసేవనం రెండు పర్యాయాలు ఆచరింపబడు తున్నది.



**(తీర్థైః) "తీర్థం శాస్త్రాధ్వరక్షేత్రోపాయోపాధ్యాయమంత్రిషు, అవతారర్షిజుష్టాంభః"** అని నిఘంటువు. అందువల్ల ఆచార్యపాదసంబంధంకల్గిన జలం తీర్థశబ్దవాచ్యం. **"తరంతి అనేన తీర్థమ్"** అన్నది తీర్థశబ్దవ్యుత్పత్తి. దీనిచేత తరిస్తారు – అని దీని అర్థం.

**(అర్థినః) "సంసారవైరిణామ్"** అంటూ పూర్వశ్లోకంలో నిర్దేశింపబడ్డ అంతరంగభక్తులను – అని అర్థం.

**(పావనైః) "స్నాతం చ గురుణా యత్ర తీర్థం నాన్య త్తతోఽధికమ్"** (ఆచార్యుడు స్నానం చేసిన దానికంటె గొప్ప తీర్థం వేఱొకటి లేదు) అనే భరద్వాజవచనం ఇక్కడ ప్రమాణం. అదే రీతిలో **"అర్థినః"** అన్నపుడు **"ప్రక్షాళ్య చరణౌ పాత్రే ప్రణిపత్యోప యుజ్య చ"** (పాదాలను పాత్రలో కడిగి, నమస్కరించి, సమీపించి చేరి) అనే భారద్వాజవచనం అనుసంధేయం **"సంపన్నసౌరభైః"** అనే విశేషణం ద్వారా తమ సంబంధంవల్ల ఇతరులకుకూడా ఆ సౌరభత్వం ప్రాప్తిస్తుందని తెలియడంవల్ల వరవరమునుల శిష్యులకుకూడా వారి సంబంధంచేత తీర్థపాదత్వం సిద్ధిస్తుందని ఏర్పడుతున్నది) భరద్వాజసంహితలో **"దండవత్ ప్రణమే ద్భూమా వుపేత్య గురు మన్వహమ్, దిశే వాపి నమస్కుర్యా ద్యత్రాసౌ వసతి స్వయమ్"** (ఆచార్యుని దగ్గఱకు ప్రతిదినం పోయి నేలపై పడి దండప్రణామాన్ని చేయాలి. లేక, వారున్న దిక్కుకైనా నమస్కరించాలి) అని ప్రారంభించి, ఆచార్యుని విషయంలో శిష్యుడు చేయవలసిన కర్తవ్యాలను కొన్నిటిని వివరించి, మధ్యలో **"ప్రక్షాళ్య చరణౌ పాత్రే ప్రణిపత్యోపయుజ్య చ"** అంటూ మఱికొన్ని కైంకర్యవిశేషాలను తెలిపి, తరువాత **"ఆచార్యోఽపి తథా శిష్యం స్నిగ్ధో హితపర స్సదా, ప్రబోధ్య బోధనీయాని వృత్తి మాచారయేత్ స్వయమ్"** (ఆచార్యుడు కూడా శిష్యుని విషయంలో ప్రేమకల్గినవాడై, హితాన్ని కోరేవాడై, ఎల్లప్పుడూ తెలుపవలసినవానిని బోధించి, సద్వృత్తిని ఆచరించేటట్లు చేయాలి) అని చెప్పినందువల్ల ఆచార్యునివలన హితాన్ని వినే శిష్యునకు శ్రీపాదతీర్థ స్వీకరణం అంగమని తెలుస్తున్నది. కాబట్టి ప్రకృతశ్లోకంలో **"తతః స్వచరణాంభోజ"** ఇత్యాది ప్రయోగం చేయబడిందని గ్రహించాలి. **"భావయంతమ్" – "భూ–సత్తాయామ్"** అనే ధాతువునుండి పుట్టిన ఈ క్రియారూపానికి ధ్వాత్వర్థస్వారస్యాన్ని బట్టి సత్తను కలిగేటట్లు చేసి అని–తాత్పర్యం.

**(29) ఆరాధ్య శ్రీనిధిం పశ్చా దనుయాగం విధాయ చ ।**
**ప్రసాదపాత్రం మాం కృత్వా పశ్యంతం భావయామి తమ్ ॥**

పశ్చాత్=మధ్యాహ్నికకృత్యం ముగిసిన తర్వాత, శ్రీనిధిం=లక్ష్మికి నిధి అయిన, అంటే-లక్ష్మికి లక్ష్మి అయిన శ్రీరంగనాథుని, ఆరాధ్య=పరమభక్తితో ఆరాధించి, అనుయాగమ్=భగవత్ప్రసాద ప్రాప్తి రూపమైన ప్రసాదస్వీకారాన్ని, విధాయ=చేసి, మామ్=పూర్వం=ఆ ప్రసాదానికి విముఖుడుగా ఉన్న నన్ను, ప్రసాదపాత్రం=వారు ఆరగించి, విడచిన ప్రసాదశేషానికి పాత్రుణ్ణిగా, కృత్వా= చేసి, పశ్యంతమ్=నన్ను కటాక్షిస్తున్న, తం = ఆ మణవాళమహామునులను, భావయామి= పరమభక్తితో మనస్సులో సదా ధ్యానిస్తున్నాను.

శ్రీపాదతీర్థాన్ని అనుగ్రహించిన తరువాత తమ ఆరాధనలోని అర్చామూర్తి అయిన శ్రీరంగనాథునకు తిరువారాధనం చేసి, భగవత్ప్రసాద ప్రతిపత్తిరూపం అయిన ప్రసాద స్వీకారాన్ని చేసి, **"పోనకమ్ శెయ్ద శేడమ్"** (ఆరగించగా మిగిలిన శేషం) అని కీర్తింపబడే తాము ఆరగించగా శేషించిన ప్రసాదాన్ని అనుగ్రహించి, దాసుణ్ణి కటాక్షించిన శ్రీవరవరమునులను భావిస్తున్నాను.

**(పశ్చాత్)**- మాధ్యాహ్నికకృత్యాలను పూర్తిచేసికొన్న తరవాత-అని అర్థం. వరవరముని కావ్యంలో **"అథ మాధ్యందినాం కృత్యాం కృత్వా సత్యోత్తరో మునిః, ఆరాధ్య విధివ ద్దేవ మన్వభూ ద్రంగభూషణమ్"** (తరువాత మాధ్యాహ్న కృత్యాలను ఆచరించి, నిష్కృష్టసత్త్వగుణాన్ని కల వరవరమునులు శ్రీరంగనాథుణ్ణి విధిప్రకారం ఆరాధించారు) అని వర్ణింపబడింది.

**(శ్రీనిధిమ్)** **"శ్రియః శ్రీః", "శ్రీనిధిమ్", "శ్రియః శ్రియమ్", "తిరువుక్కుమ్ తిరువాకియ"** (లక్ష్మికి కూడా సంపద అయినవాడు) అని కీర్తింపబడే శ్రీరంగ నాథుని -అని అర్థం. లక్ష్మికి నిధివలె సంపదగా ఉన్నవానిని - అని ఇచటి సారం. **(ఆరాధ్య)** శాండిల్యస్మృతిలోని **"యథా యువానం రాజానం యథా చ మదహస్తినమ్, యథా ప్రియాతిథిం యోగ్యం భగవంతం తథార్చయేత్, సతీవ ప్రియభర్తారం జననీవ స్తనంధయమ్, ఆచార్యం శిష్యవన్మంత్రం మంత్రివల్లాలయే ద్ధరిమ్"** (యువరాజునువలె, మదపుటేనుగునువలె, యోగ్యుడైన ప్రియాతిథినివలె భగవానుణ్ణి అర్చించాలి. ప్రియమైన భర్తను భార్యవలె, చంటిబిడ్డను తల్లివలె, ఆచార్యుణ్ణి



శిష్యుడువలె, మంత్రాన్ని, అంటే-ఉపాయాన్ని మంత్రివలె హరిని భక్తుడు లాలించాలి) అనే సూక్తిని అనుసరించి భగవానుణ్ణి పరమభక్తితో ఆరాధించి-అని అర్థం.

**(అనుయాగమ్)** భగవదారాధన తర్వాత చేయబడే భగవత్ప్రసాదస్వీకారానికి అనుయాగమని పేరు. **"జుహుయా దాహుతీః పంచ విష్ణో ప్రాణాదిసంజ్ఞికే"** (పరిషేచనం చేసి ప్రాణాపాన వ్యాన ఉదాన సమానాలనే పేర్లను కల అయిదు భగవన్నామాలను ఉచ్చరిస్తూ అన్నాన్ని అయిదు ఆహుతులుగా భుజించాలి) అని ప్రారంభించి, అనుయాగం చేయాలి - అని శాండిల్యస్మృతి అన్నది. **"ధాతారం హృదయాంతస్థం ధ్యాత్వా పాదాంబుపూర్వకమ్, తథాన్యే జుహుయా దన్నం తత్తన్మంత్రై స్సమాహితః, ధ్యాయ న్నేవ పరం బ్రహ్మ భోక్తారం హృదయస్థితమ్, అశ్నీయా దత్వరో మంత్రీ భోజ్యం సర్వ మకుత్సయన్"** (మన హృదయంలో ఉన్న భగవానుని ధ్యానం చేసి, భగవదారాధనాతీర్థాన్ని స్వీకరించి, **"ప్రాణాయ స్వాహా"** మొదలైన మంత్రాలను ఉచ్చరిస్తూ నోటిద్వారా అన్నాన్ని హోమం చేయాలి. తరువాత భగవానుని ధ్యానిస్తూ తొందరపడకుండా, అన్నాన్ని **"అన్నం న నింద్యాత్"** అన్నట్లు నిందించకుండా, అంటే-ఉప్పులేదు, కారం లేదు, పులుసు లేదు, తీపి లేదు-అంటూ కొఱతలను పలుకకుండా భుజించాలి) అని, **"పథ్యం మితం చ శుద్ధం చ రస్యం హృదయరంజనమ్, స్నిగ్ధం దృష్టిప్రియం కోష్ణ మన్నం భోజ్యం మనీషిభిః"** (శుద్ధమైనది, పరిమితమైనది, హితమైనది, రుచి కల్గినది, హృదయాన్ని రజింపచేసేది, నేతితో కూడినది, చూడడానికి ప్రియంగా ఉండేది, నులి వెచ్చనిది అయిన అన్నాన్ని బుద్ధిమంతులు భుజించాలి) అనికూడా ఆ స్మృతిలో తెలుపబడింది.

**(అనుయాగం విధాయ చ)** - ఇచటి చకారంచేత వరవరమునులు తదీయారాధనతో ముందుగా భక్తులను తృప్తిపఱచి, తరువాత తాము భుజించినట్లు చెప్పబడింది. ఈ విషయాన్ని వరవరమునికావ్యంలో ఎఱుమ్బియప్పా స్వయంగా **"తత స్తన్ముఖసంస్పర్శసరసేన సుగంధినా, శుచినా సుకుమారేణ సత్త్వసంశుద్ధి హేతునా, భక్తిపూతం ప్రక్లృప్తేన భోజ్యేన భగవత్ప్రియాన్, తత్పర స్తర్పయామాస తత్ప్రీతిప్రేమవృద్ధయే, ఆత్మాన మాత్మనః పశ్యన్ భోక్తారం పురుషం పరమ్, అను యాగం యథాయోగం నిస్సంగో నిరవర్తయత్"** (భగవానునకు నివేదన చేసిన తరువాత, స్వామి ముఖసంస్పర్శచేత సుగంధాన్ని కల్గినది, రుచిని కల్గినది, శుద్ధి అయినది, మృదువుగా ఉన్నది, మనఃపరిశుద్ధిని కల్గించేది, భక్తితో పెట్టబడినది

అయిన భగవత్ప్రసాదంతో భాగవతులైన శ్రీవైష్ణవులను మిక్కిలి ఆదరంతో తృప్తి పఱచి, ఆ తరువాత తాము సంగరహితులై ఆరగించారు) అని వర్ణించారు.

తదీయారాధన విశేషశాస్త్రంద్వారా విధింపబడింది. భరద్వాజపరిశిష్టమనే గ్రంథంలో శ్రీవైష్ణవలక్షణాలు ఈ విధంగా నిర్వచింపబడ్డాయి. **"మునయ స్సత్వనిష్ఠానాం లక్షణాని నిబోధత, విష్ణో ర్దాసైకఫలతా తదేకోపాయతాస్థితిః, తదాజ్ఞాకరణేప్రీతి స్తత్కర్మ గుణకీర్తనమ్, తచ్చిహ్నాంకితదేహత్వం తదీయారాధనే రతిః, తదన్యస్పర్శవైరాగ్య మింద్రియార్థేష్వలోలతా, ఆచార్యాధీనవృత్తిత్వ మాచార్యార్థాత్మదేహతా, క్రోధలోభమదాలస్యమానమోహవిహీనతా, సత్యశౌచ దయాధైర్య క్షమాసంతోషయుక్తతా, ఇత్యేతై ర్లక్షణై ర్యుక్తా వైష్ణవాః"** (మునులారా! సత్వగుణంలో నిష్ఠను కలవారి లక్షణాలను వినండి. విష్ణువునకు దాసులుగా ఉండడం ఒక్కటే ప్రాప్యంగా తలచడం, ఆ స్వామిని మాత్రమే ఉపాయంగా భావించడం, ఆ స్వామి ఆజ్ఞను ప్రీతితో నిర్వర్తించడం, ఆ స్వామి గుణాలను, లీలలను, కీర్తించడం, ఆ స్వామిచిహ్నాలతో ముద్రింపబడిన దేహాన్ని కల్గి ఉండడం, విష్ణుభక్తులను ఆరాధించడంలో ఆసక్తి, ఆ స్వామికంటే వేఱు అయిన విషయాలపట్ల వైరాగ్యం, ఇంద్రియార్థాలపట్ల నిరాసక్తి, ఆచార్యునకు అధీనుడై వర్తించడం, ఆచార్యునికోసం తన ఆత్మను, దేహాన్ని వినియోగించడం, క్రోధం, లోభం, మదం, ఆలస్యం, దురభిమానం, మోహం – ఇటువంటి దోషాలు లేకపోవడం, సత్యం, శౌచం, దయా, ధైర్యం, క్షయ, సంతోషం అనే గుణాలను కల్గి ఉండడం అనే ఈ లక్షణాలను కలవారు శ్రీవైష్ణవులు). ఈ ప్రమాణం వల్ల – **"అపి చాస్య కుతో దానం దత్వా చాస్య కుతః ఫలమ్, దాతా ప్రతిగృహీతా చ ప్రేత్యేవ నరకం వ్రజేత్"** అనే నిషేధం శ్రీవైష్ణవయతులుకాని వారిని దృష్టిలో పెట్టుకొని చెప్పబడిందని తెలియాలి.

**(మామ్)** – యతి పెట్టిన ప్రసాదాన్ని భుజించకూడదనే నిషేధాన్ని **"యత్యన్నం యతిపాత్రస్థమ్"** ఇత్యాదిగా చెప్పబడ్డ సామాన్యవిధిని విశేషవిధిగా తలచిన దుర్బుద్ధి అయిన నన్ను–అనే వక్తృబుద్ధిస్థభావాన్ని ఈ సర్వనామపదం సూచిస్తుంది.

**(ప్రసాదపాత్రం కృత్వా)**– తాము ఆరగించి విడచిన భోజనపాత్రలోని శేషాన్ని స్వీకరించడానికి తగిన యోగ్యతను కలవాడనుగా నన్ను చేసి – అని భావం. **"యోగ్యభాజనయోః పాత్రమ్"** అని కోశప్రమాణం.



**(పశ్యంతమ్)** పూర్వం ఆవిధంగా ఉన్న ఇతనికి ఎంత అదృష్టం లభించింది? అనే ఆశ్చర్యంతో, సంతోషంతో, కరుణతో చూచేవారిని–అని భావం. ఆచార్యుల భుక్తశేష ప్రసాదాన్ని ప్రాప్యంగా స్వీకరించడం శిష్యుని ధర్మాల్లో ఒకటి. **"యోఽసౌ మంత్రవరం ప్రాదాత్ సంసారోచ్ఛేద సాధనమ్, ప్రతీచ్ఛే ద్గురువర్యస్య తస్యోచ్ఛిష్టం సుపావనమ్"** (సంసారాన్ని నశింపజేసే సాధనం అయిన అష్టాక్షరి అనబడే గొప్పమంత్రాన్ని అనుగ్రహించిన గొప్ప గురువుయొక్క పరమపావనమైన ఉచ్ఛిష్టాన్ని శిష్యుడు అభిలషించాలి) అనే భరద్వాజవచనం దీన్ని నిరూపిస్తున్నది. **"మోర్మున్నార్ అయ్యన్"** అని కీర్తింపబడే కున్థత్తూర్ అయ్యన్ అనే మహానుభావులు ప్రతిదినం తమ ఆచార్యులు ఆరగించి విడచిన మోరు(మజ్జిగ)ను ముందుగా ప్రాప్యంగా స్వీకరించడంవల్లనే వారికి ఆ పేరును నిరూపకనామమైనదని పెద్దల సూక్తి. శ్రీవచనభూషణ రహస్య గ్రంథంలో శిష్యవృత్తిని తెలిపేప్రకరణంలో శ్రీమల్లోకార్యగురువరులీ విషయాన్ని **"ఆహారనియతి"** పదంతో సూచించగా, శ్రీవరవరమునులు **"తదీయరుడైయవుమ్ ప్రసాదజ్ఞళాన వస్తుక్కళైయే ఆహారమాక"** అని వివరించారు. భగవద్రామానుజులు కూడా గీతలోని 17వ అధ్యాయంలోగల **"ఉచ్ఛిష్ట మపి"** అనే నిషేధాన్ని వ్యాఖ్యానిస్తూ గీతాభాష్యంలో **"గుర్వాదిభ్యోన్యేషాం భుక్తశిష్టమ్"** అని వివరించడం కూడా ఇచట స్మరణీయం. ఈ వివరణను గూర్చి శ్రీదేశికులు విస్తృతంగా **"ఉచ్ఛిష్టభక్షణానుమితిని దాన మాచార్యత్వం ప్రణవాది త్రికపూర్వకపరవిద్యోపదేష్టర్యేవ"** ఇత్యాదిగా చేసిన విచారణలో రహస్యత్రయాన్ని అనుగ్రహించిన ఆచార్యుల శ్రీపాదతీర్థం, ఉచ్ఛిష్టం పరిగ్రాహ్యాలని అంగీకరించడం ఇక్కడ స్మరణీయం. యతిపతిదినచర్యలోని **"హార్ద పూరుషభోగ్యం చేత్యనుయాగం విధాయ చ, ప్రసాదపాత్రం కుర్వాణం భక్తవర్గం యథోచితమ్"** (అనుయాగాన్ని నిర్వహించి, తమ భక్తవర్గానికి ప్రసాదాన్ని అనుగ్రహించేవారు) అనే సూక్తి భావనీయం.

**30. తత శ్చేత స్సమాధాయ పురుషే పుష్కరేక్షణే ।**
**ఉత్తంసితకరద్వంద్వ ముపవిష్ట ముపహ్వరే ॥**

తతః=అనుయాగానంతరం, పుష్కరేక్షణే=పుండరీకాక్షుడు, పురుషే=పురుషశబ్ద వాచ్యుడు, అయిన భగవానునియందు, చేతః=మనస్సును, సమాధాయ=లగ్నం చేసి, ఉత్తంసితకరద్వంద్వం యథా తథా=తలపై పెట్టుకొన్న రెండు చేతులను కలవారై,

(అంజలిని చేసి), ఉపహ్వరే= నిర్జనప్రదేశంలో, ఉపవిష్టం=పద్మాసనంతో యోగాభ్యాసంలో వేంచేసియుండే, (వరవరమునులను సేవిస్తున్నాను.)

భగవన్నివేదితప్రసాదాన్ని స్వీకరించిన తరువాత పుండరీకాక్షుడైన పరమ పురుషుని పట్ల మనస్సును లగ్నం చేసి, శిరస్సుపై జోడించిన రెండు చేతులను పెట్టుకొని అంజలి చేస్తూ, ఏకాంతంలో పద్మాసనంలో వేంచేసి ఉండే మణవాళ మహామునులను సేవిస్తున్నాను.

**(ఉత్తంసితకరద్వంద్వమ్) "ఉత్తంసిత"** విశేషణప్రయోగబలంచేత ఇక్కడ కరద్వంద్వ శబ్దం అంజలిని బోధిస్తుంది.

**(ఉపహ్వరే)**–ఏకాంతంలో. **"రహోఽ ంతిక ముపహ్వరే"** అని నిఘంటువు.

**(ఉపవిష్టమ్) – "ఉపవిశ్యాసనే యుంజ్యాత్"** (ఆసనంలో కూర్చుండి భగవద్ధ్యానాన్ని చేయాలి) అనే గీతోక్తక్రమం పాటింపబడినట్లయింది. **"ఉపవిష్టమ్"** అనే పదం అనంతర శ్లోకంలోని **"వరవరమ్"** అనే విశేష్యపదంతో అన్వయిస్తుంది.

అనుయాగానంతరం భగవద్ధ్యానాన్ని చేయాలని శాండిల్య స్మృతిలో **"అష్టాంగయోగ ప్రీతిం చ కృత్వా ధ్యానపరో వశీ"** అంటూ చెప్పబడింది. భరద్వాజుడు కూడా **"కృత్వా చానుయాగం కుర్వీత స్వాధ్యాయం వైష్ణవం పరమ్, తతో యుంజీత చాత్మానం పూరుషే పుష్కరేక్షణే"** (అనుయాగాన్ని చేసి, వైష్ణవమైన, గొప్పది అయిన స్వాధ్యాయాన్ని–అంటే గ్రంథలేఖన, వ్యాఖ్యానాదులను చేయాలి. తరువాత ఆత్మను పుష్కరాక్షుడైన పరమపురుషునిలో లగ్నం చేయాలి) అని తెలియజేశాడు. సూక్తిలోని **"పుష్కరేక్షణ, పురుష"** శబ్దాలు యథాతథంగా ప్రకృతశ్లోకంలో ప్రయోగింపబడడం వల్ల పై భారద్వాజసూక్తి ప్రకృతశ్లోకానికి మూలం అని తెలుస్తున్నది. శ్లోకంలోని చకారంవల్ల ఈ యోగం స్వాధ్యాయానికి ముందుకూడా చేయవచ్చునని ఏర్పడు తున్నది. యోగం ఆరాధనవలె మూడు కాలాల్లోను అనుష్ఠేయమన్నది అనంతరం చెప్పబడుతుంది. యోగమంటే–యోగులు తమ హృదయపుండరీకంలో దివ్యమంగళ విగ్రహవిశిష్టుడై వేంచేసియుండే భగవానుని నిశ్చలమైన మనస్సుతో చక్కగా ధ్యానించడం. ప్రకృతశ్లోకంలోని **"పుష్కరేక్షణ"** శబ్దప్రయోగం యోగిహృదయాల్లో విగ్రహవిశిష్టుడైన భగవద్రూపాన్ని సూచిస్తున్నది.



పరాశరమహర్షికూడా **"దేవతిర్యఙ్మనుష్యాదిచేతనేష్వపి సంస్థితః, తదంతర్యామ్య వస్థా హి విష్ణోః స్సర్వగతస్య వై, స ఏవ యోగిహృదయపంకజే తు సవిగ్రహః"** (అంతటా వ్యాపించిన విష్ణువుయొక్క దేవతలు, పశుపక్ష్యాదులు, మానవులు మొదలైన చేతనులలో ఉండే స్థితి అంతర్యామిరూపం. అతడే యోగిహృదయపుండరీకాలలో దివ్యమంగళ విగ్రహయుక్తుడై వేంచేసి ఉంటాడు) అని పలికాడు. తైత్తిరీయోపనిషత్తు **"స య శ్చాయం పురుషే య శ్చాసా వాదిత్యే"** (పురుషుని హృదయంలో ఉండేవాడు, సూర్యునిలో ఉండేవాడు ఒకడే) అని అంటూ ఆదిత్యమండలాంతర్వర్తి అయిన పురుషుడు, యోగిహృదయపుండరీకమధ్యవర్తి–ఇద్దఱూ ఒకరేనని చెప్పినందున, ఛాందోగ్యంలో – **"తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ"** అని ఆదిత్య మండలంలో ఉన్న భగవానుడు పుండరీకాక్షుడని చెప్పినందువల్ల, ఆ ఆదిత్యమండలం లోని భగవద్రూపంతో అభిన్నమైన యోగిపురుషహృదయవర్తికూడ పుండరీకాక్షుడేనని స్పష్టపడుతున్నది. ఈ అభిప్రాయంతోనే పై భరద్వాజమహర్షి సూక్తిలో **"పురుషే పుష్కరేక్షణే"** అని చెప్పబడింది. ఇక్కడ పురుషశబ్దప్రయోగంకూడా సందర్భోచితం. **"పూః స్సంజ్ఞో వై శరీరేఽ స్మిన్ శయనా త్పురుషో మతః"** (శరీరానికి పూః అని పేరు. అందులో ఉండే జీవునకు పురుషుడు అని పేరు) అనే పురుషశబ్దవ్యుత్పత్తి స్వారస్యాన్ని బట్టి యోగిహృదయంలో వేంచేసి ఉండే స్వామిని ఇక్కడ పురుషశబ్దంతో నిర్దేశించడం ఎంతో సముచితం. ఇది ప్రకృతంలో విశేష్యపదంగా గ్రహిస్తే పరికరాంకురాలంకారం. విశేషణంగా గ్రహిస్తే పరికరాలంకారం ఉన్నదని చెప్పవచ్చు.

ఈ స్తుతికర్తకూడా వరవరమునికావ్యంలో ఈ సందర్భాన్ని వర్ణిస్తూ **"విమలాయతలోచనే, అపరాధసహే నిత్యం దహరాకాశగోచరే"** (నిష్కల్మషాలైన, విశాలాలైన నేత్రాలను కలవాడు, అపరాధసహత్వమనే గుణాన్ని కలవాడు, నిత్యం దహరాకాశమనబడే హృదయావకాశంలో వేంచేసి ఉన్నవాడు) అని వచించారు. ఈ సూక్తిలోని **"దహరాకాశ"** శబ్దం **"బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ"** అని చెప్పబడ్డ హృదయపుండరీకాన్ని నిర్దేశిస్తుంది. **"అపరాధసహ"** మనే ప్రయోగం **"అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి, ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే"** (అంగుష్ఠ పరిమాణాన్నికల, పురుషశబ్దవాచ్యుడైన పరమాత్మ జీవుని లోపల వేంచేసిఉన్నాడు. అతడు భూతభవిష్యత్తులకు నియామకుడు కాబట్టి ఆ స్థితిని ఏవగించుకోడు) అనే శ్రుతియొక్క అర్థాన్ని తెలుపుతుంది. ఈ విధంగా

ఇక్కడ హృదయాకాశంలో భగవానుడు అంగుష్ఠపరిమాణుడై వేంచేసి ఉంటాడనే దహరాధికరణ, ప్రమితాధికరణ ప్రమేయాలు స్మరింపజేబడ్డాయి–అని వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్య ప్రమాణం.

**"తత శ్చేతః సమాధాయ పురుషే పుష్కరేక్షణే"** అనే ప్రకృత శ్లోకంలోని ప్రయోగం **"తతో యుంజీత చాత్మానం పురుషే పుష్కరేక్షణే"** అనే భారద్వాజవచనాన్ని శబ్దతః, అర్థతః స్మరింపజేస్తున్నది. **"తత శ్చేతః సమాధాయ"** అనే సూక్తి **"తతో యుంజీత చాత్మానమ్"** అనే ప్రయోగానికి స్మారకం. **"చేతః"** అనే పదం **"ఆత్మానమ్"** అనే పదానికి వ్యాఖ్యానరూపం. ఏవిధంగా అంటే – **"ఆత్మా యత్నధృతిస్వాంతస్వభావ పరమాత్మసు"** అని నానార్థరత్నమాలా ప్రమాణాన్నిబట్టి ప్రమాణంలోని **"ఆత్మ"** అనే శబ్దం మనస్సును తెలుపుతున్నదని ప్రకృతశ్లోకం వివరించింది. **"సమాధాయ"** అనే సూక్తి **"యుంజీత"** అనే ప్రయోగానికి వివరణం. **"యుజి–సమాధౌ"** అని కదా ధాతువు. ఆ రీతిలోనే **"తతః"** అనే ప్రకృతశ్లోకసూక్తి ప్రమాణంలోని **'చ'** కారాన్ని వ్యాఖ్యానించింది. ఇక, **"పురుషే పుష్కరేక్షణే"** అనే సూక్తి శబ్దతః ప్రమాణాన్ని అనుకరిస్తున్నదన్నది సుస్పష్టం. ఈ విధంగా ఆయా పదాలతో ప్రమాణవచనాన్ని అర్థత, శబ్దతః స్మరింపజేయడంలోని కవి ఉద్దేశ్యం శ్రీవరవరమునుల అనుష్ఠానం శాస్త్రానుగుణం కనుక పరమప్రమాణం – అని తెలియజేయడమే.

**31. అబ్జాసనస్థ మవదాతసుజాతమూర్తి –**
**మామీలితాక్ష మనుసంహితమంత్రరత్నమ్ ।**
**ఆనమ్రమౌళిభి రుపాసిత మంతరంగైః**
**నిత్యం మునిం వరవరం నిభృతో భజామి ॥**

అబ్జాసనస్థం=యోగంకోసం పద్మాసనంలో వేంచేసి ఉన్నవారై, అవదాతసుజాత మూర్తిమ్= తెల్లని, అందమైన రూపాన్ని కలవారై, ఆమీలిత+అక్షమ్= శుభాశ్రయ మనబడే భగవద్రూపాన్ని ధ్యానించినందున కొంచెం మూసికొన్న కన్నులను కలవారై, అనుసంహితమంత్రరత్నమ్= రహస్యంగా అనుసంధించబడిన మంత్రశ్రేష్ఠం అయిన ద్వయాన్ని కలవారై, ఆనమ్రమౌళిభిః=చక్కగా వంచిన శిరస్సును కల, అంతరంగైః = కోయిలణ్ణన్ మొదలైన అంతరంగశిష్యులచే, ఉపాసితమ్=సదా దర్శిస్తూ, సేవింపబడే, వరవరం మునిం=వరవరమునులను, నిభృతః(సన్)=జాగరూకతను కలవాడనై, నిత్యం భజామి=సదా భజిస్తున్నాను.



యోగంకోసం పద్మాసనంలో వేంచేసి ఉన్నవారై, పరమపరిశుద్ధమైన, సుందర దివ్యమంగళవిగ్రహాన్ని కలవారై, శుభాశ్రయవస్తుధ్యానంచేత కొంచెం మూసికొన్న తిరునేత్రాలను కలవారై, ద్వయానుసంధాననిరతులై, వినయం మూర్తీభవించినట్లున్న వానమామలైస్వామి మొదలైన అంతరంగశిష్యులు అంతరంగకైంకర్యాన్ని చేస్తూండగా వేంచేసి ఉండే వరవరమునులను ఏకాగ్రతతో నిత్యం భావించి, సేవిస్తున్నాను.

**(అబ్జాసనస్థమ్) – "తతో నివాతకే రమ్యే నిమ్నోన్నతవివర్జితే, కుశాజినసుచేలాని ఉపర్యుపరి విన్యసేత్, పద్మాసన స్తు తత్రైవ కృత్వాంగాని సమం నయేత్"** (ఎక్కువగా లేనిది, అందమైనది, ఎత్తుపల్లాలు లేనిది అయిన చోట కొయ్యపీటను వేసి, దానిపై దర్భలను, దానిపై జింకచర్మాన్ని, దాని మీద వస్త్రాన్ని పరచి, పద్మాసనంలో కూర్చుండి, అవయవాలను సమంగా ఉంచుకొని యోగాన్ని ఆచరించాలి) అని విశ్వామిత్రసూక్తి.

**(అవదాత) – "క్షీరసంఘాతగౌరమ్"** (పాలవలె తెల్లని) అని ఈ కవి వరవరమునుల దేహవర్ణం తెల్లనిది అంటూ ఉత్తరదినచర్యలో చేసిన వర్ణన స్మరణీయం. **"దుగ్ధోదన్వద్ధవళో"** అని అణ్ణన్‌కూడా వరవరమునిశతకంలో వర్ణించారు.

**(ఆమీలితాక్షమ్)** దీనిచే **"నాసాగ్రన్యస్తలోచనః"** అనే యోగనియమం దీనిచే స్మరింపబడింది.

**(అనుసంహితమంత్రరత్నమ్) – "అనేన మంత్రరత్నేణ మత్ప్రియేణ భజే త్సదా"** (నాకు ఇష్టమైన ఈ మంత్రరత్నంతో నన్ను సదా భజించాలి) అని పూర్వమే ద్వయానుసంధానం కార్యమని చెప్పబడింది కదా!

**(ఉపాసితమ్) – "ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్, "సదా పరగుణావిష్టో ద్రష్టవ్యః"** (ఆనందంతో కల్గిన చల్లని బాష్పాలను కలవాడు, పులకలతో కూడుకొన్న శరీరాన్ని కలవాడు, సదా పరమాత్మ కల్యాణగుణాలలో ఆసక్తిని కలవాడైన మహనీయుని సదా దర్శించాలి) అన్నట్లు వరవరమునులవంటి మహనీయులు సదా దర్శింపతగినవారుకదా! ఆనందంతో చల్లని కన్నీటిని కలవాడు, గగుర్పాటును కలదేహాన్ని కలవాడు, పరమాత్మ కల్యాణగుణాలచే సదా ఆవేశింపబడ్డవాడు అయిన యోగిని దేహాన్నికల అందటికి దర్శింపతగినవాడు–అని విష్ణుధర్మం తెలిపిన రీతిలో వేంచేసి ఉన్న వరవరమునులను ఎల్లప్పుడూ సేవిస్తున్నానని శ్లోకతాత్పర్యం. **(నిత్యం**

**భజామి)** – నిత్యం సేవిస్తున్నాను – అని భావం. దీని చేత **"విగ్రహాలోకనపరః"** అని పూర్వం తెలుపబడ్డ విధి స్మరింపజేయబడింది. **"తత శ్చైకాంత మాశ్రిత్య సన్నివిష్టం కృతాంజలిమ్, శ్రీభూపతే శ్చ చరణౌ చింతయంతమ్ నమామి తమ్"** (తర్వాత ఏకాంతంలో అంజలిని చేస్తూ కూర్చొని ఉండేవారు, శ్రీదేవి, భూదేవులకు పతి అయిన భగవంతుని శ్రీచరణాలను చింతించేవారైన ఆ శ్రీరామానుజులను నమస్కరిస్తున్నాను) అనే యతిపతిదినచర్యాస్తుతిప్రయోగం భావనీయం.

**32. తత శ్శుభాశ్రయే తస్మి న్నిమగ్నం నిభృతం మనః ।**
**యతీంద్రప్రవణం కర్తుం యతమానం నమామి తమ్ ॥**

తతః=యోగాభ్యాసానంతరం, తస్మిన్=పూర్వశ్లోకంలో ప్రస్తావింపబడ్డ ఆ, శుభాశ్రయే = యోగిధ్యేయమైన భగవద్రూపంలో, నిమగ్నం=మునిగిన, నిభృతం=నిశ్చలమైన, మనః= మనస్సును, యతీంద్రప్రవణమ్=యతీంద్రులైన శ్రీరామానుజుల పట్ల అత్యంత ప్రావణ్యాన్ని కలిగి ఉండేటట్లు, కర్తుం=చేయడానికి, యతమానం=ఆరంభం చేసే, తం=ఆ వరవరమునులను, నమామి=నమస్కరిస్తున్నాను.

యోగాభ్యాసాన్ని చేసిన తరువాత, ఆ శుభాశ్రయ వస్తువులో లయించి, నిశ్చలంగా ఉన్న మనస్సును నివర్తింపజేసి, భగవద్రామానుజులపట్ల ప్రావణ్యాన్ని కలిగి ఉండేటట్లు చేయడానికి ప్రయత్నించే ఆ వరవరమునులను నమస్కరిస్తున్నాను.

**(తతః) "యతీంద్రచరణద్వంద్వప్రవణేనైవ చేతసా"** అని పూర్వం తెల్పిన రీతిలో ఆ రామానుజుల పాదాలను స్మరిస్తూ, వారికి ఉద్దేశ్యభూతుడైన భగవానుని శుభాశ్రయాన్ని ధ్యానించిన తరువాత – అని భావం.

**(శుభాశ్రయే)** – **"పుష్కరేక్షణే పురుషే"** అని కీర్తింపబడ్డ భగవద్రూపంలో–అని భావం. **"హేయప్రత్యనీకత్వే సతి సమస్తకల్యాణగుణాకరత్వమ్"** (హేయ గుణాలకు ప్రతిభటంగా ఉండడం, అన్ని కల్యాణగుణాలను కలిగి ఉండడం) అన్నది శుభాశ్రయ లక్షణం.

**(నిభృతం)** నిశ్చలంగా ఉన్న–అని అర్థం.

**(యతీంద్రప్రవణం కర్తుమ్) "యతీంద్రప్రవణ మేవ కర్తుమ్"** అని భావం. పూర్వం (16వ శ్లోకంలో) ఈ యతీంద్రచరణద్వంద్వప్రావణ్యం కర్తవ్యాలలో తాను అధికారం



కల్గి ఉండడాన్ని తెలుపడంకోసం అన్యవిశేషణంగా చెప్పబడింది. ఇక్కడ మాత్రం అనన్యార్థంగా – అంటే – యతీంద్రచరణద్వంద్వప్రావణ్యమే పరమప్రయోజనం మని తెలుపడంకోసం చెప్పబడింది.

**(తమ్)** – యతీంద్రప్రవణులుగా ప్రసిద్ధులైన వరవరమునులను, **(నమామి)**– చరమపర్వ నిష్ఠకు గల గొప్ప వైలక్షణ్యాన్ని అనుసంధించి, నిర్భయుణ్ణి, నిర్భరుణ్ణి అయిన నేను ఆ వరవరమునులతో నాకు గల సంబంధాన్ని అనుసంధిస్తున్నానని భావం. **"యతీంద్రప్రవణం కర్తుం యతమానం నమామి తమ్"** అనే సూక్తివల్ల మణవాళమహామునుల చరపర్వనిష్ఠను – అంటే యతీంద్రప్రావణ్యాన్ని అనుసంధించి, వారిని సేవిస్తే తమకుకూడా చరమ పర్వనిష్ఠ సిద్ధిస్తుందనే స్తుతికర్త భావం ధ్వనిస్తుంది. నిష్ఠ కల్గినవారితోడి సంబంధం మనకుకూడా నిష్ఠను కల్గిస్తుందని తాత్పర్యం. **"సంసర్గజా దోషగుణా భవంతి"** (సంబంధం వల్ల దోషాలు, గుణాలు కలుగుతాయి) అని కదా లోకోక్తి. వరవరమునుల మనస్సు ఎల్లప్పుడూ శ్రీరామానుజుల శ్రీపాదాలలో ప్రావణ్యాన్ని కల్గి ఉంటుంది. మధ్యలో **"పురుషే పుష్కరేక్షణే"** అని భగవానుని శుభాశ్రయంపట్ల కల్గిన చేతస్సమాధానం ప్రాప్తమైనందున, ఆ స్థితినుండి తిరిగి పూర్వరీతిలో యతీంద్రప్రవణమైన హృదయాన్ని కల్గినవారు కావడం ఇక్కడ తెలుపబడింది. యోగంనుండి బయటకు వచ్చిన వరవరమునులు భగవద్రామానుజుల దాసులైన శ్రీవైష్ణవులతో కలసి కాలం గడిపే రీతిని, అనుగ్రహించబోయే ఉత్తరదినచర్యకు ఉపోద్ఘాతంగా చెప్పినట్లయింది. అపరాహ్ణంలో శ్రీవచనభూషణాది దివ్యగ్రంథకాలక్షేపంగూర్చి తెలుపబడుతున్నదికదా! దానికి ఈ శ్లోకం అవతరికగా ఉన్నది–అని శ్రీ.ప్ర.భ. అణ్ణాస్వామివారివ్యాఖ్య. "శుభాశ్రయమన్నది ధ్యానించేవాని హేయాలైన దుఃఖాదులను తొలగించేది, అతని మనస్సు తనపట్ల నిశ్చలంగా లగ్నమయేటట్లు చేసేది అయిన భగవానుని దివ్యమంగళవిగ్రహం." అని శ్రీమాన్ టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారి వివరణం.

**పూర్వదినచర్య వ్యాఖ్య సంపూర్ణం**



## శ్రీమణవాళమహామునులు అనుగ్రహించిన

# యతిరాజవింశతి

### తనియన్

**యః స్తుతిం యతిపతిప్రసాదనీం**
**వ్యాజహార యతిరాజవింశతిమ్ ।**
**తం ప్రపన్నజన చాతకాంబుదం**
**నౌమి సౌమ్యవరయోగిపుంగవమ్ ॥**

ఏ శ్రీవరవరమునులు, భగవద్రామానుజులకు ఆనందాన్ని కల్గించే యతిరాజవింశతి అనే స్తుతిని పలికారో, ప్రపన్నజనులనే చాతకపక్షులకు మేఘంవలె సంతోషాన్ని కల్గించే ఆ శ్రీవరవరమునులకు నమస్కరిస్తున్నాను.



శ్రీపిళ్ళైలోకమ్ జీయర్ వ్యాఖ్యానానువాదం

## అవతారిక

తిరువాయ్‌మొழிప్పిళ్ళై అనే ఆచార్యులు **"తొణ్డర్ క్కముదుణ్ణ చ్చొన్మాలైకళ్ శొన్నేన్"** (భక్తులకు అమృతంవంటి సూక్తి మాలికలను పలికాను) అనే రీతిలో భూసురులైన శ్రీవైష్ణవులకు భోగ్యంగా అవతరించిన తిరువాయ్‌మొழி ప్రబంధంలో అవగాహనం చేసి (మిక్కిలిగా ఆసక్తిని పొంది), అందులోని శబ్దరసం, అర్థరసం, భావరసం - అనే వీనిని అనుభవించి, ఆ ప్రబంధంలోనే నిష్ఠను కలవారై, అంతేకాక అన్యప్రబంధాలపట్ల అంతటి ఆసక్తిని లేనివారైనందున వారికి ఆ పేరు (తిరువాయ్‌మొழிప్పిళ్ళై అనే పేరు) కల్గింది. ఆழ்వార్ల శ్రీచరణాలలోనే సదా కైంకర్యం చేస్తూ కాలం గడిపే ఆ ఆచార్యుల శ్రీచరణాలను శ్రీవరవరమునులు ఆశ్రయించారు. ద్రావిడవేద - వేదాంగాల రూపంలోని దివ్యప్రంబంధాల తాత్పర్యాలను తిరువాయ్‌మొழிప్పిళ్ళై ఉపదేశించగా వారు పొందారు. **"మిక్క వేదియర్ వేదత్తినుట్పొరుళ్"** (గొప్ప వైదికులు పలికే వేదంలోని అంతరార్థం) అయిన చరమపర్వంలో నిష్ఠను కలవారై, శేషిత్వం, శరణ్యత్వం, ప్రాప్యత్వం - అనే ఆకారత్రయాన్ని పిళ్ళై విషయం లోనే కల్గినవారై, వారి పట్లనే నిష్ఠను కలవారై ఉండే శ్రీవరవరమునులను తిరువాయ్‌మొழி ప్పిళ్ళై చూచి, వారి ఆచార్యనిష్ఠకు చాలా సంతోషించి "శ్రీరామానుజుల శ్రీచరణాలే శరణమని'' వారికి ఉపదేశించారు. అందువల్ల వరవరమునులు ఆచార్యాజ్ఞను అనుసరించి, శ్రీరామానుజుల (శ్రీచరణాల)పట్ల చాలా ప్రావణ్యాన్ని పొందారు. శ్రీరామానుజుల గుణచేష్టితాలను గూర్చి పల్కి ఆనందించాలనే దశ వారికి కలుగగా, ఆ శ్రీరామానుజుల వైభవాన్ని గూర్చి పలికేవారై, చరమోపాయనిష్ఠులైన చరమాధికారులకు నిత్యం అనుసంధించ దగినవి అయిన చరమార్థాలను ఈ స్తుతి ప్రబంధరూపంలో వ్యక్తం చేస్తూ, తమ మనస్సులోని కోరికలను ఆ శ్రీరామానుజుల శ్రీచరణాలలో ప్రార్థించి, స్తోత్రాన్ని పూర్తిచేస్తున్నారు.





అవతారిక : ఈ ప్రబంధంలోని మొదటి శ్లోకంతో, నమ్మాழ்వార్ల శ్రీచరణాలలో శ్రీరామానుజుల పూర్ణమైన భక్తిని, తమ అభిమానాన్ని పొందినవారి దుఃఖాలను పోగొట్టి రక్షించే వారి స్వభావాన్ని గూర్చి పల్కుతూ, తాము ప్రారంభించిన స్తోత్రం నిర్విఘ్నంగా పరిసమాప్తి అయేటట్లు చేయగల శ్రీరామానుజుల శ్రీచరణాలలో నమస్కరిస్తున్నారు.

**1. శ్రీమాధవాంఘ్రిజలజద్వయ నిత్యసేవా -**
**ప్రేమావిలాశయ పరాంకుశ పాదభక్తమ్।**
**కామాదిదోషహర మాత్మపదాశ్రితానాం**
**రామానుజం యతిపతిం ప్రణమామి మూర్ధ్నా॥**

శ్రియఃపతి పాదపద్మాల జంటను నిత్యం సేవించడంలోని ప్రేమచేత వ్యాకులమైన బుద్ధిని కల నమ్మాழ்వార్ల శ్రీచరణాలపట్ల భక్తిని కల్గినవారు, తమ పాదాలను ఆశ్రయించినవారి కామాదిదోషాలను పోగొట్టేవారు, యతిరాజులు అయిన శ్రీరామానుజులను శిరసా నమస్కరిస్తున్నాను.

వ్యాఖ్యానం : (**శ్రీమాధవాంఘ్రిజలజద్వయేత్యాది**) - **"తిరుమాలే! నానుమ్ ఉనక్కు ప్పழவడియేన్"** - (శ్రియఃపతీ! నేను నీకు అనాదిగా దాసుడను) అనే రీతిలో మిథునశేషత్వమే (లక్షి, నారాయణులనే దివ్యదంపతులకు శేషమై

ఉండడమే) జీవస్వరూపం కనుక, ఆ స్వరూపానికి తగిన పురుషార్థంకూడా ఆ దివ్యదంపతులకు చేసే కైంకర్యమే అవుతుంది. కనుక **"తిరుమాఱ్కురవు శెన్రాల్ కుడైయామ్"** (శ్రియఃపతి నడచినపుడు ఆదిశేషుడు గొడుగై సేవిస్తాడు) అని నిత్యసూరులలో ముఖ్యుడైన ఆదిశేషుడు దివ్యదంపతుల చేరికలో కైంకర్యం చేస్తాడని చెప్పబడింది. శ్రీవరవరమునులు ఆదిశేషుల అవతారమే కనుక), ఆ పూర్వజన్మ సంస్కారంచేత లక్ష్మణావతారంలో దివ్యదంపతులను వెంబడిస్తూ కైంకర్యం చేయాలని వెళ్ళినపుడు కూడా **"భవాం స్తు సహ వైదేహ్యా గిరి సానుషు రంస్యతే, అహం సర్వం కరిష్యామి"** (రామా! నీవు వైదేహితోపాటు కొండ చరియలలో విహరిస్తావు. అపుడు నీకు అన్ని సేవలను చేస్తాను) అని శ్రీరాముని అర్థించారు. ఆవిధంగానే కదా నమ్మాళ్వార్లు కూడా **"అడిమై శెయ్‌వార్ తిరుమాలుక్కు"** (లక్ష్మీవల్లభునకు కైంకర్యం చేస్తారు) అని, **"కోలత్తిరు మామకళోడు ఉన్నై క్కూడ"** (అందమైన లక్ష్మీదేవితో ఉండే నీకు కైంకర్యం చేస్తాను) అని మిథునమే కైంకర్యప్రతిసంబంధిగా (సేవను స్వీకరించేవారుగా) చెప్పారుకదా!

అందుచేత, శ్రియఃపతి అయిన భగవంతుని శ్రీచరణపద్మాలలో కైంకర్యం చేయాలనే తీవ్రమైన ఆశచేత కలతపొందిన మనస్సు కల్గినవారైన ఆళ్వార్ల శ్రీచరణాలలోని ప్రేమయే (భక్తియే) తమకు నిరూపక లక్షణంగా కల్గినవారై, శ్రీరామానుజులున్నారని దీని అర్థం. **"మాయాః ధవో-మాధవః"** (లక్ష్మికి భర్త) అనే మాధవ శబ్దం ఇక్కడ శ్రియఃపతిత్వం చెప్పబడినందున శ్రీశబ్దం (**"శ్రీమాధవాంఘ్రి"** అనే చోట గల శ్రీశబ్దం) ఔపచారికం. మఱి ఎందుకు ఈవిధంగా ప్రయోగించారంటే, **"శీమాదవన్ గోవిన్దన్"** అని **"శ్రీమాధవ"** శబ్దాన్ని తిరువాయ్‌మొళిలో నమ్మాళ్వార్లు ప్రయోగించిన దివ్యసూక్తిని దృష్టిలో పెట్టుకొని శ్రీవరవరమునులు ఈ విధంగా ప్రయోగించారు.

శ్రీరామానుజుల వైభవాన్ని గూర్చి పలికేటపుడు జ్ఞానభక్తి వైరాగ్యాలను పురస్కరించుకొని వారి వైభవాన్ని పలుకకుండా, నమ్మాళ్వార్ల శ్రీచరణాలలో సంబంధాన్ని పురస్కరించుకొని శ్రీరామానుజవైభవాన్ని వరవరమునులు పల్కడానికి కారణం ఏమి? అంటే - **"మాఱనడిపణిన్దుయ్‌న్దవన్"** (శ్రీరామానుజులు నమ్మాళ్వార్ల శ్రీచరణాలను ఆశ్రయించి ఉజ్జీవించినవారు) అని అముదనార్ పల్కిన దివ్యసూక్తియే కారణం. ఇక్కడ **"అంఘ్రి"** శబ్దంతో భగవంతుని దివ్య మంగళవిగ్రహయోగం తెలుపబడుతున్నది. జలజశబ్దంతో శ్రీచరణాల లోని భోగ్యత (పద్మసామ్యంద్వారా) చెప్పబడింది. ద్వయశబ్దంద్వారా **"ఉన్నినై యడిత్తామరైకళ్"** (నీ పాదపద్మాల జంట) అనే రీతిలో రెండు తామరపూవులను చక్కగా పొందికగా చేర్చి పెట్టినట్లుగా ఉండే ఆ చేరికలోని పరస్పర సాదృశ్యం (పోలిక)చెప్పబడింది. సేవాశబ్దంతో కైంకర్యం తెలుపబడింది. నిత్యశబ్దంతో **"ఒழிవిల్ కాలమెల్లామ్"** (విచ్ఛేదం లేని కాలం అంతా) అనే విధంగా ఈసేవ ఆత్మ ఉన్నంతవరకు ఉండాలి - నిత్యంగా - అనే అర్థంచెప్పబడింది. ఇది (ఈకైంకర్యం), **"ఉడనాయ్ మన్ని వழுవిలా అడిమై శెయ్యవేణ్డుమ్"** (వెంటనే మన్నికగా ఉండి, విచ్ఛేదం లేని కైంకర్యం చేయాలి) అని నమ్మాళ్వార్లు పల్కిన సర్వదేశసర్వకాల సర్వావస్థలలో చేయదగిన సర్వవిధకైంకర్యాలకు ఉపలక్షణం. ఇటువంటి కైంకర్యాన్ని పొందాలి - అనే ప్రేమ పారవశ్యంతోనే నమ్మాళ్వార్లు **"శిన్దై కలఙ్గి తిరుమాల్! ఎన్నழைప్పన్"** (మనస్సు కలత చెంది, ఓ శ్రియఃపతీ! అని పిలుస్తాను) అని ఆర్తితో పిలచారు. లోకం అంతా అన్నపానాదులకోసం గొంతెత్తి ఆక్రందిస్తూ ఉండగా, భగవత్కైంకర్యం చేయలేకపోతే నిలువలేక, ఆక్రందిస్తూ క్లేశపడే వీరి రీతి ఉభయవిభూతులలో ఉండేవారందఱికంటే విలక్షణంగా ఉన్నందున ఈవిధంగా **"శ్రియఃపతీ!"** అని ఆర్తితో పిలచారు. ఇటువంటి, ఆళ్వార్ల స్వభావంపట్ల గల మిక్కిలి అభినివేశంతో వారి శ్రీచరణాల పట్ల రామానుజులు ప్రేమను కలవారై ఉన్నారు.

**(కామాదీత్యాధి)** - భగవత్కైంకర్యానికి అడ్డుగా ఉండే లౌకిక విషయాల పట్ల అభినివేశమనే కామం, ఆదిశబ్దంచేత చెప్పబడే, భగవదేకరక్ష్యత్వానికి (భగవానునిచే మాత్రమే రక్షింపదగి ఉండడానికి) విరోధి అయిన అర్థతృష్ణను, తదేకశేషత్వ విరోధి (భగవానునకు మాత్రమే శేషమై ఉండడం అనే స్థితికి విరోధి) అయిన అహంకారం - మొదలైన దుర్గుణాలు తమ శ్రీచరణాలలో ఆశ్రయించిన వారికి లేకుండా తమ ఉపదేశాలతో, తమ కటాక్షావిశేషాలతో సవాసనగా వాటిని పోగొట్టేవారు- అని భావం.

**(రామానుజమ్)** - **"న చేద్రామానుజేత్యేషా చతురా చతురక్షరీ, కామవస్థాం ప్రపద్యంతే జంతవో హంత! మాదృశః"** (రామానుజ- అనే ఈ నాల్గు అక్షరాల,

మిక్కిలి చాతుర్యాన్ని కల నామమే లేకపోతే, అయ్యో!, మావంటి ప్రాణులు ఏగతిని పొందుతారో కదా!) అని జ్ఞానం కలవారు అభినివేశాన్ని పొందేటట్లుగా మోక్షహేతువైన రామానుజ అనే తిరునామాన్ని కలవారని భావం.

**(యతిపతిమ్)-** జితేంద్రియులైన సన్న్యాసులలో, గొప్పవారైన- అని అర్థం. ఈపదం ఇంతకు ముందు చెప్పిన ఆశ్రితుల దోషాన్ని నివర్తింప (లేకుండా)జేసే స్వభావానికి మూలమైన గుణయోగాన్ని (మంచి గుణాలను కల్గి ఉండడాన్ని) తెల్పుతున్నది. (**"ప్రణమామి"** అని పల్కితేనే చాలి ఉండగా, **"మూర్ధ్నా ప్రణమామి"** అని అనడంవల్ల - విషయం (రామానుజులనే విషయం యొక్క) వైభవాన్ని అనుసంధించి, మానసంగా ప్రణామం చేయడంతో నిలువకుండా, తమ గొప్ప ఆదరంతో నిండినవారై, శ్రీరామానుజుల శ్రీచరణాలలో తలను వంచుతున్నారు - అనే విషయం స్ఫురిస్తున్నది.

**అవతారిక :** ఈ విధంగా ఆరంభించిన స్తోత్రం నిర్విఘ్నంగా పూర్తి కావడం కోసం, వారి శ్రీచరణాలను ఆశ్రయించి, దానివల్ల తేజస్సును (ఉజ్జీవనాన్ని) పొందినవారై, శ్రీరామానుజులకు భగవద్భాగవతులపట్ల గల ప్రేమాతిశయాన్ని, ఆశ్రితులకు ఉత్తమమైన ప్రాప్యంగా (ప్రయోజనంగా) ఉండే రీతిని గూర్చి ఇందులో పల్కి, సాదరంగా స్తుతిస్తున్నారు.

**2. శ్రీరంగరాజచరణాంబుజరాజహంసం**
**శ్రీమత్పరాఙ్కుశ పదాంబుజభృంగరాజమ్ ।**
**శ్రీభట్టనాథపరకాల ముఖాబ్జమిత్రం**
**శ్రీవత్సచిహ్నశరణం యతిరాజమీడే ॥**

శ్రీరంగనాథుని పాదపద్మాలలో రాజహంసవంటివారు, కైంకర్యలక్ష్మిని కల నమ్మాళ్వార్ల శ్రీచరణపద్మాలలో వాలే గొప్ప తుమ్మెదవంటివారు, పెరియాళ్వార్లు, తిరుమంగైమన్నన్ మొదలైన ఆళ్వార్ల ముఖాలనే పద్మాలను వికసింపజేసే సూర్యుని వంటివారైన యతిరాజులను స్తుతిస్తున్నాను.

వ్యాఖ్యానమ్ : **(శ్రీరంగరాజేత్యాది)** - భగవానుని విషయంలో చూస్తే, అసారమైన అంశాన్ని (పరత్వాదులను) వేఱుచేసి, సారమైన అంశంలో (అర్చావతారంలో) (సౌలభ్యాదులలో) ఊనికను (ఆసక్తిని) కల్గి ఉంటారు. పరం, వ్యూహం అనే భగవద్రూపాలు నిత్యులకు, ముక్తులకు, ముక్తులో సమానులైన ఈలోకంలోని గొప్ప జ్ఞానులకు మాత్రమే సాక్షాత్కరించుకోదగినవి అయినందున, విభవం, అంతర్యామి - అనేవి పుణ్యం చేసినవారికి, (విభవావతారం), ఉపాసకులకు (అంతర్యామిరూపం) సాక్షాత్కారాన్ని ఇచ్చేవి అయినందున ఈనాల్గింటికి కొన్ని అవధులున్నాయి.

**"అడియోముక్కే ఎమ్బెరుమాన్ అల్లీరో!"** (అనన్యగతికులమైన దాసులమైన మాకే మీరు స్వామికదా!) అని పరత్వాదులకు లక్ష్యభూతులు కాని వెనుకబడినవారికికూడా (సామాన్యులకు) దర్శనాన్ని అనుగ్రహిస్తూ ఉండే అర్చావతారాన్ని గూర్చి చెప్పగల్గిన కొఱత ఏమీ లేదు కదా! ఈ రీతిలో సౌలభ్యానికి పరమావధి అయిన అర్చాస్థలాలకు అన్నిటికి మూలమైన (నిలయమైన) శ్రీరంగంలో శ్రీరామానుజులు మిక్కిలిగా అభినివేశాన్ని కల్గి ఉన్నారు.

అందువల్ల, శ్రీరంగనాథుని శ్రీచరణాలలో గల మిక్కిలి భోగ్యతను అనుభవించి, సరసమైన సంచరణాన్ని చేసే శ్రీరామానుజుల రీతిని గూర్చి శ్రీవరవరమునులు పల్కుతున్నారు. పరమపదంలోని ఐశ్వర్యం కూడా **చుళుకీకృతం - పుడిసిలి మాత్రం** - అనే రీతిలోనే ఐశ్వర్యాన్ని కల్గినదై, **"రతిం గతః"** (శ్రీరంగంపట్ల ఆసక్తిని పొందాడు) అనేటట్లు సర్వజ్ఞుడైన సర్వేశ్వరుని కూడా తన భోగ్యతతో వ్యామోహపరచే రీతిలోని అంతు లేని భోగ్యమైన శ్రీరంగక్షేత్రాన్ని **"అరఙ్గర్‌మౌళి"** అనేటట్లు స్వాధీనంగా చేసికొన్నందున ఏర్పడే గొప్పతనాన్ని కల శ్రీరంగనాథుని శ్రీచరణకమలాలలో ప్రవహించే మధు ప్రవాహంలో రెక్కలాడిస్తూ (స్నానమాడి) వర్తించే గొప్పహంసగా ఉండేవారు - శ్రీరామానుజులు - అని భావం. **"పొన్నరఙ్గమెన్నిల్ మయలే పెరుకు మిరామానుశన్"** (బంగారువలె వ్యామోహాన్ని పొందదగిన శ్రీరంగంపట్ల అత్యంత ప్రావణ్యాన్ని కలవారు శ్రీరామానుజులు) అనే రీతిలోని కదా- ఈ దివ్యదేశంపట్ల శ్రీరామానుజులకు ఉండే ప్రావణ్యం.

**(శ్రీమత్పరాంకుశేత్యాది)** ఇక, భాగవత విషయంలోని వీరి ప్రావణ్యాన్ని గూర్చి పల్కితే, తమ ప్రయత్నంతో భగవంతుని పొందాలని యత్నించే

ఉపాసకులుగా కాకుండా, శరణాగతిని చేసినప్పటికీ, ఆ శరణాగతిని సాధనంగా తలచేవారుగా కాకుండా అతడే (భగవంతుడే) ఉపాయమని తలచినప్పటికీ "అతడు ఫలాన్ని ఇవ్వాలని అనుకొన్నప్పుడు ఇవ్వనీ, మనం త్వర పడకూడదు'' అని సహించి ఉండేవారుగా కాకుండా, "ప్రాప్యం, ప్రాపకం- అనే రెండు భగవంతుడే'' అని నిశ్చయించుకొని, "ఇపుడే ప్రాప్యాన్ని పొందాలి'' అనే మిక్కిలి అభినివేశంతో కన్నీరు విడచి, (ఆర్తిపొంది) తొందరపడే ఆర్తిని కలవారై, పరం, వ్యూహం, విభవం మొదలైనవానిలో కంటే, **"కణ్డియూర్ అరఙ్గమ్" (తిరుక్కణ్డి యూర్, శ్రీరంగం)** అనే రీతిలో శ్రీరంగం మొదలైన దివ్యదేశాలపట్ల మిక్కిలి వ్యామోహాన్ని కల్గి ఉండే ఆ<u>ళ్వా</u>ర్ల విషయంలో వీరి (శ్రీరామానుజుల) మనస్సు మిక్కిలిగా లగ్నమై ఉన్నది.

అందువల్ల, కైంకర్యంలో అభినివేశమనే (జీవుని) స్వరూపానికి తగిన సంపత్తును కలవారై, నిరంకుశస్వతంత్రుడైన భగవంతుని, **"ఈశ్వరోఽహమ్"** (నేను ఈశ్వరుడను) అని తలచే సంసారులను తమ గొప్ప సూక్తులతో వశీకరించుకొని, వారు ఆనందంతో తలపంకించేట్లు చేసినందున పరాంకుశులనే నామాన్ని కలవారైన, ఆ<u>ళ్వా</u>ర్లలో ముఖ్యులైన నమ్మా<u>ళ్వా</u>ర్ల చాలా భోగ్యమైన శ్రీచరణాలలో భోగ్యతానుసంధానాన్ని (అవి భోగ్యాలనే నిరంతర భావాన్ని) నిత్యజీవనంగా కలవారు (శ్రీరామానుజులు) - అనిభావం.

పూర్వం, **"పరాంకుశపాదభక్తమ్"** అని నమ్మా<u>ళ్వా</u>ర్ల శ్రీచరణాల పట్ల ప్రేమను కలవారని మాత్రం చెప్పబడింది. ఇక్కడ ఆ ప్రేమకు తగినట్లు వారి శ్రీచరణాలలోని భోగ్యతలో అవగాహించి (మిక్కిలిగా ఆసక్తిని కలవారై - (అంటే, నమ్మా<u>ళ్వా</u>ర్ల పట్ల మిక్కిలి ప్రేమను భక్తిని, కలవారై) ఆనందించే రీతి చెప్పబడు తున్నది. మిగిలిన ఆ<u>ళ్వా</u>ర్లకంటే నమ్మా<u>ళ్వా</u>ర్లకు ఉండే వైలక్షణ్యం స్ఫురించే టట్లుగా, ఆ<u>ళ్వా</u>ర్లు అందఱితో కలిపి వారిని అనుసంధించినంత మాత్రంతో చాలదని తలచి, ప్రత్యేకంగా ముందుగా అనుసంధించారు. ఇపుడు, వారితో (మిగిలిన ఆ<u>ళ్వా</u>ర్లతో) కలిపి అనుసంధిస్తున్నారు. లక్ష్మీదేవిని మిగిలిన దివ్యపత్నులందఱితో కలిపి అనుసంధిస్తున్నప్పటికీ, ముందుగానే **"శ్రియఃపతి"** అని ఆమె వైలక్షణ్యం స్ఫురించేటట్లు శ్రీరామానుజులు అనుసంధించినట్లుగా,



మిగిలిన ఆ<u>ళ్వా</u>ర్లు వీరికి అంగభూతులు - అనేటట్లుగా కదా, నమ్మా<u>ళ్వా</u>ర్ల గొప్పతనం ఉన్నది.

**(శ్రీభట్టనాథ)-** భగవన్మంగళాశాసన రూపమైన ఐశ్వర్యాన్ని కలవారై, బ్రాహ్మణోత్తములైన పెరియా<u>ళ్వా</u>ర్లయొక్క, బాహ్యులు కుదృష్టులు - అనే ప్రతివాదులకు మృత్యువువంటివారైన తిరుమంగై ఆ<u>ళ్వా</u>ర్లయొక్క తిరుముఖ మండలమనే తామరలను వికసింపజేసే సూర్యుడు - అని భావం. **"ఆళుమాళార్?"** (భగవానుని రక్షించేవారెవరు?) అనే లోటు తీరేటట్లు శ్రీరామానుజులు జీవులను సంస్కరించి, భగవంతుని దగ్గరకు చేర్చినందున, వారిని చూడగానే ఆ<u>ళ్వా</u>ర్ల ముఖం వికసిస్తుంది.

**(శ్రీవత్సచిహ్నశరణమ్)** - ఇంతకుముందు, **"ఆత్మపదాశ్రితానామ్, కామాదిదోషహరమ్"** (తమ పాదాలను ఆశ్రయించినవారి కామాదిదోషాలను పోగొట్టేవారు) అని పల్కి సామాన్యంగా, తమ శ్రీచరణాలను ఆశ్రయించిన వారికి మోక్షోపాయమై ఉండేవారనే విషయం చెప్పబడింది. ఇక్కడ, వారంతా ఒక ఎత్తు; తాము ఒక ఎత్తు - అనే రీతిలోని గొప్పతనాన్ని కలవారై, శిష్యాచార్య క్రమానికి అవధి అయిన కూరేశులకు ప్రాప్య - ప్రాపకాలు రెండు తామే (రామానుజులే) అయిన రీతి చెప్పబడుతున్నది.

**(యతిరాజమీడే)** - ఈ విధంగా ఆ<u>ళ్వా</u>ర్లు అభిమానించిన విషయమైన శ్రీరంగనాథుని పట్ల, **"ముకిల్వణ్ణన్ అడియై అడైన్దు అరుళ్ శూడి ఉయ్న్ద"** (మేఘవర్ణుడైన శ్రీరంగనాథుని శ్రీచరణాలను శరణు పొంది, ఆ స్వామి అనుగ్రహాన్ని పొంది, ఉజ్జీవించిన) నమ్మా<u>ళ్వా</u>ర్ల విషయంలో వారి, వారికి తగిన పూర్ణమైన ప్రేమను కలవారై, భక్తులకు ప్రాప్య- ప్రాపకరూపులై ఉండేవారిని - స్తుతిస్తున్నాను - అని భావం.

**3. అవతారిక :** "మమ్మలను ఆశ్రయించినవారికి ప్రాప్యం, ప్రాపకం- మేమే- అని అన్నారు కదా! అయితే, మమ్మలను ఆశ్రయించిన మీకా నియమం వర్తించదా ఏమి?'' అని శ్రీరామానుజుల అభిప్రాయంగా తలచి, "నాకు ఆ రీతిలో కాదు; దేవరవారి శ్రీచరణాలే ప్రాప్యం, ప్రాపకం - అని ఆశ్రయించిన కూరేశులు మొదలైనవారి శ్రీచరణాలే ప్రాప్యం, ప్రాపకం - అని ఆశ్రయించిన వాడను కావాలి'' - అని శ్రీరామానుజుల శ్రీచరణసన్నిధిలో ప్రార్థిస్తున్నారు.

**3. వాచా యతీంద్ర! మనసా వపుషా చ యుష్మత్**
**పాదారవిందయుగళం భజతాం గురూణామ్ ।**
**కూరాధినాథకురుకేశ ముఖాద్యపుంసాం**
**పాదానుచింతనపర స్సతతం భవేయమ్ ॥**

ఓ యతీంద్రా! మనస్సుతో, వాక్కుతో, శరీరంతో నీ పాదపద్మాల జంటను సేవించే మహనీయులైన కూరేశుల, తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ (కురుకేశులు) మొదలైన పూర్వాచార్యుల శ్రీపాదాలనుగూర్చి చింతించడంలో ఆసక్తిని కలవాడనునై నేను ఎల్లప్పుడు కావాలి.

వ్యాఖ్యానమ్ : **(వాచా యతీంద్రేత్యాది)** - "ప్రత్యక్షే గురవ స్స్తుత్యాః" (ఆచార్యులను ప్రత్యక్షంగా స్తుతించాలి) అనే విధంగా భగవానుని పొందడంలో ఉపకారకులైన ఆచార్యులను స్తుతించడానికి, స్మరించడానికి, నమస్కరించ డానికి కదా, ఈ జీవులకు వాక్కు, మనస్సు, శరీరం ముందుగా సృష్టింప బడ్డాయి. **"విచిత్రా దేహసంపత్తిః"** (దేహమనే సంపద విచిత్రమైనది ఈశ్వరునకు నివేదించడం కోసం సృష్టింపబడింది) అనే విధంగా సర్వేశ్వరుడు తనను ఆశ్రయించడం కోసం ఇచ్చిన కరణాలతో అన్యపరులై సంచరించే ఈ లోకంలో, భవత్సమాశ్రయణాన్ని చేయడం మాత్రమేకాక, దానిని కూడా ప్రథమావధి- అని విడచి, "చరమావధి అయిన, ఆచార్యుల విషయంలో కరణత్రయాన్ని వినియోగించే రీతిలోని గొప్పతనాన్ని కల ఇటువంటి వారుకూడా ఉన్నారు కదా! - అని చాలా విద్ధులై (ఆసక్తులై), వారి (రామానుజ భక్తుల) శ్రీచరణాలను ఆశ్రయిస్తున్నారు.

**(వాచా)**- **"వాయ్ అవనై యల్లదు వాழ்త్తాదు"** (జిహ్వా, భగవంతుని తప్ప ఇంకొకరిని మంగళాశాసనం చేయదు) అని ప్రథమపర్వనిష్ఠులు భగవద్విషయాన్ని తప్ప ఇంకొక విషయాన్ని స్తుతించని రీతిలో, వీరు కూడా ఆచార్యులనే స్వరూపానురూపమైన విషయాన్ని తప్ప ఇంకొక విషయాన్ని స్తుతించరు. ప్రథమపర్వనిష్ఠులకు దేవతాంతరం (అన్యదైవాలు) త్యాజ్యం. వీరికి భగవద్విషయం వ్యావృత్తం. (త్యాజ్యం) **"నా వకారియమ్"** (జిహ్వతో చేయరానిది) అని భగవన్మంగళం తప్ప మిగిలినది ఏదయినా జిహ్వతో చేయరానిది- అని అన్నారు కదా వీరు.



**(మనసా)** - **"మనః పూర్వో వాగుత్తరః"** (మనస్సు ముందు, వాక్కు తరువాత) అనే నియమం వీరికి లేదు. అందువల్ల **"వాచా"** అని పల్కిన తరువాత **"మనసా"** అని అంటున్నారు. వీరు (కూరేశాదులు) నోరు తెరచి మాట్లాడితే ఆచార్యవిషయాన్ని గూర్చి తప్ప, ఇంకొక విషయాన్ని పలుకనట్లుగా, వీరి మనస్సుకు కూడా అది తప్ప ఇంకొకటి విషయం కాలేదు. తిరుక్కోట్టియూర్ నంబిని "మీ ధ్యానానికి ఏది విషయం?" (మీరు ధ్యానించడానికి ఏది విషయం?) అని ప్రశ్నించగా, ఆచార్యులైన యామునుల దివ్యమంగళవిగ్రహమే తమ ధ్యానానికి విషయమని పల్కిన సూక్తి స్మరణీయం.

**(వాచా మనసా వపుషా చ)**- అని అంటూ కరణాలకు ప్రత్యేక ప్రత్యేకంగా కల్గిన ప్రావణ్యం చెప్పబడుతున్నది.

**(యుష్మత్పాదారవిందయుగళం భజతామ్)** - వీరి (కూరేశాదుల) వేపకషాయం ఇది. (అంటే - శ్రీరామానుజుల శ్రీచరణాలే కూరేశాదులకు భోగ్యతమమైన వస్తువు) ఈ ఆత్మకు, స్వరూపానికి తగిన శేషి అయిన దేవరవారి, నిరతిశయభోగ్యమై, పరస్పర సాదృశ్యంలోని అందాన్ని కల శ్రీచరణాలను ప్రాప్యంగా, ప్రాపకంగా తలచి నిరంతరం సేవించే కూరేశాదుల - అని అర్థం. **"నిత్యం యదీయచరణౌ శరణం మదీయమ్"** (నిత్యం, ఆచార్యులైన నాథ మునుల రెండు చరణాలే నాకు శరణం.) అని ఆచార్యచరణాలే ప్రాప్యం, ప్రాపకం - అని పరమాచార్యులైన యామునులు పలికారు కదా! శ్రీచరణాలను వాక్కుతో, భజించడం అంటే - **"ప్రణమామి"** అనే రీతిలో నమస్కరించడం.

**(పాదానుచింతనపర స్సతతం భవేయమ్)**- వారు (కూరేశాదులు) దేవరవారి శ్రీచరణాలను నిత్యం అనుసంధించినట్లుగా, ఈ అనుసంధానం అనేది కాదాచిత్కం (ఏదో ఒక సమయంలో మాత్రం) కాకుండా, నిత్యంగానే కొనసాగాలి- అని భావం. **"అనుచింతనమ్- అనుస్యూతం చింతనమ్"** అనే అర్థాన్ని గ్రహిస్తే, శ్లోకంలోని సతతమనే శబ్దం సంగతం కాదు. కనుక **"అను"** అనేది హితమనే అర్థాన్ని ఇచ్చేదై, **"కృష్ణానుస్మరణమ్ పరమ్"** అనేచోటవలె, పాదాలపట్ల శేషత్వానుసంధానాన్ని తెల్పుతున్నది. **"ఉన్ తొణ్డర్కట్కు అన్బుఱ్ఱిరుక్కుమ్బడి ఎన్నై యాక్కి అఙ్గాట్పడుత్తే"** (నీ భక్తుల పట్ల ప్రేమను

కల్గి ఉండేటట్లు నన్ను చేసి, వారికి దాసుడను అయేటట్లు చేశావు కదా !) అనే అర్థం ఇక్కడ చెప్పబడింది. వీరికి (శ్రీవరవరమునులకు)-ఈ శ్రీరామానుజుల విషయంలో ఉండే భావబంధం (ప్రేమ)లోని అతిశయం, వారు చివరలో ప్రార్థించినది మొదటలోనే ప్రార్థించేటట్లు చేసింది.

అవతారిక : శ్రీరామానుజుల శ్రీచరణాలకు ఈ విధంగా అవినాభూతులై (పాదస్థానీయులై), ఆ శ్రీరామానుజులు తప్ప ఇంకొక విషయాన్ని తెలియని కూరేశులవంటివారి శ్రీచరణాలలో శేషత్వాన్ని అర్థించి, వారిపట్ల గల భక్త్యతిశయంచేత వారు అభిమానించిన విషయమైన శ్రీరామానుజుల శ్రీచరణాలలో వాక్కు, మనస్సు, శరీరమనే మూడు కరణాలు ఆసక్తిని పొందేటట్లు అనుగ్రహించాలి- అని వారిని ఇందులో ప్రార్థిస్తున్నారు.

**4. నిత్యం యతీందు! తవ దివ్యవపుస్స్మృతౌ మే**
**సక్తం మనో భవతు వాగ్గుణకీర్తనేఽసౌ ।**
**కృత్యం చ దాస్యకరణం తు కరద్వయస్య**
**వృత్త్యంతరేఽస్తు విముఖం కరణత్రయం చ ॥**

యతీంద్రా! నా మనస్సు నీ దివ్యరూపాన్ని ధ్యానించడంలో నిత్యం ఆసక్తం కావాలి. నా వాక్కు మీ గుణాలను కీర్తించడంలో ఆసక్తం కావాలి. నా రెండు చేతులు మీ కైంకర్యాన్ని చేసేవిగా కావాలి. నా మూడు కరణాలు ఇతరవ్యాపారాలలో వైముఖ్యాన్ని పొందాలి.

వ్యాఖ్యానమ్ : **(నిత్యం యతీంద్రేత్యాది)- (మే మనః తవ దివ్యవపుస్స్మృతౌ నిత్యం సక్తం భవతు)-** అనాదికాలంగా ఇతర (లౌకిక) విషయాలలో ఆసక్తిని కలవాడనై సంచరించిన నా మనస్సు- దేవరవారి దివ్యమంగళ విగ్రహంలో సదా లగ్నమై, వేఱొక విషయాన్ని స్మరించకుండా చక్కగా దానినే స్మరించేటట్లు కావాలి. **"ఉన్దన్ మెయ్యిల్ పిఱజ్గియ శీర్తన్ని వేణ్డిలన్"** (దేవరవారి దివ్యమంగళవిగ్రహగుణాలను తప్ప వేఱొక విషయాన్ని కోరను) అనేటట్లుగా మనస్సుకు శుభాశ్రయమైన అవలంబనం దేవరవారి దివ్యమంగళవిగ్రహమే కావాలి- అని భావం.

**(వాగ్గుణకీర్తనేఽసౌ)** - ఇంతకు ముందు తగని విషయాలను పలరిస్తూ ఉండే నా వాక్కు, దేవరవారి కల్యాణగుణాలను వర్ణిస్తూ పల్కడంలో ఆసక్తం కావాలి- అని భావం.

**(కృత్యం చేత్యాది)** -అన్యవిషయాలకోసం చాలా నీచమైన వృత్తిని చేసిన నా రెండు చేతులకు ఇపుడు కృత్యం- దేవరవారి శ్రీచరణాలలో నిత్యం కైంకర్యం చేయడంగా కావాలి.

**(వృత్త్యంతరేఽస్తు విముఖ మిత్యాది)** - దేవరవారి విషయంలో కరణత్రయం ఆభిముఖ్యాన్ని పొందినా, అన్యవిషయాలలో వైముఖ్యం లేకపోతే, ఈ ఆభిముఖ్యం స్థిరంగా నిలువదు - అని భావించి, బయట శరీరానికి పూసికొన్న మైపూతలవంటి హేయ (లౌకిక) విషయాలను భావించడం, పల్కడం, సేవించడమనే వ్యాపారాల నుండి నా కరణత్రయం విముఖం అయేటట్లు- అని అర్థం. ఇందువల్ల **"నైయుమ్ మనమ్ ఉన్ కుణజ్గళై యున్ని"** (నీ గుణాలను భావించి నా మనస్సు ఆర్తిని పొందుతున్నది) ఇత్యాదిగా కరణత్రయం శ్రీరామానుజుల విషయంలో ప్రావణ్యాన్ని, అన్యవిషయాలపట్ల ఆసక్తి తీరడంతో పాటుగా ప్రార్థించారు.

అవతారిక : "భగవంతుడే శేషి, ఉపాయం, ఉపేయం- అని శాస్త్రాలు పల్కుతూ ఉండగా, మీరు మమ్ములను, మా భక్తులను శేషిభూతులుగా, ఉపాయంగా పల్కుతున్నారే ! ఆ విధంగా దేనినిబట్టి పల్కుతున్నారు?'' అని శ్రీరామానుజుల అభిప్రాయంగా తలచి, "సకలశాస్త్రసారమైన తిరుమంత్రమే దీనికి మూలమైన ప్రమాణం, అందులో ప్రతిపాదించే అర్థానికి అనురూపమైన నిష్ఠను, దాని ఫలమైన, దేవరవారి శ్రీచరణాలలో అనుభవాన్ని (కైంకర్యాన్ని) అనుగ్రహించాలి''- అని ఇందులో అపేక్షిస్తున్నారు.

**5. అష్టాక్షరాఖ్య మనురాజ పదత్రయార్థ –**
**నిష్ఠాం మమాత్ర వితరాద్య యతీంద్ర! నాథ! ।**
**శిష్టాగ్రగణ్య జనసేవ్య భవత్పదాబ్జే**
**హృష్టాఽస్తు నిత్యమనుభూయ మమాస్య బుద్ధిః ॥**

యతీంద్రా! ఈ సంసారంలో ఈ కలికాలంలో అలమటించే నాకు, అష్టాక్షరి అనబడే మంత్రరాజంలోని ప్రణవం, నమస్సు, నారాయణాయ– అనబడే మూడు పదాల అర్థంలో నిష్ఠను ప్రసాదించాలి. శిష్టాగ్రేసరులైన జనులచే సేవించదగిన నీ శ్రీచరణపద్మాలను సదా అనుభవించి, ఈ నా బుద్ధి సంతోషపడినదిగా కావాలి.

వ్యాఖ్యానమ్ : **(అష్టాక్షరేత్యాది) - "ఓమిత్యేకాక్షరమ్, నమ ఇతి ద్వే అక్షరే నారాయణాయేతి పంచాక్షరాణి, ఇత్యష్టాక్షరం ఛందసా గాయత్రీ చేతి" (ఓమ్-** అని ఒక అక్షరం, నమః - అని రెండక్షరాలు, నారాయణాయ- అని అయిదు అక్షరాలు - ఈ విధంగా ఎనిమిది అక్షరాలు, ఛందస్సు గాయత్రి)- అని తిరుమంత్రం ఎనిమిది అక్షరాలను కల్గినదై, మూడు పదాలను కల్గినదై ఉన్నది- అనే విషయం వేదసిద్ధం కదా! ఇక్కడ మనుశబ్దం మంత్రమనే అర్థాన్ని ఇస్తుంది. మనురాజమంటే మంత్రరాజమని అర్థం. తిరుమంత్రం రాజు కావడం అంటే- వేదాలు, ఋషులు, వైదికులు ఏక కంఠంగా సకలఫలాలను ఇవ్వగల్గినందున, ఉపాయాంతరాలకు సహకారి అయినందున, తనకంటే అన్యమైన వ్యాపక-అవ్యాపక భగవన్మంత్రాలు అన్నిటికంటే గొప్పదై ఉండడం.

ఈ తిరుమంత్రంలోని మూడు పదాలలోని అర్థమేమంటే- ఆత్మయొక్క భగవదనన్యార్హశేషత్వం, భగవదనన్యశరణత్వం, భగవదనన్యభోగ్యత్వం- అనేవి. వాటికి ప్రతియోగి అయిన భగవంతుని శేషిత్వ- శరణత్వ- ప్రాప్యత్వాలు, అనన్యార్హశేషత్వ, అనన్యశరణత్వ, అనన్యభోగ్యత్వాది జీవుని ఆకారత్రయం ఆ భగవంతుని విషయంలోవలె, తదీయులైన భాగవతుల విషయంలో కూడా ఉన్నాయి. అందువల్లనే తిరుమంత్రాన్ని అభ్యసించిన తిరుమంగై ఆళ్వార్లు. **"నిన్ తిరువెట్టెళుత్తుమ్ కఱ్ఱు నాన్ ఉఱ్ఱదుమ్ ఉన్నడియార్క్కడిమై"** (నేను అష్టాక్షరిని అభ్యసించి గ్రహించినది ఏమంటే - నీ దాసులకు దాసుడనై ఉండడం) అని అన్నారు. ఈవిధంగా సామాన్యంగా తదీయులకు అందఱికి భగవత్సంబంధ మూలంగా శేషత్వాదులున్నందున, తదీయ (భాగవత) విషయంగా, నిర్హేతుకంగా మొదట తనను స్వీకరించి, ఈదశను పొందించిన స్వాచార్యులపట్ల కూడా శేషత్వాదులు (అనన్యార్హశేషత్వాదులు) అను సంధించడంలో అడ్డు లేదు.



కనుక, తిరుమంత్రంలోని మూడు పదాలలో చెప్పబడే అర్థాలు చరమ పర్వపర్యంతంగా ఉండే నిష్ఠను, ఈ నిష్ఠలో అపేక్షను కల దాసుడనైన నాకు, ఇందులో అభిరుచి కలవారు లభించని ఈ విభూతిలో ఇపుడే అనుగ్రహించాలి. గొప్పగా దాహాన్ని పొంది, "మంచినీళ్ళు, మంచినీళ్ళు" అని అలమటించేవానికి ఇక్కడే ఇపుడే నీటిని ఇచ్చి, ఆ దాహాన్ని తీర్చాలికదా ! అని భావం.

"మీరు మమ్ములను అపేక్షిస్తే మాత్రం, ఈవిధంగా ఈకోరిక నేను పూర్తి చేయవలసిన అక్కరఏమి?" - అని శ్రీరామానుజుల భావంగా తలచి దానికి సమాధానం తెలుపబడుతున్నది -

**(నాథ!)** - అని అంటూ. మీరు నా అపేక్షితాన్ని తప్పక చేయాలనే దానికి కారణ మేమీ నాలో చెప్పదగినది) ఏదీ లేదు. ఈ ఆత్మకు స్వరూపానికి తగిన శేషి అయిన దేవరవారే "ఇది మన సొత్తు కదా!" అని ఈ స్వ - స్వామి సంబంధాన్ని హేతువుగా తలచి అనుగ్రహించాలని భావం.

**(శిష్టేత్యాది)-** శిష్టులంటే- జ్ఞానానుష్ఠానాలతో పూర్ణులై, ఏ లోటు లేని ప్రాప్యంలో అభిలాషను కలవారు. వారిలో అగ్రగణ్యులంటే- కూరేశుల వంటివారు. ఇటువంటివారిచే నిరంతరం అనుభవింపబడే, స్వరూపానురూపశేషి అయిన దేవరవారి పరమభోగ్యమైన శ్రీచరణాలను, ఈ ప్రాప్యం (శ్రీచరణాల కైంకర్యం) పొందకపోతే నిలువలేని ఈనా బుద్ధి, కోరిన రీతిలో అనుభవించి ఆనందించేటట్లుగా - అని భావం. **"ఉనదడిప్పోదిల్ ఒణ్శీరామ్ తెళితేనుణ్డ మర్న్దిడ వేణ్డి నిన్ పాలదువే పోన్దదు ఎన్ నెఞ్జెన్నుమ్ పొన్వణ్డు"** (నా మనస్సు అనే బంగారు తుమ్మెద దేవరవారి శ్రీచరణాలలోని గొప్పవైన కల్యాణగుణాలనే స్వచ్ఛమైన తేనెను ఆస్వాదించి నిలువగోరి, మీవద్దకు చేరింది) అనే ఇరామానుశనూఱ్ఱన్దాది పాశురార్థం ఇక్కడ ప్రస్తావింపబడింది.

అవతారిక : "ప్రాప్యం పొందాలనే రుచిని కలవారై, బాహ్యవిషయాలలో ఆశ తీరినవారైన కూరేశులవంటి వారుకదా, మమ్ములను అనుభవించేవారు. వారివలె మీకు ప్రాప్యరుచి, అన్యవిషయ వైరాగ్యం ఉన్నాయా?" అని అంటే, తమకు ఏమాత్రం ప్రాప్యరుచి లేని రీతిని, ఇతరవిషయాలపట్ల ఆసక్తి ఇంకా ఇంకా

వృద్ధి చెందే రీతిని విన్నపించి, ఈ రెండిటికి మూలమైన పాపాన్ని పోగొట్టి అనుగ్రహించాలని ఇందులో వరవరమునులు రామానుజులను అర్థిస్తున్నారు.

**6. అల్పాఽపి మే న భవదీయ పదాబ్జభక్తిః**
**శబ్దాదిభోగరుచి రన్వహ మేధతే హా ! ।**
**మత్పాపమేవ హి నిదాన మముష్య నాన్యత్**
**తద్వారయార్య! యతిరాజ! దయైకసింధో! ॥**

దయాసింధూ! ఆర్యా! శ్రీరామానుజా! నీ శ్రీచరణాలపట్ల భక్తి కొంచెం కూడా నాకు లేదు. శబ్దాది లౌకికవిషయాలను అనుభవించడంలోని ఆసక్తిమాత్రం ఎక్కువగా వృద్ధి అవుతున్నది. అయ్యో! దీనికి నా పాపమే కారణం తప్ప ఇంకొకటి కాదు. అందువల్ల ఆ నా పాపాలను పోగొట్టండి.

వ్యాఖ్యానమ్ : **(అల్పాపి మే - ఇత్యాది)**

**(భవదీయపదాబ్జభక్తిః అల్పాపి మే న)** - దేవరవారి శ్రీచరణపద్మాలలో పూర్ణమైన భక్తి లేకపోవడమే కాదు; అత్యల్పభక్తికూడా ఇతరవిషయాలలో చాపల్యాన్ని కల నాకు లేదు. ఆనుకూల్యం కొంచెం కూడా లేకపోయినా, ప్రాతికూల్యనివృత్తి (అడ్డుపెట్టకుండా ఉండడం) అనేది ఉంటే చాలుకదా అంటే, అది కూడా లేదు సుమా! - అని అంటున్నారు.

**(శబ్దాదీత్యాది)** - దేవరవారి శ్రీచరణాలలో కైంకర్యం చేయడానికి విరోధి (అడ్డు)గా ఉండే లౌకిక విషయాలను అనుభవించాలనే శ్రద్ధ దిన దిన ప్రవర్ధమానమవుతున్నది. అయ్యో!

ఇందువల్ల తిరుమంత్రంలోని తృతీయపదార్థమైన- అనన్యభోగ్యత్వంలోని నిష్ఠ విషయంలో విరోధి తమకు ఉన్నదని తెలుపబడింది.

ఈ రెండిటికి మూలమేది? అంటే,

**(అముష్య నిదానం మత్పాపమేవ హి)** అని అంటున్నారు. ప్రాప్తవిషయమైన దేవరవారి కైంకర్యం పట్ల ఆసక్తి లేకపోవడానికి, అప్రాప్తాలైన లౌకిక విషయాల పట్ల ప్రావణ్యంకల్గి ఉండడానికి కారణం ఏమంటే - పాపిష్ఠివాడవైన నాపాపమే



కదా! ఈ ఏవకారం (అవధారణం) ద్వారా ఇంకొక కారణం ఏదీ లేదని నిర్ధారింపబడుతున్నది.

**(నాన్యత్)** - "ఈశ్వరుని నిరంకుశస్వాతంత్ర్యం దీనికి హేతువు కాదు. అతడు (భగవంతుడు) జీవుల ఉజ్జీవనంకోసం పాటుపడతాడు కదా! మీకర్మ దోషం వల్ల ఇది అంతా ఏర్పడితే, ఇక మేం చేయగల్గినదేమి?'' అంటే, "అదేమి! మీరు చేయగల్గినదేమీ లేదా?'' -

**(తద్వారయ)** - దానిని దాసుని (నా) వద్దకు రాకుండా మీరు అడ్డుకోవాలి.

నాకు అందుకు శక్తి ఉన్నదా? ఏమి? - అంటే,

**(ఆర్య!)** ఆవిధంగా చేయడానికి తగిన ఉపాయాన్ని తెలియ గల్గిన జ్ఞానం మీకు ఉన్నదికదా!

**(యతిరాజ!)** - తెలిసినట్లుగా చేయగల మీకు శక్తిలేదా? మీరు జితేంద్రియులైన సన్న్యాసులకు నాథులు కనుక, మీ అభిమానాన్ని నోచుకొన్నవారి పాపాన్ని పోగొట్టడానికి తగిన శక్తిలో మీకు ఏ కొఱత లేదు.

**(దయైకసింధో!)** - ఆజ్ఞానశక్తులను రక్షణకు ఉపయోగపడేటట్లుగా నిర్వహించే మీ కృపకు ఏమైనా లోటున్నదా? **"అస్య దయైకసింధోః"** అని విశేషజ్ఞులైన కూరేశులు తలమునకలు వేసే రీతిలోనిది కదా, మీ కృపాప్రాచుర్యం ఉన్నది! ఇక్కడ **'ఏక'** శబ్దం ద్వారా గుణాంతరాలు వెదకి (తడవిచూచి) పట్టుకోవలసిన రీతిలో దయాగుణపౌష్కల్యం ఉన్నదని హార్దభావం.

**అవతారిక :** ఈ విధంగా భగవద్రామానుజుల శ్రీచరణాలలో ఆభాసమైన ప్రేమకు, (లేని ప్రేమ ఉన్నట్లు నటించడానికి), ఇతర లౌకిక విషయాలపట్ల ప్రావణ్యం ఉండడానికి హేతువైన పాపాన్ని పోగొట్టి, అనుగ్రహించాలని ప్రార్థించిన శ్రీవరవరమునులు, మళ్ళీ తిరుమంత్రంలోని మూడు పదాల అర్థాలలోని నిష్ఠకు విరోధులై, అనాదికాలంగా పట్టుకొని బాధించే అకృత్య కరణాలు, (చేయరాని పనులను చేయడం) భగవదపచారాదులు, ఇపుడు చేస్తున్న గురువు విషయంలో, మంత్రం విషయంలో, ఆ మంత్రం ప్రతిపాదించే దేవత విషయంలో చేసే పరిభవం (అవమానం) మొదలైన వానిని మాటిమాటికి తలచి,

"ఈ విధంగా దోషభూయిష్ఠుడనైన నేను దేవరవారి సమక్షంలో ఏసంశయం లేకుండా నిలచి, దీనిని విన్నపించానే!"- అని భీతులై, తమ మూర్ఖతను తలచి దానిని గూర్చి ఇక నాల్గు శ్లోకాలతో పల్కుతున్నారు.

**7. వృత్త్యా పశు ర్నరవపు స్త్వహ మీదృశోఽపి**
**శ్రుత్యాదిసిద్ధ నిఖిలాత్మ గుణాశ్రయోఽయమ్ ।**
**ఇత్యాదరేణ కృతినోఽపి మిథః ప్రవక్తుమ్**
**అద్యాపి వంచనపరోఽత్ర యతీంద్ర! వర్తే ॥**

యతీంద్రా! వంచనపరుడనైన నేను మానవరూపాన్ని కలవాడను అయినా వ్యాపారంలో (క్రియలో)మాత్రం పశుప్రాయుడను. ఇటువంటివాడను అయినా, "వేదం మొదలైనవాటిలో ప్రతిపాదింపబడ్డ అన్ని ఆత్మగుణాలకు ఆశ్రయమైనవాడు ఇతడు" అని ఆదరంగా విద్వాంసులు పరస్పరం గొప్పగా చెప్పుకోవాలని ఇక్కడ శ్రీరంగంలో ఉంటున్నాను.

వ్యాఖ్యానమ్ : **(వృత్త్యా పశు రిత్యాది)** - శాస్త్రాభ్యాసాదులకు యోగ్యమైన మానవజన్మలో పుట్టినందున, ఆ మానవజన్మకు విరుద్ధమైన అకృత్యాదులలో అడ్డు లేకుండా వర్తించినందున, నరసామ్యం (జన్మవల్ల) పశుసామ్యం (ప్రవృత్తి వల్ల) రెండు తమకు ఉన్నదని పల్కుతున్నారు.

**(వృత్త్యా పశుః)** - నా వృత్తిని చూస్తే, అది జన్య-జనక విభాగం లేకుండా వర్తించే పశువృత్తితో అది సాటి వస్తుంది.

**(నరవపుః)** - నేనెత్తిన రూపాన్ని చూస్తే, శాస్త్రవశ్యమైన మానవశరీరమై కన్పిస్తుంది. ఇక్కడ **"తు"** అనే పదం ద్వారా- మనుష్యరూపాన్ని పొంది, వర్తించే లోకంలో మిగిలిన అందఱి మానవులకంటే తమకు గల వ్యత్యాసం సూచింపబడింది.

**(ఈదృశోఽపి)** - పూర్వం పల్కిన రీతిని కలవాడనై ఉన్నా, తమ దోషవిస్తృతిని మాటలతో చెప్పలేనందువల్ల, **"ఈదృశః"** (ఇటువంటి వాడను) అని అంటున్నారు. నాదోషం ఇటువంటిది అయిన పిదప, నేను ఇటువంటి మహనీయుల దరి చేరడం తగదు- అని విరమించవలసి ఉండగా, ఆ విధంగా



చేయకుండా పోవడమే కాక, "ఇతనివలె ఆత్మగుణాలతో నిండినవారు లేరు, అందువల్ల, ఈ శ్రీరామానుజుల దరి చేరి వీరికి కైంకర్యం చేయడానికి ఇతనికంటే యోగ్యులు లేరు'' అని జ్ఞానాధికులందఱు తాము ఏకకంఠంగా, ప్రీతి పరీవాహరూపంగా పొగడే విధంగా కదా, ఇపుడు దాసుడనైన నేను వంచనపరుడనై వర్తిస్తున్నాను.

**(యతీంద్ర!)** - రోగాన్ని పోగొట్టే వైద్యుని ఆశ్రయించినా, వ్యాధికి చిక్కి బాధపడే రోగివలె, ఆశ్రిత దోషాలను పోగొట్టడానికి శక్తిని కల మిమ్ములను ఆశ్రయించిన నేను, ఈ దోషసాగరంలో పడి మునిగి పోవడం తగునా? స్వామీ!- అని అంటున్నారు.

**8. దుఃఖావహోఽహ మనిశం తవ దుష్టచేష్ట -**
**శబ్దాదిభోగనిరత శ్శరణాగతాఖ్యః ।**
**త్వత్పాదభక్త ఇవ శిష్టజనౌఘమధ్యే**
**మిథ్యా చరామి యతిరాజ! తతోఽస్మి మూర్ఖః ॥**

యతిరాజా! శరణాగతుడననే పేరును కలవాడనై, శబ్దాదిలౌకికభోగాలలో ఆసక్తిని కలవాడనై, మీకు దుఃఖాన్ని కలుగజేసే నేను మీ శ్రీచరణపద్మాలలో భక్తిని కలవానివలె నటిస్తూ శిష్టజనుల మధ్యలో మిథ్యగా ప్రవర్తిస్తున్నాను. అందువల్ల నేను మూర్ఖుణ్ణి.

వ్యాఖ్యానమ్ : **(దుఃఖావహోఽహ మిత్యాది)**

**(అహం తవ అనిశం దుఃఖావహో భవామి)** - దేవరవారి శ్రీచరణాలలో శేషత్వమే నిరూపక లక్షణంగా కల్గి ఉండడమనే స్వరూపాన్ని కల నేను, ఈ ఆత్మకు స్వరూపానురూప శేషి అయిన దేవరవారికి అవిచ్ఛిన్నంగా హర్షాన్ని కలుగజేసేవాడనై ఉండవలసి ఉండగా, అది చేయకపోవడమే కాకుండా, దానికి విరుద్ధంగా దుఃఖాన్ని కల్గించేవాడనై ఉన్నాను. ఇది నా తిరుమంత్రంలోని ప్రథమపదార్థంలోని నిష్ఠ ఉండే తీరు (అనన్యార్హశేషత్వం ఉండే తీరు.)

**(దుష్టచేష్టః)**- దయాగుణపూర్ణులు కూడా ఏతాము వేసి పైకి తోడడానికి (రక్షించడానికి) శ్రమ పడే రీతిలో దుష్టప్రవృత్తినే చేసినవాడను.

**(శబ్దాదిభోగనిరతః)** - దేవరవారి శ్రీచరణాలలో కైంకర్యం చేయడంకోసమే నేను పెట్టిపుట్టినా, దానికి విరుద్ధంగా శబ్దాదిలౌకిక విషయానుభవంలో, సర్వశక్తి అయిన భగవంతునిచే కూడా విడిపించడానికి సాధ్యం కాని రీతిలో చాలా ప్రావణ్యాన్ని పొందినవాడను.

**(శరణాగతాఖ్యః)**- శరణాగతుడననే పేరు మాత్రమే నాకు ఉన్నది. అయితే అందులో కూడా నిష్ఠ లేదు - అని భావం. దీనివల్ల తమ మధ్యమ పదార్థనిష్ఠాహాని తెలుపబడింది. **"శబ్దాదిభోగనిరతః"** అని అన్నందున తృతీయ పదార్థ నిష్ఠ (అనన్యభోగ్యత్వం) లేదని తెలుపబడింది. "ఇతర విషయాలలో ప్రావణ్యాన్ని కల్గినవాడై, దుష్టచేష్టుడు అయినందున ఇతనిని పరిగ్రహించ బోవడం లేదు. శరణాగతుడనే పేరు కలవాడైనందున విడువడం వీలు కాదు. ఈ విధంగా గెంటివేయడానికి, గ్రహించడానికి వీలుకాకుండా ఉండే ఇతనిని నేనేం చేయను?"- అని శ్రీరామానుజులు మనస్సులో గాయపడినందున వారికి నిత్యదుఃఖావహుడని భావం.

**(త్వత్పాదభక్త ఇవ శిష్టజనౌఘమధ్య - ఇత్యాది)** - "నా స్థితి ఇటువంటిది అయినపుడు, నాకు, శ్రీరామానుజులనే ఈ విషయానికి ఏవిధంగా పొసగు తుంది? - అని జంకి వెనుకంజ వేయవలసి ఉండగా, ఆ విధంగా చేయకుండా, దేవరవారి శ్రీచరణాలలో యథార్థమైన ప్రేమను కలవారైన మహనీయుల సమూహంలో నేను కూడా ఒకడనై ప్రవేశించి, ప్రేమలేశం అయినా లేకుండా ఉండగా, దేవరవారి శ్రీచరణాలలో ప్రేమ నిండుగా ఉండేవారివలె కృత్రిమంగా సంచరిస్తున్నాను.

**(తతోఽస్మి మూర్ఖః)** - స్నేహం లేనివాడనై ఉన్నా, స్నేహం కలవానివలె అనుభవ కైంకర్యాలను ఆశపడుతూ, ప్రార్థిస్తూ, కృత్రిమంగా వర్తిస్తున్నాను- అందువల్ల మూర్ఖుడను- అని పల్కుతున్నారు.

**9. నిత్యం త్వహం పరిభవామి గురుం చ మంత్రం**
**తద్దేవతామపి న కించిదహో! బిభేమి।**
**ఇత్థం శఠోఽప్యశఠవద్భవదీయసంఘే**
**హృష్ట శ్చరామి యతిరాజ! తతోఽస్మి మూర్ఖః ॥**



ఓ యతిరాజా! నేను ఆచార్యుని, మంత్రాన్ని, ఆ మంత్రాధిదేవతను ఎల్లప్పుడు అవమానిస్తున్నాను. అందుకు కొంచెంకూడా భయపడడంలేదు. ఎంత ఆశ్చర్యం! ఈ విధంగా గూఢంగా అకార్యాన్ని చేసే శఠుడను అయినా, ఆ విధంగా శఠుడు కానివానివలె నీ భక్తుల సంఘంలో సంతోషించేవాడనై ప్రవర్తిస్తున్నాను. అందువల్ల నేను మూర్ఖుణ్ణి.

**వ్యాఖ్యానమ్ : (నిత్యం త్వహమిత్యాది)**

**(నిత్యం త్వహం పరిభవామి గురుమ్)** - ఏ హేతువు లేకపోయినా అంగీకరించి, తమ ఉపదేశంతో తత్త్వజ్ఞానాన్ని కల్గించి, స్వరూపయాథాత్మ్యాన్ని ప్రకాశింపజేసే తిరుమంత్రాన్ని అర్థంతో పాటుగా అనుగ్రహించి, స్వరూప విరుద్ధాలు ప్రవేశించని రీతిలో రాత్రి పగలు జాగ్రత్తగా రక్షిస్తూ ఉండే ఆచార్యులు పల్కిన రీతిలో అనుష్ఠించనందున, ఆ ఆచార్యులు ఉపదేశించిన మంత్రాన్ని, దాని అర్థాన్ని అధికారులు కానివారికి ఉపదేశించినందున, సర్వకాలం ప్రతిదినం పరాభవిస్తున్నాను. అంతమాత్రమే కాక,

**(మంత్రం చ పరిభవామి)** అనుసంధించేవారికి రక్షకమైన మంత్రమనే పదంతో వ్యవహరింపబడేదై, సకలవేదాంతసారమైన అష్టాక్షరిని, ఆచార్యులు దానికి తెల్పిన యథార్థాన్ని మఱచినందున, అ యథార్థాన్ని దానికి అర్థంగా తలచినందున, దాని గొప్పతనం సంకోచించేటట్లుగా పరాభవం చేస్తున్నాను. అంతేకాక,

**(తద్దేవతామపి నిత్యం పరిభవామి)** - ఆ మంత్రానికి శేషిత్వ- శరణత్వ- ప్రాప్యత్వరూపంతో ప్రతిపాదింపదగిన (తెలియదగిన) భగవంతుని, ఆ స్వామిని ఆశ్రయించడానికోసం సృష్టింపబడిన మూడు కరణాలను ఆ స్వామిపట్ల ప్రావణ్యం పొందేటట్లు చేయనందున, అంతకంటే వేఱయిన విషయాలలో మిక్కిలి ఆసక్తిని కల్గి ఉండేటట్లు వర్తించినందున, మంత్రదేవత అయిన భగవంతుని పరాభవిస్తున్నాను.

**(న కించిదహో! బిభేమి)** - ఎల్లప్పుడు ఉద్దేశ్యంగా అనుసంధించి గౌరవించ దగిన గురు - మంత్ర - దైవాలను అనవరతం అవమానించి, జీవన యాత్రగా సంచరిస్తూ ఉన్నా, ఇందులో ఏ కొంచెం కూడా భయం లేకుండా ఉన్నాను.

**(ఇత్థం శఠోఽపి)** - పైపైన కాకుండా, లోలోపల పరిశీలించి చూస్తే, నేను శఠుడనైనా,

**(అశఠవద్భవదీయసంఘే హృష్ట శ్చరామి)** - ఆచార్యవిషయంలోను, ఆ ఆచార్యులు కృపజేసిన మంత్రం విషయంలోను, ఆ మంత్రం చేత తెలియదగిన భగవద్విషయంలోను విధింపబడిన రీతిని దాటకుండా తగిన జ్ఞానంతో విశ్వాసంతో వర్తించేవారై, దేవరవారి శ్రీచరణాలలో సంబంధాన్ని పురస్కరించు కొని నిరూపించబడేవారైన మహాత్ముల నడుమ "గురువు పట్ల, మంత్రంపట్ల, తత్ప్రతిపాద్యదేవతల పట్ల ఇతనివలె గొప్ప ప్రేమను కలవారింకొకరు లేరు'' అని తోచేటట్లు అంతు లేని హర్షం కలవాడనై, ఆ ఆనందం వ్యక్తమయేటట్లు అటు ఇటు సంచరిస్తున్నాను.

**(తతః... మూర్ఖోఽస్మి)** - ఈ విధంగా గురుమంత్రాదులను పరాభవించి, ఆ పని చేయడంలో ఏ భయం లేకుండా మహాత్ముల మధ్యలో ప్రవేశించి, "నేనుకూడా వారిలో ఒకడను'' అని చూచేవారికి తోచేటట్లుగా మోసగించి, వర్తిస్తున్నాను - అనే దీనివల్ల నాకంటే మూర్ఖులు ఇంకొకరు లేరు.

**10. హా! హంత! హంత! మనసా క్రియయా చ వాచా**
**యోఽహం చరామి సతతం త్రివిధాపచారాన్ ।**
**సోఽహం తవాప్రియకరః ప్రియకృద్వదేవ**
**కాలం నయామి యతిరాజ! తతోఽస్మి మూర్ఖః ॥**

యతిరాజా! నేను మనస్సుతో, క్రియలతో, వాక్కుతో మూడు విధాలైన అపచారా లను (భగవదపచార– భాగవతాపచార – అసహ్యాపచారాలను) ఎల్లప్పుడు చేస్తున్నాను. ఇటువంటి నేను నీకు అప్రియాన్ని కల్గిస్తూ, ప్రియాన్ని కల్గించేవానివలె కాలాన్ని గడుపుతున్నాను. ఆహా! ఈ కారణంవల్ల నేను మూర్ఖుణ్ణి.

**వ్యాఖ్యానమ్ : (హా! హంత! హంతేత్యాది)** - భగవద్భాగవతాచార్యులను అనుసరించడంకోసం (సేవించడంకోసం) సృష్టింపబడిన మనోవాక్కాయాలనే త్రికరణాలతో ఆ ముగ్గురిని (భగవంతుని, భాగవతులను, ఆచార్యులను) అవమానించి, ఆ విధంగా చేయడంలో ఏ భయం లేకుండా మహాత్ముల మధ్యలో అనువర్తించడమే కాక, నిత్యం అపచారాలనే చేస్తూ ఉండే తీవ్రమైన తమ



అలవాటును చూచి **"హా! హంత! హంత!"** అని వరవరమునులు పల్కు తున్నారు.

**(మనసా)** - భగవద్వైభవం మొదలైనవానిని అనుసంధించడంకోసం ఉండే మన మనస్సు పడే పాట్లు, అయ్యో!

**(క్రియయా)** - ఉద్దేశ్యాలను (తాము కొలిచే శ్రీరామానుజులను) ఉద్దేశించి అంజలి, ప్రణామం మొదలైన కైంకర్యాలను చేయడంకోసం, వారి సద్గుణాలను పొగడడంకోసం సృష్టింపబడిన శరీరం, వాక్కు అపచారాలను చేసి అనర్థాన్ని పొందడానికి ఉపయోగపడుతున్నదే!

**(సతతమ్)** - స్వరూపానికి తగిన కైంకర్యంలో అన్వయించినవానికి కాల విశేషంలో ఆ కైంకర్యాన్ని విచ్ఛేదం వస్తే, అది సహించలేనిదిగా ఉండేటట్లు, ఆ అపచారం చేయడంలోని ఒక్కొక్క సమయంలో అంతరాయం కల్గితే, ఆ అంతరాయం సహించలేనిదిగా ఉంటుంది. 'చరామి' అనే వర్తమాన క్రియాపద ప్రయోగంద్వారా అన్ని అవస్థలలోను అపచారం అనువర్తిస్తున్నదని తెలుపబడింది.

**(త్రివిధాపచారాన్)** - త్రికరణాలలో ఒక్కొక్క విషయంలోని అపచారమే చాలా క్రూరమై ఉండగా, మూడు విధాలైన అపచారాలలోను అన్వయించాను. అదికూడా, ఏవో కొన్ని అపచారాలను చేయడం మాత్రం కాకుండా, నానావిధాలైన అపచారాలలో అన్వయించిన రీతిని తెలుపగోరి బహువచనం (**"అపచారాన్"**- అనే బహువచనం) ప్రయోగింపబడింది. **"అహం సర్వం కరిష్యామి"** (నేను అన్ని విధాలైన కైంకర్యాన్ని చేస్తాను) అనేదానికి ఇది పూర్తి విరుద్ధం.

**(సోఽహమ్)** - అపచారం చేసిన చేయి ఇంకా తడి ఆరిపోని పాపిష్ఠివాడనైన నేను.

**(తవ అప్రియకరః)** - "స్వరూపానికి తగిన కైంకర్యంలో అన్వయించి ఉజ్జీవించాలి'' అని నాకోసం కృషిచేస్తూ ఉండే దేవరవారికి, ఆ కృషిని పాడుచేసి, అనిష్టాన్ని చేస్తూ ఉండేవాడను.

**(ప్రియకృద్వత్)-** వాస్తవమైన స్థితి ఈవిధంగా ఉండగా, "భగవద్భాగవతా చార్య విషయాలలో ఇతడు ఇంతటి ప్రేమను కలవారు కైంకర్యంలో రుచి కలవారు ఇంకొకరు లేరు. అందువల్ల ఇతడే మనకు ప్రియాన్ని చేసేవాడు" అని దేవరవారు తలచేటట్లుగా వర్తిస్తున్నాను.

**(ఏవం కాలం నయామి)-** ఈ విధంగా కృత్రిమమైన వర్తనంతో కాలం గడుపుతున్నాను.

**(యతిరాజ! తతోఽస్మి మూర్ఖః)** - రక్షణ సామర్థ్యాన్ని కల దేవరవారు దగ్గర ఉండగా, ఈ వస్తువు (నేను) అపచారంలో చేయిపెట్టినందున నాకంటే మూర్ఖులు ఇంకొకరు లేరు - అని భావం.

అవతారిక : ఈ రీతిలో అకృత్యకరణం (చేయకూడని కార్యాలను చేయడం), కృత్యాకరణం (భగవంతుని పట్ల అపచారం చేయడం మొదలైనవానిని) చేస్తున్నప్పటికీ, వాటిలో ఏమాత్రం సంబంధం లేనివానివలె వర్తిస్తున్నందున, నాకంటే తక్కువవాడు ఇంకొకడు లేడు- అని విషణ్ణులైన శ్రీవరవరమునులను చూచి, శ్రీరామానుజులు "పశ్చాత్తాపాదులు కల్గితే, అవి (అకృత్యకరణాదులు) తమకు తామే తొలగిపోతాయి సుమా" అని అనగా, "నాకు పశ్చాత్తాపం లేశంకూడా లేనందున ఇపుడు కూడా అకృత్యకరణమే నాకు నిత్యానుష్ఠానమై కొనసాగుతున్నది" - అని ఇందులో విన్నపిస్తున్నాయి.

**11. పాపే కృతే యది భవంతి భయానుతాప –**
**లజ్జాః పునః కరణ మస్య కథం ఘటేత ।**
**మోహేన మే న భవతీహ భయాదిలేశః**
**తస్మాత్పునః పునరఘం యతిరాజ! కుర్వే॥**

యతిరాజా! ఏదయినా పాపం చేసినపుడు భయం, పశ్చాత్తాపం, లజ్జ – అనే మూడు కల్గితే, మళ్లీ ఆ పాపాన్ని తిరిగి చేయడం జరుగదు. కాని, నేను పాపాలను చేసినా, భయం మొదలైన మూడు కొంచెంకూడా నాకు కల్గవు. అందువల్ల పాపాలను మళ్ళీ మళ్ళీ చేస్తున్నాను.

వ్యాఖ్య : **(పాపే కృత ఇత్యాది)** భయం- అంటే- భవిష్యత్తులో రాబోయే అనర్థవిశేషాలను సూచించే చిహ్నాలను చూచినపుడు కలిగేది దుఃఖమే కదా! "ఇపుడు ఈ పనిని చేస్తే, తరువాత మనకు అనర్థం వస్తుంది" అని జంకే వానికి అటువంటి భయం కల్గుతుంది. "నేను అకృత్యాన్ని చేయడంలో సంబంధాన్ని కలవాడను కాబోను" అనే నిశ్చయం కల్గినా, దుర్వాసన వల్ల (గతంలోని బలమైన చెడ్డ అలవాటువల్ల) మనస్సు కలత చెంది (పాడయిపోయి), అనుకోకుండా అకృత్యం చేయడానికి ప్రయత్నించేవానికి పశ్చాత్తాపం కల్గుతుంది. కావాలని బుద్ధిపూర్వకంగా ప్రయత్నం చేసినా, పెద్దవారు అసహ్యించుకుంటారని భయపడేవానికి సిగ్గు కల్గుతుంది. వీటిలో ఏదయినా కల్గి ఉంటే, తిరిగి తిరిగి పాపాన్ని చేయడం ఏవిధంగా జరుగుతుంది?

**(మోహేన మే న భవతీహ భయాదిలేశః)-** తరువాత రాబోయే ప్రమాదాన్ని కాని, ఇపుడు ఏర్పడే శిష్టగర్హణం (పెద్దవారు నిందించడం)కాని- వీనిలో దేనినీ గమనించ లేని అజ్ఞానంతో బుద్ధిపూర్వకంగా అకృత్యాదులలో పూర్తిగా లగ్నమై ఉండే నాకు కొంచెం కూడా భయం, లజ్జ మొదలైనవి లేవు.

**(తస్మాదిత్యాది)-** అందువల్ల, మళ్ళీ మళ్ళీ పాపాన్నే చేస్తున్నాను.

అవతారిక : "భగవంతుడు అన్ని వస్తువులలో అంతర్యామిగా సమస్త ప్రవృత్తులను చూస్తూ వేంచేసి ఉండే రీతిని తలిస్తే, పాపాలను చేయడానికి అవకాశం లేదుసుమా!" అనగా, "దానిని కూడా అనుసంధించడానికి అవకాశం లేని రీతిలో కామంతో పరవశమైన మనస్సును కలవాడనై, ఉన్నాను"- అని పల్కుతున్నారు.

**12. అంతర్బహి స్సకలవస్తుషు సంతమీశమ్**
**అన్ధః పురః స్థితమివాహ మవీక్షమాణః ।**
**కందర్పవశ్యహృదయః సతతం భవామి**
**హంత! త్వదగ్ర గమనస్య యతీంద్ర! నార్హః ॥**

యతీంద్రా! నేను అన్ని పదార్థాల లోపల బయట వ్యాపించి ఉండే భగవానుని, ఎదుట ఉండే వస్తువులను కానలేని గుడ్డివానిలె చూడనివాడనై, మన్మథునకు వశమైన హృదయం కలవాడనై సదా ఉన్నాను. అందువల్ల మీ ఎదుటకు రావడానికి కూడా తగను.

**వ్యాఖ్యానమ్ : (అంతర్బహి రిత్యాది)-** తన, పర- అనే తేడా లేకుండా అన్ని వస్తువుల లోపల, బయట తేడా లేక వ్యాపించి ఉండి, తాను వ్యాపించిన వ్యాప్యవస్తువులను స్వాధీనంలో పెట్టుకొని నియమిస్తూ ఉండేవానిని - అని దీని అర్థం. లోపల భగవంతుడు ఉండే రీతిని తెలిస్తే, నా ఆలోచనను గమనించి ఆశ్రయమైన మనస్సులో ఉండేవాడు - ఏమని అనుకుంటాడు? అని జంకి, మనస్సులో పాపచింతన చేయడం జరుగదు. బయట ఉండే రీతిని తలిస్తే, "లోపలే కదా ఉన్నాడు, బయట లేడు'' అని బాహ్యకరణాలతో పాపాన్ని చేయడానికి వీలు లేదు. లోపల బయట ఉండేవాడైనా, చేసిన పాపాలకు తగిన దండనను ఇచ్చి నియమించడానికి శక్తి లేనివాడైతే పాపం చేయవచ్చు. ఆ విధంగా కాకుండా, అపరాధానికి అనుగుణంగా దండించడానికి తగిన నిరంకుశస్వతంత్రుడై ఉన్నపుడు ఇక ఏవిధంగా పాపం చేయడానికి వీలుంటుంది?

**(అంధః పురః స్థిత మివాహ మవీక్షణమాణః)** - పుట్టుగుడ్డివాడు తన ముందున్నవానిని చూడలేనట్లుగా, తత్త్వజ్ఞాన శూన్యుడనైన నేను, అంతటా సన్నిహితుడై, సర్వనియంతయై ఉండే భగవంతుని చూడలేకున్నాను.

"మీరు, ఆచార్యులవల్ల ఉపదేశం పొందినవారై ఉండగా, చూడలేక పోవడానికి ఏమి కారణం?'' అంటే, దానికి బదులు పల్కుతున్నారు.

**(కందర్పవశ్యేత్యాది)-** అతనిని చూడడానికి సాధనమైన మనస్సు కామపరవశత చేత కలత చెందిన తరువాత ఇక చూచే అవకాశం ఉన్నదా? లౌకికవిషయాలలో ప్రావణ్యాన్ని పొందిన మనస్సులో ఆచార్యోపదేశాదులవల్ల కల్గిన జ్ఞానం స్థిరంగా ఉండడం అరుదుకదా!

**(సతతమ్)** - మనస్సుకు ఈ కామపారవశ్యం తాత్కాలికం అయితే, మిగిలిన సమయాలలో అయినా ఇంద్రియాలను నియంత్రించగలవారిలో గొప్పవారై దేవరవారు ఉండడం దాసుడు ఉజ్జీవించడానికి ఉపయోగిస్తుంది- అని తలచాను. కాని అది విపరీతమైనదే! - అని పల్కుతున్నారు.

**(ఈశ మవీక్షమాణః త్వదగ్రమనస్య నార్హః)** - భగవానుడు పొందదగిన వాడనే జ్ఞానం కదా, ఆచార్యుని ఆశ్రయించడానికి మూలం. ఆ జ్ఞానం లేనందున దాసుడనైన నేను దేవరవారి సమక్షానికి రావడానికి యోగ్యుడను కాను- అని అంటున్నారు.

**(కందర్పవశ్యహృదయః త్వదగ్రగమనస్య నార్హః)** - కామపరశుడనైన నేను జితేంద్రియాలలో గొప్పవారైన దేవరవారి ముందు రావడానికి యోగ్యత ఉన్నదా? - అని అంటున్నారు.

**(ఈశ మవీక్షమాణః కందర్పవశ్యహృదయః త్వదగ్రగమనస్య నార్హః)** (దాసుడనైన) నన్ను చూచినా, మిమ్ములను చూచినా, నేను దేవరవారి ముందుకు రావడానికి యోగ్యత లేదు- అని పల్కుతున్నారు. దాసుడనైన నేను **"మాతవనే కణ్ణుఱ నిఱ్కిలుమ్ కాణకిల్లా"** (మాధవుడే కంటికి ఎదురుగా నిలిచినా చూడలేని) వాడనై, **"పొరుళుమ్ పుదల్వరుమ్ పూమియుమ్ పూమ్ కుழలారు మెన్రే మరుళ్ కొణ్డవన్"** (ధనం, సంతానం, భూమి, పూలు ముడుచు కొన్న కేశాలను కల కాంతలు- అని అజ్ఞానాన్ని పొందినవాడను) - దేవరవారు అయితే **"అరఙ్గన్ మలరడి క్కాళుఱ్ఱవరే తమక్కుఱ్ఱవరాయ్ క్కొళ్ళుముత్త మన్"** (శ్రీరంగనాథుని పాదపద్మాలకు దాసులైనవారే తమకు కావలసినవారని తలచే ఉత్తములు.)

**(హంత! నార్హః)** - యోగ్యత కూడా నశించిపోయింది సుమా! - అని అంటున్నారు.

**(ఈశ మవీక్షమాణః త్వదగ్రగమనస్య నార్హః)** మును ముందుగా సామాన్య మైనదానిని చూడనివాడను విశేషమైనదానిని పొందడమనే (దరిచేరడమనే) విషయం ఉన్నదా? - అని పల్కుతున్నారు.

**అవతారిక :** "ఈ విధంగా పాపాలను ఆర్జించే భూమియై, ఆ పాపాలకు ఫలమైన దుఃఖానుభవానికి స్థానమైన ఈ శరీరంలో నిలచి ఉండడాన్ని పోగొట్టు కోరా? మీరు'' అని శ్రీరామానుజుల అభిప్రాయంగా తలచి, "నా పాపాతి శయంచేత శరీరాన్ని పోగొట్టుకోవాలనే అపేక్ష నాకు కలుగలేదు. అటువంటి నా పాపాలను దేవరవారే శీఘ్రంగా పోగొట్టాలి''- అని పల్కుతున్నారు.

**13. తాపత్రయీ జనితదుఃఖనిపాతినోఽపి**
**దేహస్థితౌ మమ రుచిస్తు న తన్నివృత్తౌ ।**
**ఏతస్య కారణమహో! మమ పాపమేవ**
**నాథ ! త్వమేవ హర తద్యతిరాజ ! శీఘ్రమ్॥**

నాథా! యతిరాజా! నాకు దేహస్థితి (రక్షణ)లోనే ఆసక్తి కల్గుతున్నది తప్ప, ఆధ్యాత్మిక - ఆధిభౌతిక - ఆధిదైవికాలనే మూడు తాపాలవల్ల కలిగే దుఃఖాలలో పడి ఉన్న ఆ దేహాన్ని పోగొట్టుకోవడంలో ఆసక్తి లేదు. దీనికి నా పాపాలే కారణం. అయ్యో! మీరే ఆ పాపాలను తీర్చాలి.

వ్యాఖ్య : **(తాపత్రయీత్యాది)** ఈ శరీరంలో అనుభవించే దుఃఖాలు ఒకటా, రెండా, వాటిని పోగొట్టుకోకుండా ఉండడానికి? కర్మలు ఒక విధమైనవి అయినపుడు కదా, వాటి ఫలమైన దుఃఖంకూడా ఏకవిధంగా ఉంటుంది. కర్మానుగుణంగా అనుభవించవలసిన దుఃఖం, ఆధ్యాత్మికాదుల రూపంతో మూడు విధాలుగా (ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికమని మూడు విధాలుగా) ఉంటుంది. వీటిలో, ఆధ్యాత్మికం- శారీరమని, మానసమని రెండు విధాలు. శారీరం అయితే - జ్వరం, వ్యాధి మొదలైనవానితో అనేకవిధాలు. మానసం- కామ, క్రోధాదులతో వచ్చే దుఃఖం, ఆధిభౌతికం - మృగాలు, పక్షులు మొదలైన వానివల్ల కలిగే దుఃఖం. ఆధిదైవికం - చలి, వేడిమి మొదలైనవానివల్ల కలిగే దుఃఖం- ఈ విధంగా మూడు రీతులలోని దుఃఖసమూహాలతో కలిగే దుఃఖసముద్రంలో ఇంకా ఇంకా అవగాహిస్తూ (మునిగిపోతూ) ఉన్నా,

**(దేహస్థితౌ మమ రుచిః)** - **"దుఖం మా భూవమ్"** (దుఃఖాన్ని పొందే వాడను కాను) అనే లౌకికుల రీతిని సైతం దాటిన నాకు, దుఃఖానికి చోటయిన శరీరాన్ని ఏ లోటు లేకుండా కాపాడుకోవడంలోనే ఆసక్తి ఉన్నది.

**(తు)** - లౌకికుల రీతికంటే తమకు ఉండే తేడాను ఈ పదం ద్వారా సూచించారు.

**(న తన్నివృత్తౌ)**- ఆ ఆసక్తి (శరీరరక్షణలోని ఆసక్తి) దీని నివృత్తిలో (ఈ శరీరాన్ని పోగొట్టుకోవడంలో) నాల్గవవంతు అయినా ఉంటే, దీనిని పోగొట్టుకొని ఉండవచ్చుకదా.



**(ఏతస్యేత్యాది)**- దీనికి కారణం నేను చేసిన పాపమే, అంతే, అయ్యో!

**(నాథ !)** - ఇది (నా ఆత్మ) దిక్కు లేనిదైనందున ఈ విధంగా హైన్యాన్ని పొందుతున్నదా? (లేదుకదా)

**(త్వమేవేత్యాది)** - ఈ సంబంధాన్ని చూచి, "దుఃఖాన్ని సుఖంగా తలచి ఆశపడే వీడు ఇంకా ఇంకా అనర్థాన్ని కొనితెచ్చుకొంటాడు''- అని చటుక్కున ఆపాపాన్ని మీరు పోగొట్టాలి.

**అవతారిక :** "ఇపుడు కూడా భయం, పశ్చాత్తాపం మొదలైనవి లేకుండా, పాపాలను ఆర్జించడం (చేయడం) నుండి విరమించని రీతిని కలవారై, శరీరం పోగొట్టుకోవడంలో అపేక్ష లేకుండా ఉండే మీకు దానికి కారణమైన మీ పాపాలను పోగొట్టడమంటే, పోగొట్టడం మాకు సాధ్యమా? అందువల్ల మీరే మీ రక్షణకు దారి చూచుకోవాలి - అని అనగా, "దోషమే మూర్తీభవించిన నాకు దేవరవారి కృప తప్ప ఇంకొక గతి లేదు సుమా!'' - అని తరువాత రెండు శ్లోకాలతో పల్కుతున్నారు.

అందులో, మొదటి శ్లోకంతో "సర్వజ్ఞులైన కూరేశులు, వరదరాజ స్తవాదులలో పల్కిన దోషాలకు అన్నిటికి అద్వితీయాశ్రయమైన దాసునకు దేవరవారి కృప తప్ప వేఱు గతి లేదు'' -అని అంటున్నారు.

**14. వాచామగోచర మహాగుణ దేశికాగ్ర్య -**
**కూరాధినాథ కథితాఖిల నైచ్యపాత్రమ్ ।**
**ఏషోఽహమేవ న పునర్జగతీదృశస్తత్**
**రామానుజార్య ! కరుణైవ తు మద్గతిస్తే ॥**

శ్రీరామానుజాచార్యా! వాచామగోచరాలైన గొప్ప గుణాలను కల్గిన ఆచార్య శ్రేష్ఠులైన కూరేశులచేత అనుసంధింపబడిన అన్ని నైచ్యాలకు నేనే పాత్రం. నావంటివాడు ఈ లోకంలో లేడు. అందువల్ల నీ దయమాత్రమే నాకు గతి.

వ్యాఖ్య : **(వాచామగోచరేత్యాది)**- **"మొழியై క్కడక్కుమ్ పెరుమ్ పుకழాన్"** (వాచామగోచరమైన గొప్ప కీర్తిని కలవారు) అనేవిధంగా **"ఇంత"** అని నోటితో పరిచ్ఛేదించి పలుకడానికి సాధ్యం కాని రీతిలో ఉన్నవి, అవధి

లేనివి అయిన జ్ఞానశక్త్యాది కల్యాణగుణాలను కలవారై, తనపట్ల తీరని అపరాధాన్ని చేసిన నాలూరాన్‌ను కూడా భగవంతునితో వాదులాడి రక్షించే గొప్ప కరుణను కలవారైనందున ఆచార్యశ్రేష్ఠులైన కూరేశులు అనుగ్రహించిన ఆ నైచ్యానికి పాత్రం, పూర్వం పల్కిన స్వభావాన్ని కల్గిన నేనొక్కడనే.

**(న పునర్జగతీదృశః)** - పరిశీలించి చూస్తే ఈ లోకంలో ఇటువంటి దోషాన్ని కలవాడెవడూ లేడు.

**(తద్రామానుజేత్యాది)** - దేవరవారి కృపకు కడుపు నిండేటట్లుగా ఉండే దోషపూర్తి నాకు ఉన్నందున, దేవరవారి కృపయే నాకు ఆశ్రయం.

**(ఆర్య!)** - ఈ అర్థం దేవరవారికి తెలియనందున దాసుడు విన్నపించాలా?

**(రామానుజ!)** - దేవరవారి కృపవరకు పోవాలా? మోక్షానికి అద్వితీయ ఉపాయమైన, చాతుర్యాన్ని కల, చతురక్షరి అయిన - నాల్గు అక్షరాలు కల) రామానుజ నామమే చాలదా? **"న చేద్రామానుజేత్యేషా చతురా చతురక్షరీ"** (రామానుజ - అనే నాల్గు అక్షరాలు కల, చాతుర్యాన్ని కల్గిన నామమే లేకపోతే మనవంటివారి గతి ఏమయి ఉండేదో కదా) అని చెప్పబడుతున్నది కదా?

**అవతారిక :** ఇంతమాత్రమే కాకుండా, పరమాచార్యులైన యామునులు, కూరేశులు, వారి కుమారులైన భట్టర్ తాము అనుగ్రహించిన ప్రబంధాలలో ప్రతిపాదించిన దోషాలన్నీ నాకొక్కనికే ఉన్నందున, దేవరవారి కృపయే నాకు ఉపాయం - అని ఇందులో శ్రీవరవరమునులు అంటున్నారు. దోషం ఎక్కువ అయేకొలదీ, శ్రీరామానుజుల కృప తమపట్ల పూర్తిగా ప్రవహిస్తున్నది- అని భావిస్తున్నారు.

**15. శుద్ధాత్మ యామున గురూత్తమకూరనాథ -**
**భట్టాఖ్యదేశికవరోక్త సమస్తనైచ్యమ్ ।**
**అద్యాప్యసంకుచితమేవ మయీహ లోకే**
**తస్మాద్యతీంద్ర! కరుణైవ తు మద్గతిస్తే ॥**

యతీంద్రా! మహాత్ములైన శ్రీయామునులు, శ్రేష్ఠులైన కూరేశులు, శ్రీపరాశర భట్టర్ అనే గొప్ప ఆచార్యులచే చెప్పబడిన నైచ్యాలు అన్నీ ఈలోకంలో ఇపుడు ఏ లోటు లేకుండా నాలోనే ఉన్నాయి. అందువల్ల నాకు నీ దయ ఒక్కటే రక్షకం.



వ్యాఖ్య : పరిశుద్ధమైన మనస్సును కల ఆళవందార్, ఆచార్యోత్తములైన కూరేశులు, వారి కుమారులైన భట్టర్ - అనే వీరు తమ తమ ప్రబంధాలలో **"అమర్యాదః"** అని, **"బుద్ధ్వా చ నో చ"** అని, **"అతిక్రామన్నాజ్ఞామ్"** అని ఈ విధంగా పల్కిన నైచ్యం అంతా -

**(అద్యాప్తీత్యాది)** - ఈ లోకంలో, ఈ కాలంలో, నా ఒక్కనిలోనే ఏ సంకోచం లేకుండా ఉన్నది. అందువల్ల, దేవరవారి కృపయే నాకు తరించే ఉపాయం.

**(ఇహ లోకే)** - లోకాంతరంలో ఇంకొకటి ఉన్నదేమో తెలియదు. (ఈలోకంలో లేదు)

**(అద్య)**- వేరొక కాలంలో ఉందేమో తెలియదు.

**(అసంకుచితమ్)** - ఒకవేళ ఉన్నా, ఈ విధంగా ఏ లోటు లేని రీతిలో ఉండదు. అందుచేత, ఇటువంటి విషయం (నేను) దేవరవారి కృపకు ఇంకొకటి లేదు. దాసునకు దేవరవారి కృప తప్ప వేరొక రక్షకం లేదు- అని భావం. ఇందుచేత **"నికరిన్ఱి నిన్ఱ ఎన్నీశతైక్కు నిన్నరుళిన్‌కణన్ఱి పుక లొన్ఱు మిల్లై, యరుట్కు మవదే పుకల్"** (సాటిలేని - నా నైచ్యానికి మీ కరుణ తప్ప ఇంకొక ఆశ్రయం లేదు. మీ కృపకు కూడా నేనే ఆశ్రయం) అనే సూక్త్యర్థం తెలుపబడింది.

**అవతారిక :** ఈ విధంగా, దోషబాహుళ్యాన్ని, దోషాన్ని మిక్కిలిగా కల తమకు ఉజ్జీవనోపాయం శ్రీరామానుజుల కృపయే- అనే విషయాన్ని వీరు (వరవరమునులు) పలుకగానే, శ్రీరామానుజులు వీరిని విశేషంగా కటాక్షించి, "మీకు కావలసినదేమి? అని ప్రశ్నించగా, **"వాచా యతీంద్ర!"** అని, **"అల్పాపి మే"** అని గడచిన రెండు శ్లోకాలతో ప్రార్థించిన అనిష్టనివృత్తిని, ఇష్టప్రాప్తిని ఈ శ్లోకంలో పూర్వార్ధ ఉత్తరార్ధాలలో ప్రార్థిస్తున్నారు

**16. శబ్దాదిభోగవిషయా రుచి రస్మదీయా**
**నష్టా భవత్విహ భవద్దయయా యతీంద్ర! ।**
**త్వద్దాసదాసగణనా చరమావధౌ యః**
**తద్దాసతైకరసతాఽవిరతా మమాస్తు ॥**

యతీంద్రా! ఈలోకంలో నాకు సంబంధించిన లౌకికవిషయభోగాసక్తి నీదయవల్ల నశించినది కావాలి. ఎవడు, నీ దాసులయొక్క దాసుల చరమావధిలో ఉన్నాడో, అటువంటివాని కైంకర్యంలోనే ఆసక్తి నాకు నిత్యంగా ఉండాలి.

వ్యాఖ్య : **(శబ్దాదీత్యాది)** - తిరుమంత్రంలోని మూడవ పదంలో **("నారాయణాయ"** అనే మూడవ పదంలో) తెల్పిన అనన్యభోగ్యత్వానికి శబ్దాదిలౌకికవిషయాల అనుభవమే కదా విరోధి. అందువల్ల, అవిద్యానివృత్తిని కోరకుండా లౌకికవిషయాలలోని ప్రావణ్యాన్ని పోగొట్టమని ఇందులో అర్థిస్తున్నారు.

**(అస్మదీయా)** - ఈ లౌకికవిషయానుభవ రుచివల్ల కదా, అనాదికాలంగా స్వరూపానికి తగినపురుషార్థాన్ని కోల్పోయాను- అనే కారణంచేత దానిపేరును ఉచ్చరించడం కూడా వీరికి అసహ్యంగా ఉన్నది.

**(నష్టా భవతు)** - **"యాతు శతధా వినాశమ్"** (వినాశాన్ని అనేక రీతులలో పొందనీ) అనే విధంగా రూపుకనబడని రీతిలో నశించిపోవాలి. ఈ దేహం ఈ జన్మ చివరలో నశించి పోతుందా? - అంటే,

**(ఇహ నష్టా భవతు)** - అని అంటున్నారు. ఈ శరీరంతో ఉండే కాలంలోనే నశించిపోవాలి. అంతేకాక, శబ్దాది లౌకికవిషయాలు ఎటువంటి గొప్పవారినైనా తన వశం చేసికొని, అద్వితీయంగా పాలించే ఈ లోకంలో - అని కూడా అర్థం.

"అనాదికాలంగా అనువర్తిస్తూ వచ్చే ఇది నశించాలంటే దీనికొక హేతువు ఉండవద్దా? - అంటే, సమాధానం పల్కుతున్నారు''.

**(భవద్దయయా)** అని అంటూ. "నాకు శేషమై ఉండే ఇతడు ఈలౌకిక విషయాల వల్ల బాధను పొందుతున్నాడే! ఈ విషయాల చేతిలో ఇక ఇతడు క్లేశపడకుండా ఉండాలి'' అని దేవరవారు కృపచేస్తే బతికి బయటపడవచ్చు; అంతే.

కేవలం కృపతో లౌకిక విషయరుచి పోతుందా? అంటే, సమాధానం పల్కుతున్నారు-



**(యతీంద్ర!)** - అని అంటూ. విషయాలను తిరస్కరించి శక్తిని కల యతులలో గొప్పవారైన దేవరవారికి సాధ్యం కానిది ఉన్నదా?

ఇంతమాత్రమేనా? ఇంకా ఏమయినా కావాలా? అని అంటే- "ఇది ఆనుషంగికం. ప్రధానమైన ఫలం వేటే ఉన్నది'' అని అంటూ తమకు ఇష్టమైన పురుషార్థాన్ని ఇక ప్రార్థిస్తున్నారు.

**(త్వద్దాసేత్యాది)**- దేవరవారి శ్రీచరణాలలోని శేషత్వమేని రూపక లక్షణంగా కల శేషభూతుల వరుసతో చివరి స్థానంలో ఉండేవారెవరో, వారి శ్రీచరణాలకు శేషమై ఉండడమనే దానిలోనే స్థిరంగా ఆసక్తిని కలవాడనై ఉండడమే నాకు నిరంతరం కొనసాగాలి.

**(మమాస్తు)** - "ఇదే పురుషార్థం'' అని నిశ్చయించుకొన్న నాకు ఇది కలిగేటట్లుగా - అని అర్థం. ఈ పురుషార్థం పట్ల ఆశలేనివారు కోల్పోయారంటే రుచిని కల నేను కూడా కోల్పోవాలా? - (అనిభావం.)

అవతారిక : "ఇష్టాలను అనుగ్రహించడం, అనిష్టాలను తీర్చడం - అనేవి ఉపాయస్వరూపుడైన భగవంతుని పనులు కదా! నాకు వానిని నిర్వహించడం సాధ్యమా?''- అని శ్రీరామానుజులనగా, **"పల్లుయిర్క్కుమ్ విణ్ణిన్ తలైనిన్టు వీడళిప్పాన్ మణ్ణిన్ తలత్తుదిత్తు"** (పలువురు జీవులకు మోక్షాన్ని అనుగ్రహించడం కోసం పరమపదం నుండి ఈ లోకానికి వచ్చి అవతరించి) అని, "శ్రీవిష్ణులోకమణిమంటపానికి (సహస్రస్థూణా మండపానికి దారి చూపించే వారు) అనే రీతిలో ఉండే దేవరవారికి సాధ్యం కానిది ఉన్నదా? అయినా, అవతారంలోని సత్యత్వం కోసం సర్వేశ్వరునిపై మోక్షప్రదత్వం అనేది పెట్టినప్పటికీ, ఆ భగవంతుడు కూడా దేవరవారికి అధీనుడు కదా! కనుక, ఆశ్రితుల పాపవిమోచనం చేయడంలో శక్తి దేవరవారికే ఉన్నది- అని బదులు పల్కుతున్నారు.

**17. శ్రుత్యగ్రవేద్యనిజదివ్యగుణస్వరూపః**
**ప్రత్యక్షతా ముపగత స్త్విహ రంగరాజః ।**
**వశ్య స్సదా భవతి తే యతిరాజ! తస్మాత్**
**శక్తః స్వకీయజన పాపవిమోచనే త్వమ్ ॥**

యతిరాజా! వేదాంతాలద్వారా తెలియదగిన దివ్యగుణాలను, స్వరూపాన్ని కల్గినవాడై, శ్రీరంగంలో అందఱి నేత్రాలకు గోచరుడై, సులభుడై ఉండే శ్రీరంగ నాథుడు మీకు అధీనుడు. అందువల్ల మీరు మీ భక్తుల పాపాలను పోగొట్టడంలో సమర్థులు.

వ్యాఖ్య : **(శ్రుత్యగ్రవేద్యేత్యాది)** - అపౌరుషేయమై, నిత్యమై, నిర్దోషమైన వేదాంతంతో తెలియదగిన తన కల్యాణగుణాలతో కూడిన దివ్యాత్మ స్వరూపాన్ని కలవాడు, స్వరూపగుణాలను కలవాడు - అని అర్థం. ఇక్కడ స్వరూపగుణాలను ప్రస్తావించడం అనేది - రూప, విభూతి, గుణాలకు కూడా సూచకం. **"దివ్యగుణస్వరూపః"** అని కల్యాణగుణ విశిష్టంగా స్వరూపాన్ని పల్కడం - పరతత్త్వం నిర్గుణమని అనేవారు నోరెత్తడానికి వీలులేకుండా చేయడంకోసం. **"నలముడైయవన్"** (ఆనందగుణాన్ని కలవాడు) అని ఆళ్వార్లు పల్కినట్లే ఇది కూడా నిర్గుణవాదాన్ని నిరసించడం కోసం పలుకబడింది. **"నిర్గుణమ్, నిరంజనమ్"** ఇత్యాదులలో స్ఫురించే గుణసామాన్యనిషేధం, **"యస్సర్వజ్ఞః సర్వవిత్"** (అన్నిటిని తెలిసిన వాడు, అన్నిటిని పొందేవాడు) ఇత్యాదులలో విధింపబడిన కల్యాణగుణాలకంటే వేఱయిన, హేయగుణాలను ఉద్దేశించి చెప్పబడిందని స్ఫురించడంకోసం **"దివ్యగుణస్వరూపః"** అని అన్నారు. ఇందుచేత- అతని (శ్రీరంగనాథుని) పరత్వం చెప్పబడింది.

ఈ విధంగా కేవలం శాస్త్రాలద్వారా వినడం కాకుండా, సాక్షాత్తు కళ్ళతో దర్శించి, అందఱు ఆనందించేటట్లుగా శ్రీరంగంలో వేంచేసి, శయనించి ఉండే శ్రీరంగనాథుని సౌలభ్యాన్ని ప్రస్తావిస్తున్నారు.

**(ప్రత్యక్షతా ముపగతః)** - **"ఎన్టేనుమ్ కట్కణ్ణాల్ కాణాద అవ్వడివై"** (ఏనాటికీ మాంసచక్షువులతో దర్శించడానికి సాధ్యం కాని ఆ రూపాన్ని) నేత్రాలకు విషయంగా (కంటికి కన్పించేటట్లు) చేశాడు. **"ఞాలత్తూడే నడన్దు నిన్ఱు"** (భూమిపై సంచరించి) అనే రీతిలో తన రూపంలోని వైలక్షణ్యాన్ని దర్శించి ప్రావణ్యాన్ని పొందేవారు లేని ఈ సంసారంలో కదా, తన రూపాన్ని దర్శింప జేశాడు. (ప్రత్యక్షీకరించాడు).

**(రంగరాజః)**- తగని చోటకు వచ్చినప్పటికీ తన (రంగనాథుని) వైభవం సంకోచించకుండా ప్రకాశిస్తున్నది. పరమసామ్యపత్తిని పొందిన ముక్తులకు



దర్శనాన్ని ఇచ్చే సన్నివేశంలో కంటే ఇక్కడకు వచ్చి, ద్వైరాజ్యాన్ని లేకుండా చేసిన తరువాతనే అతని శేషిత్వం సుప్రతిష్ఠితమైనది.

**(వశ్య స్సదా భవతి తే యతిరాజ!)** - ఈ విధంగా పరత్వ-సౌలభ్యాలు రెండిటితో పూర్ణుడైన శ్రీరంగనాథుడు దేవరవారికి ఎల్లప్పుడు విధేయుడుకదా!- **"నమ్ శేవకనార్ మరువియ పెరియకోయిల్"** (మన స్వామి అభిమానించిన శ్రీరంగం) అనే విధంగా "భక్తులు చేసే అంజలిని చూచి వారికి వశమయేవాడు కదా! ఉభయవిభూతి సంపదను దేవరవారికి ఇచ్చి, "నేను పలు అవతారాలను ఎత్తి సంస్కరించాలని చూచినా సంస్కరింపబడని సంసారుల మూర్ఖతను తీర్చి, నాకు దాసులయేటట్లు సంస్కరించి అప్పగించడానికి ఈ శ్రీరామానుజులు ఒకరిని పొందానుకదా! - అని అంతు లేని వ్యామోహాన్ని పొంది, "ఏదయినా ఒక పనిలో నన్ను వీరు ఎపుడు నియమిస్తారు?'' అని ఆ సమయంకోసం వేచి ఉండి, సదా వీరికి విధేయుడై ఉన్నాడు.

**(వశ్యః భవతి)** - ఈ విధంగా శ్రీరంగనాథుడు ఆశ్రితపరతంత్రుడై, అందువల్ల సత్తను పొందాడు. **'ఆత్మానం నాతివర్తేథాః'** (భక్తపారతంత్ర్యమనే నీ అసాధారణ స్వరూపాన్ని అతిక్రమించకు) అని, **"తేవుమ్ తన్నైయుమ్"** (పరత్వాన్ని, అసాధారణ స్వరూపమైన సౌలభ్యాన్ని) అని భక్తపారతంత్ర్యం భగవదసాధారణ స్వరూపంగా చెప్పబడుతున్నది కదా! నిరంకుశస్వతంత్రుడైన వాడు ఏదో ఒక సమయంలో ఆవిధంగా ఉండవచ్చుకదా! అంటే,

**(సదా భవతి)** - అని అంటున్నారు. స్వాతంత్ర్యంతో తన సత్తను పొందడం కాకుండా, తన స్వరూపస్థితి అయిన భక్తపారతంత్ర్యాన్ని పోగొట్టుకుంటాడా? దేవరవారిపట్ల మాత్రమే వ్యామోహంవల్ల పరతంత్రుడై ఉండడం కాకుండా, తన స్వరూపసత్తను పొందడంకోసంగా భక్తపరతంత్రుడై ఉంటాడు కనుక, ఈ భక్తపారతంత్ర్యం సదా ఉంటుంది.

**(తస్మాత్)** - అందువల్ల, దేవరవారు ఆశ్రయించినవారి పాపాలను పోగొట్టడంలో శక్తిని కలవారుకదా!

**అవతారిక :** "ఉపాయరూపుడైన ఈశ్వరుడు మాకు విధేయుడై ఉన్నాడు, సరే. అనాదికాలంగా ఆ స్వామి యొక్క ఆజ్ఞారూపాలైన శాస్త్రాల మర్యాదను

ఉల్లంఘించి, మూడు కరణాలతో చాలా క్రూరమైన పాపాలను పూర్ణంగా చేసి, ఇపుడు మనస్సులో భీతి (పరిణతి) కల్గినపుడు ప్రపన్నుడు ఆ స్వామికి కలిగే కోపాన్ని, అతని పాదాలను ఆశ్రయించి, ఉపశమింపజేసి కోవలసి ఉన్నది కదా!" అని భగవద్రామానుజుల అభిప్రాయంగా భావించి, తాను ముందు తాగి, బిడ్డ వ్యాధిని తీర్చే వాత్సల్యాన్ని కల తల్లివలె, మాకు తల్లివంటి మీరు కూడా మిమ్ములను ఆశ్రయించిన మాకోసం లక్ష్మీవల్లభుడైన భగవంతుని శ్రీచరణాలలో వీరి "సర్వాపరాధాలను క్షమించాలి" అని ప్రార్థించారు కనుక, మాకు ఏ కొఱత లేదు సుమా - అని ఇందులో పల్కుతున్నారు.

**18. కాలత్రయేఽపి కరణత్రయ నిర్మితాతి –**
**పాపక్రియస్య శరణం భగవత్క్షమైవ ।**
**సా చ త్వయైవ కమలారమణేఽర్థితా యత్**
**క్షేమ స్స ఏవ హి యతీంద్ర! భవచ్ఛ్రితానామ్॥**

యతీంద్రా! మూడు కాలాలలోను కరణత్రయాలచే చేయబడిన అతి పాపకృత్యాలను కల్గినవానికి రక్షకం భగవానుని క్షమాగుణం మాత్రమే. అది మీచేతనే భగవానుని సన్నిధిలో ప్రార్థింపబడినది. అందువల్ల మిమ్ములను ఆశ్రయించినవారికి అందఱికి ఆ ప్రార్థన క్షేమకరం.

వ్యాఖ్య : **(కాలత్రయేపి)** - భూతకాలంలోని పాపాలు మాత్రమే కాకుండా, మూడు కాలాలలోను పాపాలను క్షమించి, సహించవలసి ఉన్నది. **"కృతాన్ క్రియమాణాన్ కరిష్యమాణాంశ్చ"** (చేసిన, చేస్తున్న, చేయబోయే అపరాధాలు) అనే శరణాగతిగద్య సూక్త్యర్థం ఇక్కడ తెలుపబడింది.

**(కరణత్రయేత్యాది)**- ఏదో ఒక కరణంతో చేసిన పాపాలను క్షమించడం కాకుండా, కరణత్రయంతో ఆర్జించిన పాపాలను క్షమించాలి- అని భావం. ఇందువల్ల "మనోవాక్కాయైః" అనే సూక్త్యర్థం చెప్పబడింది. "నిర్మిత" అని అన్నందున, వీనిని తాను సంకల్పం చేయడం మాత్రమే కాక, తలచినదానికి ఒకటికి పదింతలుగా చేయబడినవి- అని భావం.

**(పాపక్రియ)** అని అన్నందున అకృత్యకరణం, **"అతిపాప"** అని అన్నందున భగవదపచారాదులు చెప్పబడ్డాయి. ఇందువల్ల- **"అకృత్యకరణకృత్యాకరణ**



**భగవదపచార భాగవతాపచారాసహ్యాపచార రూపనానావిధానంతాపచారాన్"** అనే శరణాగతిగద్య సూక్త్యర్థం తెలుపబడింది.

**(శరణం భగవత్ క్షమైవ)** - ఈవిధంగా ఉండే పాపాలను కలవానికి భగవంతుని "అపరాధాలను సహించడ"మనే క్షమ తప్ప వేఱు శరణం లేదు.

**(సా చేత్యాది)** -ఆ క్షమ కూడా దేవరవారిచే శ్రియఃపతి శ్రీచరణాలలో **"మనోవాక్కాయైః"** అని ఆరంభించి **"సర్వానశేషతః క్షమస్వ"** (అన్నిటిని పూర్తిగా క్షమించు) అని ప్రార్థింపబడింది. అదే, దేవరవారి శ్రీచరణాలను ఆశ్రయించిన ఆశ్రితజనులకు ఉజ్జీవించేటట్లుగా వేసిన చలువపందిరి కదా.

**(త్వయైవ)** - "అభిమానాన్ని పొందినవారిని (శరణాగతి చేసినవారిని) అనుగ్రహించాలి" అని భగవంతునితో వాదులాడే స్వరూపాన్ని కల దేవరవారే కదా ఆవిధంగా ప్రార్థించారు. **"ఇని యా ముఱామై అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్ మెయ్‌నిన్ఱు కేట్టరుళాయ్"** (ఇక మేము ప్రకృతిసంబంధాన్ని పొందకుండా ఉండేటట్లు దాసుడు చేసే ప్రార్థనను సావధానంగా వినాలి అనుగ్రహించాలి) - అని ప్రథమాచార్యులైన నమ్మాళ్వార్లు ప్రార్థించిన రీతిని చూస్తే, ఆ నమ్మాళ్వార్లు శ్రీచరణాలను ఆశ్రయించిన ఈ రామానుజులకు కూడా ఇదే కదా అనుష్ఠానం.

**(కమలారమణే)** - హృదయపూర్వకంగా పలుకని మాటను కూడా సహృదయంగా స్వామి భావించేటట్లు చేసి, భక్తుని అనుగ్రహించేటట్లు చేసే లక్ష్మీదేవి, ఆమెను కూడా సందేహించి, భక్తులను రక్షించేవాడైన స్వామి- అనే ఆ ఇద్దఱి చేరికలో కదా దేవరవారు ప్రార్థించారు.

**(అర్థితా)**- తాము, (మీరు) ఆ భగవంతుడు మాత్రమే మాత్రం తెలిసేటట్లుగా మనస్సులో ప్రార్థించడం కాకుండా, తరువాతవారికి కూడా దీనిని పురస్కరించుకొని ప్రార్థించేటట్లుగాకదా మాట, వాక్కుతో పల్కుతూ ప్రార్థించారు. ప్రార్థించినవారిని తప్పక అనుగ్రహించేటట్లుగా దేవరవారు కూడా దంతపంక్తిని చూపించారుకదా (అర్థించారుకదా).

**(భవచ్ఛ్రితానాం-స ఏవ హి- క్షేమః)** - దేవరవారి స్వభావాన్ని, మీ అభిమానాన్ని పొందిన శరణాగతుల స్వభావాన్ని, ప్రార్థించిన రీతిని గూర్చి తలిస్తే,

దేవరవారి శ్రీచరణాలను ఆశ్రయించినవారికి ఏనుగు కంఠంపై (మెడపై) కూర్చున్నవారివలె ఏభయం లేకుండా ఉండడానికి తగిన రక్షణ ఇదే కదా- అనేది స్పష్టం.

**అవతారిక :** ఈవిధంగా శ్రీరామానుజుల దివ్యవైభవాన్ని తమ ప్రేమకు తగినట్లుగా పలకాలని ప్రారంభించిన ఈ వరవరమునులు, మొదటి రెండు శ్లోకాలతో - ఆళ్వార్ల విషయంలో, వారు ఆరాధించే భగవానుని విషయంలోను శ్రీరామానుజులకు ఉండే గొప్ప ప్రావణ్యాన్ని తమను ఆశ్రయించినవారికి ప్రాప్యంగా ప్రాపకంగా ఉండే రీతిని గూర్చి పలికారు. తరువాత మూడు శ్లోకాలతో తమకు అపేక్షితమైన పురుషార్థాలను వారి సన్నిధిలో అర్థించి, అనంతర శ్లోకంతో శ్రీరామానుజుల శ్రీచరణాలలో తమకు ప్రేమ లేక పోవడానికి, ఇతరవిషయాలలోని ప్రావణ్యానికి మూలమైన పాపాన్ని పోగొట్టి, అనుగ్రహించాలని విన్నపించారు. తరువాత ఆఱు శ్లోకాలతో - తిరుమంత్రం లోని మూడు పదాలచే ప్రతిపాదింపబడే అనన్యార్హశేషత్వ - అనన్యశరణత్వ- అనన్యభోగ్యత్వాలలో నిష్ఠకు విరోధులైన అకృత్యకరణాదులను, అపచారాదులను గూర్చి వివరంగా పల్కి, తరువాత ఒక శ్లోకంతో అనంతమైన క్లేశాలకు మూలమైన దేహంతో కలసి ఉండడానికి మూలకారణమైన పాపాన్ని తీర్చాలని అర్థించారు. తరువాత రెండు శ్లోకాలతో - యామునులు మొదలైనవారు తమ సూక్తులలో పల్కిన దోష సమూహాలకన్నిటికి ఆకరమైన నాకు దేవరవారి కృప తప్ప ఇంకొక శరణం లేదు - అని అన్నారు. తరువాత మూడు శ్లోకాలతో దాసుని అనిష్టాలను పోగొట్టి, ఇష్టాన్ని అనుగ్రహించాలని, వారు (రామానుజులు) తమ కార్యాలను చేయడంలో శక్తిని కలవారని, వారు గద్యత్రయంలో సర్వేశ్వరుని శ్రీచరణాలలో చేసిన ప్రపత్తియే తమ ప్రాప్యసిద్ధికి కారణమని- ఇంతవరకు పలికారు. ఇక, తరువాత, రెండు శ్లోకాలతో శ్రీరామానుజుల శ్రీచరణాలలో కైంకర్యమనే పరమప్రాప్యం నిత్యాభివృద్ధంగా తమకు కొనసాగాలని, దానికి అడ్డుగా ఉండే దుర్విషయాల సంబంధం నశించాలని శ్రీరామానుజుల సన్నిధిలో ప్రార్థించి, ఈప్రబంధంద్వారా దాసుడు విన్నపించిన ఈ ప్రార్థనను సాదరంగా అంగీకరించాలని ప్రార్థించి, స్తుతిని పూర్తిచేస్తున్నారు (వరవరమునులు).



చివరి రెండు శ్లోకాలలోని ఈ మొదటి శ్లోకంలో- దేవరవారి శ్రీచరణాలలో సేవ అనే పరమప్రాప్యమే తమకు నిత్యాభివృద్ధమయేటట్లు, దానికి అంతరాయంగా ఉండే (అడ్డుగోడగా ఉండే) ఇతర విషయాల సంబంధం తీరిపోయేటట్లు దేవరవారే అనుగ్రహించాలి - అని శ్రీరామానుజులను అర్థిస్తున్నారు.

**19. శ్రీమన్! యతీంద్ర! తవ దివ్యపదాబ్జసేవాం**
**శ్రీశైలనాథ కరుణా పరిణామదత్తామ్ ।**
**తా మన్వహం మమ వివర్ధయ నాథ! తస్యాః**
**కామం విరుద్ధ మఖిలం చ నివర్తయ త్వమ్ ॥**

కైంకర్యలక్ష్మిని కల్గిన ఓ యతీంద్రా! నాకు తిరువాయ్మొழிప్పిళ్ళై అనబడే నా ఆచార్యుల దయయొక్క పరిపాకంచే అనుగ్రహింపబడ్డ దివ్యమైన నీ శ్రీచరణసేవను ఎల్లప్పుడు నీవు వృద్ధిజేయాలి. నాథా! దీనికంటే విరుద్ధమైన సమస్తాన్ని నివర్తింప జేయాలి.

వ్యాఖ్య : **(శ్రీమన్! యతీంద్రేత్యాది) - (శ్రీమన్!)** - భగవదనుభవం (దర్శనం), కైంకర్యమనే స్థిరమైన కైంకర్యాన్ని కల యతిరాజా!

**(యతీంద్ర!)** - ఆ స్వరూపానురూపమైన సంపదను అనుభవించేటపుడు "నాకు'' అని నాలుక చాచని రీతిలో (ఆశపడని రీతిలో) ఇంద్రియాలను నియంత్రించి ఉండే రీతిని ఉద్దేశించి, **"యతీంద్ర!"** అని సంబోధిస్తున్నారు. **"ఆమ్ పరిశు అటిన్దు కొణ్డు"** అని ప్రాప్యమైన కైంకర్యాన్ని గూర్చి పల్కిన తరువాత, **"ఐమ్బులన్ అకత్తడక్కి"** (పంచేంద్రియాలను లోపల నియంత్రించి) అని అందులో స్వప్రయోజన బుద్ధితో ప్రావణ్యాన్ని పొందే పంచేంద్రియాలను నియమించే రీతిని గూర్చి తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు పలికారు కదా! లేక, తమకు అపేక్షితమైన ప్రాప్యాన్ని అనుగ్రహించడానికి కావలసిన జ్ఞానాది సంపదను కలవారని, దానికి విరోధిని పోగొట్టగల్గిన శక్తిని కలవారని భావించి **"శ్రీమన్! యతీంద్ర!"** అని సంబోధిస్తున్నారని కూడా చెప్పవచ్చు.

**(భవదీయపదాబ్జసేవామ్)** - దీనిద్వారా తమకు ఇష్టమైన ప్రాప్యం (శ్రీరామానుజుల పాదకైంకర్యం) తెలుపబడింది. స్వరూపానురూపశేషి అయిన

దేవరవారి నిరతిశయభోగ్యమైన శ్రీచరణాలలో నిరంతరమైన అనుభవమనే కైంకర్యాన్ని **"ఇరామానుశన్ శరణారవిన్దమ్ నామ్ మన్ని వాழ"** (శ్రీరామానుజుల శ్రీచరణాలలో మనం మన్నికగా నిలచి ఉజ్జీవించేటట్లు) అని, **"నమ్ తలైమిశైయే పొజ్గియ కీర్త్తి యిరామానుశనడి ప్పూమన్నవే"** (మన తలలపై పొంగే కీర్తిని కల శ్రీరామానుజుల శ్రీచరణపద్మం స్థిరంగా ఉండేట్లు) అని అముదనార్ ఇరామానుశనూఱ్ఱన్దాది ఆరంభంలో, చివరలో పల్కిన ప్రాప్యాన్ని ఆశపడు తున్నారు.

"ఈప్రాప్యం మీ ప్రయత్నంతో సాధించి పొందినదా?'' అంటే, "లేదు అది దేవరవారి దయాప్రాప్తం'' అని అంటున్నారు.

**(శ్రీశైలనాథకరుణాపరిణామదత్తామ్)-** అస్మదాచార్యులైన తిరువాయ్ మొழిప్పిళ్ళై, తాము ఎల్లప్పుడు అనుభవించే ఈ పరమప్రాప్యాన్ని అడ్డు లేకుండా ప్రవహించే తమ నిర్హేతుకకృప యొక్క పరీవాహరూపంగా, గోవులు స్తనవేదనతో పాలను నేలపై స్రవించేటట్లుగా, నాకు ఆశ లేకపోయినా, తమ ప్రయోజనంగా తలచి, సర్వస్వదానంగా అనుగ్రహించారు. అందువల్ల ఇది నాకు లభించింది.

తిరువాయ్మొழిప్పిళ్ళై కరుణవల్ల ఈ ప్రాప్యం (రామానుజకైంకర్యం) లభిస్తే, మఱి మీకిపుడు ఏమి కావాలి? అంటే తెల్పుతున్నారు.

**(తామన్వహం మమ వివర్ధయ)-** దేవరవారు ఇపుడు కొత్తగా సృష్టించి ఇవ్వవలసినది ఏదీ లేదు. తిరువాయ్మొழిప్పిళ్ళై అనుగ్రహంతో అనుగ్ర హించినవానిని ప్రతిదినం వృద్ధి కావించడమే అపేక్షితం - అని అంటున్నారు.

అపుడు శ్రీరామానుజులు "కానీండి, ఆ విధంగానే చేస్తాము లెండి'' అనే భావం స్ఫురించేటట్లు కరుణామృత పరిణామరూపమైన కటాక్షాల వృష్టితో చల్లగా కటాక్షించారు. అపుడు దానివల్ల సమస్తదుఃఖం తీరినవారై, "పూర్ణంగా అనుగ్రహిస్తూ, ఉత్తరోత్తరం ఈ కైంకర్యం అభివృద్ధి పొందేటట్లుగా చేయాలి''- అని శ్రీవరవరమునులు పల్కుతున్నారు.

**(తామన్వహం వివర్ధయ)** - అని అంటూ.



తమకు అనుగ్రహించే ప్రాప్యంయొక్క గౌరవాన్ని కాని, ఈ ఉపకారానికి లక్ష్యమైన నా తక్కువదనాన్ని కాని గమనించకుండా, తమ అవధిలో (గొప్పగా) అనుగ్రహించారే! అని మిక్కిలిగా అభినివేశాన్ని పొందుతున్నారు.

**(తామ్)** - అని అంటూ "ఈ విధంగా చేయాలనే'' నిర్బంధం ఏమి?'' అని అంటే, దానికి సమాధానం పల్కుతున్నారు.

**(నాథ!)** - సొత్తుకు చెందినపనిని చేయడం స్వామికే కదా బాధ్యత. "మమ్ములను ఆశ్రయించినవారిని అందఱిని గమనించవలసి ఉండగా, ఇతనిని ఒక్కని మాత్రమే గమనించడం వీలవుతుందా?'' అని నన్ను ఉపేక్షించకుండా, దేవరవారి శ్రీచరణాలలోని కైంకర్యానుభవం లేకపోతే నిలువలేని నా స్వభావాన్ని గమనించి, దయ చూపి, నాకొక్కనికే పూర్ణంగా ఆ అనుభవాన్ని నిరంతరంగా వర్ధిల్లజేయాలి - అని అంటున్నారు.

ఈ విధంగా అనుభవాన్ని (కైంకర్యాన్ని) వృద్ధి చేస్తూ ఇచ్చినా, "దీనికి అడ్డుగోడ అయిన విరోధిని తానే తొలగించుకొంటాడులే!'' అని విరోధినివృత్తిని నా చేతికి అప్పగించడం కాకుండా, దానిని కూడా మీరే నిర్వహించాలి- అని అంటున్నారు-

**(తస్యాః కామం విరుద్ధ మఖిలం చ నివర్తయ త్వమ్)-** అని అంటూ. దేవరవారి శ్రీచరణాలలో కైంకర్యమనే ఈ పరమప్రాప్యానికి విరుద్ధమై, విషయవైవిధ్యంచేత పలువిధాలుగా ఉండే విషయప్రావణ్యరూపమైన కామాన్ని వాసనతో పాటుగా పోగొట్టాలి - అని దీని అర్థం. లేక, దీనికి విరుద్ధమైన ఐశ్వర్యానుభవమనే కామాన్ని, ఆత్మానుభవాన్ని, భగవదనుభవమనే ప్రతిబంధ కాలను అన్నిటిని పోగొట్టాలి - అని అంటున్నారని కూడా చెప్పవచ్చు.

ఈ రెండు యోజనలలో మొదటి యోజనలో ఔచిత్యం అధికం. ఎందుకంటే **"శబ్దాదిభోగరుచి రన్వహ మేధతే హా!" "శబ్దాదిభోగవిషయారుచి రస్మదీయా"** అని లౌకిక విషయప్రావణ్యమే దీనికి ప్రతిబంధకమని పూర్వం పల్కిన దానికి ఈ అర్థయోజన కుదురుతుంది కనుక. ఈ విధంగా శ్రీరామానుజుల శ్రీచరణాలలో తమకు అపేక్షితం స్వరూపానికి తగినది అయిన పురుషార్థాన్ని, అనాదికాలంగా ఈ పురుషార్థానికి అడ్డుగా ఉన్నది, ఇపుడు

అనువర్తిస్తూ ఉన్నది అయిన అర్వాచీనవిషయాలలోని ప్రావణ్యం తీరడంతో పాటుగా పలు రీతులలో శ్రీవరవరమునులు ప్రార్థించారు.

**అవతారిక :** నా చాపల్యం వల్ల ఒక క్రమం అనేది లేకుండా విజ్ఞాపనం చేసిన ఈ సూక్తిని, దాసుని దోషాలను చూచి ఉపేక్షించకుండా, అంగీకరించాలని పల్కుతూ తాము పలికే స్తుతిని శ్రీవరవరమునులు ముగిస్తున్నాను.

**20. విజ్ఞాపనం యదిద మద్య తు మామకీనమ్**
**అంగీకురుష్వ యతిరాజ! దయాంబురాశే!।**
**అజ్ఞో౽ యమాత్మగుణలేశ వివర్జితశ్చ**
**తస్మాదనన్యశరణో భవతీతి మత్వా ॥**

దయాసముద్రా! యతిరాజా! నాకు చెందిన ఈ విజ్ఞాపనాన్ని "వీడు అజ్ఞుడు, ఆత్మగుణాలు లేశం కూడా లేనివాడు, అందువల్ల అనన్యశరణుడు" అని తలచి అంగీకరించండి.

వ్యాఖ్య : **(విజ్ఞాపనమ్)** - తమ అపేక్షితాలను శ్రీవరవరమునులు శ్రీరామానుజుల శ్రీచరణ సాన్నిధ్యంలో విన్నిపించగా, అది ఒక ప్రబంధంగా రూపొందింది.

**(ఇదమ్)** - **"శెవిక్కినియ శెఞ్జొల్"** (చెవులకు మధురమైన అందమైన సూక్తి) అనే విధంగా ఎవరికైనా సాదరంగా ఉండే ఈ స్తుతి ఒక విషయాన్ని భావించి ఇంకొకటి పల్కడం కాకుండా, తలపు - వాక్కు పొసగి ఉండే రీతిలో పలుకబడింది.

**(అద్య తు)** - పూవు పూచేటపుడు వలె, పలికే సమయంలోని అందం దీని ద్వారా తెలుపబడింది. ఈ రసం మాఱడానికి ముందే చెవులను ఒగ్గి, **"ఇళైయ పున్ కవిత్తై"** (పరిణతి చెందని తక్కువ కవిత) అనే విధంగా శబ్దార్థ విషయవైభవాన్ని యథాతథంగా తెలిసికొని, పల్కడానికి తగిన జ్ఞానం, శక్తి లేకపోయినా - అని అర్థం. తను వైభవానికి తగిన వైలక్షణ్యాన్ని కల్గి ఉన్నది కాకపోయినా, "మన దాసుడు పల్కినది కదా, ఇది" అని మనస్సులో సంతోషించి, వినదగినది- అని భావం.



**(అంగీకురుష్వ)** - ఎవరి ప్రయోజనం కోసం అర్థిస్తున్నారు? 'ఇతని వాక్కు ఈ విధంగా ఉండరాదు. (ఇతడీవిధంగా ప్రార్థించనక్కరలేదు) దీనికోసం ఇంతకాలంగా ప్రయత్నించిన నాది కదా ప్రయోజనం- అని తలచి దేవరవారే అంగీకరించాలి- అని అంటున్నారు. (ఇది ఆత్మనేపది క్రియార్థం).

**(యతిరాజ !)** - నాలోని దోషాలను పోగొట్టగల్గిన జ్ఞానశక్త్యాదులను కలవారుకదా, మీరు.

**(దయాంబురాశే!)** - కోపించి, దూరంగా గెంటివేయదగిన దోషాలు నాలో ఉన్నా, శ్రీచరణాలను తలపై అలంకరించుకోదగిన (ఆశ్రయించదగిన) కరుణాసముద్రులు కదా, మీరు.

**(అజ్ఞో౽యమ్)**- ఇతడు, స్వరక్షణకోసం, నేను తప్ప ఇంకొక రక్షణ ఉన్నదని తలచేవాడా! నన్ను తప్ప ఇంకొకరిని తెలుసా?

**(ఆత్మగుణలేశవివర్జతశ్చ)** - తనకు ఏమయినా కొన్ని ఆత్మగుణా లున్నాయని తలచి, అవి తన ప్రాప్యసిద్ధికి అవి ఉపకరిస్తాయని తలచేవాడా? నా కృపకు అడ్డుగా ఉండేదని చెప్పదగినది ఏదయినా ఉన్నదా?

**(తస్మాదనన్యశరణః)** అందుచేత "ఇతనికి నేను తప్ప ఇంకొక శరణం ఉన్నదా? తన రక్షణకు ఇంకొక ఉపాయాన్ని తెలియగల్గిన జ్ఞానం లేనివాడై, సత్పురుషులు అంగీకరించడానికి తగిన ఆత్మగుణాల సంబంధం లేనివాడై ఉన్నందున ఇతడు నేను తప్ప ఇంకొక శరణం లేనివాడు''- (అని)

**(ఇతి మత్వా)** - ఈ విధంగా దేవరవారు తలచి, భగవదనుభవం మొదలైనవానిలో అన్యపరతను తీర్చి అనుగ్రహించి, నన్ను అంగీకరించాలి- అని ప్రార్థించి, (శ్రీవరవరమునులు యతిరాజవింశతిని) ముగించారు.

శ్రీ పిళ్ళైలోకమ్ జీయర్ అనుగ్రహించిన
యతిరాజవింశతి వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం సంపూర్ణం.

శ్రీమద్వరవరమునయే నమః

## ఎఱుమ్బియప్పా అనుగ్రహించిన

# ఉత్తర దినచర్య - వ్యాఖ్యానంతో

**1. ఇతి యతికులధుర్య మేధమానైః**
**శ్రుతిమధురై రుదితైః ప్రహర్షయంతమ్ ।**
**వరవరముని మేవ చింతయంతీ**
**మతి రియ మేతి నిరత్యయం ప్రసాదమ్ ॥**

ఇతి = (ఈవిధంగా) యతీంద్రప్రవణులైన శ్రీవరవరమునులు శ్రీరామానుజుల విషయంలో అనుసంధించిన యతిరాజవింశతి రూపంగా, ఏధమానైః= శ్రీరామానుజుల చిత్తంలో ఒకటికి పదిగా అభివృద్ధి చెందినవిగా, శ్రుతిమధురైః= చెవులకు ఇంపైనవిగా ఉన్న, ఉదితైః = స్తోత్రాలతో, యతికులధుర్యమ్ = యతి సార్వభౌములైన భగవద్రామానుజులను, ప్రహర్షయంతమ్=మనస్సులో ఎక్కువ ఆనందించే రీతిలో చేసిన, వరవరమునిమ్ ఏవ=వరవరమునులనే, చింతయంతీ = ధ్యానం చేస్తున్న, ఇయం మతిః = ఇంతవరకు అప్రాప్తవిషయాల అనుసంధానంచేత దుష్టమైన నా బుద్ధి, నిరత్యయం = అంతం లేకుండా నిత్యమైన, ప్రసాదం = ప్రసన్నతను, ఏతి = పొందుతున్నది.

ఇంతవరకు తగని విషయాలనే తలచి, అవి లభించినందువల్లనో, లేక, లభించనందువల్లనో కలత చెందిన నా బుద్ధి యతిరాజవింశతిని విన్నపించి, యతిరాజులను ఆనందప్రవాహంలో మగ్నులయేటట్లు చేసిన మణవాళ మహామునులను ఒక్కరిని మాత్రం ధ్యానించే స్థితిని పొంది, ముందున్న కలత తీరి, ప్రసాదాన్ని పొందుతున్నది.

పూర్వదినచర్య, యతిరాజవింశతి, ఉత్తరదినచర్య – అనే శ్రీవరవర మునుల దినచర్యా క్రమంలో ముందు పూర్వదినచర్య వ్యాఖ్యానింపబడింది తరువాత, శ్రీ వరవరమునుల అనుసంధాన రూపమైన యతిరాజవింశతి అది వ్యాఖ్యానింప బడింది. అనంతరం క్రమంలో చివరగా ఉత్తర దినచర్య వ్యాఖ్యానింపబడుతున్నది. ఆ విధంగా యతిరాజవింశతిని అనుగ్రహించి శ్రీరామానుజులను ఆనంద పఱచిన



శ్రీవరవరమునులను చింతించడంవల్ల తమకు కల్గిన మనఃప్రసాద విశేషాన్ని ఎఱుమ్బియప్పా ఈ శ్లోకంలో వ్యక్తం చేస్తున్నారు.

**(ఇతి)** ఈ పదం యతిరాజవింశతిని అనువదిస్తున్నది.

**(ఏధమానైః)** **"ఏధ–వృద్ధౌ"** అని ఇచటి ధాతువు. **"భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ"** (నీ మనస్సుకు గొప్పది అయిన నమోవాకాన్ని ఆచరిస్తున్నాము) అన్నరీతిలో ఒక్కొక్క శ్లోకం వేయిగా తోచే ఇరవై శ్లోకాలతో – అని భావం. ఇచటి వైదిక ప్రమాణంలోని **"భూయిష్ఠామ్"** అనే విశేషణం భగవానుని అభిప్రాయంలో చెప్ప బడిందని పెద్దల సూక్తి. ఆ రీతిలోనే ఇక్కడకూడా ఈ విశేషణం భగవద్రామానుజా చార్యాభిప్రాయంతో చేయబడింది. తమ విషయంలో ప్రావణ్యం కల శ్రీవరవర మునులు పల్కిన ఒక్కొక్క శ్లోకాన్ని వేలాది శ్లోకాలతో సమానంగా శ్రీరామానుజులు భావించారని తాత్పర్యం. **"పరగుణపరమాణూన్ పర్వతీకృత్య"** (ఇతరుల స్వల్పమైన గుణాలను కూడా పర్వతంవలె పెద్దవిగా భావించి) అన్నట్లు అణువును మహాగిరిగా (పర్వతంగా)గా కదా భావిస్తారు పెద్దలు. మహాగిరులవంటి శ్రీవరవరమునుల శ్లోకాలను ఇక ఆ విధంగా భావించడంలో ఏమి ఆశ్చర్యం ఉన్నది? **"అర్థతో గభీరత్వా దప్యేధమానత్వం యుక్తమ్"** – ఎన్ని అర్థాలను చెప్పినా, ఇంకా ఇంకా మరిన్ని గొప్ప అర్థాలు స్ఫురిస్తూనే ఉంటాయి – అనే అర్థవిశేషం ఇచటి వర్త మానార్థకరూపంవల్ల ధ్వనిస్తుంది. దీనివల్ల, అప్రమేయం అయిన భగవద్వైభవాన్ని స్తుతించవచ్చునేమో కాని, భగవద్రామానుజుల వైభవాన్ని స్తుతించడం సాధ్యం కాదని పూర్వాచార్యులు పల్కిన సూక్తర్థ్యం అనుసంధింప బడినట్లయింది. అర్థగాంభీర్యాన్నిబట్టికూడా ఏధమానత్వం తగినది – అని వాధూల వీరరాఘవా చార్య వ్యాఖ్య.

**(యతికులధుర్యమ్)**–యతికులరక్షాభారాన్ని నిర్వహించేవారని, యతిశ్రేష్ఠులని– అర్థం.

**(ప్రహర్షయంతమ్)**– ఈ ప్రయోగం స్తోత్రరత్నంలోని **"ప్రహర్షయిష్యామి సనాథ జీవితః"** (నిన్ను సంతోషింపజేసి, సార్థకమైన జన్మను కలవాడను కాగలను) అనే సూక్తిని తలపింపజేస్తుంది. మిక్కిలిగా ఆనందింపజేసే – అని అర్థం. ప్రకృష్టత్వాన్ని తెలిపే **"ప్ర"** అనే ఉపసర్గద్వారా ఆనందంయొక్క అనన్యార్థత్వం చెప్పబడుతున్నది. అంటే, స్వయం ప్రయోజనంగా శ్రీవరవరమునులు భావించారని తాత్పర్యం.

లోకంలో ఆనందాన్ని కల్గించే స్తోత్రాదులవల్ల స్తుతికర్తలు ఏవో ప్రయోజనాలను ఆశిస్తారు. కాని, ఇక్కడ భగవద్రామానుజుల ఆనందమే పరమప్రయోజనం. ఆత్మనేపద నిర్దేశం చేయకపోవడంచేత ఈ ఆనందం కేవలం పరార్థంకోసమేనని ధ్వనిస్తున్నది.

**(వరవరముని మేవ)** శ్రీవరవరమునులను ఒక్కరినే - అని భావం. ఇచటి ఏవకారంద్వారా స్తుతికర్త శ్రీవరవరమునులచే ఆనందింపజేయబడే శ్రీరామానుజులను తాము స్వాతంత్ర్యంతో భావించడం లేదని తెలియజేసినట్లయింది.

**(ఇయం మతిః)** – ఇచటి ఈ సర్వనామశబ్దం ప్రకరణస్వారస్యాన్నిబట్టి "ఇంతవరకు తగని విషయాల సంబంధంవల్ల కలుషమైన నా బుద్ధి" అనే అర్థాన్ని ఇస్తుంది. **"చింతయంతీ మతిః"** అనే ప్రయోగంవల్ల శ్రీకృష్ణుని మాత్రమే చింతించే **"చింతయంతి"** అనబడే ఒకానొక గోపికకంటె, శ్రీకృష్ణునే **"కృష్ణతృష్ణా మివోదితమ్"** అన్నట్లు నిరంతరం ధ్యానించే **"దీర్ఘచింతయంతి"** అనబడే నమ్మాళ్వార్ల కంటె, భగవద్రామానుజులను మాత్రమే చింతించే **"చింతయంతి"** అయిన శ్రీవరవరమునులు విలక్షణులు - అనే భావం ధ్వనిస్తుంది. **"ప్రహర్షయంతం చింతయంతీ ప్రసాద మేతి"** అనే అన్వయంద్వారా **"తాపార్తో జలశాయినమ్"** (శారీరక, మానసిక తాపాలతో బాధపడేవాడు సముద్రశాయి అయిన స్వామిని ధ్యానించాలి) అనే రీతిలో, ఆనందింపజేసే శ్రీవరవరమునులను ధ్యానించే నా మనస్సు తేటపడుతున్నదనే అర్థక్రమం అనుసంధేయం.

**"శ్రుతిమధురై రుదితైః"** అన్న ప్రయోగంలో **"రుదితైః"** (చెవులకింపైన రోదనలతో) అని చివర పదాన్ని విడదీసి అర్థం చెప్పే అవకాశం (రోదనార్థాన్ని తెలిపే ఈ పదంవల్ల) ఉన్నందున విరుద్ధమతికృత్ అనే దోషం ఉన్నదని కొందఱు అన్నారు. కాని, అది సరికాదు. ఆ పదానికి ముందు **"శ్రుతిమధురైః"** అనే ప్రయోగంలో చివర విసర్గ ఉన్నదని వేగంగా స్ఫురిస్తుంది. అంతేకాక, ఒక వేళ రోదనమే అనుకున్నా, యతిరాజవింశతిలో ఇంతకుముందు **"హా! హంత! హంత!"** అని అంటూ శ్రీవరవరమునులు తమకు యతిరాజుల విషయంలోగల ఆర్తిని ప్రస్తుతించారు. అత్యంతం కల్గిన ఆర్తికారణంగా రోదించడం అన్నది ప్రకృతంలో స్వరూపానురూపమేకాక, ఔజ్జ్వల్యాన్ని, మతింత ప్రకాశాన్ని కల్గించేది కాబట్టి, ఈ దోషప్రసక్తి లేదు. ఈ విధంగా ఆర్తితో రోదించడం శేషికి ప్రియకరంకూడా.



శ్రీరామాయణంలో సీతాదేవి దుఃఖాన్ని చూచి హనుమంతుడు **"కి మర్థం తవ నేత్రాభ్యాం వారి స్రవతి శోకజమ్"** (ఎందుకు నీ కంటి నుండి కన్నీరు కారుతున్నది?) అని పల్కిన సూక్తి ఇందుకొక ప్రమాణం. ఈ రోదనలు లోకంలోని రోదనలవంటివి కాదు కనుక శ్రుతిమధురాలై ఉంటాయికూడా. **"న చైవ దేవీ విరరామ కూజితాత్"** (మధురంగా రోదించడంనుండి సీతాదేవి విరమించలేదు) అనే శ్రీరామాయణ సూక్తి ఇక్కడ ప్రమాణం. **"క్రుధ్యే ద్విషీదే ద్వేష్యే చ్చ"** (పరమాత్మపై ఉన్న ప్రేమకారణంగా భక్తుడు ఆ పరమాత్మపై కోపపడవచ్చు, రోదించవచ్చు, ద్వేషించవచ్చు కూడా) అనే భారద్వాజోక్తినిబట్టి విషాదం, వాని కార్యాలైన రోదన, ద్వేషాలు దోషాలు కావు - అని కూడా అందులో తెలుపబడింది. మోక్షాన్ని అనుగ్రహించే భగవద్రామానుజుల ముందు సంసారంవల్ల తమకు కల్గిన ఆర్తిని నివేదించి వరవరమునులు చేసే రోదన శ్రుతిమధురంగా ఉంటుందనడంలో ఏం సందేహం? అందువల్ల **"శ్రుతిమధురైః"** అనే ప్రయోగం అర్థవంతం. **"యతిరాజవింశతి వడమొழியఱ్కై, ఆర్తిప్రబంధమ్ తెన్మొழியఱ్కై"** (యతింజవింశతి సంస్కృతభాషలోని రోదన, ఆర్తిప్రబంధమ్ ద్రావిడభాషలోని రోదన) అని పెద్దలు చమత్కరించారు కదా!

**2. అథ గోష్ఠీం గరిష్ఠానా మధిష్ఠాయ సుమేధసామ్ ।**
**వాక్యాలంకృతివాక్యాని వ్యాఖ్యాతారం నమామి తమ్ ॥**

అథ = యతిరాజవింశతిని అనుగ్రహించిన తరువాత, గరిష్ఠానామ్ = స్వయంగా గ్రంథాన్ని విరచింపగల గొప్పవారైన, సుమేధసామ్ = జ్ఞానవృద్ధులైన కోయిలణ్ణన్ మొదలైనవారి, గోష్ఠీం = సదస్సుకు, అధిష్ఠాయ = ఏకాంతంగా తాము యోగాభ్యాసం చేసే చోటునుండి వేంచేసి, వాక్యాలంకృతివాక్యాని = పూర్వాచార్యుల వచనాలతోనిండిన శ్రీవచనభూషణవాక్యాలకు, వ్యాఖ్యాతారమ్=పదచ్ఛేద పదార్థోక్త్యాదిరూపమైన వ్యాఖ్యానాన్ని అనుగ్రహించే, తం = ఆ వరవరమునులను, నమామి = నమస్కరిస్తున్నాను.

ఇంతవరకు **"గ్రంథనిర్మాణకర్మణా"** అని చెప్పబడిన గ్రంథరచనారూపమైన స్వాధ్యాయవిశేషం అనుసంధింపబడింది. ఈ శ్లోకంలో **"వ్యాఖ్యానై ర్లేఖనై ర్వాపి"** (వాఖ్యానాలతో, గ్రంథ రచనలతో కాలం గడపాలి) అని, **"వ్యాచక్షీత నిబధ్నీయాత్"** అనే విశేషశాస్త్రవిధిచే తెలుపబడ్డ వ్యాఖ్యానరూపమైన స్వాధ్యాయ విశేషాన్ని స్తుతికర్త ప్రస్తావిస్తున్నారు.

యోగదశను విడచి, బయటకు వేంచేసిన తరువాత, స్వయంగా గ్రంథ రచనను చేయ గల మిక్కిలి గొప్ప మేధావులు నిండిన సభలో వేంచేసి ఉండి, శ్రీవచనభూషణదివ్యసూక్తులను వ్యాఖ్యానించే మణవాళమహామునులను సేవిస్తున్నాను.

సాయంసంధ్యానుష్ఠానికి ముందు అపరాహ్ణంలో శ్రీవచనభూషణ దివ్యగ్రంథకాలక్షేపం అనుగ్రహించే సంప్రదాయం దీనివల్ల తెలుపబడింది.

**(అథ)** – యతిరాజవింశతితో శ్రీరామానుజులను ఆనందపఱచిన తరువాత – అని అర్థం

**(గరిష్ఠానామ్)** – **"అత్యంతం గురవః–గరిష్ఠాః"** ప్రత్యేకంగా గ్రంథరచన చేయగల్గిన, వ్యాసపదవిని నిర్వహించగల్గినవారియొక్క – అని అర్థం.

**(సుమేధసామ్)** – గొప్ప బుద్ధిని కలవారియొక్క – అని అర్థం. ఇది **"గరిష్ఠానామ్"** అనే పదానికి విశేషణం. **"మేధా–ఆశుగ్రహణే"** అనే ధాతుపాఠాన్నిబట్టి శీఘ్రంగా విషయాన్ని గ్రహించే శక్తికి మేధ అని పేరు. అట్లే, **"ధీ ర్ధారణావతీ మేధా"** అనే సూక్తినిబట్టి గ్రహించిన విషయాన్ని గుర్తుంచుకోగలిగే శక్తికికూడా మేధా అని పేరు. దీనివల్ల గ్రహణధారణశక్తి మేధ అనబడుతుందని ఏర్పడుతున్నది. ఏకసంధాగ్రాహులై, అసాధారణధారణశక్తిని కలవారియొక్క – అని అర్థం. వీరు, వరదనారాయణ గురుప్రభృతులు. అష్టదిగ్గజాలుగా పేరుపడిన పండితోత్తములు. **(అధిష్ఠాయ)** పూర్వశ్లోకంలో నుండి మండూకప్లుతిన్యాయంలో విభక్తిమార్పు పొందిన **"ఉపాహరత్"** అనే పదాన్ని అధ్యాహరించుకొని, ఏకాంతం నుండి వేంచేసి – అనే అర్థాన్ని చెప్పాలి.

**(వాక్యాలంకృతి)** – ఈ పదం శ్రీవచనభూషణమనే పేరుతో ప్రసిద్ధమైన శ్రీ పిళ్ళై లోకార్యప్రణీతమైన, అపూర్వమైన రహస్యగ్రంథాన్ని తెలుపుతుంది. బంగారం తక్కువగా, రత్నాలు ఎక్కువగా ఉన్న భూషణాన్ని రత్నభూషణమని అన్నట్లే, పూర్వా చార్య ప్రోక్తవాక్యాలు ఎక్కువగా, గ్రంథకర్త వాక్యాలు తక్కువగా ఉన్న ఈ రహస్య గ్రంథానికి వచనభూషణమనే పేరు పెట్టబడింది. **"రత్నప్రచురమాన భూషణత్తుక్కు రత్నభూషణమెన్డు పేరామాప్పోలే, పూర్వాచార్యర్కళుడైయ వచనప్రచురమాయ్, అనుసంధాతాక్కళుక్కు ఔజ్జ్వల్యకరమా యిరుక్కైయాలే ఇతుక్కు వచనభూషణ మెన్డు**



**తిరునామమాయ్త్తు"** (రత్నాలు నిండుగా ఉండే భూషణానికి రత్నభూషణమనే పేరు కలిగేటట్లే, పూర్వాచార్యుల సూక్తులతో నిండినదై, అనుసంధించేవారికి ఆనందాన్ని కల్గించేదై ఉన్నందున దీనికి వచనభూషణమనే పేరు కలిగింది) అనే శ్రీవరవరమునుల వ్యాఖ్యానసూక్తి ఇచట స్మరణీయం. **"భూషణశబ్దమ్ గౌణవృత్త్యా ధారయితాక్కళుక్కు ఔజ్జ్వల్య హేతుపరమ్. ఇఙ్గు ధారణా మనుసంధానమెన్డు"** (భూషణశబ్దం లక్షణావృత్తిద్వారా ఆ భూషణాన్ని ధరించేవారికి ఔజ్జ్వల్యాన్ని కల్గించేది అనే అర్థాన్ని ఇచ్చేటట్లే, ఇక్కడ ధారణమంటే అనుసంధానమే కాబట్టి, అనుసంధించేవారికి శోభను కల్గించేదనే భావాన్ని భూషణశబ్దం ఇస్తుంది) అంటూ అణ్ణావప్పఙ్గార్ చేసిన వివరణ కూడా ప్రకృతంలో అవధేయం. ఈవిధంగా ఈ గ్రంథంలో పూర్వాచార్యవచనాలు ఎక్కువగా, తమ వచనాలు తక్కువగా ఉన్నాయని కవి సూచించడంవల్ల ఈ గ్రంథంయొక్క అర్థగాంభీర్యం, ఆప్తతమత్వం చెప్పబడ్డాయి.

**(వాక్యాని)** – **"కృతిగంభీరసందర్భం శ్రీమద్వచన భూషణమ్"** (రచనలో గంభీరమైన పదప్రయోగాలను కల శ్రీవచనభూషణమ్) అని ప్రశంసింపబడే శ్రీవచన భూషణదివ్యగ్రంథ వాక్యాలను – అని అర్థం, **"వాక్యానామ్"** అనే షష్ఠ్యంత పాఠంఉన్నా ఈ ద్వితీయాంత పాఠమే యుక్తం, శరణాగతిగద్యలో **"ద్వయమ్ అర్థానుసంధానేన సహ సదైవం వక్తా"** (అర్థంతో పాటుగా ద్వయమంత్రాన్ని ఎల్లప్పుడు అనుసంధించేవాడవై) అనే ప్రయోగం గమనించతగినది – అని శ్రీప్ర.భ.అణ్ణాస్వామివారి వ్యాఖ్య.

**(వ్యాఖ్యాతారమ్)** – ఇచటి తృన్ ప్రత్యయం తాచ్ఛీల్యార్థకం. పదచ్ఛేదాదివ్యాఖ్యాన లక్షణాలు నిండిన వ్యాఖ్యానాన్ని అనుగ్రహించే స్వభావంకలవారని ఇచటి భావం. దీనివల్ల **"పరిచిత మివాథాపి గహనమ్"** (పరిచితంగా తోచినా, చాలా గహనంగా – అర్థం కానిదిగా ఉండేది) అని, **"ఆర్వశనభూషణత్తిన్ ఆழ்పొరుళెల్లా మఱి వార్?"**, (శ్రీవచనభూషణంలోని గంభీరమైన అర్థాలను తెలియగలవారు ఎవరు?) **"శీర్వశనభూషణత్తిన్ శెమ్బొరుళై"** (గొప్పదైన శ్రీవచనభూషణంలోని అందమైన, ఋజువైన అర్థాలను) అని ఇత్యాదిగా ప్రశంసింపబడే శ్రీవచనభూషణ శబ్దార్థ గాంభీర్యం సూచింపబడింది. అందువల్లనే కాలక్షేపం ఈ గ్రంథంతో సిద్ధిస్తుందని చెప్పినట్లయింది. **"వ్యాఖ్యాతారమ్"** – అంటే, వ్యాఖ్యానరూపమైన గ్రంథాలను అనుగ్రహిస్తున్నారని అర్థం కాదు. పూర్వదినచర్యలో ప్రాతఃప్రవచనాన్ని

గూర్చి చెప్పే సందర్భంలో **"వ్యాచక్షాణం నమామి తమ్"** అన్నట్లే ఇక్కడ కూడా **"వ్యాఖ్యా తారమ్ నమామి తమ్"** అన్నదికూడ ప్రవచనాన్నే చెబుతున్నది, ఎందుకంటే, **"గరిష్ఠానాం సుమేధసాం గోష్ఠీ మధిష్ఠాయ"** అని ప్రయోగింప బడినందువల్ల" – అని శ్రీప్ర.భ.అణ్ణాస్వామివారివ్యాఖ్య.

వాధూల వీరరాఘవాచార్యవ్యాఖ్యలో వేఱొక విధమైన అన్వయం **"గరిష్ఠానాం గోష్ఠీ మధిష్ఠాయ, వాక్యాలంకృతివాక్యాని సుమేధసాం వ్యాఖ్యాతారమ్"** (గొప్పవారి గోష్ఠిని అధిష్ఠించి శ్రీవచనభూషణ సూత్రాలను బుద్ధిమంతులకు వ్యాఖ్యానించేవారు) అని చూపబడింది. ఈ అన్వయాన్నిబట్టి **"గరిష్ఠానామ్", "సుమేధసామ్"** అనే పదాలు రెండు వేర్వేరుగా గ్రహింపబడ్డాయి. **"సుమేధసామ్"** అనే పదానికి ఉపదేశాన్ని పొందటానికి తగిన మహాబుద్ధిత్వం వివక్షితం. శాండిల్యస్మృతిలోకూడా **"ప్రియవాక్యం మహాబుద్ధిమ్"** అంటూ ఈ లక్షణం చెప్పబడింది. ఇందువల్ల **"శిష్యాణాం శిక్షయా వాపి స్వాధ్యాయార్థోఽయ ముచ్యతే"** (శిష్యులకు బోధించడంకూడా స్వాధ్యాయంగా చెప్పబడుతున్నది) అని నిర్వచింపబడ్డ స్వాధ్యాయం అనుష్ఠింపబడినట్లయింది.

ఇక్కడ ఇంకో విశేషంకూడా గమనింపవలసి ఉన్నది. **"సాంగాఖిలద్రవిడ సంస్కృత రూపవేదసారార్థసంగ్రహమహారసవాక్యజాతమ్"** (వేదాంగాలతోకూడిన సకలద్రావిడ, సంస్కృతవేదాల సారార్థసంగ్రహాన్ని ప్రతిపాదించే గొప్పల వాక్యాల సమూహం) అనే కీర్తింపబడే శ్రీవచనభూషణ గ్రంథవ్యాఖ్యానంద్వారా స్వాధ్యాయం సంపూర్ణంగా అనుష్ఠించినట్లవుతుంది. భరద్వాజ మహర్షి – **"పురాణాన్యవగాహేత సేతిహాసాని యత్ర చ, కేశవస్య జగత్సర్గస్థితిభంగాది కీర్త్యతే, స్తోత్రాణి కల్పాన్ నామాని కథా శ్చ వివిధా హరేః, సద్భిః ప్రణిహితాం శ్చాన్యాన్ ప్రబంధాన్ పరిశీలయేత్, మూలస్కంధమయో వేదః పంచరాత్రం చ తత్పరమ్, అన్యచ్చ తత్పరం గ్రాహ్యం శాస్త్రం నాన్యాదృశం పునః"** (కేశవుడైన భగవానుని సృష్టిస్థితిసంహారాదిలీలను, వర్ణించే పురాణాలు ఇతిహాసాలతోపాటు, స్తోత్రాలను, కల్పగ్రంథాలను, భగవన్నామాలను, కథలను, మహాత్ములచే రచింపబడ్డ మిగిలిన ప్రబంధాలను అనుసంధించాలి. అన్నిటికీ మూలమైన వేదాలు, వానికి అనుకూలమైన పాంచరాత్ర శాస్త్రం, ఆ రీతిలోనే వేదానుకూలమైనశాస్త్రం సమస్తం పరిగ్రాహ్యంతప్ప, వేదవిరుద్ధమైనది పరిగ్రాహ్యం ఏదీ కాదు) అని చెప్పిన సమస్తం



శ్రీవచనభూషణగ్రంథంలో సారరూపంగా ప్రతిపాదింపబడినవి. **"దివసస్యాష్టధా భాగో దక్షాదిభి రుదాహృతః"** – (దినసమయాన్ని ఎనిమిది విభాగాలు చేయాలని దక్షునిచే చెప్పబడింది) అనే ప్రక్రియలో **"వేదాభ్యాసా ద్వితీయే తు"** అని విధింపబడిన వేదాభ్యాసం ఇంతకుముందు పూర్వదినచర్యా స్తోత్రంలో **"తత్త్వం దివ్యప్రబంధానామ్"** ఇత్యాది ప్రయోగంద్వారా చెప్పబడింది. **"ఇతిహాసపురాణాది పాఠః సప్తమషష్ఠయోః"** (ఆఱవ, ఏడవ భాగాల్లో ఇతిహాస, పురాణాదులను ప్రవచించాలి) అనే ఇతిహాసపురాణప్రవచనం శ్రీవచనభూషణ వ్యాఖ్యానంద్వారా అనుష్ఠింపబడినట్లయింది. శ్రీవచనభూషణ గ్రంథప్రారంభం **"వేదార్థ మఱుదియిడు వతు స్మృతీతిహాసపురాణఙ్గళాలే"** (వేదార్థం స్మృతుల, ఇతిహాసాల, పురాణాల సహాయంతో నిశ్చయింపబడుతున్నది కదా!) అని కదా అవుతున్నది.

ఇక, శ్రీవరవరమునుల శ్రీవచనభూషణగ్రంథ వ్యాఖ్యానచాతురిని ఎఱుమ్బియప్పా శ్రీవరవరమునికావ్యంలో **"స తత్ర నిశ్చలం చేత శ్చిరేణ వినివర్తయన్, రహస్యగ్రంథతత్త్వేషు రమయామాస తత్ప్రియాన్, వాక్యసంగతివాక్యార్థ తాత్పర్యాణి యథాశ్రుతమ్, వ్యాకుర్వ న్నేవ పూర్వేషాం వర్తమానం పదే పదే, స్వమనీషికయా నైవ కల్పయన్ కించిద ప్యయమ్, గుప్తాన్ పూర్వైః గురుత్వేన గూఢా నర్థా నదీదృశత్, శ్రుతి స్మృతీతిహాసేన శ్రుత్యంతైః పంచరాత్రతః, దేశికానాం నిబన్ధౄణాం దర్శయ న్నేకకంఠతామ్, వాక్యాలంకార వాక్యాని వ్యాచక్షాణో విచక్షణాన్, సుధియ స్స్వాదయామాస స్వస్వరూపం సుదుర్గ్రహమ్"** (ఆ వరవరమునులు విద్వద్గోష్ఠిలో నిశ్చలమైన మనస్సును కల్గి, రహస్య గ్రంథలలోని తత్త్వాలతో తమ ప్రియశిష్యులను రంజింపచేశారు. శ్రీవచనభూషణ గ్రంథంలోని వాక్యాల సంగతిని, వాక్యార్థాన్ని, తాత్పర్యాన్ని పెద్దలవల్ల తాము విన్న రీతిలోనే ప్రతిసందర్భంలోను మాటిమాటికీ వివరించారు. తమ స్వంతబుద్ధితో దేనిని కల్పించకుండా, పూర్వాచార్యులు గూఢంగా కాపాడిన గొప్ప గొప్ప రహస్యార్థాలను సైతం దర్శింపజేశారు. శ్రుతులు, స్మృతులు, ఇతిహాసాలు, పాంచరాత్రాగమంద్వారా పూర్వాచార్యుల ఆ ప్రబంధాలన్నీ ఒకే అర్థతత్త్వాన్ని తెలుపుతున్నవి; ఏకగ్రీవంగా ఉన్నవనే విషయన్ని చూపిస్తూ, శ్రీవచనభూషణవాక్యాలను వ్యాఖ్యానిస్తూ సమర్థులైన బుద్ధిమంతులకు సైతం సులభంగా అర్థంకాని ఆత్మతత్త్వాన్ని మధురంగా అందించి ఆనందింపజేశారు) అని విశదంగా వర్ణించారు.

**(3) సాయంతనం తతః కృత్వా సమ్యగారాధనం హరేః ।**
**స్వైరాలాపైః శుభైః శ్రోతౄన్ నందయంతం నమామి తమ్ ॥**

తతః = సాయంకాలసంధ్యావందనం చేసిన తరువాత, సాయంతనం = సాయం సంధ్యా సమయంలో చేయవలసిన, హరేః = ప్రాప్తి విరోధిని నశింపజేసే శ్రీరంగనాథునకు, ఆరాధనమ్ = తిరువారాధనను, సమ్యక్ = చక్కగా, కృత్వా = పరమ భక్తితో చేసి, (దుర్గ్రహాలైన శాస్త్రార్థాలను వివరిస్తూ) శ్రోతౄన్ = శ్రోతలు అయిన కోయిలణ్ణన్ మొదలైన జ్ఞానాధికులను, నందయంతం = సంతోషింప జేసే, తం = ఆ వరవరమునులను, నమామి, = నమస్కరిస్తున్నాను.

అనంతరం, సాయంసంధ్యావందనాదులను ముగించిన పిమ్మట, శ్రీరంగనాథునకు ఆరాధనను చేసి, తమ స్వచ్ఛంద మధురవచనాలతో శ్రోతలను రంజింపచేసే శ్రీవరవరమునులను నమస్కరిస్తున్నాను.

**(తతః)** – సాయంసంధ్యావందనానుష్ఠానం తరువాత – అని అర్థం. **"తతః"** అనే ఈ శబ్దం పూర్వోక్త శ్రీవచనభూషణ వ్యాఖ్యానానంతరం – అనే అర్థాన్ని ఇచ్చే అవకాశం ఉన్నా, వక్తృబుద్ధిస్థమైన అభిప్రాయాన్ని బట్టి ఈ అర్థమే సరసం. ఈ స్తుతికర్త శ్రీవరవరమునికావ్యంలో కూడా **"తత స్సాంధ్యవిధిం కృత్వా స్తుత్వా చ మధుసూదనమ్"** (తరువాత సంధ్యాకాల విధిని నిర్వర్తించి, మధుసూదనుని స్తుతించి) అని అంటూ ఈ విషయాన్ని వర్ణించడంవల్ల, గుణోపసంహారన్యాయాను సారం కావ్యంలో వర్ణింపబడ్డ సాంధ్యవిధినిర్వహణానంతరం అని అర్థం చెప్పడం సముచితం. **(హరేః)** ఇది పూర్వం నిర్దేశింపబడ్డ **"రంగనిధిం", "హరతీతి హరిః"** అనే పదాల వ్యుత్పత్తిస్వారస్యాన్నిబట్టి విరోధినిరసనశీలుడైన శ్రీరంగనాథునియొక్క – అని అర్థం. లేక, **"బ్రహ్మాణం శితికంఠం చ యమం వరుణ మేవ చ, ప్రసహ్య హరతే యస్మా తస్మా ద్ధరి రితీర్యతే"** (బ్రహ్మను, రుద్రుని, యముణ్ణి, వరుణుని నియమించేవాడు కాబట్టి హరి అనబడుతున్నాడు) అనే రీతిలో సర్వదేవతలను నియమించే స్వభావం కలవాడని కూడా అర్థం. పూర్వదినచర్యలోని **"రంగనిధిమ్"** అనే ప్రయోగంచేత సౌలభ్యం చెప్పబడింది, **"శ్రీనిధిమ్"** అని సౌందర్యం చెప్పబడింది. ఇక్కడ హరి శబ్దంచేత పరత్వం చెప్పబడింది. ఈ విధంగా పరత్వ–సౌలభ్య–సౌందర్యాల మేళనం ఆశ్రయణానికి ప్రయోజకమని సూచింపబడింది.



**(స్వైరాలాపైః)** – ఈ పదం **"స్వైర+ఆలాపైః"** అని, **"స్వైః+ఆలాపైః"** అని వ్యస్త సమస్తరూపాలుగా రెండు విధాలుగా విభజించి అర్థం చెప్పబడింది. **"మన్దస్వచ్ఛందయోః స్వైరః"** అని అమరం. స్వేచ్ఛగా అనుగ్రహించే శ్రీసూక్తు లతో–అని ఇచటి భావం. **"క్రీడార్థ మపి యద్బ్రూయుః"** (మహనీయులు లీలగా ఏది పలికినా అది వేదమే) అనే సూక్తి, **"శొల్లుమ్ అవిడు శురుదియామ్"** అని అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్ పల్కిన జ్ఞానసారంలోని సూక్తి ఇక్కడ స్మరించతగినవి. **"కలైయిలఙ్గు మొழியాళర్ కణ్ణపురత్తు"** (శాస్త్రార్థాలు ప్రకాశించే సూక్తులను పలికేవారు నివసించే తిరుకణ్ణపురం) అనే సూక్తికి వ్యాఖ్యానం చేసిన రీతిలో, నోరు తెరచి ఏది పల్కినా అది అంతా శాస్త్రార్థమే అవుతుంది అని భావం – అని కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామి వ్యాఖ్య. **"ఆర్ వశనబూషణత్తిన్ ఆழ்పొరుళెల్లా మఱివార్? ఆర్ అదు శొన్నేరిల్ అనుట్టిప్పార్?"** (శ్రీవచన భూషణంలోని గంభీరమైన అర్థాలను గ్రహించ గలిగిన వారెవరు? అందులో చెప్పబడిన రీతిలో నడచుకొన గల్గిన వారు ఎవరు?) అనే రీతిలో గ్రహించడానికి, గ్రహించిన రీతిలో అనుష్ఠించడానికి సుకరంకాని శ్రీవచనభూషణ రహస్యగ్రంథం లోని అర్థాలను శిష్యులకు ఉపదేశించేటపుడు ఎంతసులభమైన రీతిలో ఉపదేశించినా వాని సహజమైన కాఠిన్యాన్నిబట్టి ఆ ఉపదేశంలో ఎంతో కొంత కాఠిన్యం మిగిలి ఉండనే ఉంటుంది. సాయం సంధ్యావందనం తరువాత శ్రీరంగనాథుని అర్చామూర్తి తిరువారాధనం పూర్తి చేసికొన్న పిమ్మట చేసే ప్రవచనం తమ ఇష్టానుసారంగా తామే చేసేది కాబట్టి సులభతమంగా ఉంటుంది. ఈ ప్రవచనమే ఇచట స్వైరాలాపశబ్దంచేత చెప్పబడింది. సకలశాస్త్రార్థాలను తనలో ఇముడ్చుకొన్న, మిక్కిలి సులభమైన ప్రవచనానికి స్వైరాలాపం అని పేరు. ఈ విధమైన శ్రీసూక్తులతో పూర్వం శ్రీవచన భూషణప్రవచనాన్ని విన్న తమ శిష్యులను శ్రీవరవరమునులు సంతోషింప చేసేవారు – అని ఇచటి భావం.

**(నందయంతమ్) "టునది–సమృద్ధౌ"** అనే ధాతుపాఠాన్నిబట్టి శిష్యులను ఆనందపఱచేవారని, సమృద్ధిని కల్గినవారినిగా వారిని చేసేవారిని – అని అర్థం. శ్రీవరవరమునుల ఈ స్వైరాలాపాలను ఈ స్తుతికర్త వరవరమునిశతకంలో **"ఆమ్నాయేషు స్తుతిభి రమితై స్సేతిహాసైః పురాణై, దృశ్యం యత్నైః యదిహ విదుషాం దేశికానాం ప్రసాదాత్, స్వైరాలాపై స్సులభయసి తత్ పంచమోపాయ**

**తత్వం దర్శదర్శం వరవరమునే? దైన్య మస్మద్విధానామ్"** (వేదాలలోని సూక్తులలో, ఇతిహాస పురాణాలలో కనిపించేది, పూర్వాచార్యుల సూక్తులలో ఉన్నది అయిన పంచమోపాయ తత్త్వాన్ని, ఓ వరవరమునీ! మీరు, మా దైన్యాన్ని గమనించి, యథాలాపంగా పలికే సూక్తులతో మాకు వివరిస్తున్నారు) అంటూ ప్రస్తుతించారు.

**"శోధయిత్వా పదద్వయమ్"** అని ప్రాతఃకాలికమైన ఆరాధన, **"ఆరాధ్య శ్రీనిధిమ్"** అని మాధ్యందినఆరాధన, **"సాయంతనం తతః కృత్వా సమ్యగారాధనమ్"** అని సాయంకాలిక ఆరాధన చెప్పబడింది. ఈ కాలత్రయారాధన స్మృతివిహితం. శాండిల్యస్మృతిలో **"ఆముహూర్తా త్తు వై బ్రాహ్మా దన్యూనం ప్రహరాత్ సుధీః, స్నానార్చనజపస్తోత్రపాఠైః కాలం వినోదయేత్, భోగానుపార్జ్య యాగార్థమ్"** (బ్రాహ్మ ముహూర్తంనుండి ప్రహరం తక్కువకాని సమయం–అంటే –జాము కాలం– మూడుగంటల కాలం బుద్ధిమంతుడైనవాడు స్నాన–అర్చన–జప– స్తోత్రపాఠాలతో కాలం గడపాలి. భగవద్యాగరూప ఆరాధనకు ద్రవ్యాలను సమకూర్చుకోవాలి) అని ఆరంభించి, **"ప్రసన్నో యోగ మారభేత్, అభిగమ్య యథాపూర్వ మర్చయిత్వా యథావిధి"** అని, **"త్రికాలద్రవ్యయోగేన"** అని ఈ విషయం తెలుపబడింది. పరాశరమహర్షికూడా **"త్రికాల మర్చయే ద్దేవం ప్రతిమాసు విశేషతః"** (భగవానుని ప్రతిమారూపంలో ప్రతిదినం మూడు కాలాల్లో విశేషంగా ఆరాధించాలి) అని, **"ఏవం త్రికాల మర్చాయాం పూజయే ద్విధివచ్చరుమ్"** (అర్చామూర్తికి మూడు కాలాల్లో విధిప్రకారంగా ప్రసాదనివేదన చేయాలి) అని, **"కాలత్రయార్చనాన్తే తు"** అని ఈ అంశాన్ని తెలియజేశాడు. యతిధర్మసముచ్చయంకూడా **"ప్రాతస్స్నానం జపో మౌనం నిత్య మేకాంతశీలతా, నమస్కారోపవాసౌ చ భక్తి ర్విష్ణౌ తథా గురౌ, ఆస్తిక్యం బ్రహ్మసంస్పర్శః ప్రాణాయామరతి స్తథా, త్రైకాల్య మర్చనం విష్ణోః పరమం ముక్తిసాధనమ్"** (ప్రాతఃకాలస్నానం, జపం,మౌనం, ఎల్లప్పుడు ఏకాంతంలో ఉండడం, నమస్కారం, ఉపవాసం, విష్ణుభక్తి, గురుభక్తి,ఆస్తికత, భగవద్ధ్యానం, ప్రాణాయామంలో ఆసక్తి, మూడు కాలాల్లో విష్ణువును ఆరాధించడం యతిముక్తికి సాధనాలు) అని తెలిపింది. అత్రిస్మృతి కూడా **"త్రైకాల్య మర్చనం విష్ణోః"** (మూడు కాలాలలో విష్ణువును అర్చించాలి) అని అన్నది. ఈ ఆరాధన ఉపాదానాదిరూపమైన పాంచకాలికారాధనలో శ్రేష్ఠమని భారద్వాజ పరిశిష్టంలో **"ప్రాప్త్యాభిగమనం దృష్ట్యోపాదానం నమసార్చనమ్, స్వాధ్యాయః కీర్తనా ద్యోగః స్వార్పణా దపి కేవలమ్, ఏవం విద్వా నేకదాపి కుర్వన్ స్యా**



**త్పాంచకాలికః, కృతం భవతి వా సర్వ మిజ్యయైవ హి కేవలమ్"** (అర్చామూర్తి సమీపాన్ని చేరడంతో అభిగమనం, దర్శనంతో ఉపాదానం, నమస్కారంతో అర్చనం, కీర్తించడంతో స్వాధ్యాయం, తనను అర్పించడంతోనే యోగం–ఈ విధంగా పాంచకాలిక పూజ చేసినట్లవుతుంది. లేకపోతే, కేవలం ఇజ్యద్వారా–అంటే నమః పూర్వకమైన అర్చనద్వారానే అన్నీ చేయబడినట్లవుతుంది) అని తెలుపబడింది.

ఈ రీతిలోనే యోగంకూడా ఆరాధనవలె త్రైకాలికమే. శాండిల్యుడు **"వక్ష్యామి యోగా దూర్ధ్వం య త్కర్తవ్యం స్నానపూర్వకమ్, ఉచ్చైస్స్వరేణ యోగాంతే స్తుత్వా స్తోత్రై రనన్యధీః"** (యోగానికి పిమ్మట, స్నానం తరువాత చేయదగిన కర్తవ్యాన్ని తెలుపుతున్నాను. ఉచ్చైఃస్వరంతో స్తోత్రాలను ఏకాగ్రతలో పఠించి) అని ప్రాతఃకాలికయోగంతో **"అష్టాంగయోగప్రీతిం చ కృత్వా ధ్యానపరో వశీ"** అని వివరించి, **"యామిన్యాం యోగకాలే తు యత్కార్యం యోగిభి ర్నరైః, వక్ష్యామి వ స్సమాసేన శ్రుణుధ్వం మునిపుంగవాః"** (మునిశ్రేష్ఠులారా! రాత్రిసమయంలోని యోగకాలంలో యోగులు చేయవలసిన కర్తవ్యాన్ని సంగ్రహంగా తెలుపుతాను, వినండి) అని ప్రారంభించి, **"కుర్యా ద్యోగ మతంద్రితః"** (శ్రద్ధగా యోగాన్ని అనుష్ఠించాలి) అని రాత్రిసమయంలోని యోగాన్ని వివరించాడు. యతిధర్మ సముచ్చయమనే గ్రంథంలోకూడా **"శూన్యే గృహే దేవగృహే గుహాయాం గిరిగహ్వరే, యత్ర వా రమతే బుద్ధిః తత్రాసీత ప్రసన్నధీః, యోగశాస్త్రోక్తమార్గేణ కృతాసనపరిగ్రహః, యోగం యుంజీత సతతం సంధ్యాస్వపి విశేషతః"** (మనస్సుకు ఎక్కడ ఇష్టపడుతుందో అక్కడ ప్రసన్నమైన మనస్సుతో ఉండాలి. యోగశాస్త్రంలో చెప్పిన రీతిలో ఆసనంలో కూర్చుండి ఎప్పుడూ యోగాన్ని ఆచరించాలి. ప్రత్యేకించి సంధ్యాసమయాల్లో అనుష్ఠించాలి) అని చెప్పబడింది. ఈ యోగంకూడా పాంచకాలికాలైన అంశాలలో ప్రధానం – అని భరద్వాజపరిశిష్టమనే గ్రంథంలో – **"సర్వం యోగేన వా కృతమ్"** అంటూ తెలుపబడింది. ప్రకృతంలో, వరవర మునులు ఈ యోగాన్ని మూడు కాలాలలోను అనుష్ఠించారని తెలుస్తున్నది. **"పత్యుః ప్రకారాన్ ప్రణిధాయ చ"** అని, **"తత శ్చేత స్సమాధాయ"** అని, **"కృత్వా చేత శ్శుభాశ్రయే"** అనే ప్రయోగాల ద్వారా ఈ త్రైకాలిక యోగం ప్రస్తావింపబడింది.

అంతేకాక, శ్రీవరవరమునిదినచర్యాంతర్గతమైన యతిరాజవింశతిలో **"శ్రీమన్! యతీంద్ర! తవ దివ్యపదాబ్జసేవామ్"** (శ్రీరామానుజా! తమ దివ్యమైన

పదాలయొక్క సేవను) అని ప్రస్తుతింపబడ్డ స్వాచార్యార్చనకూడా పాంచకాలికంలో ముఖ్యమైనది. భరద్వాజపరిశిష్టంలో ఈ అంశం **"పూజనేన గురో ర్వాపి సతాం వా పరిషేవణాత్"** (ఆచార్యుల సేవతోగాని, సత్పురుషుల పరిచర్యతోగాని) అని చెప్పబడింది. ఈ స్వాధ్యాయంకూడా త్రైకాలికమే, శాండిల్యస్మృతిలో **"వాసుదేవాది మూర్తీనాం నామ్నాం సంకీర్తనం చరేత్"** (వాసుదేవాది భగవన్మూర్తుల నామ సంకీర్తనాన్ని చేయాలి) అంటూ ప్రాతఃకాలికస్వాధ్యాయాన్ని తెలిపి, **"వేదాభ్యాసో ద్వితీయే తు"** (వేదాభ్యాసాన్ని దినం రెండవభాగంలో) అని, **"ఇతిహాసపురాణాభ్యాం షష్ఠం సప్తమ మభ్యసేత్"** అని కూడా వేరే సందర్భంలో చెప్పబడింది. ఈ విధమైన త్రైకాలికస్వాధ్యాయం ప్రకృతస్తోత్రంలో **"ధ్యాత్వా రహస్యత్రితయమ్"** అని, **"తత్త్వం దివ్యప్రబంధానామ్"** అని, **"వాక్యాలంకృతివాక్యాని వ్యాఖ్యాతారమ్"** అని ప్రసక్తమైనది. ప్రకృతశ్లోకాను గుణంగా **"తత స్సాయంతనం కర్మ కృత్వా శ్రీరంగ శాయినమ్, ధ్యాత్వా........వేదాంతవాక్యతత్త్వార్థైః విమలజ్ఞానసంపదః, బోధయంతం నిజాన్ భక్తాన్"** (తరువాత సాయంకాల కృత్యాన్ని అనుష్ఠించి, శ్రీరంగనాథుని ధ్యానించి... నిర్దుష్టమైన జ్ఞానాన్ని కలిగిన తమ శిష్యులకు వేదాంత వాక్యాల తత్వాలను బోధించేవారై) ఇత్యాది యతిపతిదినచర్యాసూక్తి స్మరణీయం.

**4.** **తతః కనకపర్యంకే తరుణద్యుమణిద్యుతౌ ।**
**విశాలవిమలశ్లక్ష్ణతుంగతూలాసనోజ్జ్వలే ॥**

**5.** **సమగ్రసౌరభోద్గారనిరంతరదిగంతరే ।**
**సోపధానే సుఖాసీనం సుకుమారే వరాసనే ॥**

తతః=స్వస్వరూపాన్ని ప్రకాశింపజేసే తమ శ్రీసూక్తులతో శిష్యులను ఆనందపఱచిన తరువాత, తరుణద్యుమణిద్యుతౌ=బాలసూర్యుని కాంతివంటి కాంతిని కల్గినదై, విశాల విమలశ్లక్ష్ణతుంగతూల+ఆసనోజ్జ్వలే=విశాలమైన, నిర్దుష్టమైన, చిక్కని, ఉన్నతంగా ఉన్న పత్తితో చేయబడినదై, సమగ్రసౌరభ+ఉద్గారనిరంతరదిగంతరే= నిరవధికమైన భగవత్ప్రసాదరూపగంధమాల్యాదుల సువాసనచే వ్యాపింపబడిన నాలుగు పక్కలను కల్గినదై, సోపధానే = శ్రమ తీరడానికై చేరగిలబడడం కోసం తగిన దిండ్లను కల్గినదైన, కనకపర్యంకే = బంగారు శయ్యపై, సుకుమారే = మృదువైన, వరాసనే = యోగానికి తగినట్లు దర్భాసనం, అజినం మొదలైన



వానితో చేయబడ్డ గొప్ప ఆసనంలో, సుఖాసీనం = తమ మనస్సుకు అనుకూలంగా వేంచేసి ఉన్న (**"చింతయామి తమ్"** అనే 11వ శ్లోకంతో అన్వయం)

అర్థపంచకవిశేష ప్రకాశకాలు అయిన తమ శ్రీసూక్తి విశేషాలతో అంతేవాసులను ఆనందింపజేసిన తరువాత, బాలసూర్యునివలె వెలిగే కాంతిని కల్గినది, విశాలంగా, తెల్లగా, నిగనిగలాడేది, ఉన్నతమైనది, పత్తితో చేసినది, గొప్ప సుగంధంతో వ్యాప్తమైన నాల్గు దిక్కులను కల్గినది, తలదిండ్లతో కూడినది అయిన స్వర్ణమయపర్యంకంలో యోగాభ్యాసానికి తగిన, సుకుమారమైన ఉన్నతాసనంలో సంతోషంగా వేంచేసి ఉన్న శ్రీవరవరమునులను సేవిస్తున్నాను. **(తతః)** – పంచమోపాయతత్త్వాన్ని ఆవిష్కరించే స్వైరాలాపాలతో శ్రోతలను రంజింప చేసిన తరువాత.

**(సౌరభ)** – భగవత్ప్రసాదాలైన గంధమాల్యాదుల సుగంధంయొక్క. **(వరాసనే)**– **"చేలాజినకుశోత్తరమ్"** అని చెప్పబడ్డ యోగానికి తగిన ఆసనంలో–అని అర్థం. **"సుఖాసీనమ్"** అనే పదంచేత **"ఆసీనస్సంభవాత్"** అనే యోగసూత్రార్థం, **"సమగ్రసౌరభే"** త్యాదిప్రయోగంద్వారా **"మనోనుకూలే"** అని, **"తతో నివాతకే రమ్యే యత్ర వా రమతే మనః"** అని పూర్వం ఉదాహరింపబడ్డ స్మృతులను విషయంగా కల **"యత్రైకాగ్రతా తత్రావిశేషాత్"** అనే యోగసూత్రార్థం స్మరింపజేయ బడ్డాయి. **"కనకపర్యంక"** అన్నపుడు భృత్యులచేత సిద్ధం చేయబడిన–అనే అర్థం ఇచ్చే ఈ సందర్భాన్ని వర్ణిస్తూ కావ్యంలో చేయబడిన **"తత స్సజ్జీకృతం భృత్యైః శయనీయం విభూషయన్"** (శిష్యులచే సిద్ధంచేయబడిన శయ్యను అలంకరిస్తూ) అని, వరవరమునిశతకంలోని **"భృత్యైః స్నిగ్ధైః ప్రియహితపరై రంచితే భద్రపీఠే తుంగం తూలాసనవర మలం కుర్వత స్సోపధానమ్"** (తమ పట్ల ప్రీతిని కలవారు, తమకు ప్రియాన్ని హితాన్ని చేసేవారు అయిన శిష్యులు సిద్ధపరచిన ఎత్తైన, తలదిండుతో కూడిన శయ్యను అలంకరించేవారు) అని గల ప్రయోగాలను స్మరించడం యుక్తం. ఇందువల్ల భక్తుల ప్రార్థనను అనుసరించి పర్యంకాన్ని అంగీకరించడంలో దోషం లేదు – అని తెలుస్తున్నది. భాగవతంలో పరమహంస ధర్మాలనుగూర్చి అజగరుడు ప్రహ్లాదునకు తెలియజేస్తూ పల్కిన – **"క్వచి చ్ఛయే ధరోపస్థే తృణపర్ణాశ్మవేశ్మసు, క్వచిత్ప్రాసాదపర్యంకే కశిపౌ వా పరేచ్ఛయా"** (ఒక సమయంలోనే మీద గడ్డి, ఆకులు, రాళ్ళు వీనితో నిర్మింపబడ్డ నివాసాల్లో,

మఱొక సమయంలో సమయంలో శిష్యుల ప్రార్థనపై గొప్ప భవనాల్లో సుఖాసనంమీద) అని చెప్పబడింది. ఇందువల్ల **"రాత్ర్యధ్వానం చ యానం చ స్త్రీకథాం లౌల్య మేవ చ, మంచకం శుక్లవస్త్రం చ యతీనాం పతితాని షట్"** (రాత్రి ప్రయాణం, వాహనం, స్త్రీకథ, విషయాసక్తి, పర్యంకం, తెల్లని వస్త్రం–అనే ఆఱు యతులకు పతనహేతువులు) ఇత్యాదిగా చెప్పబడినవానిలో ఒకటి అయిన లౌల్యం తానుగా ఆశపడి పర్యంకాన్ని స్వీకరించరాదని తెలుపుతున్నది తప్ప, శిష్యుల ప్రార్థనవల్ల స్వీకరిస్తే దోషం లేదని తెలుస్తున్నది. కాబట్టి కావ్యాదులలో వర్ణింపబడ్డ వాహనస్వీకారాదులుకూడా అనుచితాలు కావని వివరింపబడినట్లయింది. భాగవతంలో పరమహంసధర్మాన్ని తెలిపే ప్రకరణంలో – **"రథేభాశ్వైః చరేత్ క్వాపి"** (యతి, రథాలపై, ఏనుగులపై గుఱ్ఱాలపై ఎక్కి తిరుగవచ్చు) అని ఉన్నది. ఈ సందర్భంలో పరాశరసంహితావచనాలు ఉదాహరణీయాలు. **"కనకపర్యంక"** అంటూ ఇక్కడ చెప్పబడ్డ సువర్ణసంబంధం శిష్యప్రార్థనాహేతుకం కాబట్టి తప్పులేదు. అందువల్ల మేథాతిథికూడా సువర్ణాన్ని యతి పరిగ్రహించరాదని అన్నాడు తప్ప, శిష్యాదుల ప్రార్థనపై నిస్సంగంగా ఉపయోగిస్తే తప్పులేదన్నాడు. **"సౌవర్ణరౌప్యకాంస్యేషు తామ్రాబ్జాశ్మమయేషు చ, భుంజన్ భిక్షు ర్న లిప్యేత దూష్యతే తు పరిగ్రహాత్"** (బంగారంతో, వెండితో, కంచుతో, రాగితో, రాతితో చేసిన పాత్రలలో యతి భుజించినా లౌల్యానికి గురికాడు. కాని, వాని పరిగ్రహంమాత్రం కూడదు) అని పరాశరవచనం. ఈ సూక్తి భోజనపాత్రవిషయకమైనా, సామ్యాన్నిబట్టి పర్యంకవిషయంలోకూడా సువర్ణాన్ని ఉపయోగించడంలో తప్పులేదని ఏర్పడుతున్నది. అందువల్లనే ఈ మేథాతిథి ప్రమాణంలోని **"దూష్యతే తు పరిగ్రహాత్"** అనే వచనం స్వరసం.

"ఉత్తమాశ్రమి, పరమ విరక్తాగ్రేసరులు అయిన శ్రీవరవర మునులు **"తుంగతూలాస నోజ్జ్వలం, సుకుమారం, సమగ్రసౌరభోద్గారశాలి"** (ఎత్తైనది, భక్తితో చేయబడినది, ప్రకాశించేది, మెత్తనిది, చక్కని సువాసనను వెదజల్లుతున్నది) అయిన కనకపర్యంకంలో వేంచేసి ఉండడం సుతరాం అసంభావితమే అయినా, ఇది ఆదరాతిశయం స్ఫురించేటట్లు అతిశయోక్తి ప్రక్రియలో పల్కిన సూక్తిగా గ్రహించవచ్చు. **"పడియిడై మాడత్తడియిడైత్తూణిల్ పదిత్తవన్ మణికళినొళియాల్, విడిపకలిరవొన్ఱఱివరిదాయ తిరువెళ్ళియఙ్గుడి యదువే"** (భవనాలలోన స్తంభాలలో



పొదిగిన రత్నాల కాంతి వల్ల ఇది పగలు, ఇది రాత్రి అని తెలియడానికి సాధ్యం కాని రీతిలో ప్రకాశించే తిరువెళ్ళియఙ్గుడి క్షేత్రం) అని, **"శెమ్బొన్ మాడ త్తిరుక్కురుకూర్"** (అందమైన, బంగారు మయమైన భవనాలు కలిగిన తిరుక్కురుకూర్ క్షేత్రం) అని దివ్యసూరులు పల్కిన క్రమంలోనే ఇదికూడా అని చెప్పవచ్చు" – అని శ్రీకాంచీ ప్ర.భ. అణ్ణాస్వామి వారి వ్యాఖ్య. "తరుణద్యుమణిద్యుతౌ" అనే ప్రయోగం బాలసూర్యుని కాంతి వంటి కాంతిని కల్గిన అనే అర్థం ఇస్తుందున నిదర్శనాలంకారం ఉన్నది.

**6. ఉన్మీలత్పద్మగర్భద్యుతితల ముపరి క్షీరసంఘాతగౌరం**
**రాకాచంద్రప్రకాశప్రచురనఖమణిద్యోతవిద్యోతమానమ్ ॥**
**అంగుళ్యగ్రేషు కించి న్నత మతిమృదులం రమ్యజామాతృయోగీ**
**దివ్యం తత్పాదయుగ్మం దిశతు శిరసి మే దేశికేంద్రో దయాళుః ॥**

దయాళుః = పరమదయాళువై, దేశికేంద్రః = ఆచార్యశ్రేష్ఠులైన శ్రీవరవరమునులు, ఉన్మీలత్పద్మగర్భద్యుతితలం = వికసించే ఎఱ్ఱ తామరపూల మధ్యదేశంలోని కాంతి వంటి కాంతిని కల అధో ప్రదేశాన్ని కల్గినదై, ఉపరి=పైన, క్షీరసంఘాతగౌరమ్= క్షీరరాశివలె తెల్లగా ఉన్నది, రాకాచంద్రప్రకాశ ప్రచురనఖమణిద్యోతవిద్యోత మానమ్ = పూర్ణిమాచంద్రుని కాంతివంటి కాంతిని దట్టంగాకల, అందమైన గొప్ప నఖాల కాంతిచేత ప్రకాశించేది, అంగుళ్యగ్రేషు=వేళ్ళ చివరలో, కించిత్ నతం=కొంచెం వంగినది, అతిమృదులమ్ = చాలా సుకుమారమైనది, దివ్యం = అప్రాకృతమైనది. అయిన, తత్ = ఆ అతివిలక్షణమైన, పాదయుగ్మం = శ్రీపాదయుగ్మం, మే = దాని విషయంలో ఆశను కల నా, శిరసి=శిరస్సుపై, దిశతు = అలంకారంగా అనుగ్రహింతురుగాక!

**"తన్నామగుణహర్షితః"** అని పూర్వం చెప్పబడ్డ రీతిలో శ్రీవరవరమునుల నామాలకు, గుణాలకు ఆనందించిన భక్తులు చేసిన స్వాచార్యస్తుతిని కవి ఇక్కడ ప్రస్తావిస్తున్నారు. ఈ శ్లోకం మొదలు **"ఇతి స్తుతినిబంధేన సూచితస్వమనీషితాన్"** అనే శ్లోకం(12) వరకు దాసులు ప్రేమపరవశులై చేసే స్తుతులు తెలుపబడుతున్నాయి. మణవాళమహాములు తమ శ్రీపాదపద్మాల జంటను దాసుడనైన నా తలపై ఉంచి, అనుగ్రహించాలని కవి ప్రార్థించడమే ఇందలి ప్రధానాంశం.

**(దేశికేంద్రః)** **"ఇది-పరమైశ్వర్యే"** అనే ధాతుస్వారస్యాన్నిబట్టి ఆచార్యునకు ఉండవలసిన **"ఞాన మనుట్టాన మివై"** అని చెప్పబడ్డ లక్షణాలన్నిటినీ వరవరమునులు పుష్కలంగా కలవారని అర్థం. అందువల్ల అనువృత్తిప్రసన్నాచార్యుని కంటె కృపామాత్రప్రసన్నాచార్యునకు ఉండే గొప్పతనం వ్యక్తమవుతున్నది. ఈ అర్థం ప్రకృతంలో **"దయాళుః"** అనే విశేషణంద్వారా దృఢీకరింపబడింది. **(ఉన్మీలత్)** ఈ వర్తమానకాలికశత్రంతప్రయోగస్వారస్యం సహృదయైక వేద్యం. పూర్తిగా వికసించిన పూవులో శోభ తగ్గిపోతుంది. కాబట్టి, వికసిస్తూ ఉండే - అనే అర్థం ఇచ్చే ఈ విశేషణం ఇక్కడ ప్రయోగింపబడింది. **"వికసతః, న తు వికసితస్యేత్యర్థః"** (వికసిస్తూ ఉన్న - అని అర్థం. వికసించిన - అని అర్థం కాదు.) అని వీర రాఘవాచార్యవ్యాఖ్య.

**(పద్మగర్భ)** - బయటఉన్న కాంతికి గాలి, ఎండ మొదలైనవాని ప్రభావంవల్ల లోటు కలుగవచ్చు. తామరపూవు గర్భంలో ఉన్నకాంతికి ఆ లోటు ఉండదు కాబట్టి ఈ ప్రయోగం సాభిప్రాయకం. పద్మకాంతిద్వారా రక్తవర్ణత్వం స్ఫోరితం. వరవరమునిశతకంలోకూడా **"పద్మాభితామ్రమ్"** అని వర్ణింపబడింది. పాదతలం (అరికాళ్ళు) ఎఱ్ఱగా ఉండడం మహాపురుష లక్షణం. **"నేత్రాంతనఖపాణ్యంఘ్రితలైస్తామ్రైః స్త్రిభిః భగీ"** (కన్నుల చివరలో, గోళ్ళలో, అరచేతులలో, అరికాళ్ళలో ఎర్రదనం కలిగినవాడు మహాపురుషుడు) అనే ప్రమాణం దీన్ని తెలుపుతున్నది. **"ముఖనేత్రాస్యజిహ్వోష్ఠ తాలుస్తననఖాః కరాః, పాదౌ చ దశ పద్మాని పద్మాకారాణి యస్య చ"** (ముఖం, నేత్రాలు, నోరు, పెదవి,నాలుక, తాలువు, స్తనాలు, నఖాలు, చేతులు, పాదాలు - అనే ఈ పది పద్మాకారంలో ఉన్నవాడు మహాపురుషుడు) అనే ప్రమాణం **"పద్మగర్భద్యుతి"** అన్నపుడు అనుసంధేయం.

**(ఉపరి క్షీరసంఘాతగౌరమ్)** - పైన పాలరాశివలె తెల్లగా ఉండడానికి కారణం శ్రీవరవరమునుల ఆదిశేషాంశత్వమే. **"మంగళం పన్నగేంద్రాయ మర్త్యరూపాయ మంగళమ్"** (మానవ రూపాన్ని ధరించిన ఆదిశేషునకు మంగళం) అని అంటూ ఈ అంశం వరవరమునికావ్యంలో మంగళా శాసనాత్మకంగా కీర్తింపబడింది. **"క్షీరసంఘాత"** అనే ఉపమానంవల్ల పాదాల మహత్త్వం వ్యక్తమవుతున్నది. **"శిరో లలాటః శ్రవణే గ్రీవా వక్ష శ్చ దృక్తథా, ఉదరం పాణిపాదౌ చ పృష్ఠం దశ బృహంతి చ"** (శిరస్సు, నుదురు,చెవులు,కంఠం, వక్షస్సు, కళ్ళు, ఉదరం, చేతులు, కాళ్ళు, పృష్ఠభాగం-అనే పది పెద్దవిగా ఉండాలి) అన్నది సాముద్రికశాస్త్రం.



**(నఖమణీనామ్)** - రత్నాలవలె ఆకర్షణీయాలైన-అని అర్థం. **(విద్యోతమానమ్)** **"క్షీరార్ణవ మివ అనేకచంద్రైః విశేషతో దీప్యమానమ్"**- పాలసముద్రంవలె పలు చంద్రుల కాంతితో మిక్కిలిగా ప్రకాశింపజేయబడిన-అని ఇక్కడ భావం. **"చంద్రప్రకాశప్రచుర"** అనే ప్రయోగంద్వారా పూర్ణచంద్రుని కాంతివంటి కాంతి ఎక్కువగా ఉన్నదనే అర్థం ఏర్పడడంచేత, ఆ చంద్రకాంతికి ప్రకృతంలో విజాతీయమైన పూర్వోక్తపద్మద్యుతియొక్క అల్పత్వంకూడా భాసిస్తుందని వీరరాఘవాచార్య వ్యాఖ్య ప్రమాణం ఇక్కడ **"రాకాచంద్రప్రకాశ", "పద్మగర్భద్యుతి తలమ్"** అన్నపుడు నిదర్శనాలంకారం భావ్యం.

**(అంగుళ్యగ్రేషు కించి న్నతమ్)** - దీనివల్ల వేళ్ళు చివరలో కొంచెం వంగి ఉండాలంటూ **"పాదావరాంగుళీ"** అని చెప్పబడ్డ మహాపురుషలక్షణం సూచింపబడింది.

**(అతిమృదులమ్) - "సౌకుమార్య మతివాఙ్మనసమ్"** (సౌకుమార్యం మాటలకు, మనస్సుకు అందనిది) అన్నరీతిలో పూవుకంటె మెత్తనిది **"పూర్వోక్తామ్లానకుసుమాదపి కోమలమ్"** ఈ పాదయుగ్మం అని వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్య **(మే శిరసి)** మిక్కిలి ఆర్తితో ఉన్న నా తలపై - అని భావం. **(దిశతు)** అలంకారంగా అనుగ్రహించు గాక! - అని వీరరాఘవాచార్య వ్యాఖ్య. **"తత్పాదౌ గృహ్య మూర్ధ్ని స్వే నిధాయ వినయాన్వితః"** (ఆ రెండుపాదాలను గ్రహించి వినయంగా తన తలపై పెట్టుకొని) అంటూ తెలుపబడ్డ పాదధారణం స్వయంగా ఆచార్యులు అనుగ్రహించడంద్వారా చేయాలనే అత్యంత పారతంత్ర్యానికి అనుగుణంగా ఈ ప్రార్థన చేయబడింది. **"ఉన్ పాదపఙ్కయమే తలైక్కణియాయ్"** (నీ పాద పద్మాలను మా తలకు అలంకరించు) అని కదా ఆళ్వార్ల ప్రార్థన.

**(దయాళుః దేశికేంద్రః రమ్యజామాతృయోగీ తత్ దివ్యం పాదయుగ్మం మే శిరసి దిశతు)** - పరమకారుణికులై, కృపామాత్రప్రసన్నాచార్యులై, పరమాచార్య సార్వభౌములైన శ్రీవరవరమునులు తమ పరమవిలక్షణమైన దివ్యపాదార విందద్వయిని దాసుని శిరస్సుపై ఉంచి అనుగ్రహించాలి. ఆ పాదద్వంద్వం ఎటువంటిది? అంటే,

**(ఉన్నీలత్ పద్మగర్భద్యుతితలమ్)** ఈ ప్రయోగంలో బహువ్రీహి గర్భబహువ్రీహి సమాసం ఉన్నది. అపుడే వికసిస్తున్న తామరపూవులోపల ప్రకాశించే కాంతివంటి కాంతిని కల లోపలి భాగాన్ని కల్గినది. అరికాళ్ళు ఎఱ్ఱ తామరలవలె ఎఱ్ఱగా ఉన్నవని ఇచటి భావం. **(ఉపరిక్షీరసంఘాతగౌరమ్)** శ్రీపాదాల పైభాగం పాల ముద్దవలె తెల్లగా ఉన్నది. ఆదిశేషావతారరూపుడైన బలరాముని పెరియాళ్వార్లు వర్ణించే సందర్భంలో **"మున్నలోర్ వెళ్ళిప్పెరుమలై కుట్టన్ మొదుమొదు విరైన్దోడ"** (ముందుగా అద్వితీయమైన గొప్ప వెండికొండ వంటి బలరాముడు గబ గబా వేగంగా వెళుతుండగా) అనే పాశురంలో బలరాముని తెల్లని, పెద్ద పర్వతంగా పల్కడం ఆ మూర్తి ఆదిశేషాంశమని సూచించడం కోసమే అయినట్లే ఇది కూడా. అస్మత్కులకూటస్థులైన ప్రతివాదిభయంకరం అణ్ణన్‌కూడా వరవరమునిశతకంలో **"దుగ్ధోదన్వద్ధవళమధురం శుద్ధసత్త్వైకరూపం రూపం యస్య స్ఫుటయతితరాం యం ఫణీంద్రావతారమ్"** (పాల సముద్రం వలే తెల్లని, మధురమైన, సాత్త్వికమైన రూపం శ్రీవరవరమునులు ఆదిశేషుల అవతారమనే విషయాన్ని స్పష్టం చేస్తున్నది) అనే శ్లోకంద్వారా ఈ రహస్యాన్ని ప్రస్ఫుటం చేశారు–అని శ్రీ.ప్ర.భ. అణ్ణాస్వామివారి వ్యాఖ్యానం.

**(దివ్యమ్)** ఆదిశేషుడు నిత్యసూరివర్గంలోకి చేరినవాడు కాబట్టి, ఆ ఆదిశేషుల పునరవతార భూతులైన వరవరమునుల పాదయుగ్మం దివ్యమేకదా! ఈ లోకంలోని సంసారుల పాదాలవలె తక్కువ స్వభావాన్ని కల్గినవి కావని తాత్పర్యం. **"దివు"** ధాతువునకున్న అర్థాలను ఇచట యథాయోగంగా అన్వయించవచ్చు.

**(దిశతు)** ప్రథమపురుషలో ప్రయోగింపబడ్డ ఈ రూపానికి మధ్యమపురుషార్థంలోనే దృష్టి అని చెప్పాలి. వరవరమునుల సమక్షంలోనేకదా శిష్యులు ప్రార్థిస్తున్నారు.

**7. త్వం మే బంధుః త్వ మసి జనక స్త్వం సఖా దేశిక స్త్వం**
**విద్యా వృత్తం సుకృత మతులం విత్త మప్యుత్తమం త్వమ్ ।**
**ఆత్మా శేషీ భవసి భగవ న్నాంతర శ్శాసితా త్వం**
**యద్వా సర్వం వరవరమునే! యద్యదాత్మానురూపమ్ ॥**

వరవరమునే = మణవాళమహామునీ! త్వం = దేవరవారు, మే = దాసునకు, బంధుః= **"ఉన్దన్నోడుఉఱవేల్ నమక్కిఙ్గు ఒళిక్క ఒళియాదు"** (నీతో మాకుండే



సంబంధం పోగొట్టుకుంటే పొయేది కాదు) అన్న రీతిలో అవర్జనీయమైన (మీకు నాకు కూడా కాదనడానికి వీలులేని) సంబంధాన్ని కల్గిన బంధువుగా, అసి=అగుచున్నారు. త్వం=తమరు, జనకః = విద్యాప్రదానాదులద్వారా తండ్రిగా, అసి=అగుచున్నారు. త్వం=తమరు, సఖా అసి=భగవదనుభవాదులలో వృత్తకీర్తనాదులకు సహాయకులుగా అగుచున్నారు, త్వం= తమరు, దేశికః =అజ్ఞాతజ్ఞాపనాదులద్వారా, తత్త్వజ్ఞానప్రదానం ద్వారా, సన్మార్గనిర్దేశనం ద్వారా ఆచార్యులగుచున్నారు, త్వం=తమరు, విద్యా= **"మాతేవ రక్షతి"** ఇత్యాదిగా కీర్తింపబడ్డ రీతిలో ఆత్మరక్షణ ఉపయోగపడే పరవిద్య అగుచున్నారు, త్వం=తమరు, వృత్త మసి=పూర్వం తెలిసిన విద్య (జ్ఞానం) యొక్క ఫలరూపమైన సదనుష్ఠానంవలె హితరూపులగుచున్నారు, అతులం సుకృతమ్ అసి=క్షయించే స్వభావం కల్గినది కాక, సర్వసంపదలకు మూలకారణమైన పుణ్యమగుచున్నారు, త్వం=తమరు, ఉత్తమం=శ్రమపడవలసిన అవసరం లేకుండా సులభంగా లభించడంచేత, నశించే స్వభావం లేని కారణంచేత ఉత్తమమైన, విత్తమ్=అసి ధనరూపులగుచున్నారు, ఆత్మా భవసి=**"సర్వాత్మా"** అని, **"ఎనదావి ఆవియుమ్ నీ"** (నా ఆత్మ నీవు) అని, **"ఎన్నుయిరే"** అనే రీతిలో పూర్వం తెల్పిన ధనాదులను అన్నిటినీ స్వార్థంగా గ్రహించే ప్రధానమైన ఆత్మ అవుతున్నారు, శేషీ భవసి=దాసుడు చేసే కించిత్కారాన్ని గ్రహించే శేషి అగుచున్నారు. భగవన్=షాడ్గుణ్యంచేత పరిపూర్ణులైన స్వామీ!, త్వం=తమరు, ఆంతరః శాసితా అసి = **"అంతఃప్రవిష్టః శాస్తా"** (లోపల ప్రవేశించినవాడవై, శాసించేవాడవై) అనే రీతిలో లోపల నిలచి, శాసించేవారుగా అగుచున్నారు, యద్వా=ఈ రీతిలో ప్రత్యేకప్రత్యేకంగా చెప్పి ఏమి లాభం?, యత్ యత్ =ఏది ఏది, ఆత్మానురూపం భవతి=ఆత్మస్వరూపానికి తగినదో, తత్సర్వం=అది అంతా, భవసి= అగు చున్నారు.

వరవరమునీ! తమరు దాసునకు సర్వవిధబంధువు అగుచున్నారు. తమరే తండ్రి, స్నేహితుడు, ఆచార్యులు,విద్య,అనుష్ఠానం, గొప్ప పుణ్యం, ఉత్తమవిత్తం,ఆత్మ, శేషి, అంతర్యామియైన శాసకుడు–ఇవి అన్నీ తమరే. ఇంత ఎందుకు? ఏది ఏది ఆత్మకు హితమో అది అంతా దాసునకు తమరే సుమా!

**(త్వం మే బన్ధుః అసి) "బధ్నాతీతి బంధుః"** అనే వ్యుత్పత్తిద్వారా అవర్జనీయసంబంధం ఇక్కడ ద్యోతకమవుతున్నది. **"అసి"** అనే వర్తమానకాలికక్రియాప్రయోగంద్వారా

ఈ బంధుత్వం కాదాచిత్కం కాదని, నిత్యమని చెప్పబడడంవల్ల లౌకికబంధువ్యావృత్తి సిద్ధించింది. బంధువులు ప్రాప్యంగాను, ఉపాయంగాను ఉన్నట్లే, వీరుకూడా ప్రాప్యప్రాపకభూతులని తాత్పర్యం. **(త్వం జనకః అసి) "భూతానా మవ్యయః పితా"** (ప్రాణులకు ఎనాడూ నశించని తండ్రి) అని, **"ఎన్ఱు ఇఱవాద వెన్దై"** (ఏనాటికీ నశించని తండ్రి) అని కీర్తించే రీతిలో ఉన్న తండ్రి మీరే. **"స హి విద్యాత స్తం జనయతి తచ్ఛ్రేష్ఠం జన్మ"** (ఆచార్యుడు విద్యతో జ్ఞాన జన్మను కలిగిస్తున్నాడు. ఆ జన్మే కదా గొప్పది) అని కదా సూక్తి. ఇక్కడ కూడా **"అసి"** అనే ప్రయోగంద్వారా హిరణ్యగర్భాదివ్యావృత్తి ద్యోతితం.

**(త్వం సఖా అసి) "తన్మిత్ర మాపది సుఖే చ సమక్రియం యత్"** (ఆపదలలో, సుఖాలలో సమానంగా వర్తించేవాడే మిత్రుడు) అని, **"మిత్ర మాపది జానీయాత్"** (మిత్రుని ఆపదలో తెలియవచ్చు) అనికదా మిత్రలక్షణం చెప్పబడుతున్నది. సంసారార్ణవమగ్నుడను అయిన నన్ను దఱిచేర్చి, ఆపదలో కాపాడిన ఉత్తమ మిత్రులు మీరు. **"సమానం ఖ్యాయతే ఇతి సఖా"** అనే సఖాశబ్ద వ్యుత్పత్తిస్వారస్యాన్ని బట్టి, భగవదనుభవాదులలో వృత్తకీర్తనసాహాయ్యాదులుకూడా ఇక్కడ వివక్షితాలు. **"వేదమ్ వల్లార్కళైక్కొణ్డు విణ్ణోర్పెరుమాన్ తిరుప్పాదమ్ పణిన్దు"** (వేదాన్ని చక్కగా తెలిసినవానిని ముందుంచుకొని, పరమపదనాథుడైన భగవంతుని పాదాలను ఆశ్రయించి) ఇత్యాది దివ్యసూరిసూక్తులు, ఈ స్తుతి విరచించిన ఎఱుమ్బియప్పా వరవరమునులతో కలసి శ్రీరంగనాథుణ్ణి సేవించిన సందర్భం మొదలైనవి స్మరణీయాలు. నేను బాధపడేటపుడు చూచి **"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"** (మానవుల దుఃఖాలను చూసి మిక్కిలి దుఃఖాన్ని శ్రీరాముడు పొందుతున్నాడు) అన్న రీతిలో తాము నా కంటె ఎక్కువగా బాధపడి, ఆ బాధను తీర్చివారై, భగవదనుభవాన్ని పొందేటపుడు **"బోధయంతః పరస్పరమ్"** (ఒకరికొకరు తెలుపుకునేవారై) అన్న రీతిలో ఉండేవారని వేఱొక వ్యాఖ్య. ఇక్కడ కూడా **"అసి"** అనే వర్తమానకాలిక క్రియ చేత ఉపకారౌపాధికమైన (ఉపకారాన్ని చేయడం లేక, పొందడం ద్వారా ఏర్పడే) సఖిత్వం వ్యావర్తింపబడింది. సోపాధికమైన సఖిత్వం దాని ఉపాధి నశించగానే నశిస్తుందికదా! **(దేశికోఽసి)** – తెలియని విషయాన్ని తెలుపడంద్వారా మాకు ఉపకరించే ఉత్తమాచార్యులు మీరే. **"న గురో రపర స్త్రాతా"** (గురువుకంటే గొప్ప రక్షకుడు లేడు) అంటూ గురువు గొప్ప రక్షకులుగా కీర్తింపబడ్డాడుకదా!



**(త్వం విద్యాఽసి)** – ఆ గురువు ఉపదేశించే ఉత్తమ విద్యకూడా మీరే. **"మాతేవ రక్షతి"** ఇత్యాదిగా చెప్పబడే విద్యాధర్మాలను అన్నిటినీ కల్గిన ఉత్తమ విద్యారూపులు మీరే – అని భావం.

**(త్వం వృత్త మసి) "విద్యా దదాతి వినయమ్"** (విద్య వినయాన్ని ఇస్తుంది) అన్నట్లు ఈ విద్యకు ఫలంగా చెప్పబడే సద్వర్తనంవలె హితరూపులు మీరే.

**(అతులం సుకృత మసి)** – ఇంతవరకు చెప్పబడ్డ బంధు,గురు,విద్యాదుల లాభానికి మూలమైన **"పుణ్యానా మపి పుణ్యోసౌ"** (ఇతడు పుణ్యాలలో కూడా గొప్ప పుణ్యం) అని, **"పుణ్ణియన్"** అని చెప్పబడే ఉత్తమపుణ్యంకూడా మీరే. **"అతుల"** శబ్దప్రయోగంచేత క్షయించే ఫలాన్ని ఇచ్చే, ఫలం ఇస్తూ తాను క్షయం పొందే లోకంలో ప్రసిద్ధం అయిన సుకృతంకంటె వీరికిగల వైలక్షణ్యం ధ్వనిస్తుంది.

**(ఉత్తమం విత్త మసి)** – ఉన్నది అనగానే పోయే ప్రాణంకూడా తిరిగి వచ్చేటట్లు ఉన్నది, తనను కలవారిని అందఱు సేవించేటట్లు చేసేది విత్తం. నిధిసామ్యంలో చెప్పబడే స్వారస్యాలన్నీ ఇచటకూడా అనుసంధేయాలు. ఉత్తమశబ్దంచేత **"అర్థానా మార్జనే దుఃఖమ్....ఆయే దుఃఖం వ్యయే దుఃఖం ధిక్ ధనమ్"** (సంపాదించడంలో దుఃఖం.... వ్యయం అయితే దుఃఖం కలుగుతాయి. ఛీ! ధనం ఎంత చెడ్డది!) అని గర్హింపబడే లోకంలోని ధనంకంటె ఉన్న వైలక్షణ్యం ధ్వనిస్తుంది. **"నిధి రవ్యయః"** వంటి తరగని, గొప్ప విత్తమని భావం.

**(త్వ మాత్మా భవసి)** పూర్వం ప్రస్తావించిన అన్నిటినీ స్వంతం చేసికొని అనుభవించే, ప్రధాన భూతమైన ఆత్మకూడా మీరే.

**(శేషీ భవసి)** – ఈ ఆత్మనుకూడా సొత్తుగా గల, **"ఆత్మేశ్వరమ్"** (ఆత్మలకు ప్రభువు), **"ప్రధానక్షేత్రజ్ఞపతిః"** (ప్రకృతి జీవులకు ప్రభువు) అని ఇత్యాదిగా చెప్పబడే సర్వేశ్వరునివలె ప్రధానతములు మీరే.

**(భగవన్)** –జ్ఞానశక్త్యాదులను నిండుగా కల స్వామీ!

**(ఆంతర శ్శాసితా త్వమ్)** – పూర్వం చెప్పబడిన జనక, దేశికాదులు అందఱూ బయట ఉండి శాసించేవారే తప్ప, లోపల ఉండి శాసించగలిగేవారు కారు. ఆవిధంగా కాకుండా లోపల ఉండి శాసించేవారు, మీరు. మనస్సులో ఉండి శాసించేవారని తాత్పర్యం. **"య ఆత్మాన మంతరో యమయతి"** (ఆత్మ లోపల

ఉంటూ శాసించేవాడు) అంటూ అంతరాత్మగా ఉండి ఆత్మలనన్నిటిని శాసించే సర్వేశ్వరుణ్ణిసైతం శాసించగలిగేవారు, మీరు. వరవరమునులు శ్రీరంగనాథునకే ఆచార్యులు కదా! **"జ్ఞానీత్వాత్మా"** (జ్ఞాని అయితే నా ఆత్మ)**, "అతీవారుయిరానాయ్"** (జ్ఞానిని ప్రాణంగా కలవాడై) ఇత్యాది సూక్తులు ఇచట భావ్యాలు. ఇంత ఎందుకు? ప్రథమ–మధ్యమ–చరమపర్వరూపాలతో వేత్వేరుగా ఉన్న ప్రాప్యసిద్ధికి ఏది ఏది స్వరూపానురూపమో అది అంతా మీరే. వాక్యంలోని ఉత్తరార్ధంలోగల యచ్ఛబ్దం తచ్ఛబ్దాన్ని అపేక్షించదు కాబట్టి **"యద్వా, తత్ సర్వం"** అంటూ తచ్ఛబ్ద ప్రయోగాం లేకున్నా దోషంలేదు. ఈ శ్లోకభావానికి అనుగుణంగా **"ఆచార్యవ ద్దేవతావ న్మాతృవత్పితృవత్స్వయమ్, సుహృద్వత్స్వామివత్సంతో ద్రష్టవ్యా రాజవ త్తథా"** (మహాత్ములు ఆచార్యునివలె, దైవంవలె, తల్లివలె, తండ్రివలె, స్నేహితునివలె, స్వామివలె, ప్రభువువలె చూడదగినవారు), **"ఐహికాముష్మికం సర్వమ్"** (ఈ లోకంలో, పరలోకంలో) ఇత్యాది సూక్తుల భావం అనుసంధేయం. **(ఆత్మా)** తాను అని అర్థం. అహం శబ్దవాచ్యుడైన (నేను అనే) ఆత్మ మీరే **"తఙ్జమాకియ తన్దైతాయొడు తానుమాయ్"** (రక్షకుడైన తండ్రియై, తల్లియై, తానై) (తిరువాయ్–3–6–9) అంటూ ఆళ్వార్లు నేను అని చెప్పవలసినచోట **"తాన్"** అని ప్రయోగించడం గమనార్హం. ఇందువల్ల **"త్వం ఆత్మా అసి"** అని అంటే మీరు నేనుగా అవుతున్నారని కూడా అర్థం చెప్పవచ్చు దీనికి పిమ్మట **"శేషీ భవసి, అంతరః శాసితా భవసి",** – అని అంటే నన్ను దాసునిగా చేసికొనే వారు, నాలో ప్రవేశించి నియమించేవారు (పరమాత్మ) మీరే అవుతున్నారని భావం. **"అంతరః"** అని అంటే, **"అంతరో భవః"** మనస్సులో ఉండే పరమాత్మ – అని మొదటి అర్థం. **"ఆత్మనః అంతరః"** అనే ఉపనిషత్ సూక్తిలో అంతర అనే పదానికి ఆత్మలోపల ఉండే పరమాత్మ అనే అర్థం చెప్పబడినందువల్ల **"అంతరస్య అయమ్ అంతరః"** అనే వ్యుత్పత్తిద్వారా, ఆత్మలోపల ఉండే పరమాత్మలో ఉండి నియమించే జ్ఞాని అన్నది రెండవ అర్థం. ఈ శ్లోకంలో **"త్వమ్ ఆత్మా అసి"** (మీరు నేను అగుచున్నారు) అని అంటూ పల్కినది జీవుడు పరమాత్మ ఒక్కడే – అనే భావంతో కాదు, శేషశేషిభావంతో, నియంతృనియామ్యభావంతో – అనే అంశం తర్వాత **"శేషీ భవసి, అంతరః శాసితా భవసి"** అని పల్కినందువల్ల స్పష్టపడుతున్నది. పరమాత్మతో తమకు ఉన్న ఈ సామానాధికరణ్యం శాస్త్రసిద్ధమైనందున, **"పీతకవాడైపిరానార్ పిరమకురువాకి వన్దు"** (పీతాంబరధారి అయిన స్వామి



పరమాచార్యుడై అవతరించి) (పెరియాళ్వార్–5–2–8) అన్నట్లు మామునులు పరమాత్మయొక్క అవతారం కావడంచేత, స్తుతికర్త తమకు మామునులతో సామానాధికరణ్యాన్ని ప్రస్తావించారని చెప్పాలి–అంటూ ఉ.వే.శ్రీమాన్.టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారి వివరణం అనుసంధేయం.

**8. అగ్రే పశ్చా దుపరి పరితో భూతలం పార్శ్వతో మే**
**మౌళౌ వక్త్రే వపుషి సకలే మానసాంభోరుహే చ ।**
**పశ్యన్ పశ్యన్ వరవరమునే! దివ్య మంఘ్రిద్వయం తే**
**నిత్యం మజ్జ న్నమృతజలధౌ నిస్తరేయం భవాబ్ధిమ్ ॥**

వరవరమునే = వరవరమునీ!, దివ్యం = అతివిలక్షణమైన, తే=తమ, అంఘ్రి ద్వయం= శ్రీపాదాల జంటను, అగ్రే=ముందు, పశ్చాత్=వెనుక, ఉపరి=పైన, భూతలం పరితః=భూప్రదేశంలో నాల్గు వైపుల, మే పార్శ్వమ్=నా ఇరువైపుల, మౌళౌ=శిరస్సులో, వక్త్రే=ముఖంలో, సకలే వపుషి=అన్ని అవయవాలలో, మానస+అంభోరుహే చ=హృదయపుండరీకంలోను, పశ్యన్ పశ్యన్= భావనాప్రకర్షంచేత ప్రత్యక్షసమానాకారంగా మనస్సులో మాటిమాటికీ దర్శిస్తూ, అమృతజలధౌ= అమృతసాగరంలో, నిత్యం మజ్జన్=నిత్యం చక్కగా మునిగి, భవ+అబ్ధిమ్= సంసారసముద్రాన్ని, నిస్తరేయమ్=దాటగలను.

**(మానసాంభోరుహే చ)** – ఇక్కడి చకారంచేత చక్షురాది ఇంద్రియాలు అన్నీ చెప్పబడ్డాయి. భావనాప్రకర్షచేత సర్వత్ర గోచరించడం ప్రాకృతవిషయంలో కూడా **"పశ్యామి తా మిత ఇత పురతశ్చ"** (ఆమెను ఇటూ అటూ ముందూ, వెనుక చూస్తున్నాను) అన్నట్లు ప్రసిద్ధంకదా!

**(అమృతజలధౌ నిమజ్జన్ భవాబ్ధిం నిస్తరేయమ్)** ఒక సముద్రంలో మునిగి వేఱొక సముద్రాన్ని దాటగలను అనడం ఉక్తి చమత్కారం. ఇదంతా వరవరమునుల దివ్యపాదాల దర్శనమహిమ సుమా! అని వాధూల వీరరాఘవాచార్యవ్యాఖ్య.

**"అమృతజలధౌ మజ్జన్"** అనే సూక్తికి అనుగుణంగా, వైకుంఠగద్యలోని **"పాదారవిందయుగళం శిరసి కృతం ధ్యాత్వా, అమృతసాగరాంతర్నిమగ్నసర్వా వయవ స్సుఖ మాసీత"** (పాదపద్మాల జంట శిరస్సుపై ధరించి ధ్యానించి, అమృత సాగరం లోపల మునిగిన అన్ని అవయవాలను కలవాడై, సుఖంగా

ఉండాలి) అనే సూక్త్యర్థం స్మరణీయం. భగవానుని విషయంలో శ్రీరామానుజులు పల్కిన ఈ సూక్తిని ఎఱుమ్బియప్పా తమ ఆచార్యుల విషయంలో అనుసంధించడం విశేషం. ప్రాకృతవిషయంలోకూడా ఇదే రీతిలో **"ఆనందసాంద్రమమృతప్లవనాది వాౠ భూత్"** (ఆనందమనే మహాసముద్రంలో తేలియాడినవాడయ్యాడు) ఇత్యాదిగా చెప్పబడింది కదా! **"గురుపాదాంబుజం ధ్యాయేత్ గురో రన్యం న భావయేత్"** (ఆచార్య పాదపద్మాలను ధ్యానించాలి. గురువు కంటే ఇంకొకరిని భావించరాదు) అనే సూక్తితాత్పర్యం ప్రకృతంలో భావ్యం.

ఈ శ్లోకం ఎఱుమియప్పా అనుగ్రహించిన వరవరమునిశతకంలోకూడా ఉన్నది. ప్రస్తుతస్తుతిని వ్యాఖ్యానించిన వాధూలవీరరాఘవాచార్యస్వామివారే ఈ శతకాన్నికూడా వ్యాఖ్యానించారు. ఆ వ్యాఖ్యలో ఈ శ్లోకభావం **"స్వస్య పృష్ఠతో గమనదృశ్యాభిప్రాయేణ అగ్ర ఇత్యుక్తమ్; పురో ధావనాభిప్రాయేణ పశ్చాది త్యుక్తమ్; వహనాద్యభిప్రాయేణ ఉపరీ త్యుక్తమ్; "జల్ప న్నుచ్చై ర్జయ జయ విభో జీవ జీవ; "ఇత్యుక్తాభిప్రాయేణ పరితో భూతల మిత్యుక్తమ్; పాదోపధానభావాభిప్రాయేణ మౌళౌ వక్త్రే వపుషి సకల ఇత్యుక్తమ్; స్వీయసుషుప్తి కాలాభిప్రాయేణ; దేశాంతరనియుక్తక్రియానుష్ఠానార్థ ప్రవాసాభిప్రాయేణ వా మానసాంభోరుహ ఇత్యుక్త మితి విభావనీయమ్"** అని వివరింపబడింది. దీన్నిబట్టి, తాము వరవర మునుల వెనుక వెళ్ళేటపుడు తమకు ముందు, ముందు వెళ్ళేటపుడు తమకు వెనుక, శ్రీపాదాలను మోసేటపుడు తమకు పైన, దివ్యదేశయాత్ర చేసేటపుడు భూతలం అంతా, **"జయ జయ, జీవ, జీవ"** అని మంగళాశాసనం చేసేటపుడు తమకు రెండు వైపుల, రాత్రి శయనించడానికి ముందు పూర్వం తెల్పిన రీతిలో ముఖంలో, తలలో, మిగిలిన అవయవాల్లో, తాము నిద్రించేటపుడు, లేక వేఱు కార్యాన్ని పురస్కరించుకొని తమను వరవరమునులు నియమించి, పంపేటపుడు తమ హృదయకమలంలోను వారి శ్రీపాదాలను ఎల్లప్పుడూ సేవిస్తూ, ఆనంద సాగరంలో మునిగినవారై, తరువాత జన్మసముద్రాన్ని దాటి పరమపదాన్ని చేరాలని దీనిద్వారా కవి ప్రార్థించినట్లయింది. **"మజ్జన్ మజ్జన్"** అని మూడవ పాదంలో పాఠాంతరం.

మణవాళమహామునీ! పరమవిలక్షణంగా ఉన్న తమ శ్రీపాదాల జంటను ముందు, వెనుక, పైన, క్రింద, నాల్గు వైపుల, నా రెండు పార్శ్వాలలో, శిరస్సులో, ముఖంలో, మిగిలిన అన్ని అవయవాలలో, హృదయపుండరీకంలో భావనా ప్రకర్షంతో ప్రత్యక్ష సమానాకారంగా స్మృతివిషయం చేసికొని, ఆనందసముద్రంలో నిత్యం మునిగినవాడనై, సంసారసాగరాన్ని దాటగలను.



**9. కర్మాధీనే వపుషి కుమతిః కల్పయ న్నాత్మభావం**
**దుఃఖే మగ్నః కి మితి సుచిరం దూయతే జంతు రేషః ।**
**సర్వం త్యక్త్వా వరవరమునే! సంప్రతి త్వత్ప్రసాదాత్**
**దివ్యం ప్రాప్తుం తవ పదయుగం దేహి మే సుప్రభాతమ్ ॥**

వరవరమునే=వరవరమునీ! ఏష జంతుః=ఈ చేతనుడు, కర్మాధీనే=పూర్వం చేసిన కర్మకు లోబడి ఏర్పడిన, వపుషి=శరీరంలో, ఆత్మభావం=ఆత్మప్రతిపత్తిని, అంటే–ఆత్మ అనే అభిప్రాయాన్ని, కల్పయన్=ఆరోపించుకొనేవాడై, కుమతిః= అన్యథాజ్ఞానాన్ని కలవాడై, దుఃఖే మగ్నః=ఆధ్యాత్మికాది తాపత్రయాలపట్ల కల్గిన దుఃఖంలో మునిగినవాడై, కిమితి =ఎందుకోసం, సుచిరం=చాలాకాలంగా, దూయతే=పరితపిస్తున్నాడు?, ఇతి మత్వా=అని తలచి, సర్వం=ముందు చెప్పిన దుఃఖాదులను అన్నిటినీ, త్యక్త్వా=విడచి, సంప్రతి=ఇపుడు, మే=ఈ విధంగా పరితపించే నాకు, దివ్యం=గొప్ప, అప్రాకృతమైన, తవ=తమ, పదయుగం =పాదాల జంటను, ప్రాప్తుం=పొందడానికి, సుప్రభాతమ్=మీ అనుభవాన్ని పొందే దివసానికి ఆరంభమైన సుప్రభాతాన్ని, త్వత్ప్రసాదాత్=మీ అనుగ్రహం వల్ల, దేహి=కృప జేయండి.

వరవరమునీ! అన్యథాజ్ఞానాన్ని కల ఈ ప్రాణి (నేను) పూర్వకర్మాను గుణంగా ప్రాప్తించిన శరీరంలో ఆత్మ ప్రతిపత్తిని ఆరోపించుకొని, దేహాత్మభ్రాంతిని కలవాడై, ఆధ్యాత్మికాది తాపత్రయాలలో మునిగి, చాలాకాలంగా ఎందుకు పరితపిస్తున్నాడు? ఈ తాపాన్ని తీర్చి అనుగ్రహించండి. ఇపుడే మీ కృపతో బాహ్యసంబంధాలను సవాననగా విడచి, తమ దివ్యపాదారవిందాలను ఆశ్రయించేటట్లు ఒక సుప్రభాతాన్ని నాకు అనుగ్రహించండి (అంటూ కొందఱు శిష్యులు ప్రార్థించారు)

**(కర్మాధీనే)** – కర్మను ఉపాధిగా కల్గినది, ఆగంతుక మని అర్థం. **"అనేన ఆరోప్యాకారస్యాసత్వ ముక్తమ్"** – అని వాధూల వీరరాఘవాచార్యవ్యాఖ్య. అంటే, శరీరంలో ఆత్మత్వం లేదని చెప్పబడింది.

**(ఆత్మభావమ్)** – ఆత్మత్వం అని, లేక, ఆత్మరూపపదార్థ మని అర్థం. భావశబ్దం పదార్థ వాచికదా!
**(కల్పయన్)** – దేహంలో ఆత్మత్వాన్ని ఆరోపిస్తే ధర్మవిపర్యాసం కాబట్టి అన్యధాజ్ఞానం, దేహాన్ని ఆత్మగా భావిస్తే ధర్మివిపర్యాసం కాబట్టి విపరీతజ్ఞానం. రెండూ ఆరోపాలే.

**(కుమతిః)** అన్యధాజ్ఞానం కలవాడనై, అందువల్లనే దుఃఖాల్లో మునిగినవాడనై

**(ఇతి)** – అని తలచి, **"మత్వా"** అనే పదాన్ని అధ్యాహరించుకోవాలి. ఇంతవరకు మామునులకు తమ భక్తుల విషయంలోగల తలపుకు అనువాదం.

**(సర్వమ్ త్యక్త్వా)** పూర్వం తెలిపిన రీతిలో అన్యధాజ్ఞాన, విపరీతజ్ఞానాలు, వాని వల్ల కలిగే దుఃఖం, అజ్ఞానం – దానివల్ల కలిగే తాపం – అంతా విడచి –

**(దివ్యం తవ పదయుగం ప్రాప్తం సుప్రభాతం మే త్వత్ప్రసాదా ద్దేహి)** పూర్వం చెప్పబడిన దుఃఖాలు తీరడంతోపాటు నేను తమ పాదాలను ఆశ్రయించడమనే ఫలప్రాప్తిని కల్గినది, కృపామాత్ర ప్రసన్నాచార్యులైన తమ అనుగ్రహంవల్లనే సిద్ధించేది, మహాఫలాన్ని అనుభవించే దివసానికి ఆరంభరూపమైనది అయిన సుప్రభాతాన్ని దాసునకు ప్రదానం చేయండి–అని భావం. లేక, **"ఏష జంతుః"** అని ప్రారంభించి **"దుఃఖే మగ్న స్సన్ కి మితి దూయతే?"** అని అన్వయించవచ్చు. తమనే అన్యసమాధితో **"ఏష జంతుః"** అని నిర్దేశించుకొని, **"కి మితి దూయతే?"** అని ఆచార్యులను ఉద్దేశించి నివేదిస్తున్నారని అన్వయించవచ్చు. అపుడు **"సర్వం త్యక్త్వా"** – నాదోషాన్ని అంతటినీ చూచినా, నిగ్రహబుద్ధి కలుగకుండేటట్లు సంకల్పించి, క్షమించి, **"త్వత్ప్రసాదాత్"** – తమ కాలుష్యం లేని స్వభావంచేతగాని, అనుగ్రహంచేతగాని, దివ్యం=అప్రాకృతమైన, ప్రాప్తం= స్వరూపాను రూపమైన, సుప్రభాతం=తమ అనుభవం సిద్ధించే గొప్ప దివసానికి ప్రారంభం అయిన, తవ పదయుగం – మీ పాదద్వయిని, మే= పూర్వం **"ఏష జంతుః"** అని నిర్దేశింపబడ్డ నాకోసం, దేహి=అనుగ్రహించండి – అని అర్థం చెప్పవచ్చు ఈ అన్వయం – స్తోత్రరత్నంలోని **"కిం తు త్వదగ్రే శరణాగతానాం పరాభవో నాథ! న తేఽనురూపః"** (కాని, స్వామీ! నిన్ను శరణు కోరినవారు నీ ముందే పరాభవాన్ని పొందడం నీకు తగదు) అనే సూక్తిని అనుసరిస్తూ చేయబడింది.



ఈ స్తోత్రంలో **"దివ్యం తత్పాదయుగ్మమ్"** అని, **"దివ్య మంఘ్రిద్వయమ్"** అని, **"దివ్యం ప్రాప్తం తవ పదయుగమ్"** అని అంటూ పలు మార్లు శ్రీపాదాల దివ్యత్వాది అభ్యాసం చేయడం ఆచార్యుని విషయంలో దివ్యత్వభావనతో అని చెప్పవలసి ఉన్నది. గురువు విషయంలో మానవత్వభావన కూడదని శాస్త్రంలో నిషేధింపబడింది. **"యో గురౌ మానుషం భావమ్"** (గురువు సామాన్య మానవుడనే భావాన్ని కలవాడు నశిస్తాడు) అనే భాగవతసూక్తి ఇక్కడ స్మరణీయం. **"యస్య సాక్షా ద్భగవతి జ్ఞానదీపప్రదే గురౌ, మర్త్యబుద్ధిః శ్రుతం తస్య సర్వం కుంజరశౌచవత్"** (ఎవనికి జ్ఞానదీపాన్ని అనుగ్రహించిన సాక్షాత్తు భగవానుడైన ఆచార్యుని విషయంలో మనుష్యత్వభావన ఉన్నదో, అతని జ్ఞానం అంతా గజస్నానం వలె నిష్ఫలం) అనే సూక్తి కూడా అనుసంధేయం, శ్లోకంలో **"ప్రాప్తుః"** అనే పాఠాంతరం యుక్తమే. ఇది **"మే"** అనే సర్వనామానికి విశేషణం. **"ప్రాప్తమ్"** అనే పాఠాన్ని పెద్దలు ఆదరించలేదు–అని శ్రీ.ప్ర.భ.అణ్ణాస్వామి వారి వ్యాఖ్య.

**10. యా యా వృత్తి ర్మనసి మమ సా జాయతాం సంస్మృతి స్తే**
**యో యో జల్ప స్స భవతు విభో నామసంకీర్తనం తే ।**
**యా యా చేష్టా వపుషి భగవన్ సా భవే ద్వందనం తే**
**సర్వం భూయా ద్వరవరమునే! సమ్యగారాధనం తే ॥**

వరవరమునే! = వరవరమునీ!, మమ=కర్మవశ్యుడనై నా, మనసి = **"చంచలం హి మనః"** (మనస్సు చాలా చంచలం కదా!), **"నిష్టవానిల్లా"** (నిలచిన రీతిలో నిలువని ) అని అస్థిరంగా ప్రసిద్ధమైన మనసులో, యా యా వృత్తిః= తన సామగ్రికి అనుగుణంగా ఏ యే జ్ఞానం, జాయతామ్=కలగడానికి తగినదో, సా=తన కారణవశంచేత తప్పకుండా కలిగే ఆ జ్ఞానం, తే=**"సుసుఖం కర్తుమ్"** (ఆచరించడానికి చాలా సుఖమైనది) అన్నట్లు స్మరణదశలోనే సుఖాన్ని కల్గించే తమయొక్క, స్మృతిః జాయతామ్= స్మరణరూపజ్ఞానంగా కలుగుగాక!, విభో! = స్వామీ!, మమ= నా యొక్క, యో యో జల్పః=తన కారణవశంచేత ఏయే అసంగతభాషణం నాకు కలగడానికి అవకాశం ఉన్నదో, సః=ఆ భాషణం, తే=కీర్తింపతగిన నీ యొక్క, నామసంకీర్తనం =తిరునామసంకీర్తనంగా అగుగాక! నాథ=భగవన్= షాడ్గుణ్యపూర్తిని కల స్వామీ!, మమ=కర్మపరవశుడనైన నాయొక్క, వపుషి= కుర్వద్రూపమైన శరీరంలో, యా యా చేష్టా=స్వకారణాధీనంగా ఏ యే

చలనాత్మకమైన వ్యాపారం జరగడానికి యోగ్యమో, సా=ఆ వ్యాపారం, తే=సర్వోత్కృష్టులైన మీ విషయంలో, వన్దనం భవేత్=ప్రణామరూపంగా అగుగాక!, సర్వం=ఇంతవరకు చెప్పిన, ఇంకా మిగిలిన, నా కర్మానుగుణంగా సంభవించడానికి అవకాశం ఉన్న వ్యాపారాలు అన్నీ, తే=తమకు, సమ్యక్ ఆరాధనం (భవేత్)=తమ విషయంలో ప్రీతిని కల్గించే వ్యాపారాలుగా అగుగాక!

వరవరమునీ! దాసునకు కలిగే మనోవృత్తి అంతా తమ సంస్మరణ రూపంగా కావాలి. దాసుడు వాక్కుద్వారా చేసే జల్పనాలన్నీ తమ తిరునామ సంకీర్తనాలు కావాలి. దాసుని సకలవ్యాపారాలు తమ తిరువారాధన రూపాలుగానే కావాలి. (అంటూ కొంతమంది శిష్యులు ప్రార్థించారు)

**(మనసి) – "చంచలం హి మనః"** (మనస్సు చంచలం కదా!) అని, **"నిన్టవానిల్లా నెఞ్జు"** (ఉన్నరీతిలో ఉండని మనస్సు) అని, **"అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్"** (మహా బాహూ! మనస్సును అరికట్టడం కష్టం. సందేహం లేదు. అది చంచలమైనది.) ఇత్యాదిగా చెప్పబడే చాంచల్యాది ధర్మాలను కల్గిన మనస్సులో అని భావం.

**(యా యా వృత్తిః జాయతే)**–అర్హతార్థంలో ఇచటి లోట్‌లకారం ప్రయోగింపబడింది.

**(సా)**–ఆ యా కారణాలవల్ల అవర్జనీయంగా కలిగే ఆ జ్ఞానం, **(తే సంస్మృతిః జాయతామ్)** స్మరిస్తే సుఖాన్ని కల్గించే మీ యొక్క అనే భావం. **"తే"** అనే సర్వనామ శబ్దం ద్వారా ద్యోతికం. ఇచటిలో ట్ ప్రార్థనార్థకం. **(యో యో జల్పః)** – స్వకారణవశంచేత ఏయే జల్పనాలు (ప్రేమతో **"విణ్ణోర్‌పరవుమ్"** అన్నట్లు) చేయబడతాయో అని భావం. పూర్వంవలె ఇక్కడాకూడా లోట్‌రూపం అర్హతార్థాన్నే తెలుపుతుంది.

**(మమ వపుషి) – "న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠత్యకర్మకృత్"** (ఎవడూ ఒక్క క్షణం కూడా ఏ పని చేయకుండా ఉండలేడు) అని అంటూ కుర్వద్రూపంగా చెప్పబడే నా శరీరంలో, **(యా యా చేష్టా)**–ఇంద్రియాల ఆయా హితాహితప్రాప్తి పరిహారాలరూపమైన చలనాలు అన్నీ.

**(భవేత్)** – ఇచటి లిఙ్ అర్హతార్థకం.



**(తే వందనం భవేత్)** ఈ లిఙ్ ప్రార్థనార్థకం.

**(సర్వం)** – ఇంతవరకు చెప్పినది, అంతా.

**(తే సమ్యగారాధనం భూయాత్)**–నిన్ను సంతోషపెట్టేది కావాలి. ఈ విధంగా **"శిన్దైయినాల్ శొల్లినాల్ శెయ్‌కైయాల్"** (మనస్సుతో, మాటతో, క్రియతో), **"మనసా వాచా కర్మణా"** అన్నట్లు స్మృతి–కీర్తన–ప్రణామ సమవాయరూపమైన మనోవాక్కాయాలనబడే త్రికరణాలద్వారా చేసే ఆరాధనం తెలుపబడినట్లయింది.

ఈ శ్లోకార్థానికి అనుగుణంగా **"ఆత్మనో హ్యతినీచస్య యోగిధ్యేయ పదార్హతామ్, కృపయైవోపకర్తార మాచార్యం సంస్మరే త్తదా"** (అతి నీచుడైన ఆత్మకు యోగులు సైతం ధ్యానించే అర్హతను కృపతో కల్గించే ఆచార్యుని స్మరించాలి), **"యచ్చ తదర్థం తద్విష్ణో రారాధనా త్పరమ్"** (ఆచార్యుని ఆరాధన భగవదారాధన కంటే గొప్పది) ఇత్యాది సూక్తుల భావం అనుసంధేయం. **"జాయతామ్"** ఇత్యాది క్రియాపదాలను ఆవృత్తి చేసికోకుండా **"మనసి యా యా వృత్తిః, యద్యత్ జ్ఞానమ్ సా తే సంస్మృతి ర్జాయతామ్ తత్ జ్ఞానం త్వత్ స్మృతిరూపం సదుత్పద్యతామ్ ఇత్యాది రర్థః"** (దాసుని మనస్సులోకలిగే జ్ఞానమంతా తమ తలపుగానే, నోటిలో వచ్చే మాటలన్నీ తమ నామసంకీర్తనాలుగానే, దేహంతోచేసే క్రియలన్నీ తమ ఆరాధనగానే కావాలి) – అంటూ అర్థం చెప్పడంకూడా తగినదే. **"జాయతామ్, భవేత్"** అనే క్రియారూపాల లకారాన్నిమార్చి **"జాయతే, భవతి"** అనికూడా అన్వయించ వచ్చునని వాధూలవీరరాఘవాచార్య వ్యాఖ్య. **"మమ స్వైరచారః త్వదారాధనవ త్ప్రీతికరః స్యాత్"** – నేను నా ఇష్టం వచ్చినట్లు చేసే స్వైరచారం తమ ఆరాధనవలె ప్రీతికరం అగుగాక – అని వ్యాఖ్యానించడం సంస్మృతి మొదలైన పదాలకు ఆరీతిలో లక్షణార్థం చెప్పడం పొసగదు కాబట్టి, స్తోత్రకర్త అధికారానికి, అత్యంతపారతంత్ర్యానికి అది తగదు కాబట్టి, సంప్రదాయవిరుద్ధం కాబట్టి, స్వైరచారం లోకక్షోభానికి హేతువు కాబట్టి తగినది కాదు. **"జాయతామ్, భవేత్"** అనే క్రియారూపాల లకారాన్ని మార్చి **"జాయతే, భవతి"** అని కూడా అన్వయించ వచ్చునని వాధూల వీరరాఘవాచార్య స్వామివారు తమ వరవరముని శతకవ్యాఖ్యలో ఈ శ్లోకాన్ని వివరిస్తూ **"అత్ర క్రియాపేక్షాయా ముపస్థితజనిధాతో రేవ విభక్తివిపరిణామేన జాయత ఇతి లభ్యతే. భవతు–భవేత్ ఇత్యత్రాపి భవతీతి లభ్యతే"** అని సూచించారు. ఆయా లౌకిక స్మృతులను, జల్పనాలను, చేష్టలను

కల్గించే కారణాలే వానిని కల్గించకుండా, వరవరమునులనుగూర్చిన స్మృత్యాదులను కల్గించేటట్లు వాటిని చేయగల్గిన శక్తి, ప్రాప్తి మొదలైన గుణాలను కల్గినవారు వరవరమునులు అనే విషయం **"భగవన్!, విభో!"** అనే సంబోధనలద్వారా ధ్వనిస్తుంది.

**11. అపగతమదమానై రంతిమోపాయనిష్ఠై -**
**రధిగతపరమార్థై రర్థకామానపేక్షైః ।**
**నిఖిలజనసుహృద్భిః నిర్జితక్రోధలోభైః**
**వరవరమునిభృత్యై రస్తు మే నిత్యయోగః ॥**

మే=ఇంతకాలంగా దుష్ట సహవాసాన్ని చేసిన నాకు, అపగతమదమానైః=గర్వం, అహంకారం మొదలైన వానిని లేనివారై, అంతిమోపాయనిష్ఠైః= భాగవతాభిమానమనే చరమోపాయనిష్ఠను కలవారై, అధిగతపరమ+అర్థైః=చక్కగా ఆకళింపు చేసికొని, అనుష్ఠించిన భాగవతకైంకర్యమనే పరమపురుషార్థాన్ని కలవారై, అర్థకామ+అనపేక్షైః =ఉపాయాంతరాపేక్షను, ఉపేయాంత రాపేక్షను లేనివారై, నిఖిలజనసుహృద్భిః=అనుకూల - ప్రతికూల - మధ్యస్థులనే అందఱి మంచిని కోరేవారై, నిర్జితక్రోధలోభైః=కోపం, ఇంద్రియలోలత మొదలైన మనోదోషాలను లేనివారైన, వరవరమునిభృత్యైః=మణవాళ మహామునుల శిష్యులైన వరదనారాయణగురువు మొదలైనవారితో, నిత్యయోగః=పాదరేఖాదులవలె ఏనాడు విశ్లేషింపకుండా ఉండే నిత్యసంశ్లేషం, అస్తు=కలుగుగాక!

విషయభోగాలవల్ల కల్గిన మదం, దురభిమానం లేనివారు, ఆచార్యాభిమానమే ఉత్తారకమని శ్రీవచనభూషణదివ్యగ్రంథంలో చరమోపాయంగా నిశ్చయింపబడ్డ అంతిమోపాయంలో శ్రద్ధను కలవారు, సకలశాస్త్రసారార్థాలను కైవసం చేసికొన్నవారు, ధర్మమోక్షాలు తప్ప అర్థకామాలలో ఆశ లేనివారు, ఎవరి విషయంలోను అసూయ లేకుండా, అందఱి విషయంలో మైత్రిని కల్గి ఉన్నవారు, క్రోధాన్ని, లోభాన్ని జయించినవారు అయిన వరవరమునిశిష్యులతో దాసునకు నిత్యసంబంధం కలగాలి-అని మఱికొందఱు భక్తులు ప్రార్థించారు.

**(అపగతమదమానైః)** మానమంటే గర్వం. పెద్దవారిని అవమానించడానికి కారణమైనది ఈ అహంకారం.



**(అంతిమోపాయనిష్ఠైః)**-అంతిమోపాయమంటే తదీయాభిమానం. ఈ నిష్ఠ పూర్వం తెలిపిన మదం,మానం తొలగినపుడు ఏర్పడుతుంది. అందువల్ల మొదటి పాదంలోని రెండు విశేషణాలకు కార్యకారణభావరూపసంబంధం భావ్యం. **(అధిగతపరమార్థైః)** సంపూర్ణంగా పొందిన, తమ ఉత్కర్ష ఏమాత్రం లేని భాగవతకైంకర్యమనే పురుషార్థాన్ని కలవారిచే-అని అర్థం. అంతిమోపాయనిష్ఠకు అనురూపమైన ఉపేయమే ఈ కైంకర్యం.

**(అర్థకామానపేక్షైః)** **"యత్ర నాన్య త్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా"** (ఏ పరమాత్మను పొందినవాడు వేఱొకటిని దర్శించడో, వినడో, తెలియడో, ఆ పరమాత్మ భూమాశబ్దవాచ్యుడు) అని, **"స్థితేఽ రవిందే మకరందనిర్భరే మధువ్రతో నేక్షురకం హి వీక్షతే"** (తేనె నిండుగా కల పద్మంలో ఉన్న తుమ్మెద గడ్డిపూవు వైపు చూడదుకదా) అనే రీతిలో ఉత్తమపురుషార్థం లభించిన తర్వాత వేఱొక అల్పపురుషార్థంలో అపేక్ష ఉండదుకదా. అందువల్ల లౌకికమైన అర్థాన్ని, కామాన్ని కోరరు. అర్థం - ఉపాయం, కామం - ఉపేయం - కాబట్టి వేఱొక ఉపాయాన్ని, ఉపేయాన్ని ఆశించనివారనికూడా అర్థం.

**(నిఖిలజనసుహృద్భిః)- "శోభనశంసీ సుహృత్"** - మంచిని కలగాలని కోరేవాడు సుహృత్తు. నిఖిలజనులంటే అనుకూల - ప్రతికూల - మధ్యస్థులు. వీరు పరమపురుషార్థాన్ని కోరేవారు, లౌకికపురుషార్థాన్ని కోరేవారు, కైవల్యాన్ని కోరేవారు- అని మూడు విధాలుగా ఉంటారు. వీరందఱి విషయంలోను సుహృత్తు - అని భావం. లేక, అర్థకామాలకోసం లౌకికజనాలను ప్రార్థించేవారి విషయంలో కూడా**"సుహృదం సర్వభూతానామ్"** (ప్రాణులందరికీ సుహృత్) అని కీర్తించిన రీతిలో హితాన్ని కోరేవారు.

**(నిర్జితక్రోధలోభైః)**- క్రోధలోభాలు లేవని చెప్పినందువల్ల వీరు తమకు సహజంగా ఉన్న సర్వభూతహితైషిత్వంచేత తమ దగ్గరకు వచ్చినవారు తెలిసి గాని, తెలియక గాని చేసే అవమానాలకు కోపించరని, తమ సొత్తును ఇతరుల హితకోసం మనఃపూర్వకంగా వినియోగిస్తారని ఏర్పడుతున్నది.

**(వరవరమునిభృత్యైః)** - అంతరంగశిష్యులైన వాధూలవరదనారాయణ ప్రభృతులచే-అని భావం. వీరు పొందే భృతి కైంకర్యమే.

**(నిత్యయోగః)** పాదుకలవలె, పాదరేఖలవలె నిత్యసంశ్లేషాన్ని కల్గి ఉండాలి. భరద్వాజసంహితలోని – **"విశ్లేషా ద్విష్ణుభక్తేషు దంభం లోభం నృశంసతామ్, క్రోధ మీర్ష్యాం మదం మానం సామ్యం చ పరివర్జయేత్, ప్రపన్నై శ్చాన్యభజనాద్యుక్తా పాయ సమన్వితైః, వైష్ణవో వర్జయే త్సంగం ప్రచ్యుతా స్తే హ్యవైష్ణవాః, అభక్త మచ్యుతస్యాపి నావమన్యేత కంచన, హితం వా బోధయేత్, సాధో ర్ద్రద్యా ద్వా కించి దీప్సితమ్"**(విష్ణుభక్తుల విషయంలో దంభం,లోభం,దయారాహిత్యం, క్రోధం, ఈర్ష్య, మదం, దురభిమానం, వారితమతో సమంగా భావించడం అనేవి కూడదు. వేఱొక దైవాన్ని సేవించడం అనే లోపాన్ని కల్గిన శ్రీవైష్ణవులను సేవించరాదు. వారు వైష్ణవులు కారు), **'విశిష్టపరమైకాంతీ జ్ఞానవైరాగ్యభక్తితః, తాదృశై రేవ కుర్వీత సహసంకథనాదికమ్"** (జ్ఞానవైరాగ్యభక్తులవలన గొప్ప పరమైకాంతులు అయిన వారితోనే కలసి భాషించాలి) అని, **"గురౌ తత్ప్రియవత్సలః"** అని ఇత్యాది భారద్వాజవచనాలు ప్రకృతంలో అనుసంధేయాలు.

ఈ శ్లోకవ్యాఖ్యానంలో వాధూల వీరరాఘవాచార్యస్వామివారు అద్భుతమైన కొన్ని విశేషాలు అనుగ్రహించారు. **"ఉన్మీలత్పద్మ"** అనే ఆఱవ శ్లోకంనుండి **"అస్తు మే నిత్యయోగః"** అనే 11వ శ్లోకం చివరవరకు గల ఆఱు శ్లోకాల్లో క్రమంగా 1.తమ శిరస్సులో స్వాచార్యులు వారి శ్రీచరణాలను పెట్టాలని ప్రార్థించడం, 2. ఆ ఆచార్యులే తమకు సకలవిధబంధువులనే నిశ్చయాన్ని తెలుపడం, 3. ఆ ఆచార్యులపట్ల సర్వదేశ–సర్వదేహ–సర్వకరణాల్లో ఎల్లప్పుడు భాసించే, ప్రయోజనసహితమైన భావనాప్రకర్షను ప్రార్థించడం, 4. ఆ ఆచార్యుల అనుగ్రహంవల్ల సకలవిరోధులు తొలగాలని ప్రార్థించడం, 5. వారి విషయంలో సకలవిధకైంకర్యాలు నిర్వర్తించాలని ప్రార్థించడం 6. ఆ కైంకర్యవృద్ధికి హేతువైన తదీయనిత్యయోగాన్ని ప్రార్థించడం తెలుపబడ్డాయి.

ఇవన్నీ వాస్తవానికి ద్వయమంత్రతాత్పర్యార్థ విషయాలే. **"షట్పదోఽయం ద్విఖండః"** అని కీర్తింపబడే ద్వయంలో ఆఱు పదాల తాత్పర్యార్థాలే ఇవి. ఆ సంఖ్యలోనే ఇవి ప్రతిపాదింపబడ్డాయికూడా. సంగ్రహంగా వానిని ఈ రీతిలో చెప్పవచ్చు. ద్వయ పూర్వార్ధంలోని **"చరణౌ శరణం ప్రపద్యే"** అనే భాగంయొక్క అర్థం **"ఉన్మీలత్పద్మగర్భ"** ఇత్యాది శ్లోకంలోని **"పాదయుగ్మం దిశతు"** అనే సూక్తి ద్వారా తెలుపబడింది. **"ప్రార్థనామతిః శరణాగతిః"** అనికదా నిర్వచనం. **"దిశతు"**



అనే లోట్‌రూపం ప్రార్థనార్థకమే కదా! **"త్వం మే బంధుః"** అనే శ్లోకంద్వారా నారాయణశబ్దార్థం అనుసంధింపబడింది. సుబాలోపనిషత్తు **"మాతా పితా భ్రాతా...సుహృద్గతిః శరణం నారాయణః"** (నారాయణుడు తల్లి, తండ్రి, సోదరుడు... స్నేహితుడు, గతి, శరణం) అని నారాయణశబ్దార్థం సర్వవిధ బంధుత్వమని తెలిపిందికదా! **"అగ్రే పశ్చాత్"** అనే శ్లోకంద్వారా చతుర్థీవిభక్తిచేత చెప్పబడిన కైంకర్యప్రార్థనవల్ల ఆక్షిప్తమైన పరమభక్తి తెలుపబడింది. **"కర్మాధీనే"** ఇత్యాది శ్లోకంద్వారా నమశ్శబ్దార్థం ప్రతిపాదితం. అంటే, విరోధినివృత్తి ప్రార్థన తెలుపబడింది. **"యా యా వృత్తిః"** అనే శ్లోకం చేత చతుర్థీవిభక్తి ద్వారా లక్షింపబడ్డ కైంకర్యం చెప్పబడింది. **"అపగత"** ఇత్యాది శ్లోకంద్వారా కైంకర్యప్రతి సంబంధిత్వతాత్పర్యంచేత సూచింపబడ్డ నారాయణ శబ్దార్థంకాని, నమశ్శబ్దార్థం కాని చెప్పబడింది. ఆయా శ్లోకాల్లో లోట్‌లకారాలతో ప్రయోగింపబడ్డ క్రియా రూపాలద్వారా అధ్యాహృతమైన **"అమ్"** పదార్థం చెప్పబడింది.

**12. ఇతి స్తుతినిబంధేన సూచితస్వమనీషితాన్ ।**
**భృత్యాన్ ప్రేమార్ద్రయా దృష్ట్యా సించంతం చింతయామి తమ్ ॥**

ఇతి=పూర్వం ఆఱు శ్లోకాలలో (6–11 శ్లోకాలు) విన్నపించిన రీతిలో, స్తుతిని బంధేన= వరవరమునుల విషయంలోని స్తోత్రరూపప్రబంధంతో, సూచిత స్వమనీషితాన్=తమ తమ కోఱికలను వ్యక్తంచేసిన, భృత్యాన్=క్రయవిక్రయార్హతను కల కోయిలణ్ణన్ మొదలైన శిష్యులను, ప్రేమార్ద్రయా=అనురాగంతో చల్లగా ఉన్న, దృష్ట్యా=కటాక్షవిశేషంతో, సించంతమ్=తడుపుతున్న, తమ్=ఆ మణవాళ మహామునులను, చింతయామి=(ఎల్లప్పుడు) ధ్యానిస్తున్నాను.

ఇంతవరకు స్వాచార్యులైన మణవాళమహామునులను గూర్చిన దినచర్య అనే స్తుతిప్రబంధాన్ని అనుగ్రహించిన ఎఱుమ్బియప్పా, ఇక ఆ స్తోత్రంవల్ల ప్రీతిని పొందిన మణవాళ మహామునులను అనుభవిస్తున్నారు (ధ్యానిస్తున్నారు).

**''ఉన్మీలత్పద్మగర్భద్యుతితలమ్''** అనే శ్లోకంనుండి ప్రారంభించి **"అపగతమదమానైః"** శ్లోకంవరకుగల ఆఱు శ్లోకాలతో స్తుతించడంద్వారా తమ తమ మనోరథాలను తెలియజేసే దాసులను చల్లని కటాక్షంతో అనుగ్రహించే వరవరమునులను సదా మనస్సులో ధ్యానిస్తున్నాను.

**(ఇతి)** ఈ విధంగా–అనే అర్థం ఇచ్చే ఈ పదం గత ఆఱు శ్లోకాలలోని అర్థాన్ని పరామర్శిస్తుంది. శబ్దస్వరూపాన్ని కాదు. గత ఆఱు శ్లోకాల్లో తెలుపబడ్డ భావం ప్రధానం. అది ఏ శబ్దాలద్వారా తెలియజేసినా తెలియజేయవచ్చునని తాత్పర్యం. **"త్వం మే బంధుః"** ఇత్యాది నాల్గు శ్లోకాలు వరవరమునిశతకంలో కూడా ఉన్నాయి. అవి ఇక్కడ సందర్భానుసారంగా కూర్చబడ్డాయి. వీటిని వేఱొకరు రచించిన ప్రసిద్ధి లేదు. అందువల్ల ఇవి అన్యకర్తృకాలు కావు. లేక, ఎఱుమ్బియప్పాపట్ల ఉండే గౌరవంవల్ల వాటిని మిగిలినవారు యథాతథంగా అనువదించారనికూడా చెప్పవచ్చు

**(సూచితస్వమనీషితాన్)– "స్వమనీషితాని–స్వగతానుసంధానాని"** అని సంస్కృత వ్యాఖ్యా వివరణం. ఆయా శిష్యుల అనుసంధానాన్ని ఈ ప్రయోగం తెలుపుతుంది. ఈ ఆఱు శ్లోకాలలో **"దివ్యం తత్పాదయుగ్మం దిశతు"(6), "తవ పదయుగం దేహి"(9), "అంఘ్రిద్వయం పశ్యన్ పశ్యన్"** (8) అనే మూడు శ్లోకాల్లో వరవర మునులు తమ పాదాలను శిరస్సుపై పెట్టి అనుగ్రహించాలని, వానిని ఎప్పుడూ తాము సేవించాలని ప్రార్థించడంవల్ల, మిగిలిన మూడు శ్లోకాలలో ఆ ప్రార్థన అంతర్గతంగా ఉన్నదని చెప్పడం యుక్తం. కాబట్టి, ఈ ఆఱు శ్లోకాలు అష్టదిగ్గజాలలో కోయిలణ్ణన్, వానమామలైజీయర్ అనే ఇద్దఱు తప్ప, ఎఱుమ్బియప్పా, తిరువేఙ్గడ జీయర్, పరవస్తుపట్టర్ పిరాన్ జీయర్, ప్రతివాది భయంకరం అణ్ణన్, అప్పిళ్ళై, అప్పుళ్లార్–అనే ఈ ఆఱుగురు ఒకొక్కరు ఒక్కొక్క శ్లోకాన్ని అనుసంధించారని చెప్పవచ్చు. కోయిల్ కన్దాడై అణ్ణన్ సదా వరవరమునులను మోసే పాదుకలుగా, వానమామలై జీయర్ శ్రీపాదాలను విడచి ఉండని పాదరేఖగా ప్రసిద్ధులైనందున, ఏ సమయంలోను వరవరమునుల పాదాలను విడచి ఉండని వీరు మామునుల శ్రీపాదాలను తలతో ధరించాలని, వానిని ఎల్లప్పుడూ సేవించాలని ఆశపడరు కదా. **"పాదతద్రేఖాభూతయో ర్వరదనారాయణరామానుజమున్యోః పాదయుగ్మ ప్రదానాదిప్రార్థనానపేక్షయా షణ్ణా మేవ చ ప్రకృతస్తుతా వన్వయ ఇతి స్ఫోరణాయ శ్లోకానాం షట్సంఖ్యాశ్రయణమ్"** అందువల్లనే ప్రకృతసందర్భంలో ఆఱు శ్లోకాల అనుసంధానమని చెప్పవచ్చునని వాధూల వీరరాఘవాచార్య వ్యాఖ్య. ఈ ఆఱింటిలో ఎఱుమ్బియప్పా ఒక శ్లోకాన్ని, మిగిలిన అయిదుగురు వీరిమీద ఉండే గౌరవంవల్ల, అయిదు శ్లోకాలను అనుసంధించారని చెప్పాలి.



**(భృత్యాన్) "ఎమ్మై విఱ్కవుమ్ పెరువార్కళే"** (భాగవతులు మమ్ములను అమ్మగల్గినవారు కూడా) అన్నట్లు తమను క్రయవిక్రయార్హమైన వారినిగా తలచేవారిని–అని భావం.

**(ప్రేమార్ద్రయా)**–స్నేహం చేత ఆర్ద్రమైన–అని అర్థం. దీనివల్ల పూర్వం **"త్వం మే బంధుః"** ఇత్యాది శ్లోకంద్వారా భృత్యులు అనుసంధించిన సకలవిధబంధుత్వంలో సఖిత్వమే వరవరమునుల హృదయంలో ముఖ్యంగా నెలకొని ఉన్నదని ధ్వనిస్తున్నది. **(సించంతమ్)– "దూయతే జంతు రేషః"** అన్న సూక్తికి అనుగుణంగా ఈ పదం ప్రయోగించబడింది. తాపాన్ని పొందేవానికేకదా చల్లబడవలసిన అవసరం ఉన్నది.

**(చింతయామి)– "తాపార్తో జలశాయినమ్ ఇతి న్యాయేన సించతః చింతనం హి తాపశాంతిహేతు రితి భావః"** – తాపార్తుడు సముద్రంలో శయనించి ఉన్న భగవానుని రూపాన్ని స్మరించాలి – అనే రీతిలో చల్లబఱచేవానినిగూర్చి చింతించడం తాపశాంతికి కారణమవుతుంది కదా! – అని వీరరాఘవాచార్య వ్యాఖ్య. **"ప్రేమార్ద్రయా దృష్ట్యా సించంతమ్"** అనే ప్రయోగంవల్ల ఇతరులు తమను పొగడినందువల్ల కల్గిన ఆనందంవల్ల కాదు; సహజమైన స్నేహభావంతోనే చల్లగా చూచారని ఏర్పడుతున్నది. దీనివల్ల **"స్తూయమానో న హృష్యే త్తు"** (ఇతరులు చేసే స్తుతికి యతి హర్షించరాదు) అనే శాస్త్రార్థం అనుష్ఠింపబడి నట్లయినది.

**13. అథ భృత్యా ననుజ్ఞాప్య కృత్వా చేత శ్శుభాశ్రయే ।**
**శయనీయం పరిష్కృత్య శయానం సంస్మరామి తమ్ ॥**

అథ=పూర్వం తెల్పిన రీతిలో శిష్యులకు తత్త్వార్థాలను ఉపదేశించడంద్వారా రెండు జాములు గడచిన తర్వాత, భృత్యాన్=శిష్యులకు, అనుజ్ఞాప్య=అనుజ్ఞను ఇచ్చి, చేతః=తమ మనస్సును, శుభాశ్రయే= చిత్తాన్ని ఆకర్షించే భగవద్రూపంలో, కృత్వా=లగ్నం చేసి, శయనీయం=పడుకను, పరిష్కృత్య=అలంకరించి, శయానమ్= శయనించి ఉన్న, తం=ఆ వరవరమునులను, సంస్మరామి= స్మరిస్తున్నాను.

పైరీతిలో శిష్యులను అనుగ్రహించిన తరువాత వారికి అనుజ్ఞను ఇచ్చి, తమ మనస్సును **"శిన్దనైక్కినియాన్"** (భావనకు భోగ్యమైనవాడు) అని పల్కినరీతిలో చింతనకు మధురంగా ఉండే స్వారాధ్య దేవతారూపంలో లగ్నం చేసి, పడుకను సరిచేసికొని, పరుండి ఉన్న వరవరమునులను స్మరిస్తున్నాను.

**(అథ)** పూర్వం తెల్పిన దిశలో రెండు జాముల పొద్దువరకు కాలాన్ని గడిపిన తర్వాత–అని భావం. వరవరమునికావ్యంలోకూడా ఎఱుమ్బియప్పా– **"సరసమనసః సర్వాన్ సర్వోత్తరా నభినందయన్"** (సరసమైన మనస్సును కల గొప్పవారైన ఆ అందఱు శిష్యులను బాగా ఆనందింపజేసి) అని తెలిపారు. **(అనుజ్ఞాప్య)** ఇచటి ణిజంతార్థం అవివక్షితం అని చెప్పవచ్చు. లేక, శిష్యుల విషయంలోకూడా తమకున్న **"ప్రేమార్ద్రయా"** అనే పదంద్వారా సూచింపబడ్డ సఖిత్వభావనచేత అనుమతింపబడి– అనే అర్థంలో ఈ ణిజంతరూపం ప్రయోగింపబడిందని అనవచ్చు. **"కృత్వా చేతః శుభాశ్రయే"** అనే సూక్తిద్వారా రాత్రిసమయంలో చేయవలసిన భగవద్ధ్యానం అనబడే యోగం సూచింపబడింది. **"తతః కనకపర్యంకే"** అంటూ ముందు చెప్పబడ్డ భగవద్ధ్యానానికి తగిన ఆసనాన్ని విడచి లేచి, స్తోత్రం చేసే శిష్యులను కటాక్షించి, వారికి అనుజ్ఞను ప్రసాదించి, పర్యంకానికి అలంకారంగా వేంచేసిఉండి, భగవానుని ధ్యానిస్తూ వరవరమునులు కనులు మూసికొంటారు. మామునులకు శుభాశ్రయం వారి అర్చామూర్తికాగా, ఎఱుమ్బియప్పాకు శుభాశ్రయం మామునుల తిరుమేని. యతీంద్ర ప్రవణులుగా ప్రసిద్ధి చెందిన వరవరమునులు భగవానుని ధ్యానించడం యతీంద్రులైన భగవద్రామానుజుల సంతోషం కోసం. సౌమ్యజామాతృయోగీంద్ర చరణాంబుజషట్పదులైన వీరు సౌమ్యజామాతృయోగీంద్రులను ధ్యానించడం తమను వరవరమునుల శ్రీపాదాలను ఆశ్రయించేటట్లు చేసిన, తమ ఆరాధనలోని అర్చామూర్తి అయిన శ్రీరామచంద్రమూర్తి సంతోషం కోసం–అని భావం. ఇచట అనుసంధేయమైన ఐతిహ్యం ప్రవేశికలో ప్రస్తుతపూర్వం.

శుభాశ్రయపదానికి విశేషణంగా ప్రయోగింపబడ్డ పూర్వదిన చర్యాస్తోత్రం లోని **"పుష్కరేక్షణే పురుషే"** ఇత్యాది ప్రయోగాన్ని అనుసంధించాలి.

**(పరిష్కృత్య)**– పర్యంకాసనంనుండి లేచి, శయనాన్ని చేరడంద్వారా పరిష్కరించి– అని భావం. దీన్నిబట్టి, పూర్వం చెప్పబడిన, యోగానికి తగిన ఆసనంనుండి లేచి శయనాన్ని చేరి–అని అర్థం. వరవరమునికావ్యంలో ఈ సందర్భం **"తత స్సజ్జీకృతం భృత్యైః శయనీయం విభూషయన్"** (తరువాత శిష్యులు సిద్ధం చేసిన శయ్యను అలంకరిస్తూ) అని వర్ణింపబడింది. దీనివల్ల భృత్యులు పడిన శ్రమ సఫలం కావాలనే ఉద్దేశ్యంతోనే తప్ప, పడుకమీద శయనించాలనే ఆశతో కాదని ధ్వనిస్తుంది.



**"శయనీయం పరిష్వజ్య"** అనే పాఠాంతరం అర్థస్వారస్యం లేనందువల్ల, వరవరమునికావ్యంలో ఈ సందర్భాన్ని వర్ణించేటపుడు **"పరిష్వజ్య"** అనే పదానికి సమానార్థకమైన పదం లేనందువల్ల ఉపేక్షించవలసినదే. శుభాశ్రయంలో మనస్సును నిలుపడం, పరుండడం – రెండూ సమకాలంలోనే అని ఏర్పడడంవల్ల యతిధర్మసముచ్చయంలో శౌనకుడు తెలిపిన **"శరణం న కుర్యాత్, న కారయేత్, కృతం ప్రవిశేత్, అథ బ్రహ్మోపాసీత, తచ్చిత్త ఏవ శయీత"** అనే అంశం ఆచరించినట్లయింది.

**(సంస్మరామి)** – ఈ క్రియారూపం సందర్భోచితం. **"అనుజ్ఞాప్య"** అనే పదంద్వారా భృత్యులు బయటకు వెడలిపోవడం తెలుపబడ్డంచేత, తర్వాత దర్శనం కలిగే అవకాశం లేదు కనుక, స్మరణం మాత్రమే సాధ్యం కాబట్టి, **"శ్రీమాన్ సుఖసుప్తః"** అనే రీతిలో నిద్రాకాలికమైన తిరుమేని సౌందర్యాన్ని మనస్సులో భావిస్తూ, స్మరిస్తున్నానని ఇక్కడి తాత్పర్యం. వరవరమునులు ఆదిశేషుల అవతారం కాబట్టి అప్రాకృతమైన వారి తిరుమేని. సౌందర్యం వారి నిద్రించే కాలంలో ద్విగుణీకృతం అవుతుంది కదా!

**(14) దినచర్యా మిమాం దివ్యాం రమ్యజామాతృయోగినః ।**
**భక్త్యా నిత్య మనుధ్యాయన్ ప్రాప్నోతి పరమం పదమ్ ॥**

ఇమామ్=**"పరేద్యుః పశ్చిమే యామే"** అని ప్రారంభించి, **"శయానం సంస్మరామి తమ్"** అనే సూక్తివరకు ప్రతిపాదింపబడ్డ, దివ్యాం=అప్రాకృతమైన, రమ్యజామాతృయోగినః=శుద్ధసత్త్వస్వరూపులైన వరవరమునులయొక్క, దినచర్యామ్= అనుష్ఠాన రూపమైన దినచర్యాస్తోత్రాన్ని, ప్రతిదినం=ప్రతిదినం, భక్త్యా=భక్తితో (గొప్ప ప్రీతితో), అనుధ్యాయన్=అనవరతం అనుసంధిస్తున్నవాడు, పరమం పదమ్=పరమపదాన్ని, ప్రాప్నోతి =పొందుతున్నాడు.

ఇది ఫలశ్రుతిశ్లోకం. ఈ దినచర్యా స్తోత్రాన్ని అనుసంధించినందున కలిగే ఫలాన్ని తెలుపుతున్నది. పూర్వదినచర్యలోని మొదటి 13 శ్లోకాలు ఉపోద్ఘాతమనే అంశం ఇంతకు ముందే చెప్పబడింది. 14వ శ్లోకంనుండి ఈ ఉత్తరదినచర్యలోని 13వ శ్లోకంవరకు గల భాగమే ఈ దినచర్యా స్తోత్రం. వరవరమునుల విషయంగా రచింపబడ్డ, ఈ దివ్యమైన దినచర్యాస్తోత్రాన్ని నిత్యం అనుసంధించేవారు సద్గతిని పొందుతారు – అని భావం.

**(ఇమామ్)**–పూర్వోక్త శబ్దసందర్భాన్ని అని, లేక, అర్థక్రమాన్ని–అని అర్థం చెప్పవచ్చు.

**(దివ్యామ్) "దివి భవాం–దివ్యామ్"** సంసారదోషం ఏ మాత్రం లేని నిత్యవిభూతిలో మాత్రమే సాధ్యమైన, ఈ సంసారమండలంలో దుర్లభమైన–అని భావం. భాగవతపారమ్యరూపధర్మం అత్యంతం దుర్లభమనే విషయం భరద్వాజపరిశిష్టంలో ఈ విధంగా తెలుపబడింది. **"సుసూక్ష్మత్వా ద్దురాపత్వా న్మహత్వా ద్గౌరవా దపి, మయాఽయం పరమో ధర్మః ప్రోక్త స్సిద్ధ్యై పునః పునః"** (అత్యంతం సూక్ష్మమైనందువల్ల, పొందడానికి వీలు కానిది అవడంవల్ల, గొప్పది అవడంవల్ల, గౌరవంవల్ల నేను ఈ పరమధర్మాన్ని అది సిద్ధించడం కోసం మాటిమాటికి చెప్పాను) అని, **"పరమైకాంతినాం ధర్మః కృతే పూర్ణః ప్రవర్తతే, క్షీయమాణః క్రమేణాయం కలౌ స్థాస్యతి వా న వా, నానాకామాన్వితజ్ఞానా నానుదైవతయాజినః, నరా భగవదైకాంత్యం నాస్థాస్యంతి కలౌ యుగే, పరం భాగవతం వర్త్మ దృష్ట్వాపి కలిమోహితాః, ప్రభవంతి న విద్వాంస స్త్యక్తుం పూర్వానువర్తినీమ్, భవిష్యంతి కలౌ కేచిత్ క్వచిదేకాంతినో హరౌ, మోహయిష్యంతి చ పరే కుతర్కై స్తాన్ కుదృష్టయః"** (కృతయుగంలో ఈ పరమైకాంతిధర్మం పూర్ణంగా ఉంటుంది, కాని, ఇది క్రమంగా క్షీణిస్తూ కలియుగంలో ఉందా? లేదా? అనే స్థితికి చేరుకుంటుంది. పలు కోరికలతో కూడుకొన్న జ్ఞానాన్ని కల,  వారు, పలువురు దైవాలను కొలిచేవారైన నరులు పూర్వమార్గాన్ని విడువలేరు. భగవంతుణ్ణి మాత్రమే ఆరాధించే గొప్పదైన భాగవతమార్గాన్ని చూచికూడా మోహాన్ని పొందుతారు.  ఎక్కడో ఒకచోట ఎవరో ఒకరు మాత్రం హరివిషయంలో అవ్యభిచారి అయిన భక్తిని కల్గి ఉంటారు. మఱి కొందఱు వారిని తమ కుతర్కాలతో మోసగిస్తారు) అని చెప్పబడింది.

లేక, **"దివ్యామ్"** – అనే విశేషణానికి **"దివ్యశాస్త్రగణేషు చ"** అని, **"దివ్యాగమ మథాపి వా"** అని ప్రశంసింపబడే పాంచరాత్రదివ్యశాస్త్ర సిద్ధమనే అర్థాన్నికూడా చెప్పవచ్చు.

**(రమ్యజామాతృయోగినః)** – యోగిపదస్వారస్యాన్నిబట్టి నిష్కృష్టసత్త్వగుణం మాత్రమే కల్గిన వరవరమునులనే అర్థాన్ని చెప్పవచ్చు.

**(దినచర్యామ్)** – పగటి కాలంలో, రాత్రికాలంలో వరరవరమునుల అనుష్ఠానాన్ని ప్రతిపాదించే స్తుతిని – అని భావం. వాసవదత్తాది శబ్దాల్లోవలె ఔపచారికంగా



ఈ పదం దినచర్యను వర్ణించే స్తోత్రకావ్యాన్ని తెలుపుతుంది. లేక, అహోరాత్ర క్రియను – అనే వాచ్యార్థాన్ని కూడా గ్రహించవచ్చు.

**"దినచర్యామ్"** అనే నామంలో పగటికాలాన్ని నిర్దేశించే దినశబ్దంమాత్రం ప్రయోగింపబడినా, (రాత్ర్యాదిశబ్దసమభివ్యాహారం లేకపోయినా) అది అహోరాత్రులను రెండిటిని తెలుపుతుంది. అట్లే, రాత్ర్యాది శబ్దాలు దినాదిశబ్దాలలో కలిసి ప్రయోగింపబడకున్నా అహోరాత్రులను రెండింటిని తెలుపుతాయి. ఈ విషయం **"షడహై ర్మాసా భవంతి", "త్రిస్రో రాత్రి ర్న దుహంతి"** మొదలైన ప్రయోగాలవల్ల సిద్ధం. లేక, "అహోరాత్రి సమయాల్లో నిర్వర్తించవలసిన అభిగమనాదులు అయిదు కర్మల్లో పగటి కాలంలో నిర్వహించవలసిన కర్మలు ఎక్కువగా ఉన్నందువల్ల ప్రాచుర్యాన్ని బట్టి దినచర్యానామనిర్దేశం (మల్లగ్రామ వ్యవపదేశంవలె) చేయబడిందని అనాలి. ఆహ్నికాదిశబ్దాల అర్థనిర్వహణలోకూడా ఈ రీతినే ఆనుసరించాలి.

**(భక్త్యా)** ఆరాధనీయుడైన భగవానుని విషయంలో, ఆరాధకులైన వరవరమునుల విషయంలో, ఆరాధన రూపం అయిన పాంచకాలిక కర్మల విషయంలోగల గౌరవభావంతో కూడిన నిరతిశయప్రేమతో–అని అర్థం. నిత్యానుష్ఠానాన్ని తెలిపే దినచర్యాశబ్దం లక్షణాప్రక్రియలో ఆరాధింపబడే భగవానుని విషయంలో, ఆరాధించే వరవరమునుల విషయంలో, ఆరాధనారూపం అయిన ఈ అనుష్ఠానవిషయంలో, అంతులేని భక్తితో కూడినవారై ఈ గ్రంథాన్ని ఎల్లప్పుడూ అనుసంధించాలని సూచిస్తున్నది.

**(అనుధ్యాయన్)** నిత్యం అనుసంధించేవాడై–అని అర్థం. యావజ్జీవం అగ్నిహోత్రాన్ని ఆరాధించేవారికి సాయంకాలం, ఉదయం ఆరాధించాలనే సమయవ్యవస్థ ఉన్నట్లు ఇక్కడ అటువంటి వ్యవస్థలేదని తెలుపడంకోసం ఈ పదం ప్రయోగింపబడింది. ఇటువంటి దినచర్యను అనుసంధించినపుడు **"యద్యదాచరతి శ్రేష్ఠః"** (గొప్పవాడు ఏది ఆచరిస్తాడో అదే ప్రమాణం.) అనే రీతిలో శక్తిని కల్గినవారికి పాంచకాలిక అనుష్ఠాన నిష్ఠాపర్యవసాన రూపంగా సిద్ధోపాయాన్ని అనుష్ఠించడానికి అధికారాన్ని కలుగజేసి, ఫలసిద్ధికి ప్రయోజకశక్తి లేనివారి అనుష్ఠానానికి సహాయకారి అవుతుంది. పరమపదమంటే ఉన్నతస్థానం అయిన నిత్యవిభూతి. అండాలకు, వానికి పైన ఉన్న మహదాదులకుకూడ పైన ఉండే గొప్ప స్థానం – అని అర్థం.

(ప్రాప్నోతి)-"ప్రకర్షేణ సాధ్యవివృద్ధిలక్షణప్రకర్షేణ ఆప్నోతి" - చక్కగా పొందుతాడని అర్థం. భగవానుడు, నిత్యులు, ముక్తులు-అనే ముగ్గురకు నిత్యకైంకర్యం చేయడమనే మూడు విధాలైన ఫలాలు సిద్ధించడంలో ఏ విధమైన ఆటంకంలేని స్థానాన్ని, ఆచార్యపర్యంతకైంకర్యంతో పాటు గొప్పగా పొందుతాడని భావం. **"అత్ర పరత్ర చాపి నిత్యం యదీయచరణౌ శరణం మదీయమ్"** (ఈ లోకంలో పర లోకంలో నాథమునుల శ్రీచరణాలే నాకు శరణం) అని అంటూ పరమపదంలో కూడా ఆచార్యకైంకర్యప్రాప్తిని ఆశించారు కదా, భగవద్యామునులు స్తోత్రరత్నంలో.

లక్ష్మీతంత్రమనే గ్రంథంలో **"అచ్ఛిద్రపంచకాలజ్ఞాః పంచయజ్ఞవిచక్షణా, పూర్ణే వర్షశతే ధీరాః ప్రాప్నువంతి యథాంజసా"** (ఈ అయిదు కాలాల్లో చేయ వలసిన, భగవదారాధనారూపం అయిన కర్మను ఒక దానికి తరువాత వేఱొకటిగా వచ్చే అనుష్ఠానకాలాలను తెలిసికొని, ఆ అయిదు అనుష్ఠానాలను చేయగల సామర్థ్యాన్ని పొందిన, జ్ఞానులు తమకు నూఱు సంవత్సరాలు పూర్తికాగానే, త్వరగా పరమపదాన్ని పొందుతారు) అని శాండిల్యస్మృతిలో, - **"సర్వధర్మాన్ సముత్సృజ్య పాంచకాల్య మనువ్రతాః, వ్యామిశ్రయోగనిర్ముక్తా గచ్ఛంతి పురుషోత్తమమ్"** (అన్ని మోక్షోపాయాలను పూర్తిగా విడచి, ఈ అయిదు కాలాలకు చెందిన అనుష్ఠానాలను చక్కగా చేసేవారు ఒకదానితో వేఱొకటి కలసి ఉండే జ్ఞానభక్త్యాది ఉపాయాలనుండి విముక్తిని పొందినవారై, భగవానుని పరమపదాన్ని, పొందుతారు) అని అంటూ ఈ పాంచకాలిక కర్మానుష్ఠానానికి స్వతంత్రోపాయత్వం చెప్పబడినా, భరద్వాజాది మహర్షులు, భగవానుడనే సిద్ధోపాయంలో నిష్ఠను కలవారు ఫలరూపంగానే (భగవత్కైంకర్యరూపంగానే) చేయాలని చెప్పినందువల్ల, ఇదే యుక్తమైనది. ప్రపన్నధర్మాలను గూర్చి **"అథ స్వధర్మనిరతః ప్రాజ్ఞో భక్త స్సులక్షణః, సత్సేవాభిరతో హ్యేవ ప్రపన్న స్సిద్ధి మాప్నుయాత్"** (తన ధర్మంపట్ల శ్రద్ధకల వాడు, ప్రాజ్ఞుడు, చక్కని లక్షణాలను కలవాడు, సత్పురుషులను సేవించడంలో ఆసక్తిని కల భక్తుడైన ప్రపన్నుడు మాత్రమే సిద్ధిని పొందుతాడు) అని, **"కృత్వాభిగమనం పూర్వ ముపాదాయ చ సంపదః, ఇష్ట్వాధీత్య చ యుంజానో భోగైః కాలం వినోదయేత్"** (మొదట అభిగమనాన్ని అనుష్ఠించి, భగవదారాధనకు ఆవశ్యకం అయిన వస్తువులను సేకరించుకోవడమనే ఉపాదానాన్ని చేసి, తరువాత



భగవానుని ఆరాధించడం అనే ఇజ్యను అనుష్ఠించి, సద్గ్రంథపఠనం అనే స్వాధ్యాయాన్ని చేసి, చివరలో భగవద్ధ్యానాన్ని చేస్తూ - ఈ విధంగా అయిదు కాలాలను సంతోషంగా కాలాన్ని గడపాలి) అనే పరాశరాదుల సూక్తులు ఇచట భావ్యాలు. ఈ ప్రమాణంలో **"వినోదయేత్"** అనే వినోదోక్తిని బట్టి **"సుసుఖం కర్తు మవ్యయమ్"** (చేయడానికి సులభమైనది, నశించనిది) అనే రీతిలో ఉపాయదశలోనే ఆనందదాయకమైనదని ఏర్పడడంవల్ల, ఈ అయిదు అనుష్ఠానాలను ఉపాయభావనతోకాకుండా, ఫలరూపంగానే భావిస్తూ చేయాలని చెప్పినట్లయినది. పరాశరమహర్షికూడా **"ఉపాయభావాత్ సంత్యజ్య స్వకర్మాదిచతుష్టమ్, కర్మ కుర్యా దసక్త స్సన్ సంతుష్ట్యై పరమాత్మనః"** (ఉపాయాలు అనే భావనను విడచి కర్మయోగ, జ్ఞానయోగాదులు నాల్గింటిని నిస్సంగుడై, పరమాత్మ తృప్తికోసం అనుష్ఠించాలి) అని వచించాడు. ఈ సూక్తిలో **"తచ్చ కుర్యాత్"** అని అనకుండా **"కర్మ కుర్యాత్"** అని అనడం ఉపాయభావాన్ని విడచి చేసే కర్మ మిగిలిన కర్మలకంటె వేఱయినదనే భావనతోనే. భరద్వాజపరిష్టమనే గ్రంథంలో **"బాహ్య స్సదసతాం నాస్తి భేదః ప్రాయేణ కర్మసు, సంకల్పా దేవ భిన్నాని సహేతు ర్బంధమోక్షయోః"** (సామాన్యంగా చేసే కర్మలలో ఇవి మంచివి, ఇవి చెడ్డవి అనే స్పష్టమైన బాహ్యభేదం ఏదీ లేదు. సంకల్పాన్నిబట్టి మాత్రమే అవి మంచివి, చెడ్డవి అవుతాయి. ఫలకామనతో చేస్తే బంధానికి, నిష్కామంగా చేస్తే మోక్షానికి కారణం అవుతాయి) అని చెప్పబడినందువల్ల వేఱొక ఉపాయం యొక్క అన్వయప్రసంగం లేదు. వినియోగపృథక్త్వన్యాయాను సారంగా కూడా ఉపాయాంతరప్రసక్తి లేదు.

"ప్రాప్నోతి పరమం పదమ్" అనే సూక్తిచేత **"అథ వృత్తి మిమాం శశ్వ త్కుర్వాణో విగతవ్యథః, విసృజ్య దేహం ప్రాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్"** (ఇక, ఈ కైంకర్యాన్ని నిత్యం చేస్తూ, వ్యథ లేనివాడై, దేహాన్ని వీడి, ఆ పరమాత్మయొక్క పరమపదాన్ని పొందుతాడు) అనే భరద్వాజవచనం స్మరింపబడింది. **"భక్త్యా దినచర్యా మనుధ్యాయన్"** అనే సూక్తికి అనుగుణంగా **"యశ్చేమాం సంహితాం పుణ్యాం శ్రుణుయాత్ శ్రావయేత వా, స ముక్తః సర్వపాపేభ్యః సర్వాన్ కామాన్ సమశ్నుతే"** (ఎవడు ఈ పవిత్రమైన సంహితను వింటాడో, వినిపిస్తాడో, అతడు అన్ని పాపాల నుండి విముక్తుడై, అన్ని కోఱికలను పొందుతాడు) అనే

భరద్వాజవచనం, **"వృత్తిం సంతోఽనుభూయేమా మనురూపా మిహాత్మనః, పరత్ర చా నుమోదంతే పరమేణ విపశ్చితా"** (సత్పురుషులు ఈ ఆత్మానురూపమైన వృత్తిని ఈ లోకంలో చేసి ఆనందించడమేకాక, పరమపదంలో కూడా విశిష్టజ్ఞానాన్ని కల్గిన (**"విపశ్చిత్"** శబ్దవాచ్యుడైన) పరమాత్మతో పాటు ఆనందిస్తారు) అనే భరద్వాజపరిశిష్టవచనం అనుసంధేయాలు. ప్రస్తుతంలో పైన ఉదాహరింపబడ్డ ప్రమాణాలలోని **"తద్విష్ణోః పరమం పదమ్"** అనే ప్రయోగం **"పరమే వ్యోమన్"** అనే శ్రుతిసూక్తిని, **"సర్వాన్ కామాన్ సమశ్నుతే"** అనే ప్రయోగం **"సోశ్నుతే సర్వాన్ కామాన్"** అనే శ్రుతిసూక్తిని, **"పరమేణ విపశ్చితా"** అనే ప్రయోగం **"సహ బ్రహ్మణా విపశ్చితా"** అనే శ్రుతిసూక్తిని తలపించడంలోని అందం సహృదయైకవేద్యం. **"శ్రీమతీం యతిరాజస్య దినచర్యా మిమాం పఠన్, ప్రాప్నుయా త్పరమాం భక్తిం భాష్యకారపదాబ్జయోః"** (గొప్పదైన ఈ యతిపతి దినచర్యా స్తోత్రాన్ని పఠించినవాడు. యతిపతి పాదాల పట్ల గొప్ప భక్తిని పొందుతాడు) అనే యతిపతి దినచర్యా ప్రయోగం ఇక్కడ ఉదాహార్యం.

ఈ వరవరమునిదినచర్యా స్తోత్రానికి **"సదాచారదీపికా"** అనే వ్యాఖ్యానాన్ని ప్రసాదించిన మహావిద్వాంసులు అయిన వాధూల వీరరాఘవాచార్య స్వామివారు తమ వ్యాఖ్యానాన్ని ముగిస్తూ – శ్రీవరవరమునుల అనుష్ఠానానికి స్వతః ప్రామాణ్యం సహజంగా ఉండనే ఉన్నది. ఆ అనుష్ఠానం ఎంత స్మృత్యనుకూలంగా ఉన్నదో నిరూపించి విజ్ఞులను ఆనందింపజేయడానికే తాము యథాశక్తి ప్రయత్నించామని అంటూ **"స్వయంప్రమాణేఽప్యాచార్యే రమ్యజా మాతృయోగిని, స్మృతి ప్రపంచనం తద్జ్ఞాః తుష్యంత్వితి మయా కృతమ్"** అనే శ్లోకాన్ని అనుగ్రహించారు.

ఉత్తర దినచర్యా వ్యాఖ్యానం ముగిసింది

**పూర్వోత్తరదినచర్యే వ్యవృణోత్ యతిరాజవింశతిం చ తథా ।**
**పూర్వాచార్యవ్యాఖ్యా రస్యా అనుసృత్య శింగరార్యోఽసౌ ॥**

ప్రకాశయంతీ సద్గ్రంథా నీదృశాన్ సాంప్రదాయికాన్ ।
**శ్రీరామానుజసిద్ధాంతసభా జేజీయతాం సదా ॥**



# అనుబంధము

ఉత్తరదినచర్యాస్తోత్రంలోని శ్లోకాలను గూర్చి ముద్రిత గ్రంథాల్లో కన్పిస్తున్నది. కొన్ని ఈ స్తుతి **"ఇతి యతి కులధుర్యమ్"** అనే శ్లోకంలో ప్రారంభంకాగా, మఱికొన్ని ముద్రణలలో ముద్రణలలో **"అథ గోష్ఠీమ్"** అనే శ్లోకంతో ఆరంభం అయింది. అణ్ణావప్పఙ్గార్ వ్యాఖ్యలో, కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామివ్యాఖ్యలో రెండవక్రమమే గోచరిస్తున్నది. **"యా యా వృత్తి ర్మనసి"** అనే శ్లోకంతర్వాత కొన్ని ప్రచురణలలో **"యదనుచరవిధేయైః"** అనే శ్లోకం మధ్యలో ఉన్నది. దీని తర్వాత **"అపగతమదమానైః"** అనే శ్లోకం ఉన్నది. ఈ క్రమాన్నిబట్టి ఉత్తరదినచర్యలో మొత్తం 14 శ్లోకాలు కన్పిస్తున్నవి. **"యదనుచర"** ఇత్యాది శ్లోకాన్ని అణ్ణావప్పఙ్గార్ గాని, కాంచీ ప్ర.భ. అణ్ణాస్వామి వారు కాని వ్యాఖ్యానించలేదు. మరికొన్ని ముద్రిత గ్రంథాల్లో కూడా ఇది కన్పించడంలేదు. చాలా ప్రచురణలలో **"దినచర్యా మిమామ్"** అనే శ్లోకంతో ఉత్తరదినచర్య పూర్తికాగా, ప్రస్తుతం ముద్రింపబడుతున్న వ్యాఖ్యానంలో **"ప్రపద్యే పదపద్మాని"** అనే శ్లోకం చివరిగా ఉండడం ఒక విశేషం. సుమారు 80–90 సం॥లక్రితం చెన్నైనగరంలో ముద్రింపబడ్డ ఆనందాప్రెస్‌లో ముద్రింపబడ్డ స్తోత్రార్ణవగ్రంథం 3వ సంపుటంలో ఉత్తర దినచర్యాస్తోత్రంలో **''దినచర్యా''** అనే శ్లోకం తర్వాత **''సంపత్స్వరూపానుగుణైవ''**, **''యన్మూలమ్''**, **''శ్రీమద్రంగమ్''** అనే వరవరమునులకు చెందిన నాల్గు శ్లోకాలతోపాటు, **"న చేత్ రామానుజేత్యేషా"**, **"పుణ్యాంభోజ"**, **"తృణీకృత"** ఇత్యాది భగవద్రామానుజు లకు చెందిన మూడు ముక్తకాలుకూడా చేర్చి ముద్రింపబడ్డాయి. అంటే, ఉత్తరదినచర్యాస్తోత్రం 21 శ్లోకాలతో ముద్రింపబడ్డాయి. అంతేకాక, మరికొన్ని ప్రచురణలలో **"యదవతరణమూలమ్"** అనే శ్లోకం కూడా **"యనూలమ్"** అనే శ్లోకానికి ముందు ఉన్నది. వీటిలో **"యన్మూలమ్"**, **"యదవతరణమూలమ్"**, **"శ్రీమద్రంగమ్"** అనే మూడు ఎఱుమ్బియప్పా ప్రణీతమైన వరవరమునిశతకంలో కన్పిస్తున్నాయి. ఈ శ్లోకాలు, ఉత్తారదినచర్యా ఏకకర్తృకాలు కాబట్టి వీనిని ఉత్తర దినచర్యాను బంధంగా తరువాతి కాలంలో చేర్చబడి ఉండవచ్చునేమోనని తోస్తుంది. శ్రీమాన్ పరవస్తు గోవిందాచార్యస్వామివారి శ్రీవైష్ణవస్తోత్రమాలలో **"యదవతరణ మూలమ్"**

అనే శ్లోకం తప్ప మిగిలిన ఏడు నిత్యానుసంధేయ శ్లోకవిశేషాలుగా చూపబడ్డాయి. **"యదనుచరవిధేయైః".** అనే శ్లోకం ఎక్కడిదో స్పష్టపడలేదు. ప్రస్తుతం అణ్ణావప్ప ఙ్గార్ (వాధూల వీరరాఘవాచార్యులవారి) వ్యాఖ్యాన శ్రీకోశాన్ని అనుసరించడంవల్ల, పైన తెలిపినరీతిలో అధికంగా కన్పిస్తున్న ఎనిమిది శ్లోకాలు వాని తాత్పర్యాలతో పాటు అనుబంధంగా సమర్పింపబడుతున్నాయి. ఇవన్నీ వాస్తవానికి ఉత్తరదిన చర్యాస్తోత్రంలో అంతర్భవించకపోయినా, కొన్ని వరవరమునులను, మఱికొన్ని భగవద్రామానుజులను స్తుతించేవి కాబట్టి ప్రపన్నులకు నిత్యానుసంధేయాలే కదా!

**యదనుచరవిధేయై ర్జాతు దృష్టోఽపి తస్మిన్**
**రుచిరవరమునీంద్రే రూఢభావో భవేయమ్ ।**
**దృఢతర మతియాతో దుస్త్యజా నర్థకామాన్**
**జనిజలధిగతానాం జాయతే కర్ణధారః ॥**

శ్రీవరవరమునుల భక్తులచేత ఒకసారి కటాక్షింపబడినవాడను అయితే, ఆ వరవరమునులపట్ల స్థిరమైన భక్తిని కలవాడను అవుతాను. విడచిపెట్టడానికి వీలుకాని అర్థకామాలను దృఢంగా వదలిపెట్టినవాడు జన్మసముద్రంలో మునిగి ఉన్నవారిని ఒడ్డుకు చేర్చే ఓడ చుక్కానిని నడిపేవాడు కాగలడు.

## నిత్యానుసంధేయ శ్లోకాలు

1. ప్రపద్యే పదపద్మాని పరమప్రేమసంపదామ్ ।
**సౌమ్యజామాతృయోగీంద్రచరణైకజుషాం సతామ్ ॥**

శ్రీవరవరమునుల శ్రీపాదాలను మాత్రమే ఉపాయోపేయాలుగా నిశ్చయించుకొని ఆరాధించేవారు, ఆ ఆచార్యవర్యులపట్ల పరమభక్తిని కలవారు అయిన సత్పురుషుల పాదపద్మాలను ఆశ్రయిస్తున్నాను.

2. **సంపత్స్వరూపానుగుణైవ యస్మిన్**
**సర్వోత్తరో యత్ర మనఃప్రసాదః ।**
**సద్భి స్సమం దైవత మేవ దేశం**
**ప్రాప్తం ప్రపద్యే భవదంఘ్రిమూలమ్ ॥**

వరవరమునీ! ఎవరి విషయంలో (కైంకర్యరూప) సంపద స్వరూపానికి తగినదో, ఎవరి విషయంలో కల్గిన మనఃప్రసాదం (వారే ఉపాయోపేయాలు అనే స్వచ్ఛమైన, నిలకడ అయిన నిశ్చయం) గొప్పదో, అటువంటి దివ్యమైన, ప్రాప్తమైన తమ పాదారవింద సన్నిధిని పెద్దలతోపాటు (వారి పురుషకారపూర్వకంగా) ఆశ్రయిస్తున్నాను.

3. **యన్మూల మాశ్వయుజమాస్యవతారమూలం**
**కాంతోపయంతృయమినః కరుణైకసింధోః ।**
**ఆసీ దసత్సు గణితస్య మమాపి సత్తా**
**మూలం తదేవ జగదభ్యుదయైకమూలమ్ ॥**

దయాసముద్రులైన శ్రీమద్వరవరమునుల అవతారానికి మూలం అయిన ఆశ్వయుజమాసంలోని మూలానక్షత్రం లోకశ్రేయస్సుకు అంతటికి మూలం అయింది. అది, అ సత్పురుషుల్లో ఒకడుగా ఇంతకాలం లెక్కింపబడ్డ నేను కూడా సత్తను పొందడానికి మూలం అయింది.

4. **శ్రీమద్రంగం జయతు పరమం ధామ తేజోనిధానం**
**భూమా తస్మిన్ భవతు కుశలీ కోఽపి భూమాసహాయః ।**
**దివ్యం తస్మై దిశతు విభవం దేశికో దేశికానాం**
**కాలే కాలే వరవరమునిః కల్పయన్ మంగళాని ॥**

గొప్ప దివ్యక్షేత్రం, తేజస్సుకు స్థానం అయిన శ్రీరంగక్షేత్రం వర్ధిల్లుగాక! ఆ క్షేత్రంలో భూదేవి, లక్ష్మీదేవులలో కలసి అధివసించి ఉండే సర్వోత్కృష్టుడైన శ్రీరంగనాథుడు కుశలంగా ఉండుగాక! ఆచార్యులందఱికీ దేశికులయిన వరవరమునులు నిత్యం శుభాలను కలుగజేసేవారై శ్రీరంగనాథునకు దివ్యమైన వైభవాన్ని కల్గింతురుగాక!

5. **నచే ద్రామానుజేత్యేషా చతురా చతురక్షరీ!**
**కా మవస్థాం ప్రపద్యంతే జంతవో హంత! మాదృశః ॥**

మనలను రక్షించడంలో సమర్థవంతమయినది, **"రామానుజ"** అనే అయిన నాల్గు అక్షరాలను కల్గినది అయిన ఈ మంత్రమే లేకపోతే మనవంటి ప్రాణులు ఏ గతిని పొందేవారోకదా! అయ్యో!

**6. పుణ్యాంభోజవికాసాయ పాపధ్వాంతక్షయాయ చ ।**
**శ్రీమానావిరభూద్భూమౌ రామానుజదివాకరః ॥**

సత్పురుషులనే పద్మాలు వికసించడంకోసం, పావులు అనే చీకటి తొలగడంకోసం శ్రీమద్రామానుజులు అనే సూర్యుడు భూమిలో అవతరించాడు.

**7. తృణీకృతవిరించాదినిరంకుశవిభూతయః ।**
**రామానుజపదాంభోజసమాశ్రయణశాలినః ॥**

భగవద్రామానుజుల పదపద్మాలను ఆశ్రయించినవారు బ్రహ్మ మొదలైన దేవతల నిరంకుశం అయిన అధికారాన్నిసైతం తృణీకరిస్తారు.

